# ఆంధ్ర వాఙ్మయము - హనుమత్కథ

ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి పిహెచ్. డి. పట్టము పొందిన
సిద్ధాంతవ్యాసము.

పరిశోధకులు :

డా॥ అన్నదానం చిదంబరశాస్త్రి,
M. A., (Tel.), M. A., (Skt.), Ph. D.

NDHRA VAGMAYAMU - HANUMATKATHA
Thesis for Ph. D. — 1989


అంగిరస - ఉగాది
ఏప్రిల్ - 1992
ప్రతులు : 1000



**వెల : రు. 75-00 లు**

ముఖచిత్రం : ఆర్టిస్ట్ రాంప్రసాద్ - మచిలీపట్నం

This book is published with the financial assistance of irumala Tirupathi Devasthanam under their scheme id to publish religious books.

This book is published with a grant of four thousand upees financed by Telugu University.

ప్రతులకు :

ఎ. జానకీదేవి
రావూరురోడ్, వేటపాలెం - 523 187
ప్రకాశం జిల్లా. A. P.

ముద్రణ :
నవోదయ ఆర్టు ప్రింటర్స్, చీరాల.



**శ్రీ శ్రీ శ్రీ శివ చిదానంద భారతీస్వామి**

శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతి

కుర్తాళం – **627 802**

తమిళనాడు.

# అక్షరాశీస్సులు

చిరంజీవులు శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రిగారి "ఆంధ్ర వాఙ్మయము – హనుమత్కథ" అనే శీర్షికతో వెలువరించిన పరిశోధనాత్మక వ్యాస సంపుటి ఆమూలాగ్రముగ పరిశీలించడమైనది. ఆ పరిశోధన ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి పురస్కారము పొందుటే కాక, సాక్షాత్తు హనుమదవతారమందు గల అచంచల భక్తి విశ్వాసములతో హనుమదవతారములను పూర్ణముగ తమ లేఖినితో ఆవిష్కరింపదలచి కృతకృత్యులైరనుటలో ఎట్టి సందేహమూ లేదు. భారత దేశములోను, ముఖ్యముగా ఆంధ్ర దేశములో, ఆంధ్రవాఙ్మయములో ఎన్ని ప్రక్రియలలో శ్రీ స్వామివారిని భక్తులు స్మరించి, జపించి, ప్రచురించి, స్తుతించి, నటించి, పాడి, పాడించి, వినిపించి, రచించి, ధ్యానించి, మంత్రించి, ప్రదర్శించి, తరించిరో అన్ని సాహిత్య ప్రక్రియలనూ కూలంకషంగా పరిశీలించి ఈ వ్యాసరూపమున వెలువరించినారు. ఇట్టి మహత్కార్యసాధన భక్త్యావేశము వలననూ, భగవదనుగ్రహము వలననూ సాధ్యముగాని, పురుషకారమువలన సాధ్యము కాదనుట నిర్వివాదాంశము.

హనుమంతుడు ఆంధ్రుడనుటను పురాణాంతర్గత విశేషాంశములతో ధృవపరచి, ఆంధ్రుల అపురూప దైవముగాజేసి, ఆంధ్రులకు గర్వకారణమగునటుల వ్యాసము వెలువరించినారు. ఈ పరిశోధనావ్యాసము

హనుమత్పరముగా విశ్వకోశము (Encyclopaedia) అయినదనుటలో ఏట్టి అతిశయోక్తి లేదు. ఈ గ్రంథము హనుమత్కథా సంగ్రహ (Compendium) మైనది. ఇది భవిష్యద్బ్రహ్మయైన హనుమంతుని సమగ్ర విషయ నిక్షిప్తాగారము. శ్రీ చిదంబరశాస్త్రిగారు నిదురలేచినప్పటి నుండి పరుండు వరకు నిత్యనైమిత్తిక కార్యకలాపములలో హనుమదుపాసన తప్ప అన్యమెరుగనివారు. హనుమత్సంబంధ విషయము దప్ప మరి యితర పరిశోధనలేల యని గ్రహించి విశ్వవిద్యాలయమువారి మనః ప్రవృత్తులకు సరిపడు అంశమే పరిశోధనాంశముగా నిర్ణయించుటలో వారలఔన్నత్యము వేనోళ్ళ కొనియాడదగినది.

ఏది యేమైననూ శ్రీ శాస్త్రిగారి కృషి అభినందనీయము. ఆంధ్రుల ఆరాధ్యదైవము శ్రీ సువర్చలాసహిత పంచముఖాంజనేయ స్వామివారి అనుగ్రహము వారికి పరిపూర్ణముగా కలుగుగాక.

ఇష్టకామ్యార్థఫలసిద్ధిరస్తు.

నారాయణ స్మృతులతో

తేది. 10-3-92 (సం.) శ్రీ శివచిదానంద భారతీస్వామి

## ముఖచిత్రం

''ఆంధ్రావని నవతరించి
రవిని ఫలభ్రాంతిఁ బట్ట
ఆకసమున కెగిరినట్టి
కపికిశోరమూః ఇయ్యది.''



ఆంధ్రరాష్ట్ర గవర్నర్ గా॥ శ్రీ కృష్ణకాంత్‌గారినుండి
శ్రీ దలైలామా సమక్షంలో డాక్టరేట్ అందుకొంటూ



1985లో రాష్ట్రప్రభుత్వపు ఉత్తమ అధ్యాపక అవార్డును
ముఖ్యమంత్రి గా॥ శ్రీ యన్. టి. రామారావుగారినుండి
స్వీకరిస్తూ

| మాతృదేవో భవ | పితృదేవో భవ | ఆచార్యదేవో భవ |
| --- | --- | --- |
|  |  |  |

డా॥ అన్నదానం చిదంబరశాస్త్రిగారి తల్లిదండ్రులు
శ్రీ సీతారామాంబా లక్ష్మీనారాయణగారలు;
ఉపదేశ గురువులు పూజ్యశ్రీ పాలపర్తి సుబ్బావధానులుగారు



అర్ధాంగిగా హనుమత్కార్యంలో కూడా
అర్ధభారాన్ని వహిస్తున్న ధర్మపత్ని
శ్రీమతి జానకీదేవితో డా॥ అన్నదానం చిదంబరశాస్త్రి.

# ఈ హనుమద్గ్రంథమునకు పోషకులుగా
# రు. 1116/- లు సమర్పించిన హనుమద్భక్తులు



కీ॥ శే॥ గోకవరపు పెద్దబ్రహ్మాజీ
రమణమ్మగార్ల జ్ఞాపకార్థం వారి
పెద్దకుమారుడు, విజయనగరం జిల్లా
విశ్వహిందూపరిషత్, మరియు
హనుమద్దీక్షా సేవాసమితి అధ్యక్షులు
శ్రీ గోకవరపు అప్పలరాజు,
శ్రీమతి అన్నపూర్ణమ్మగార్లు
చిన్నవీధి, విజయనగరం.



శ్రీ మడిపిల్లి జానకిరామయ్య
శ్రీమతి అప్పలనరసమ్మగార్లు.
గ్రామ సర్పంచి - గోవిందపురం.



కీ॥ శే॥ పెంటపాటి వరహాలుగారి జ్ఞాపకార్థం
భార్య శ్రీమతి లక్ష్మీకాంతంగారు, మరియు
కుమారులు : 1. శ్రీ లక్ష్మణస్వామి
2 శ్రీ ప్రభాకరరావు 3. శ్రీ కృష్ణాజీగార్లు.



శ్రీ గ్రంధి సూర్యకోటేశ్వరరావు,
శ్రీమతి సూర్యామణిగార్లు ఈస్ట్‌కోస్ట్
జూట్‌మిల్ మరియు జూట్ మర్చంట్స్
మరియు విజయనగరం ధర్మరక్షణ
పరిషత్ కోశాధికారులు



కీ॥ శే॥ కంచర్ల వెంకటాౡజు,
ప్రబలాంబల జ్ఞాపకార్థం వీరి
ద్వితీయ ధర్మపత్ని
శ్రీమతి అప్పలనరసమ్మ; కుమారులు
శ్రీ రాజేశ్వరరావు, సోదరులు.



కీ॥ శే॥ దూపుగుంట్ల లక్ష్మికనకదుర్గ
జ్ఞాపకార్థం
భర్త శ్రీ రామకోటీశ్వరరావుగారు,
తెనాలి.



శ్రీ కె. బ్రహ్మయ్య, S. T. O.,
శ్రీమతి సుజాతగార్లు
నివాసం : లక్సెట్టిపేట
ఆదిలాబాదు జిల్లా - 504 215

# ఆమోదం

ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య
అధ్యక్షులు, తెలుగు విభాగము,
కాకతీయ విశ్వవిద్యాలయము,
వరంగల్ - 506 009

అవ్యక్తమైన చైతన్యము వ్యక్తమై, జగత్తై బహుధాత్వమును పొందుచున్నది. వ్యక్తము యొక్క ఆరంభబిందువైన ఆకాశమందు అవ్యక్త లక్షణము పూర్తిగా తొలగలేదు. ఆ అభివ్యక్తి పృథ్వి ఆవిష్కరింపబడుటతో పరిపూర్తిని పొందుచున్నది.

వ్యక్తమైన జగత్తు దిక్కాలముల నాశ్రయించియున్నది. దిక్కాలములు సూర్యదేవునితో పృథ్వికిగల సంబంధమువల్ల ఏర్పడుచున్నవి. దిక్కులు వసువులై కాలము ద్వాదశాదిత్యులై వానినడిమి అనుబంధము రుద్రులై ఇద్దరు విశ్వేదేవతలతో కూడి త్రయస్త్రింశత్ దేవతామండలము ఏర్పడుచున్నది. సంగ్రహముగా ఈ జగత్తు వసురుద్రాదిత్యమయమైనది.

వసుమతి ఆధారము. దానినుండి ఉత్పన్నమైన తల్లి సీత. ఆదిత్య వంశమున పుట్టినవాడు శ్రీరాముడు. ఈ ఇరువురికి అనుబంధము కలిపించినవాడు రుద్రాంశలో పుట్టిన ఆంజనేయుడు. సృష్టిప్రకరణమున 'వాయోరగ్నిః' అని చెప్పబడినది. అగ్నియే ఆంజనేయుడు. వాయుసూనుడు. అగ్ని జలములను దాటిననే గాని భూమి కానరాదు. సముద్రమును దాటినప్పుడు మాత్రమే మారుతికి సీతాదర్శనమైనది.

భూమ్యాకాశములకు నడిమితత్త్వము అగ్ని. ''అగ్నిముఖా వై దేవాః'' అని శ్రుతి. శ్రీరాముడు ఆకాశము నుండి - దానిపై నుండి, అవ్యక్తము నుండి, బ్రహ్మచైతన్యము నుండి దిగివచ్చినవాడు. సీతయేమో అట్టడుగున నున్న భౌతిక స్తరమున కురికివచ్చి దానిలో బద్ధురాలై ఆ పరిమితులలో కుంచించుకపోయి దుఃఖ సహస్రమును పొందినయామె.

ఈ తత్త్వము శ్రీమద్రామాయణ కల్పవృక్షమున ఇట్లు వ్యాఖ్యాతమైనది

ఏపున మంటి నుండి యుదయించిన మైథిలి, మింటి నుండియా
వాపముఁగన్న రాఘవుడు, వచ్చి యుగధ్వములందు నుండి ద్యా
వాపృథువుల్ సమాహరణ భావము పొందినరీతి సంగమ
వ్యాపృతిఁబండువెన్నెల మయంబుగఁ జేయుదు రాత్మ రోదసిన్"

(బాలకాండము - కళ్యాణ ఖండము 180)

రోదసి ప్రకృతి పురుషుల సంగమస్థానము. అదియే సీతా రాములు ఆంజనేయుని హృదయమున సాక్షాత్కార రూపమైన వస్తువైనది.

రామకథను ఒక్కొక్క సంప్రదాయము వ్యాఖ్యానించిన తీరు ఒక్కొక్క అనుభవ పరమార్థముగా వెల్లడియగుచున్నది. రౌద్రమైన తేజస్సు ఆంజనేయ తత్త్వమై ఒకచోట, షణ్ముఖతత్త్వమై మరియొక చోట వ్యక్తమై వైష్ణవ, శైవసంప్రదాయములలో చోటుచేసుకొనినది. అనుసంధానలక్షణముగల ఈతత్త్వము గురుతత్త్వమగుటసహజము. షణ్ముఖుడు గురుతత్త్వముయొక్క ఒక విభూతికాగా, ఆంజనేయుని గురుతత్త్వమును వైష్ణవ సంప్రదాయము విశదము చేసినది. ఈ రెంటిలో ఒకటి మర్కటశిశు మార్గముకాగా, వేరొకటి మార్జాలశిశు మార్గము అయినది.

షణ్ముఖమైన తత్త్వము సర్పరూపమున కుండలినీ రూపమున అభివ్యక్తముకాగా హనుమత్తత్త్వము పంచముఖమై వానరరూపమున ప్రకటితమైనది. కుమారుడు గుహుడై దహనాకాశమున వ్యక్తమైన సూర్యుడుకాగా,ఆంజనేయుడు సూర్య శిష్యుడై ఆతత్త్వమునకు పృథ్వి మీద ప్రాతినిధ్యము వహించెను.కుమారుడు దేవతలకు సేనానియై రాక్షస సంహారము చేయగా హనుమంతుడు యుద్ధమున తానే సర్వమై రాక్షస నిర్మూలనము కావించెను. అసురతత్త్వనాశనము, అనగా తమస్సును నశింపచేయుట గురుతత్త్వము నిర్వహించెడి ప్రధాన కార్యము.

హనుమత్తత్త్వమును వేరొక మార్గమున చూడవచ్చును. అది మనస్సునకు ప్రతీక. మనస్సు సదా చంచలము. ఈ చాంచల్యము కట్టుపడుటకు నిరంతర సాధన అవసరము. పరమార్థసాధనమునకు శ్రీరామ చరణారవింద ప్రాప్తికి వానరము వంటి మనస్సు కూడా ప్రయత్నము చేయవచ్చునని తెలియచెప్పుట అంతర్యము కానవచ్చును. వాల్మీకి రామాయణమున హనుమంతుడు మంత్రిగా, రాయబారిగా, సమయజ్ఞుడుగా, అద్భుత పరాక్రమముగలవాడుగా, మంత్రజ్ఞుడుగా,ఔచిత్యవేత్తగా,వాగ్విదాంవరుడుగా అనన్యభక్తుడుగా ఇట్లనంత ముఖముల చిత్రింపబడెను.

రామాయణము తరువాతి గ్రంథములలో హనుమంతుడు మహామహిముడై, దైవమై, అనంతావతారచరితుడై, విశ్వరూపుడై, సాక్షాద్భగవత్తత్త్వము,గా రూపొందుట మనము గమనించవచ్చును. హనుమదుపాసనము బుద్ధిబల యశోధైర్యములను, నిర్భయత్వమును, అరోగతను, అజాడ్యమును, వాక్పటుత్వమును కలిగించుచు భక్తుల కొంగు బంగారమైనది. ఒక విధముగా హనుమంతుడు భక్తులకు అభయసాసము.

ఇంతటి గహనమైన హనుమత్తత్త్వమును ఆంధ్రవాఙ్మయమందెంత వట్లు చిత్రింపబడినదో పరిశీలించి, పర్యాప్తముగ నిరూపణము చేయుటకు ప్రయత్నించినవారు మా మాన్యమిత్రులు శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి గారు. శ్రీ చిదంబరశాస్త్రిగారు గ్రంథములో రామాయణ మహాభారతములలో హనుమత్తత్త్వము చిత్రింపబడిన రీతిని విపులముగా చర్చించినారు. ప్రధానముగా తెలుగు రామాయణములలోని సుందరకాండ వృత్తాంతమును పరిశీలించినారు తరువాత గ్రంథములలో సమీరకుమార విజయము, మైరావణ చరిత్ర మొదలైన కావ్యములలో నున్న హనుమంతుని కథను, శతకంఠ, సహస్రకంఠరామాయణములను, సీతారామాంజనేయ సంవాదము వంటి తాత్త్విక గ్రంథములను ఈ రచయిత విపులముగా పరిశీలించినారు. ఇవే కాక ఆధునిక వాఙ్మయము లోని హనుమత్ సాహిత్యమును, హరికథలను, శతకములను, ఉదాహరణములను, దండకములను, సంకీర్తన వాఙ్మయములను కూడా వీరు పరిశీలించినారు. ఈ పరిశీలనము వలన ఆంధ్రవాఙ్మయమున హనుమత్తత్త్వము ఎంత విపులముగా వ్యాపించి యున్నదో తెలియవచ్చును.

శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రిగారు జీవితమంతయు హనుమత్సేవకు అంకితము చేసినారు. స్వయముగా తన్మంత్రోపాసము చేసినారు హనుమదుపాసనకు, చరిత్రకు ప్రధాన గ్రంథమైన పరాశర సంహితము ఎంతో కష్టపడి సంపాదించి ప్రచురించుచున్నారు. ఈ గ్రంథములో వారు తమ కృషివలన తొంబది పటలములవరకు ప్రకటించుటయైనది. ఇంకను మరి ఎంతో గ్రంథము ప్రచురించబడవలసియున్నది. ఒంగోలులో హనుమన్నావతారక్షేత్రము స్థాపించి నిర్వహించుచున్నారు. వారి బహుముఖమయిన ఈ హనుమత్సేవలో ఆంధ్రవాఙ్మయములోని హనుమత్కథను పరిశీలించుట కూడా ఒక విధమైన వారూప్యజయే.

ఈ గ్రంథమును పరిశీలించినప్పుడు వెలికివచ్చినవిషయ వైపుల్యమునుబట్టి ఇంకను ఎంతోమంది ఈ విషయమును పరిశీలించవచ్చునని స్పష్టమగుచున్నది. ఈ విధముగా మార్గము చూపినఘనత శ్రీ చిదంబర శాస్త్రిగారిది.

ఇంతటి కృషి సాగించిన శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి గారికి ఇతోధిక హనుమత్పూజావకాశము కలుగవలెనని ఆశించుచున్నాను.

3-3-1992 (సం) కోవెల సుప్రసన్నాచార్య

'మహాభారత ఋషిమండల ద్రష్ట,' 'భాషాప్రవీణ'
డా॥ పెన్మెత్స వెంకటరాజు, M. A., Ph. D.
భూతపూర్వ - ఆంధ్రశాఖాధ్యక్షులు
స్నాతకోత్తర విభాగము
డి. యన్. ఆర్. కళాశాల, భీమవరం

# ప్రస్తావనము - ప్రవచనము

"ఆంధ్రవాఙ్మయము - హనుమత్కథ" ఇది ఒక విశిష్టమైన పరిశోధన సిద్ధాంత గ్రంథము. పరిశోధకులు శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి గారు. వీరు శ్రోత్రియులు. మనోవాక్కాయకర్మములందు పరిశుద్ధులు. తెలుగు సంస్కృతభాషా సాహిత్యములందు ప్రవీణులు. ఆర్షసంప్రదాయ జీవన వృత్తియందు ప్రవణులు. అన్నింటిని మించి శ్రీమత్ హనుమదుపాసకులు.

వాక్కులు సోమసూర్యాగ్నిమయములు. అందువలన అవి మంత్రపూతములు. ఈ రహస్యమును గ్రహించినవారు బ్రహ్మనిష్ఠులైన మహర్షులు. ఆ వాక్కులు వేదములైనవి వానిని దర్శించిన మహర్షులు మండల ద్రష్టలైరి

వాల్మీకి మహర్షులవారు శ్రీమద్రామాయణమును ప్రవచించిరి. అందలి వాక్కులన్నియు మంత్రమయములు అందువలన శ్రీమద్రామాయణము మహామాలామంత్రము. అది ఛందోదయము అది మంత్రాక్షరముల రత్నమాల. ఆ రత్నమాలకు మకుటమణి హనుమ.

జీవుడు లేనిదే దేవుడు లేడు. దేవుడు లేనిదే జీవుడు లేడు. ఈ జీవాత్మ పరమాత్మల సంబంధము విడదీయరానిది. హనుమద్రాముల సంబంధము విడదీయరానిది. వేదపురాణకావ్యవాఙ్మయములందంతటను శ్రీ హనుమద్రాముల సంబంధము బహుధా వర్ణింపబడినది.

ప్రాచీనాంధ్ర వాఙ్మయము - ఉదాత్తమైనది. ఛందోబద్ధమైనది. అక్షసంప్రదాయమున పర్దిల్లినది. అందలి ప్రతిశబ్దము - ప్రతి సమాసము ప్రతి యలంకారము సరస్వతీ సాక్షాత్కారమునకు నిలయములు. అట్టి వాఙ్మయ సృష్టికర్తలైన ఆంధ్రమహాకవులందరు "నానృషిః కురుతే కావ్యమ్" అను ఆర్యోక్తికి అన్వర్థనాములు ఆట్టి ఆంధ్రవాఙ్మయమందు "హనుమత్కథ" విశిష్టస్థానము నలంకరించినది

ఆంధ్రవాఙ్మయమున రామాయణములు అనేకములు గలవు. మహాకవులు - వారి వారి రామాయణములందు - 'శ్రీహనుమ' ను వారి వారి ఆరాధనా వైభవమున కనుగుణముగ అభివర్ణించిరి మహాకవులు కొందరు "శ్రీహనుమ' ను గూర్చి కావ్యములు వ్రాసిరి. నాటకములు వ్రాసిరి. చాటువులు చెప్పిరి ఆంధ్రవాఙ్మయమునందలి - సర్వకవితా ప్రక్రియ లందు హనుమత్కథ వెలసినది.

సాహిత్య పరిశోధనము - ఇహపర సాధనము. ఉపనిషత్తులన్నియు పరిశోధన సిద్ధాంత గ్రంథములు. వస్తువును విశ్లేషించి సప్రమాణముగ సత్యస్వరూపమును - ప్రకటించి - సిద్ధాంతీకరించుట పరిశోధనము. ఆ సంప్రదాయమును అనుసరించి శ్రీ చిదంబరశాస్త్రిగారు - ఈ పరిశోధన సిద్ధాంత గ్రంథమును వెలయించిరి. అందువలన ఈ గ్రంథము శ్రీశాస్త్రిగారికి - పాఠకులకు - ఇహపరసాధనము.

అగస్త్యుడు సాగరమును ఆచమించినట్లు "ఆంధ్రవాఙ్మయము హనుమత్కథ" ను శ్రీ చిదంబరశాస్త్రిగారు - ఆచమించిరి. ఇది ఆంధ్ర వాఙ్మయమున అనర్ఘమణి

శుభం భూయాత్

8-4-92 (సం) పెన్మెత్స వేంకటరాజు

ఆచార్య శలాక రఘునాథశర్మ
తెలుగు శాఖ
శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము

శ్రీ వెంకటేశ్వరపురం (P. O.)
అనంతపురం - 5 5 009
తేది : 7-3-1-92

# సహృదయ సంభావనము

హనుమంతుడు శ్రీరామచంద్రుని హృదయమున బంధించుకొన్న పరమ భక్తుడు. ఆయనను శివావతారముగా శాస్త్రములు చెప్పుచున్నవి. కాగా ఆయన శైవులకు, వైష్ణవులకు ఏకరూపమైన ఆరాధ్యుడు. అట్టి సకలారాధ్యుని కథ ఆంధ్రవాఙ్మయమున పరచుకొని పావనము చేసిన తీరులు భక్తి శ్రద్ధలతో పరిశోధన తాత్పర్యముతో నిరూపించిన డా॥ అన్నదానం చిదంబరశాస్త్రిగారు సర్వథా అభినందనీయులు. కేవలము డాక్టరేట్ పట్టము కొఱకు ఒక అభ్యర్థి ఇంత శ్రమ పడనక్కరలేదు. కాని శ్రీ శాస్త్రిగారికి పట్టము ఆనుషంగిక ప్రయోజనము శ్రీహనుమద్విశ్వరూపదర్శనము తాను చేసి యితరులకు ఆ మహాఫలము నందించుట ప్రధాన ప్రయోజనము. ఇట్టి మహోన్నతాదర్శముతో ఈ గ్రంథము ప్రకటించుచున్న డా॥ అన్నదానం చిదంబరశాస్త్రిగారిని మనసార అభినందించుచున్నాను.

ఈ సిద్ధాంత వ్యాసమును పరీక్షించు సదవకాశము నాకు కలిగినది ఆ విధముగా ఈ గ్రంథమును పట్టి చూచితిని గ్రంథమును చదువుచున్నంత కాలము నా హృదయము శ్రీస్వామినుండి చెదరక నిలిచినది. అట్టి గుణవిశిష్టతకు పరవశించి పట్టప్రదాన యోగ్యతను గట్టిగా నొక్కి చెప్పితిని.

ఒక్కమాటలో చెప్పవలయునన్నచో ఈ గ్రంథము హనుమత్కథకు సంబంధించిన విజ్ఞాన సర్వస్వముగా రూపొందినది. శ్రీ శాస్త్రిగారు ఈ గ్రంథ నిర్మాణమునకై సేకరించిన విషయములు ఎంతయో విలువను సంతరించుకొన్నవి. వేదోపనిషన్మంత్ర శాస్త్రరహస్యముల నెన్నింటినో డా॥ శాస్త్రిగారు చక్కని ప్రజ్ఞతో అవలోడనము గావించుకొని ఆయా కథాంశములతో సమన్వయించి చూపిన పద్ధతి ఆదర్శప్రాయముగా నున్నది. ముఖ్యముగా గుప్తముగా నున్న పరాశర సంహితను హృద్గతము గావించుకొని పాఠకుల భక్తిప్రపత్తులకు దోహదముచేయుచు వీరీ గ్రంథము నొక ఆరాధనా విశేషముగా రూపొందించియున్నారు. ఒక్క ఆంధ్రవాఙ్మయమునే కాక సంస్కృతాద్యనేక భాషలలో హనుమత్కథాస్థితిగతులను వివరించి ప్రధాన విషయమునకు వన్నె తెచ్చిరి.

ఇట్టి వీరికృషి తప్పనిసరిగా పాఠకోత్తముల ప్రశంసలను బడయుట ద్వారా ఇహలోక సుఖమునకును, శ్రీహనుమద్రూపపరమాత్ముని ఆరాధనకు దోహదమగుటద్వారా పరలోకసుఖమును సాధించునని గట్టిగా నమ్ముచున్నాను. సమస్త సన్మంగళాని భవన్తు

ఆంగిరస చైత్రశుద్ధ పంచమి. (సం) శలాక రఘునాథశర్మ

Phone : 64871 Extn. 399

**Prof. G. Sundara Ramaiah**

COORDINATOR

U G C Special Assistance Programme (DSA)
(Philosophy, Religion and Culture with
Special reference to Vedanta & Buddhism)

Department of Philosophy
Andhra University

WALTAIR - 530 003

Date : 23-3-92

# REVIEW OPINION

This study of Dr. Annadanam Chidambara Sastry seeks to fulfill the gap that exists in under standing the greatness and mythological cult of Lord Haruman. Based upon all the available Telugu and Sanskrit original books Dr. Sastry given us a graphic Picture of the human and Super-human role of Hanuman in Hindu Culture The mysterious and tremandos nature of Lord Hanuman is revealed to us. The literary sources such as Ramayana, Puranas, Kavyas were referred to explore the almightyness of Lord Hannman. Dr. Sastry takes all the pain to portray the marvellous achievements of Lord Hanuman. The Upasana Kanda" is analysed very well.

Dr. Sastry brings out the evolution and charges in the theology of Hanuman. He appears as the incarnation of Lord shiva. The great qualities Satyam, sivam and sundaram are conceived as the graceful qualities of Hanuman and 'Vira' 'Dhairya 'Saurya' are regarded as his qualitios of power. Power and grace co-exist in Harumen. At the ordinary level, Hanuman is the ideal person (Mahapurusha) an upright man, a trusted person by Rama, an Ambassodar of the first Rank, a brave warrior and a statesman of first order In the Bhakti tradition, none can equal him He is the Lord and as well the object of Bhakti.

Dr. Sastry has broughtout all these aspects of Lord Hanuman and deserves congratulations for bringing out such a learned book on the cult of Hanuma.

(Sd.) G. SUNDARA RAMAIAH

# కృతజ్ఞతా నివేదనము

కార్యమెుకటైనను కారణము లనేకము లుండును. పరిశోధన యను నది పరిశోధకుని సృష్టి వంటిది కాదు. పరిశోధనలో పరిశోధకుండు ప్రధాన కారణము కాగా నాయా నిమిత్తకారణములు కూడుటవలననే పరిశోధనా కార్యము సఫలమగును. ప్రత్యక్ష పరోక్ష సహకారు లెందరో తోడగుటవల ననే యీ నా పరిశోధనను పూర్తి చేయగల్గితి ననుట యథార్థము. కావున అట్టి సహాయకారులకు కృతజ్ఞతలుసమర్పించుకొనుట ప్రథమకర్తవ్యము.

ముందుగా నాంధ్రసాహిత్యమునఁ బరిశోధనఁగావించుట కనుమ తించిన ఆంధ్ర విశ్వవిద్యాలయము వారికి, శ్రీ దంతులూరి నారాయణ రాజు కళాశాలలోని పోస్టుగ్రాడ్యుయేటు కేంద్రములో పరిశోధనను కొన సాగించుట కవకాశము కల్పించిన ఆ కళాశాలా యాజమాన్యము వారికి, నేను పరిశోధన చేసికొనుట కనుమతించి నా పరిశోధనావ్యాసంగము నిరా టంకముగా జరుగుటకుఁ దోడ్పడిన యస్. టి. ఆర్. యన్.యస్.యస్. కళాశాల అధ్యక్షులు శ్రీ డి. వి. రమణయ్యగారికి కృతజ్ఞతలు.

పరిశోధన పట్టముమాత్ర మందించుట కాక సహృదయ లోకోప కారకము కావలెనని నా ఆకాంక్ష. నాకృషివలన నుదాత్తము నాదర్శ పూర్ణము నగు నొక్క పాత్రయొక్క సమగ్రరూపము వాఙ్మయ స్వరూపమున ప్రదర్శింపగల్గిన కృతకృత్యతయే యనుకొంటిని. నాయ దృష్ట విశేషమున వేదభాగమగు నుపనిషత్తులపై విశేష పరిశోధన గావించిన డా॥ పి. వెంకటరాజు, ఎం.ఏ;పిహెచ్.డి. గారు నా పరిశోధ నకు మార్గదర్శకులయినారు.

'వేదః ప్రాచేతసా దాసీత్ - సాక్షాద్రామాయణాత్మనా'అని వేదమే రామాయణరూపమున వచ్చుటచే ఆ రామాయణమున సర్వశక్తి సమన్వి. తము, ఆదర్శవంతముసైన హనుమంతుని పాత్రయెడ పరిశోధనకు నను మతి లభించినది. బుద్ధిశక్తి, బాహుశక్తులు రెండింటికి ప్రతీకయై, శైవ వైష్ణవమతకల్లోలముల కేకైకపరిష్కారమా యనునటుల శివావతారుఁడు, స్వయంవైష్ణవుఁడు నయి, సర్వసంప్రదాయములకు నారాధ్యుఁడు నాద ర్శము నయి,విశేషించి ఆంధ్రదైవత మనఁదగిన హనుమంతునిగూర్చిన యీ పరిశోధనకు శ్రీ వెంకటరాజుగారు అడుగడుగున మార్గదర్శకులై సునిశిత పరిశీలనా దృష్టితో నా పరిశోధన చక్కగ రూపుదిద్దుకొనునట్లు నడిపించిరి. వారికి నా కృతజ్ఞతా పూర్వకమగు నమోవాకము లర్పించు కొనుచున్నాను.

నా కృషియారంభమైనది మొదలు తమ యనుభవములను దెల్పుచు, తమ కడనున్న గ్రంథము లిచ్చుచు నవసరములందెల్ల తోడై సహకరించిన మిత్రులు డా॥ రామడుగు వేంకటేశ్వరశర్మగారికి కృతజ్ఞతలు తెలియజేసికొనుచున్నాను.

పరిశోధనారంభము నుండి తుదివఱకు ఎందఱో వ్యక్తులు, గ్రంథాలయాధికారులు, గ్రంథ పరిశీలనయందు సహకరించినారు. వారి పేర్లన్నియుఁ బ్రకటించుట యసాధ్యము. కావున అట్టి ప్రత్యక్ష పరోక్ష సహాయకులందఱకు పునః పునః కృతజ్ఞతలు చెప్పుకొనుచున్నాను.

నాకు, నా గ్రంథమునకు అక్షరాశీస్సులు ప్రసాదించిన కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠాధిపతులు ప. ప. శ్రీ శ్రీ శ్రీ శివచిదానంద భారతీస్వామి వారికి నమోవాకములు గ్రంథమునకు తమ అమూల్యాభిప్రాయము లొసగిన ఆచార్యవర్యులు శ్రీ కోవెల సుప్రసన్నాచార్య శ్రీ పి. వెంకటరాజు శ్రీ శలాక రఘునాథశర్మ శ్రీ జి. సుందర రామయ్యగార్లకు నా కృతజ్ఞతల నందజేసికొనుచున్నాను.

సుజనవిధేయుఁడు
అన్నదానం చిదంబరశాస్త్రి

## ప్రకాశక వాక్యము

శ్రీ హనుమదాధ్యాత్మిక కేంద్రం ది 2-4-1992 న పూజ్యులు శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారి కరకమలములచే ఆరంభింపబడినది. నాటినుండి తనవంతు ఆధ్యాత్మిక కృషిని యథాశక్తిగా చేస్తూ ఉంది. అందులో భాగంగా చేస్తున్న మా ఈ హనుమత్కావ్య ప్రకాశన రూపమైన కృషిని హనుమద్భక్తులెల్లరు సద్వినియోగము చేసికొనవలెనని మా ఆకాంక్ష. అందుకే హనుమంతుని గూర్చి విశేషపరిశోధన గావించిన డా॥ అన్నదానం చిదంబరశాస్త్రిగారి సిద్ధాంత వ్యాసాన్ని మీ పవిత్ర హస్తాలకందిస్తున్నాము. సార్థకం చేసికొనగలరని ఆశిస్తున్నాము. ఎంతో వ్యయప్రయాసలతో కూడిన ఈ మహద్గ్రంథముయొక్క ముద్రణకు సహాయ మొనరించిన తిరుమల తిరుపతి దేవస్థానము వారికి, తెలుగు విశ్వవిద్యాలయము వారికి హనుమద్భక్తులకు 'బాలాంజనేయ' చిత్రమును యీ గ్రంథ ముఖచిత్రముగా స్వీకరింప నందజేసిన ఆర్టిస్ట్ రాంప్రసాద్ గారికి, చక్కగా గ్రంథము ముద్రించి యిచ్చిన నవోదయ ప్రింటింగ్ ప్రెస్ అధినేత శ్రీ గుండపు పూర్ణచంద్రరావుగారికి కృతజ్ఞతలు తెలియ జేసికొనుచున్నాము.

— శ్రీ హనుమదాధ్యాత్మిక కేంద్రము

# సంకేత పదసూచి

అ. అరా - అధ్యాత్మరామాయణము
అర. ప - అరణ్యపర్వము
ఆ రా - ఆనందరామాయణము
ఆం. వా. రా - శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము
ఆనంద - ఆనందరామాయణము
ఉ. కాం - ఉత్తరకాండము
ఉషః - ఉషఃఖండము
గో. రా - గోపీనాథ రామాయణము
చం. లో - చంద్రాలోకము
తె. సా. స - తెలుఁగు సాహిత్య సమీక్ష
తత్త్వ - శ్రీరామాయణమ్ సుందరకాండః తత్త్వదీపికా వ్యాఖ్య
దివా - దివాఖండము
ప. సం - పరాశర సంహిత
భా. రా - భాస్కరరామాయణము
భార. ఉ - భారతం ఉద్యోగపర్వం
భాగ - భాగవతము
మొ రా - మొల్ల రామాయణము
రామా - రామాభ్యుదయము
రం. రా - రంగనాథరామాయణము
రా. దొ. రా - రావూరి దొరస్వామిశర్మ రామకథ
రా. సారో - రామాయణ సారోద్ధారము
వా. రా - వాల్మీకిరామాయణము
వసు - వసుచరిత్రము
వా. కీ - వాసుదాసకీర్తనలు
శ్రీ. క - శ్రీరామకథామృతము
శ్రీ. రా. - శ్రీమద్రామాయణ కల్పవృక్షము
శ్రీ. ఉ. రా - శ్రీమదుత్తర రామాయణము
శ్రీరా. యుద్ధం - శ్రీరామాంజనేయ యుద్ధం
శ్రీ రా. సం - శ్రీసీతారామాంజనేయ సంవాదము
సుం. కాం - సుందరకాండము
సం. భార - సంస్కృత భారతము
సంధ్యా - సంధ్యాఖండము
సమీర - సమీరకుమార విజయము
స్త్రీ. రా. పా - స్త్రీల రామాయణ పాటలు
హ. వి స - హనుమద్విషయ సర్వస్వము
హరి - హరికులామోదము

# విషయ సూచిక

## ప్రథమ సోపానము : పుటలు 1-60



## ద్వితీయ సోపానము : పుటలు 61-151



## తృతీయ సోపానము : పుటలు 152-288

## తురీయ సోపానము : పుటలు 289-338



## అనుబంధములు : పుటలు 339-356

# ఆంధ్రవాఙ్మయమున - హనుమత్కథ

## ఉపోద్ఘాతము

ఓం కారమే చరాచర సృష్టికి మూలభూతముగఁ జెప్పఁకొను సనా
ధర్మమే విశ్వధర్మముగా ఊహకందని పరిశోధనకు నంతుచిక్కని
ము నుండి చెప్పబడుచు వచ్చినది. ఆ సనాతన ధర్మము నిర్దేశించిన
సూత్రములు ప్రభు సమ్మితములై వేదముగ, మిత్ర సమ్మిత
పురాణములుగా హితోపదేశము చేసినవి. అవే ధర్మ సూత్రములు
వ మనస్తత్త్వము నెఱిఁగి రంజనతో హృదయమున హత్తుకొనుటకై
ములుగా వెలువడినవి.

ఆ విధముగ వాఙ్మయరూపమున మానవ కోటికందిన సనాతన
ములు 'రామోవిగ్రహవాన్ ధర్మః' అన్నటులఁ గొన్ని కొన్ని ధర్మ
త్రములకుఁ బ్రతీకలుగఁగొన్ని కొన్ని పాత్రలుగ లేదా కొందఱు
తలుగ మనముందు నిలచినవి. అట్టి ప్రతి దేవత పాత్రవెనుకను లోక
మకొనఁదగిన సందేశమెంతయో యున్నది. అట్టి దేవతా మూర్తు
ఁబ్రముఖముగఁ గానవచ్చు మూర్తి, సర్వశక్తులకుఁ బ్రతీక
మంతుఁడు.

సర్వసద్గుణములకు ఆయన ప్రతీక. భౌతిక రూపమున వానరుఁడై
ాతి యందుఁ జేరియు వృత్తి ప్రవృత్తుల పరవిధానము నంది శక్తి
క్తులలో దైవతత్త్వముఁ జూపినవాఁడు. పరస్పర భిన్నశక్తులగు
శక్తి, బాహుశక్తులు రెండింటికీ స్థానము. పరస్పర విరుద్ధములై
ోన్న యుద్ధములతోఁ జరిత్ర నింపిన శైవవైష్ణవ సంప్రదాయము
ంటికి మధ్యవర్తి. శివావతారునిగా శైవులకు, రామకార్య ధురీ
నిగా వైష్ణవులకును ఆరాధ్యుఁడు.



శ్రీ రాముడు చేసినట్లు, శ్రీ కృష్ణుఁడు చెప్పినట్లు గ్రహింప వలెను ప్రతీతియుండ రెండిట హనుమంతుఁడు స్వీకారుఁడు. బ్రహ్మచర్య ాలనము, సేవాభావము, వినయ సంపదలలో దేశ కాలభేదము లేక ర్వులకు నాదర్శమైనవాఁడు. ఇట్టి యాదర్శమూర్తి యొక్క గాథ ండి లోకమందుకొనఁదగు సందేశమెంతయుఁ గలదు. ఇంత ాఁడాంధ్ర దేశమున జనించుట యాంధ్రుల గర్వకారణము. ఆంధ్ర ాఙ్మయమునందు హనుమంతుని కథనెట్లు చిత్రించినది పరిశీలించుట ద్వారా ఆ మార్గమునఁ గావ్య ప్రయోజనము సహృదయు లందు కొను ంలో దోహదమొనర్చుట యీ పరిశోధనావ్యాసోద్దేశ్యము. సాహిత్య ప్రపంచమున హనుమత్కథకుఁగల ఉత్కృష్టస్థానము నిరూపించుట ముద్దేశ్యము.

కవి సృష్టి బ్రహ్మసృష్టి కంటెఁ జాల ప్రత్యేకమైనది. అందువనే కావ్యప్రకాశ గ్రంథాదినే

"నియతి కృత నియమ రహితాం
హ్లాదైక మయీ మనన్య పరతంత్రాం
నవరసరుచిరాం నిర్మితి మాదధతీ
భారతీ కవేర్జయతి"

అని మమ్మటుఁడనెను. ఇంతటి విలక్షణమగు సృష్టిని "కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే" అను ప్రయోజనముల నాసించి మహాకవులు సలక్షణముగఁ జేసిరి. ఋషితుల్యులగు నట్టికవుల కావ్యములన్నియు లోక హితకరములు. వారు వర్ణించిన వర్ణనలన్నియు నాహ్లాదకరములు. వారు పోషించిన పాత్రలన్నియు నాదర్శములు. ఏ పాత్రనెందులకు చిత్రించినది ఎందులకుఁ బోషించినది గ్రహించిన నాఁడే ఆ పాత్రలను సృష్టించుటలో నున్న యథార్థ ప్రయోజనమును మనము పొందగల్గుదుము.

ప్రతి కవియు నేదోయొక యాశయముననే మార్పులుగానీ చేర్పులుగానీ చేయును. అట్టి యాశయములు, నటువంటి మార్పులు,

చేర్పులు లేకున్న నింతటి కావ్యసంపదయేర్పడు నవకాశమే లేదు. ఒకే విషయమును స్వీకరించి పలువురు రచనఁజేసినను ప్రతిదాని యందునుఁ బ్రత్యేకతను చూడఁగల్గుచుంటి మన నందుకుఁగారణము వారిప్రతిభయే "నవనవోన్మేషశాలిని ప్రతిభ" కావుననే ఇందఱు కవులును జనరంజకములు, రసవత్తరములునగు రచనలు చేసినవారగుచునే యున్నారు.

రామకథను వస్తువుగ స్వీకరించినవారు ప్రతి భాషయందును ఎందఱో కలరు. ముఖ్యముగాఁ దెనుగు నాట రామాయణకథ విస్తృతముగఁబ్రచారమందినది. ఏదో విధముగ రామాయణ రచనఁ గావించి జీవితము ధన్యమాయెననుకొను వారనేకులు.

"శ్రీరామాయణ సంహిత
సారమతిన్ వినిన వ్రాయఁజదివిన దురితా
పార జలరాశిఁగడతురు." అని భాస్కరరామాయణము

[1] "....   ....   ....   .... చారు కవిత్వము నేర్చి జానకీజానికథల్ రచింపక యసత్కథ లెన్ని రచించెనేనియున్ వాని వివేకమేమిటికి వాని కవిత్వ మహత్త్వమేటికిన్" అని కంకంటి పాపరాజు,

[2] "రాముకథఁ బలుకడేనియు
నేమెయినేన్ సుకవిగాంచఁడ దెట్టిబుధుండున్
ధీమహితుల మతమౌటిది
రామాయణమును రచింతు శ్రీద్ధాయుక్తిన్"

అనివాసుదాసు కవిశాసనముగనే బల్కుటయు నా విషయమును రూఢిమొనర్చు చున్నది.

" యత్ర యత్ర రఘునాధ కీర్తనం
తత్ర తత్ర కృతమస్త కాంజలిమ్
" రామాయణ మహామాలారత్నం
వందేఽనిలాత్మజమ్"

---

1. శ్రీ. ఉ. రా. పీఠిక - 15
2. ఆం. వా. రా. పీఠిక - 50

అన్న ఆర్షవాక్యములు రామకథయనగనే హనుమత్కథ యన్నటులే యని స్పష్టమొనర్చుచున్నవి. ప్రత్యేక హనుమత్కథ తెనుఁగు రచయితలకు వస్తువగుచుఁ గూడ విరాజిల్లినది.

రామాయణమున హనుమంతుని పాత్ర మిక్కిలి విశిష్టమైనది. ఆదర్శ ప్రాయమైనది. అట్టి యుదాత్త పాత్ర యొక్క పోషణము లోకమునకు మార్గదర్శకము. కావున సారస్వత ముఖ్య ప్రయోజనముల నొకటగు నుపదేశము నెడ నీ పాత్ర మిక్కిలి యుపకరించి సారస్వత ప్రయోజనమును సాధించినది. హనుమంతుని గూర్చి మహనీయుల భావనను గమనించినఁ దద్విషయకముగుఁ బరిశీలన మావశ్యకమని గ్రహింపగలము. జాతిపిత గాంధిమహాత్ముఁడు, శ్రీ రామకృష్ణపరమహంస, వివేకానందుఁడు, మహామనా మదనమోహన మాలవ్య ప్రభృతులు జాతికి ముందు నాదర్శముగ హనుమంతుని నిల్పినట్లు చరిత్ర తెల్పుచున్నది.

కావున నట్టి సద్గుణ గరిష్ఠుని కథఁ దెనుఁగు కవులే యేరీతుల మలచి నిరూపించిరను విషయముఁ బరిశీలించుట యీ పరిశోధనోద్దేశ్యము. విశేషించి హనుమజ్జనన విహారము లాంధ్రదేశ ఘటనములు. కావున నాతని ప్రభ యాంధ్రమున మీదు మిక్కిలిగఁ గాన నగును. రామాయణ మహామాలారత్నము నేకవియు వీడడు. అట్లు రామాయణ కథాంశముల నెల్లెడ వ్యాపించుచుఁ జిరంజీవి యగుట ద్వాపరయుగమునను, చరిత్రఁ గల్గి యుండి ప్రత్యేక రచనలను సైతము పొందియున్న హనుమంతుని కథ ఆంధ్రవాఙ్మయమున నెట్లు సంగ్రథితమైనది నిరూపించుట యీ పరిశోధనోద్దేశ్యము.

సోపాన చతుష్టయాధారమున గమ్యముఁ జేరుట విధానము.

ప్రథమ సోపానమున హనుమత్కథకు మూలాధారమగు వేద వాఙ్మయము, ఆ మూలకథ శాస్త్రేతిహాస పురాణాదులందు క్రమ వికాస మందినరీతి, తెనుఁగు వారి హనుమత్కథ కాధారభూతమగు మౌలికమైన హనుమద్విషయ మిందుఁ బరిశీలింపఁబడినది.

ద్వితీయ సోపానమున దెలుగు రామాయణములు హనుమత్కథ నందించిన రీతి పరిశీలింపబడినది. ఆయా రామాయణ కావ్యములందు గవులు చిత్రించిన హనుమత్పాత్ర అందలి ప్రత్యేకత పరిశీలింపబడినది.

తృతీయ సోపానమునందు దెనుగులో గేవల హనుమత్కథా కావ్యములు, హనుమత్కథా ప్రాస్తావిక కావ్యములు. నాటక, గద్య, హరికథా, శతక, జానపద సాహిత్యాదులందు హనుమత్కథ వ్యాపించిన రీతియు బరిశీలింపబడినవి. ఆంధ్రవాఙ్మయమునగనప్పట్టు హనుమత్పరమగు విశేషకథాఘట్టములు ననుశీలన గావింపబడినవి.

తురీయ సోపానము ఉపసంహార సోపానము. భారతీయ, తదితర భాషలన్నిట హనుమత్కథాగమనము, భిన్న సంప్రదాయముల హనుమత్ప్రాధాన్యత, ఆంధ్రదేశమున వివిధ హనుమదాలయములు, ఉపాసనా విధానములు, హనుమన్మంత్ర, యంత్ర, తంత్రాదికము, హనుమంతుని భిన్న రూపములు, నవావతారములు విశేషాంశములు, హనుమంతుడు ఆంధ్రుడు, రామాయణ దైవం హనుమంతుడు, జాతీయోద్యమమున హనుమంతుడు, హనుమచ్చరిత్రలోని ఆధ్యాత్మికతత్త్వము, అనుబంధములు నిబంధింపబడినవి.

# వేదవాఙ్మయంలో - హనుమత్కథ

''వేదో౽ఖిలో ధర్మమూలం''

అను వాక్యము వలన సకల ధర్మములకు మూలము వేదమని స్పష్టము. వేదధర్మములు త్రికాలాబాధితములు సమస్తమునకు లౌకికాలౌకిక చైతన్యమునకు మూలమైన వైదిక వాఙ్మయమునందు లేనిదిలేదు. కర్మజ్ఞానాది సర్వమార్గముల విశదీకరించు నీ వేదముల దేవతా స్తుతియుఁ బ్రముఖముగా గానవచ్చును. 'దేవతా స్వరూప పరిజ్ఞానము కొఱకు వేద' మని చెప్పునిరుక్త సప్తమాధ్యాయమునుబట్టి వేదవాచ్యులగు దేవతలనే ప్రమాణముగఁ దలఁచు వారునుఁగలరు. వేదోక్త మూర్తియే హనుమంతుఁడని యనేక మంత్రములు నిరూపించుచున్నవి. త్రేతాయుగమునందలి హనుమంతుఁడు తొలి మినుకులగు వేదముల నుండుటనుగూర్చి ప్రశ్నించుకొనఁబనిలేదు. కల్పాంతర గాథల కారణమున నీ కాలప్రవాహముచెడనా ప్రశ్నలకుఁ దావులేదు. ఇందుకుఁబ్రమాణము రామునిచేఁజెప్పఁబడిన

1 ''బ్రహ్మణే మమ భక్తాయ - త్వాదృశాయ యశాత్మనే
మమ ప్రతినిధి ర్మద్రా - ప్రతి కల్పం ప్రదీయతే॥

2 ''ఏకైకాంశో హనుమతః - ప్రతి కల్పం మహాత్మనః
జాయతేబ్రహ్మ రూపేణ - లోకానుగ్రహ కామ్యయా॥

అనునదియే - కావున వేదమున హనుమత్ప్రసక్తిని గూర్చి శంకింపఁబనిలేదు.

వైదిక మంత్రములఁ గల విషయము స్పష్టము గాదు. పరోక్షముగ నుండి భావనమున గోచరమగును. దీనిని

3 ''పరోక్షప్రియా ఇవహి దేవాః

అను బృహదారణ్యకోపనిషదుక్తి వలనను,

4 ''యత్పరోక్ష ప్రియోదేవో - భగవాన్ విశ్వభావనః''

అనుభాగవతోక్తి వలనను గ్రహింపగలము.

---

1. ప. సం. 54 - 38
2. ప. సం. 54 - 60
3. బృహదారణ్యకోపనిషత్తు 4 - 2 - 2
4. భాగ 4 - 28 - 65

ఋగ్వేదమనేక సూక్తములకు, దైవప్రార్థనలకు నిలయము. విశేష భావనమున నందలి ప్రథమ మంత్రమే హనుమత్ప్రతిపాదకముగఁ దెలియుచున్నది. అనిన వేదదర్శనాచార్య గంగేశ్వరానందచే

[2] "అగ్నిం దూతం వృణీమహే హోతారం
విశ్వవేదసమ్। అస్యయజ్ఞస్య సుక్రతుమ్॥

అను నీమంత్ర మిట్లు నిరూపితమయ్యెను.

అగ్నిం-అగ్రణి=వానరాగ్రణి (దైత్యవనదాహకాగ్నిని)
యజ్ఞస్య దూతమ్=శ్రీరామచంద్రుని దూతను (యజ్ఞోవైవిష్ణుః శతపథ బ్రాహ్మణం 1-1-2 కావున విష్ణురూపుఁడే శ్రీరాముడు)
సుక్రతుమ్=శోభన కర్మ శీలిని=సముద్రోల్లంఘనసీతాన్వేషణ సంజీవనగాహరణాది లోకోత్తర కృత్యనిర్వాహకుని, వృణీమహే=ఉపాసించుచున్నాము=ప్రార్థించుచున్నాము. హనుమత్పరముగా నీమంత్రమునకు గంగేశ్వరానంద యిచ్చిన వాఖ్యయిది. ఈ మంత్రార్థమే ప్రశస్తమైన

"మనోజవం మారుత తుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసానమామి'

యను శ్లోకమునఁగాననగును.

అగ్ని - యన వాయు పుత్రుఁడే కాన అగ్నిశబ్దమే హనుమత్పరమైనది. [3] వాయోరగ్నిః అను ప్రమాణమున వాయుసుతు డగ్నియేఁ ఈ భావమున ఋగ్వేద ప్రథమ మంత్రము నే హనుమత్ప్రతిపాదకముగా గ్రహింపఁదగును.

[4] "అగ్నిమీళేపురోహితం యజ్ఞస్య దేవమృత్విజం హోతారం రత్నధాతమమ్" అని మంత్రము. యజ్ఞస్య=రామసుగ్రీవుల స్నేహ యజ్ఞమునకు; దేవమ్=కారకుడైన వానిని, ఋత్విజమ్=ఋతావిజమ్= సముద్రము లంఘించి రాక్షసులను కంపింపజేసిన వానిని, రత్నధాత

---

1. వేదోపదేశ చంద్రిక - పు - 8, 9
2. ఋ. 1 - 12 - 1
3. తైత్తిరీ యోపనిషత్తు - 2 - 1
4. ఋ 1 - 1 - 1

మమ్=రామాంగుళీయకమును, సీతా శిరోరత్నమును ధరించిన, పురోహితమ్=సీతాన్వేషణాది కార్యముల ముందు నడచిన దూతయగు; అగ్నిం=వాయుసుతుని, హనుమంతుని, ఈళే=నమస్కరించుచున్నాను.

వేదమునఁగానవచ్చు 'అపాన్నపాత్' శబ్ద ప్రతిపాదకుడును హనుమంతుఁడే. ఋ 2-35, ఋ 10-30లు రెండు మంత్రములందును అపాన్నపాత్ వాచ్యదైవము స్తుతింపఁబడెను. అపశబ్దము అంతరిక్ష=ఆకాశవాచకము. ఆకాశముయొక్క నప్తా=పౌత్రుఁడు ఆకాశాద్వాయుః (తై 2-1) ఆకాశమునుండి వాయువు, వాయుసుతుఁడు హనుమంతుఁడు ననియు వేదదర్శనాచార్యులు గంగేశ్వరానందజీ మహరాజ్ సమన్వయిపఁజెరి. ఇక ఆంజనేయుని ప్రధాన నామమగు హనుమత్ నామమునకు కారణమైన విషయము.

[1] "మమచ్చన తే మఘవన్ వ్యంసో నివివిధ్వా
అప హనూజఘాన అధానవిద్ధ ఉత్తరో
బభూవాచ్ఛిరో దాసస్య సంపిణగ్వధేన" మంత్రమునఁగలదు,

మఘవన్ = ఓ ఇంద్రా; తే = నీయొక్క సన్నిధానమున; చన = నిశ్చితమగు; మమత్ = ప్రమాదకారియగు, వ్యంసః = విశాలస్కంధముకల ఐరావతమును పట్టబోయిన హనుమంతుఁడు; వివిధ్వాన్=పీడింపజొచ్చెను. నివిద్ధం = పీడించువాని యొక్క; హనూ = దవడలందు, వధేన = వజ్రాయుధమున, జఘాన = కొట్టితివి; అధపిమ్మట, దాసస్య = ఆ శ్రీరామదాసుఁడగు హనుమంతుని, శిరః = దవుడ (అవయవే 2వ యువినః ప్రయోగః) సమ్పిణక్ = జారినది; వ్యంసః = హనుమంతుడు ఉత్తరో బభూవాన్= గొప్పవాడయ్యెను. పరోక్షప్రియా ఇవహి దేవాః అన్నటులఁ బై శబ్దములు పరోక్షముగాఁ దెల్పుచుండగా

[2] "అనుస్వదామక్షరన్నాపో అస్యాఽవర్ధత
మధ్య ఆ నావ్యానామ్, సధ్రీచీనేన మనసా
తమింద్ర ఓ జిష్ఠేన హన్మనాహన్నభిద్యూః

---

1. ఋ 4 - 18 - 9

2. ఋ 1 - 33 - 11

మంత్రమున హన్మన్ అనియే శబ్దము ప్రయోగింపఁబడెను. ఇటహన్మనా శబ్దము 'హనుమతా' యొక్క రూపాంతరము పై మంత్రము అంతరిక్ష మున నున్న గంభీర జలరాశియు హనుమంతుని ముంచివేయుటయందు సమర్థమను భావముఁదెల్పును. వేదమున దూతశబ్దము విభక్తిభేదమునఁ బది పర్యాయములు, హనూశబ్దము నాల్గు పర్యాయములు హనుమతాశబ్ద రూపాంతరమగు పై 'హన్మనా' శబ్దము ఐదు పర్యాయములు ప్రయో గింపఁబడినవి.

[1] సుమారు ఐదు వందల సంవత్సరములకుఁబూర్వమే మహా విద్వాంసులగు నీలకంఠ సూరి వేద మంత్రములకు భాష్యమిచ్చుచు మంత్ర రామాయణమును రచించిరి. వారీక్రింది రీతిగా ఋఙ్మంత్ర ములందుఁగల హనుమత్కథను వివరించిరి.

[2] ''ప్రమాతుః ప్రతరం గుహ్య మిచ్ఛన్ కుమారో న వీరుధః ప్రసర్ప దుర్వీఃసనం న వక్వ మవిద చ్ఛుచన్తం రిరిహాంసం రిప ఉపస్థే అన్తః''

అను ఋక్కునందు సీతాదేవి అన్వేషణార్థము హనుమంతుని సముద్ర లంఘనేచ్ఛ వివరింపఁబడినది.

[3] ''అద్రిభిః సుతః పవతే, మంత్రమున మైనాకపర్వతమును స్పృశించి వెడలుట,

[4] ''ఉపోమతిః పృచ్యతే సిచ్యతే మధుమన్ద్రాజనీ చోదతే అన్తరాసని'' మంత్రమునందు సీతామాతకు మధురమగు రామవార్త నెఱింగించుట సూచితము.

[5] ''దీవాస ఆయన్....కృపీట మనుతద్దహన్తి' మంత్రమున లంకాదహన వృత్తము కలదు. ఇట్లు సుందరకాండ గాథ వ్యక్తము చేయఁబడగా

---

1. కళ్యాణ్ - జనవరి 1975 - వ్యాసకర్త-శ్రీరామ కుమార దాస్‌జీ
2. ఋ - 10 - 79 - 3
3. ఋ - 9 - 71 - 3
4. ఋ - 9 - 6 - 9 - 2
5. ఋ - 10 - 28 - 8

1 ''సరుద్రేభి రశస్తవార ఋహిత్వీగయమారే అవద్య ఆగాత్'' ఇంకను ఈ క్రింది మంత్రములును సుమహత్పరములుగా వేదోంమే హనుమచ్ఛాస్త్రన్ అను శీర్షిక వలనఁదెలియుచున్నది.
(కళ్యాణ్ జనవరి '85 పుట - 2)

2 ''ఓం తవ శ్రియే మరుతో మర్జయన్త రుద్రయత్తే జనిమ చారు చిత్రమ్ పదం యద్విష్ణో రుపమం నిదాయి తేన పాసి గుహ్యం నామగోనామ్''

3 ''ప్రకృష్టిహేవ శూష ఏతి రోరువద సుర్యం వర్ణం నిరిణీతే అస్యతమ్। జహాతి వవ్రిం పితు రేతి నిష్కృత ముపప్రుతం కృణుతే నిర్ణిజంతనా,

4 ''ఇషుర్న ధన్వన్ ప్రతిధీయతే మతి ర్వత్సో న మాతు రుపసర్జ్యూధని ఊరుధారేవ దుహే అగ్ర ఆయ త్యస్య వ్రతేష్వపి సోమ ఇష్యతే,

5 నృబాహుభ్యాం చోదితో ధారయా సుతో ఽనుష్వధం పవతే సోమ ఇన్ద్రతే ఆప్రాః క్రతూన్ త్సమజై రధ్వరే మతీర్వేర్న ద్రుషచ్చ మ్వోరాసదద్ధరిః''

6 అక్షావహో న హ్యతనోత సోమ్యా ఇష్కృణుధ్వం రశనా ఓతపింశత అష్టావన్ధురం వహతాభితో రథం యేన దేవాసో అనయ న్నభిప్రియమ్॥

అను ఋఙ్మంత్రమున యుద్ధకాండకు సంబంధించి రాముఁడు హనుమదాదుల సహాయమున సీతతోకూడి స్వస్థానము చేరిన విషయము చెప్పఁబడినది. విశేషించి మన్యుసూక్తము హనుమత్పరముగా వినియోగమున నున్నది. హనుమంతునకు మన్యుసూక్తముతో నభిషేక మొనర్చుట, మన్యుసూక్తోక్త పూజావిధి, హనుమత్ప్రీత్యర్థము మన్యుసూక్త పారాయణము కూడఁ బ్రశస్తముగా లోకమున నున్నవి. ఇకసామవేదమునఁజూడ

---

1. ఋ - 10 - 99 - 5
2. ఋక్సంహితా - 5 - 3 - 3
3 ఋక్సంహితా - 9 - 71 - 2
4. ఋక్సంహితా - 9 - 69 - 1
5. ఋక్సంహితా - 9 - 72 - 5
6. ఋక్సంహితా - 10 - 53 - 7

1 ''ఉపోమతిః వృచ్యతే సిచ్యతే మధుమంద్రాజకేః'' మంత్రము సామ వేదమున గాన మొనర్పబడినది. పై వలెనిది సుందరకాండ గాథను తెలుపుచున్నది.

వేదము యొక్క విభాగములు 1. సంహిత 2. బ్రాహ్మణము 3. ఆరణ్యకము 4 ఉపనిషత్తులను నాల్గింటియందు వేదాంతముగాఁ జెప్పబడు నుపనిషత్తులందు హనుమద్విషయము విశేషముగాఁగాన నగును. రామరహస్యోపనిషత్తు, రామపూర్వోత్తర తాపిన్యుపనిషత్తు, ముక్తికోపనిషత్తు, లాంగూలోపనిషత్తు ఇత్యాదులఁదు హనుమదంశము కలదు.

రామ రహస్యోపనిషత్తునందు సనకాదిమునులు ప్రహ్లాదాది భక్తులు సర్వశాస్త్రపురాణాదుల నే తత్త్వము ప్రతిపాదితమయ్యెనవియడుగ హనుమంతుఁడు

''రామ ఏవ పరం బ్రహ్మ - రామ ఏవ పరంతపః
రామ ఏవ పరం తత్త్వం - శ్రీరామో బ్రహ్మ తారకమ్'' అను

అట్లు శ్రీరాముఁడే తారక బ్రహ్మమనుటయేకాక రామరహస్యము తెల్పుచు ప్రణవమును శ్రీ రాముని యంగముగాఁబల్కి శ్రీరామోపాసనను గూర్చి చెప్పెను. శ్రీరామ పూర్వోత్తర తాపిన్యుపనిషత్తులో

2 ''తతస్తతార హనుమా - నబ్ధిం లంకాం సమత్యయౌ
సీతాందృష్ట్వాఽ సురాన్ హత్వా - పురం దగ్ధ్వా తథా స్వయం
ఆగత్యరామేణసహ - న్యవేదయత తత్త్వతః''

అనువానియందు హనుమంతుఁడు సముద్రముఁదాటి లంకకు వెళ్ళుట, సీతాదర్శనము, అసురవధ, లంకాదహనము, శ్రీరాముని చేరుట వంటి విషయములు చెప్పబడెను. అట్లే ఆవరణ పూజకై షట్కోణయంత్రస్థ దేవతా విధానము చెప్పనప్పుడు-

---

1. సామవేదము - 11 - 31 - 2

2. శ్రీరామ పూర్వోత్తర తాపిన్యుపనిషత్తులు - 4 - 25 - 28

[1] ''హనుమన్తం చ శ్రోతార మగ్రతః స్యాత్ త్రికోణకం'' అనియు
[2] ''తృతీయం వాయుసూనుం చ '' అనియుఁజెప్పబడినది.

వేదాంతమహిమ, ముక్తిభేదములు, అధ్యాత్మతత్త్వ వర్ణనాదులు గల ముక్తికోపనిషత్తు శ్రీరామాంజనేయ సంవాదపరమైనది.

శుక్లయజుర్వేదీయ తారసారోపనిషత్తు కూడ శివస్వరూపుఁడగు హనుమంతుని నిర్దేశించును. మిథిలోపవనమున జనకునకుఁబరబ్రహ్మ విద్య నుపదేశించు సమయమున యాజ్ఞవల్క్యుఁడు తన శిష్యుఁడైన భరద్వాజుని ప్రశ్నకు సమాధాన మిడుచు 'ఓం పరబ్రహ్మ' అని, అతఁడే ఉపాస్యుఁడని, అందు అ + ఉ + మ్ లలో

[3] ''మకారాక్షర సంభూత శ్శివ స్తు హనుమాన్ స్మృతః'' అని చెప్పును.

[4] ''ఓం యో హవై శ్రీపరమాత్మా నారాయణః
స భగవాన్ మకారవాచ్యః శివస్వరూపో
హనుమాన్ భూ ర్భువః సువ స్తస్మై వై నమోనమః

అని కూడ శివస్వరూపుఁడగు హనుమంతుఁడు తెలియబడును.

అథర్వణ వేదీయమగు శ్రీ హనుమత్తాపనీయోపనిషత్తు పూర్తిగా హనుమత్పరమైనది. యాజ్ఞవల్క్యజాబాలి సంవాదపరమగున దీయుపనిషత్తు.

[5] ''అథ యాజ్ఞవల్క్యం జాబాలి ముపససార। తగ్ం హోవాచ భగవన్
బ్రహ్మదిభి ర్యేనవాహ మమృతస్స్యాం. కింప్రాణాః కి మింద్రి
యాణి, కిం బుద్ధి రహంకారః। కిం చక్షు శ్శ్రోత్రం ఏనో ఘ్రాణం
జిహ్వా ధారయతీతి। పప్రచ్ఛ।

అని యారంభమగు నీయుపనిషత్తున

---

1. శ్రీరామ పూరో త్తర తాపిన్యుపనిషత్తు - 4 - 32
2. శ్రీరామ పూర్వోత్తర తాపిన్యుపనిషత్తు - 4 - 35
3. తారసారోపనిషత్తు 2 - 3
4. తారసారోపనిషత్తు - 3 - 3
5. వేదాలలో హనుమంతుడు పుట - 21

[1] ''హృదయాబ్జే। హనుమంతం। నివేశ్య యథోపచారాన్। పరికల్ప్య యథా మంత్రం। సర్వ దేవాత్మకం సర్వ జగ న్మయమేనం। యః పశ్యతి। ప తీర్ణాన్ హి। తదా కామాన్ శోకాన్ సర్వాన్ లోకా నభిజయతో।'' అని చెప్పబడి చివఱకు

[2] ''స ఏవ హనుమాన్ బ్రహ్మేతి బ్రహ్మవిదో వదంతి। నాఽన్యోఽతోఽస్తి ద్రష్టా।నాఽన్యోఽతోఽస్తి మంతా। నాఽ న్యోఽ తోఽస్తి ఘ్రాతేతి స దేవ ఖల్విదం బ్రహ్మేత్యుదాహృ త్యోపరరామ।

అని పూర్తి యైనది. ఉపనిషత్తు బ్రహ్మవిద్య కావున బ్రహ్మ విదులు హనుమంతుని యందు బ్రహ్మభావన చేయుట కలదు.
రామరహస్యోపనిషత్తునందు

[3] ''ఐహికేషు చ కార్యేషు మహాపత్సు చ సర్వదా
నైవ యోజ్యో రామమంత్రః కేవలం మోక్షదాయకః
ఐహికే సమనుప్రాప్తే మాం స్మరే ద్రామసేవకమ్''

అని హనుమంతుఁడే స్వయముగాఁజెప్పెను. ఇట్లు వైదికవాఙ్మయమున హనుమంతుని విషయము స్పష్టముగా గోచరించుచున్నది.

నిరాకారబ్రహ్మకు వాచక రూపముగా 'ఓం' కారము తెలియఁబడును. ఈ ప్రణవమే బ్రహ్మవిష్ణుశివాత్మకమై అ+ఉ+మ్ విభజనతో నున్నది. 'హనుమ' యనునది అకార ఉకారమకారయుతమగు ప్రణవమే యని, ఓంకారోపాసనే ప్రణవోపాసన అదియే ప్రాణోపాసన. ప్రాణమన వాయువే. ఆత్మా వై పుత్రనామాసి' యన్నటుల నాప్రాణోపాసన హనుమదుపాసనే యనుచు విద్యావాచస్పతి శ్రీకంఠజీశర్మ హనుమంతుని [4] ''ఓంకార వాచ్యునిగా'' నిరూపించిరి.

---

1. వేదాలలో హనుమంతుఁడు - పుట - 23
2. వేదాలలో హనుమంతుఁడు - పుట - 29
3. రామరహస్యోపనిషత్తు - పుట
4. కళ్యాణ్ - జనవరి - '75 పుట - 61

# విభిన్న శాస్త్రములలో హనుమత్కథ

శిక్షాది షట్శాస్త్రముల కంటె భిన్నముగ నున్న సంగీత, వైద్య, మంత్రశాస్త్రములయందు హనుమంతుని తోడి సంబంధము కానవచ్చును. వాఙ్మయము నందాసాహిత్యము కూడఁ జేరును కాన నట్టి వివేచనయు నావశ్యకము.

**సంగీత శాస్త్రము - హనుమంతుఁడు :** హనుమంతుడు సర్వ విద్యా విశారదుఁడుగఁ దెలియఁబడుచున్నాఁడు. ఆతనికి [1] "కళాధరుఁడ"ను నామము కూడ కలదు. నృత్యగీతాది కళలలో నిష్ణాతుఁడతఁడు. సంగీత శాస్త్ర గ్రంధమును కూడ రచించిన యాతని సంగీతజ్ఞత విశేషముగఁ జెప్పఁదగినది. ఆతని మతమును సంగీతశాస్త్రమునఁ బ్రతిపాదించెడి గ్రంధము 'ఆంజనేయ సంహిత', లేదా హనుమత్సంహితగాఁ జెప్పఁబడు చున్నది. ఆ గ్రంథము ప్రస్తుత మలభ్యము. తంజావూరున కధిపతియగు రఘునాధనాయకుడు తన 'సంగీతసుధ' గ్రంధమున నందీశ్వరాది సంహితలతోఁ బాటు అంజనానందనసంహితయుఁ గన్పట్టు చున్నట్లు

"సమీక్ష్య నందీశ్వరసంహితాం తా మాలోక్య శాస్త్రం భరత ప్రణీతం
గ్రస్థం బృహద్దేశ్యభిధం మతంగముని ప్రణీతం నిపుణం విలోక్య
విచార్య తాం యాష్టికసంహితాం చ జ్ఞాత్వాంజనానందన సంహితాంచ
ఉమాపతే రాధునికస్య తంత్ర ముద్వీక్ష్య నందీశమతానుసారి॥"

అని వ్రాసెను. మరియు నా రఘునాధుఁడు 'ఆంజనేయ భారత' మను గ్రంధము పేరు కూడ ఉల్లేఖించెను. అందు యాష్టికమునికి ఆంజనేయుని ద్వారా గానవిద్యోపదేశము జరిగెను. 'సంగీత రత్నాకర' మున గ్రంధకర్త శార్ఙ్గదేవుఁడును ప్రాచీన సంగీతాచార్యుల నామములతో

"వాయు విశ్వావసూ రంభార్జునో నారదతుంబురూ
ఆంజనేయో మాతృగుప్తో రావణో నందికేశ్వరః

అని ఆంజనేయునిఁ జెప్ప శారదా తనయుఁడు తన 'భావప్రకాశన' గ్రంధ ప్రారంభమున దివాకరనామక నాట్యాచార్యునినుండి ఏ యే సంగీతాచార్యుల మతముల నెఱిఁగినది తెల్పుచు ప్రథమాధికారమున

---

1. కళ్యాణ్ - జనవరి '75 - పుట - 186

[1] ''ప్రీతః సోఽపి సదాశివస్య శివయో ర్గౌర్యామతం వాసుకే
ర్వాగ్దేవ్యా అపి నారదస్య చ మునేః కుంభోద్భవ వ్యాసయోః
శిష్యాణాం భరతస్య యాని చ మతా న్యధ్యాప్య తా న్యంజనా
సూనో రవ్యథ నాట్యవేద మఖిలం సమ్యక్ త మధ్యాపయత్.

అనిచెప్పెను. అంతేకాకపంచమాధికారమునఅనురాగచిహ్నములఁజెప్పుచు

[2] ''యే భావా రాగచిహ్నాని – స్త్రీణా ముక్తాః పృథక్ పృథక్
సాధారణా స్తే సర్వాసాం – స్త్రీణా మిత్యాహ మారుతిః॥

అని ఆంజనేయుని మతము చెప్పఁబడెను. అట్లే రూపకములఁ జెప్పునెడను తృప్తిటాంకము గూర్చి చెప్పుచు హనుమన్మత మిట్లు చెప్పఁబడెను.

[3] ''అస్యాంక మేకం భరతో – ద్వావంకా వితి కోహలః
వ్యా సాంజనేయ గురవః – ప్రాహు రంకత్రయం యథా''॥

'సంగీత రత్నాకర' టీకారుఁడు కల్లినాథుఁడు దేశిరాగముల విషయమున ఆంజనేయ మతముఁదెల్పుచు తథాచాహ అంజనేయః

''యేషాం శ్రుతి స్వర గ్రామ – జాత్యాది నియమో న హి
నానాదేశ గతి చ్ఛాయా – దేశీ రాగ స్తు తే స్మృతా''॥

అనుచు శ్రుతి, స్వరగ్రామ, జాతి నియమము లేనిది, నానాప్రదేశ వరం పరల ప్రభావము కలది దేశిరాగమని చెప్పఁబడుననెను.

సంగీత శాస్త్రమున సామాన్యముగ నిరువదిరెండు శ్రుతులు తెలియఁబడును కాని హనుమన్మత నంబదునెనిమిది శ్రుతులు స్వీకరింపఁబడెను.

రఘునాథుఁడు సంగీత సుధయందు 'ఒకమారు ఆంజనేయుఁడు కదళీవనమును చేరగా నట యాష్టికముని తన దక్షాది శిష్యులకు సంగీత శిక్ష నిడుచుండెను. దేశిరాగము, దాని స్వరశ్రుతుల విషయమున వైపరీత్యము చూచి శిష్యులడుగ యాష్టికముని సమాధాన మిడిన విధానముగా హనుమంతుఁడు సంగీతశాస్త్ర రచన చేసెను' అని వ్రాసెను.

---

1. భావప్రకాశము – 1 – 16
2. భావప్రకాశనము – 5 – 127
3. భావప్రకాశనము – 8 – 324

'సంగీత పారిజాతము' నను సంగీత ప్రవర్తకులలో హనుమంతుండు బ్రిముఖుండుగాం జెప్పంబడెను.

[1] ''కర్తా సంగీత శాస్త్రస్య - హనూమాంశ్చ మహాకపిః
శార్దూల కాహలా వేతౌ - సంగీత గ్రంధకారిణౌ''

సంగీత పారిజాత భాష్యకారుండు కలిందుండు శివకృతశాస్త్రం శివమతం। భరతకృతం భరతమతం వలె హనుమత్కృతశాస్త్రం హనుమన్మతమనుచు

''శాస్త్రం చకార శివ భాల విభూషితాంగః
పూర్వం తత చ్ఛివమతం భరత స్తదన్తే
త ద్భారతం కపివర శ్చ విలీలిఖ ద్యత్
పశ్చా దిదం హనుమతో మత మీరితమ్ తమ్'' అనెను.

అందలి మంగళాచరణముననే కళిందుండు

''సంగీతేన వశీకరోతి వరదం క్ష్మాజాధవం రాఘవం
య శ్చామీకర చారుగాత్రి సుషమాం విస్తారయ త్యద్భుతాం
నానాతాల కలాకలాప నిపుణః కౌశల్యవ గ్గీయతే
స ప్రీణాతు ప్రశస్త గాన రసిక వ్యామోది శాఖామృగః''

అనినుతించెను. సంగీతపారిజాత గ్రంధమువలన హనుమంతుని సంగీత శాస్త్ర పాటవము స్పష్టము కాగలదు.

సంగీత మర్మజ్ఞుండగు భావభట్టు రచించిన 'అనూప సంగీత విలాస గ్రంధమున హనుమంతుని పేరు మీద అనేక సంగీతాలంకారముల వర్ణనలు కలవు. మంగళాచరణమునందే భావభట్టు

''ఆంజనేయో మాతృగుప్తో - రావణో నందికేశ్వరః
స్వాతిర్గణో బిందురాజః - క్షేత్రిరాజశ్చ కాహలః॥

అని స్తుతించి భద్రాద్యలంకారములను

---

1. సంగీత పారిజాతము - 1 - 9

భద్ర : భద్రసంజ్ఞ మలంకార మాంజనేయోఽవదత్ సుధీః
ఏకైకస్య స్వర స్యాత్ర - హననాచ్చ క్రమోభవత్॥

గ్రీవ : స గౌ రి గౌ సముచ్చార్య-మ గౌ రి సౌ తథైవ చ
గ్రీవం లఘుద్వయే నాత్ర-హనుమా నవదత్ సుధీః॥

స-గగ రి- గగ మ-గగ రి-సస స్వరములు మరల లఘుమాత్రలతో సంయుక్త మొనర్పబడి గ్రీవాలంకారమగునని హనుమన్మతము. ఇట్లే

ఖాల : స గౌ రి గౌ నముచ్చార్య-మ గౌ రి సౌ తథైవ చ
ద్రుతాభ్యాం లఘుకాలేన-ఖాలం వదతి మారుతిః॥

ప్రకాశ: సౌ రీ గౌ మో గ రీ గశ్చ-రి సౌ వితి స్వరై శ్చ తైః
హనుమా నడతాలేన-ప్రకాశాఖ్యం త మబ్రవీత్॥

బిందు : ఆద్యం దీర్ఘ త్రయం ప్రాహ-ద్వితీయం హ్రస్వ మేవ చ
బిందుర్బిందు త్రయే ణాపి-హనుమాన్ సార్థబిందునా॥

ఇట్లే సంధిప్రచ్ఛాదన,ఉద్వాహితాద్యలంకారములను హనుమన్మతోక్తము లను వివరించెను. ఈ రీతిగా సంగీత శాస్త్రజ్ఞుఁడగు హనుమంతుఁడు తుంబురనారద సంగీత వివాదమున న్యాయనిర్ణేతగా నుండి యిర్వురి చేతను తా మజ్ఞులమని, హనుమంతుఁడే సంగీత శాస్త్రమున సర్వజ్ఞుఁడని యనిపించెను. ఇట్లు హనుమంతుఁడు సంగీత శాస్త్రమునఁ బ్రత్యేక స్థానము నందియుండెను. అట్టి హనుమత్ప్రసాదలబ్ధసారస్వతాలంకారుఁ డగు భట్టుమూర్తియు సంగీత కళారహస్యనిధియై వసుచరిత్రను సంగీత శాస్త్రమయముగఁ జేయుట తెలుఁగు వాఙ్మయమునకు శోభాయమాన ముగఁ గాంచఁగలము.

ప్రముఖ వాగ్గేయ కారుఁడగు త్యాగరాజు కూడ తన కీర్తనలందు హనుమంతుని సంగీతశాస్త్రకోవిదునిగఁ జెప్పెను. ప్రశస్తమగుఁ గీర్తన 'ఎందరో మహానుభావులు' అను శ్రీరాగాదితాళకీర్తనయందు ''నారద తుంబురు పవనసూను బాలచంద్రధర'' యనుచు హనుమంతునిఁ జెప్పుట కాక మాయామాళవ గౌళరాగము దేశాది తాళము 'విదులకు మ్రొక్కెద సంగీత కోవిదులకు'' నను గీర్తనలో 'అమరేశ భరత కాశ్యప చండీ

శాంజనేయ గజముఖులు' అనుచు నాంజనేయునిఁ గీర్తించెను. ఇట్లు హనుమంతుఁడు సంగీతశాస్త్రకోవిదుఁడుగను, సంగీతశాస్త్ర ప్రవర్తకునిగను తెలియగలము.

<u>వైద్యశాస్త్రము - హనుమంతుఁడు</u> : వైద్యారోగ్య విషయములఁ గూడ హనుమత్సంబంధము కానగును.

[1] "బుద్ధిర్బలం యశో ధైర్యం నిర్భయత్వ మరోగతా" అని హనుమత్స్మరణ వలననే యరోగత యేర్పడునని ఋషివాక్యము. హనుమంతుఁడు సంజీవరాయనిగ విశేషముగ నారాధింపఁబడును. సంజీవరాయుని వీరాంజనేయావతారముగఁ దెనుఁగునాటఁ బ్రతిష్ఠించుట కానన గును. హనుమన్మంత్రప్రదక్షిణములు, సుందరకాండ పారాయణలు రోగశాంతికై జరుపుకొందురు.

ఆయుర్వేదశాస్త్రము చెప్పుచున్న ఆగంతుక గ్రహసంబంధములుగాఁ జెప్పఁబడువ్యాధులయెడల హనుమంతుఁడు ప్రధాన పరిహారము.

[2] "బేతాళ దనుజా త్పాతు - సీతాశోక వినాశనః
సర్ప వృశ్చిక లూతాది - విషేభ్యః పాతు మాం సదా"
[3] "కర్కటీ లోక సంహర్త్రీ - విషూచీ లోకఘాతినీ
చత్వారి నామా న్యేతాని-లంఖినీ భగినీ స్త్రియః"

అను వాక్యములందును, ప్రతి హనుమదర్చనమునను ఈ విషయము తెలుపఁబడును.

[4] "సుశిరో మేశిరః పాతు - ఫాలం మేపాతు పావనిః
దృశౌ మేపాతు సుదృశో - కర్ణౌపాతు సుకర్ణవాన్"

అను రీతిగా హనుమత్కవచములు చెప్పుటయే కాక హనుమదవతారము వానరుల పుట్టుకకే కారణము. క్షీరసముద్రమథనమున విషూచి,మహామారి

1. వ. సం. 78 - 25
2. వ. సం. 78 - 21
3. వ. సం. 71 - 72
4. వ. సం. 78 - 21

మున్నగు భయంకరవ్యాధులు జనించి జనపద ధ్వంసము గావించు చుండ లోకరక్షణార్థమై బ్రహ్మకోరికపేరకు రుద్రగణము వానర రూప ములఁ బొందుటగాఁ తెలియుచున్నది. (హనుమల్లీలాతరంగిణి 2 పుట) అట్లే మాలామంత్రాదులు

[1] ''ఐకాహిక జ్వర ద్వ్యాహిక జ్వర త్ర్యాహికజ్వర చాతుర్థిక
జ్వర పాంచరాత్రికజ్వర విషమజ్వర దోషజ్వర బ్రహ్మరాక్షస
జ్వర వేతాళపాశ మహానాగకులవిషం నిర్విషం కురుకురు''

అని చెప్పుచుండ ననేక కవచములు

[2] ''అనుక్తసంధినిపాతు-సర్వదాచ సుసంధిమాన్
సర్వాంగానిచమేపాతు-సర్వావయవ శోభితః''

అని మొదలుగాఁజెప్పుచున్నవి. చిరంజీవియగు హనుమంతుని ప్రాతః స్మరణయందు స్మరించుచు

''అశ్వత్థామాబలిర్వ్యాసో - హనుమాంశ్చ విభీషణః
కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః
సప్తైతాన్ సంస్మరేన్నిత్యం-మార్కండేయ మథాష్టమం
జీవేద్వర్షశతం సాగ్రం - అపమృత్యు వివర్జితః'' అని

అపమృత్యువు నుండి తొలగి పూర్ణాయుర్దాయ మందఁగోరుదురు. బ్రహ్మ చర్య నిష్ఠాగరిష్ఠుఁడగు మారుతి ''మరణం బిందుపాతేన - జీవనంబిందు ధారణం'' వీర్యబిందు పాతము వలన మరణము, వీర్యబిందు ధారణమున జీవనము కలదని అన్నటుల బ్రహ్మచర్యమున కాదర్శమైన పూర్ణ జీవిత మనుభవింపఁగాంచుఁడగుచున్నాడు. వాయుసాధన ప్రాణ సాధనము. వాయునందనుఁడగు హనుమంతు నారాధనము ప్రాణశక్తి నీయగలదని, వాత సంబంధమగు రోగముల యెడనుపశమన కారియని యందురు. తులసీదాసు బాహువులయందు వాతసంబంధమగుఁబీడయేర్ప డ నే యౌషధములు నుపకరింపక పోవుటచే 'హనుమాన్ బాహుక్' చెప్పి

---

1. ప. సం. 25 - 82
2. ప. సం. 78 - 21

రోగఉపశమన మందుటకు నాతని రచనయే ప్రమాణము. అందుననే హనుమాన్‌చాలీసా యందును 'నాసై రోగహరై సబపీరా - జపతనిరంతర హనుమతవీర'' అని పల్కెను ఈ వాక్యమును

''హనుమానంజనీసూనో - వాయుపుత్రో మహాబల
అకస్మాదాగతోత్పాతం - నాశయాశు నమోఽస్తుతే''

అను శ్లోకమును రోగోపశమనార్థము జపింతురు. విశేషించి ప్లీహవ్యాధికి

[1] ''ఓం యోయో హనుమంత ఫలఫలిత ధగధగిత ఆయురాషపరుడాహ''

అను మంత్రము పదివేలు జపించ వలెనని చెప్పఁబడెను.

నారదీయ మహాపురాణమున మహావ్యాధినాశక మంత్రములు హనుమత్సంబంధమగునవి కలవు. ఈ రీతిగా వైద్య శాస్త్రమునకు హనుమంతుని తోడి సంబంధము తెలియును.



1. కళ్యాణ్ జనవరి 75 - పుట 503

# ఖగోళశాస్త్రము - హనుమంతుడు

ఆశ్చర్యకరమగు నొక యథార్థ విషయ మేమన భూగోళమునం జెప్పుకొను గాథలన్నిటికి ఖగోళ ప్రమాణములు కానవగును. విశేష పరిశీలనమునంగాని యది గోచరము కాదు. అసామాన్యశేముషీఖనులగు మునులు జెప్పిన విషయములను సామాన్యదృష్టితో నంగీకరింపంలేక పుక్కిడి పురాణములనుకొనుచు విస్మరింపంజూచెడి కాలపరిణామము దురదృష్టకరము. భారతీయ మహర్షులు దర్శించి తెలియజేసిన ప్రతిశాస్త్రవిషయము ఒక మహాసముద్రము, అగాధము. పోయినకొలది లోతుకుం గొంపోవునట్టిది. అట్లే ఖగోళపరిజ్ఞాన మత్యద్భుతమై అనూహ్యమగు యథార్థము.

'నానృషిః కురుతే కావ్య'మనుట సామెత వంటిది, ఊసుబోక చెప్పినదియుగాదు. అది సర్వవిధముల యథార్థము. వారి దార్శనికత నర్థము చేసికొనినపుడు మనకుంగల్గు నాశ్చర్యము నానందము మేరలేనివి వాల్మీకి వంటి మహాకవులు పైని చూచి క్రింద వ్రాసిరో, కనులు మూసికొని జగత్తంతను భూత భవిష్య ద్వర్తమానముల చలనచిత్రమునువలె స్పష్టముగా చూచుచు వ్రాసిరో అర్థముకాదు. ఈ యథార్థ దృష్టిననుసరించి ఖగోళ పరిశీలనము వలన హనుమత్కథలోని వివాదాంశముల నిష్కర్ష చేయవచ్చును.

<u>హనుమజ్జననము :</u> హనుమంతుని జనన విషయ మొక్కటి పలు విధములుగాం జెప్పంబడు వివాదాంశము. అత్యద్భుత శక్తిగల యాతని చర్యలు, సూర్యుని పట్టబోవుట, అంతటివాండై విజయధ్వజమున నుండుట, లంకాదహనము ఇవి అన్నియు నైతిహాసిక భావమున జరిగి యుండుట యథార్థము కాగా నా గాథలద్వారా ఖగోళశాస్త్ర విషయము గ్రంథస్థము చేయంబడినది. హనుమజ్జననము గూర్చి

[1] ''వైశాఖేమాసి కృష్ణాయాం - దశమీ మంద సంయుతా
పూర్వప్రోష్ఠ పదాయుక్తా''

అని వైశాఖ బహుళ దశమీ శనివారము పూర్వాభాద్రా నక్షత్రమున హనుమంతుని జననముగా పరాశర సంహిత;

---

1. ప. సం. 6-36

స్వాత్యాం కుజే శైవతిథౌతు కార్తికే కృష్ణేంజనా గర్భత ఏవసాక్షాత్ అని కార్తికబహుళ చతుర్దశి స్వాతి నక్షత్రపు మంగళవారమున జననమందినట్లువైష్ణవమతాబ్జ భాస్కరము, 'చైత్రేమాసి సితేపక్షేపౌర్ణమాస్యాం కుజేఽహని' అని చైత్రశుద్ధ పౌర్ణమి మంగళవారమున జననమందినట్లు తంత్రసారము చెప్పుచున్నవి. వీనియందుఁబ్రామాణికతనెన్నుట, లేదా ప్రస్తుతగ్రాహ్యాంశ నిష్కర్ష చేయుట యవసరము. కల్పాంతర విషయములుగా నెన్నియో చెప్పఁబడ వచ్చును. కాని ప్రస్తుత కల్పనమునకు గ్రాహ్యమగునది యేదను నెడ ఖగోళ ప్రమాణమున నిట్లు గుర్తింపగలము.

[1] "ప్రాతర్యావాణా ప్రథమా యజధ్వమ్" అను ఋగ్వేద వాక్యముఁబట్టిఏరోజేనక్షత్రములు ఉదయించునో ఆనాడానక్షత్రమున కధిదేవత పూజనీయుఁడని తెలియుచున్నది. ఇట్లు పరిశీలించిన హైందవ ధర్మమున నిందఱు దేవత లెందు కేర్పడిరో తెలియును. అట్లే మన పండుగ లెంతటి శాస్త్ర బద్ధములో, సహేతుకముగా వ్యక్తమగును. ఉదాహరణమునకు వినాయక చవితి నాఁడట్లు వినాయక నక్షత్రములు దర్శనమిచ్చును

ఈ దర్శనము, లేదా ఈ నక్షత్రోదయము రెండు విధముల జరుగును. పురశ్చర్య విషయము వంటిదిది. ఈ నక్షత్రోదయములు సూర్యోదయాత్పూర్వము కాని సూర్యాస్తమయాదనంతరము కాని జరుగును.

హనుమద్విషయమునఁజూచినప్పుడు స్వాతి నక్షత్రము హనుమన్నక్షత్రము. 'ఆత్మావై పుత్రనామాఽసి'యన్నటుల నీ హనుమన్నక్షత్రము వాయుదేవతాకముగాఁబరిగణింపఁబడుచున్నది. అద్భుతమగు శక్తిగల యీ నక్షత్రమే అద్భుతశక్తియుతుఁడగు హనుమంతుని శక్తిని నిరూపించుచున్నది. వాయు తనయుఁడు సముద్రము దాటి విజృంభించి యశోకవనాదుల నెంతగా భగ్నమొనర్చెనో మన మెఱుఁగుదుము. స్వాతి కార్తియన హనుమన్నక్షత్రపుకార్తె ఆ కార్తె మనకు దాదాపు నవంబరు మాసమున వచ్చును. అప్పుడు సముద్రము మీదుగావచ్చు నుప్పెన లెట్లు విజృంభించి ధ్వంస మొనర్చునట్టివో తెలియనిదికాదు. అది హనుమద్విజృంభణము. దీనివలన జనపీడ హనుమదాశయముగా గ్రహింపఁదగదు హనుమచ్ఛక్తి యుట్టిదనుట మాత్ర ముద్దేశ్యము.

---

1. ఋ 5 - 77 - 1

స్వాతి శుక్రగ్రహ సమాగమము వర్షపాతమునకుం గారణము. ఎన్నియో వరదలు, ఉప్పెనలు శుక్రగ్రహము స్వాతితోఁగూడినపుడే జరుగుట పరిశీలనమునఁదెలియును. అట్టి హనుమజ్జనన మెప్పుడనునది యీ స్వాతీ నక్షత్రోదయము బట్టి చూచి నిర్ధారణచేసి కొనదగినది. సూర్యుఁడు కృత్తికలో నుండగాఁ దెనుఁగునాట 'కత్తెర' యందురు.

అశ్వనీ భరణీ కృత్తికా పాదం మేషం
కృత్తికాత్రయః రోహిణీ మృగశిరార్థం వృషభం

అని కృత్తిక మేషరాశితో నారంభమగును. అందుననే మనయీకాలమును తమిళులు మేషమాస మందురు. అట్టి కృత్తిక యందు ననఁగా మేషరాశి యందు సూర్యుఁడున్నప్పుడు ఉదయలగ్నము మేషలగ్నమగును. ఈ మేషమస్తమించు సూర్యాస్తమయమునకు దాని సప్తమలగ్నమగు తులాలగ్నము యొక్క ఉదయమగును.'చిత్తార్థంస్వాతి విశాఖాత్రయః తులా కావుననట్టి తులాలగ్నమున స్వాతి నక్షత్రముండును. అట్లు నక్షత్ర దర్శనమునకు మనకు సాక్షాత్కరించినది స్వాతి. స్వాతి నక్షత్రమునగా హనుమంతుఁడే. అట్టి హనుమన్నక్షత్ర దర్శనమగు నారోజే హనుమ ప్రధాన పర్వదినము. అందుచే నా సమయమున వైశాఖ బహుళ దశమిగా గుర్తింపగలము. అదియే హనుమజ్జననతిథి యని నిర్ణయించుకొనుటకు స్పష్టమగు ఖగోళ ప్రమాణమిది. అటులనే రామాయణ సారోద్ధారము కూడా [1] ''పురాణాన్తరేషు శ్రీ మదాంజనేయస్యజన్మ కార్తికకృష్ణ చతుర్దశీతి, చైత్రశుక్లైకాదశీతి, వైశాఖకృష్ణ దశమీతి, మార్గశిరకృష్ణ దశమీతి; స్థిరవాసర ఇతి, భౌమవాసర ఇతి, సౌమ్యవాసర ఇతి భిన్న భిన్నతయా ప్రతిపాద్యతే। తథాపి తేషాం సర్వేషాం కల్పభేదేన సమన్వయో భవతి'' వైశాఖకృష్ణ దశమ్యాం మందవాసరే పూర్వప్రోష్ఠ పదా నక్షత్రే, వైధృతి నామయోగే, మధ్యాహ్న వేళాయాం కర్కాటకలగ్నే కౌండిన్య ప్రాదుర్భూత శ్రీ మదాంజనేయ ఇత్యేవాస్మద్రామాయణ సారోద్ధారే 'నిర్దిష్టమ్' అని దీనిని నిర్ధారణము గావించెను.

---

1. రా. సారో. పీఠిక - పుట - 17

స్వాతి హనుమన్నక్షత్రము : హనుమత్కథను స్వాతి నక్షత్రముతో ఖగోళపరమైన సమన్వయము పఱచు వాడలస్వాతి హనుమన్నక్షత్రమనునది రూఢి వేసి కొనవలెను.

స్వాతి నక్షత్రము చుట్టూరు వానర రూపము గల చుక్కలున్నవి. [1] ఈ యంశ మీ మధ్య ఖాల్డియా, బాబిలోనియా, ఈజిప్టు మొదలగు దేశములలో లభించిన సాక్ష్యముల వలన రూఢియైనది. ఆదికావ్య కర్త యగు వాల్మీకియు నీ యంశమును

[2] "అనుయాస్యన్తి మామద్య ప్లవమానం విహాయసా భవిష్యతి హి మే పంథా స్వాతేః పంథా ఇవాంబరే" అని తన మార్గమంబరతలమందు స్వాతి మార్గము కాగల దనుటలో వ్యంగ్యముగాఁ దెల్పెను. ఇట వాల్మీకి చెప్పుటయకాదు. హనుమంతుఁడే స్వయముగా వానరులతోఁ దనను స్వాతి నక్షత్రముగాఁ జెప్పుకొనెను. ఆంధ్ర కవులెల్లరచే నీ విషయము గ్రహింపబడకున్నను జ్ఞానపీఠ అవార్డు గ్రహీత విశ్వనాథ

[3] "ద్విత్రివిలిప్తలన్ గగనవీథిఁ జరింతును నేను స్వాతిన
క్షత్రము వోలె నన్నుఁ గని కంపము నొందగ సర్వభూతముల్
ధాత్రియు మత్పదాహతికిఁ దాలదు లంఘనమందు వేళ మ
ద్గాత్రపుఁ బర్వు చేతను దిగంబడి పోవు మహాబిలంబుగా"

అని హనుమంతుని స్వాతి నక్షత్రముగనే చూపెను. ఇట్లు శక్తియుక్తుల స్వాతిగనే హనుమంతుఁడు నిరూపింపఁబడెను.

విష్ణుభక్తుఁడు : వియద్విష్ణుపదం వ్యోమ్ని' యని యమరము. విష్ణుపదమనగా నాకాశము. ఆకాశము ను విష్ణుపదమనుటకుఁ గారణము అందుఁ బురాణములు చెప్పుచున్న శేషశాయి యగు శ్రీవిష్ణు వుండుటే. ఆ విష్ణు స్థానము సరిగా స్వాతి, శ్రవణా నక్షత్రముల మధ్య కలదు. ఈ శ్రవణా నక్షత్రము గరుత్మంతుడు. 'సుపర్ణో గరుత్మాన్' అని ఋగ్వేదవర్ణనము. పాశ్చాత్యులు దీనిని ఏక్విలా *(aquila)* అందురు. అనగా గరుడ పక్షియే

1. నక్షత్రములు – పుట – 98
2. వా. రా. కి – 67 – 20
3. శ్రీ రా. క. కి – 442

విష్ణువు గరుడ వాహనుఁడనుట స్పష్టము. అట్టి గరుత్మంతునకు నాంజ నేయునకు మధ్య విష్ణువుండుటనే "అగేప్రాంజలి రాంజనేయ మనిశం" అని విష్ణువు స్తుతింపబడుట. అప్పకవియు నీ యర్థమునే

[1] "వాతాత్మజ తార్క్ష్యసమ
స్వీతునకు సమస్తలోక విఖ్యాతునకున్" అని చెప్పెను.

అన్నమయ్య మున్నగువారు హనుమంతుని విష్ణు సేవకునిగాఁ గీర్తించు భావమిదియే. రామభక్తుఁడగు హనుమంతుని విష్ణు భక్తునిగాఁజెప్పుటలో నాంతర్య మీ ఖగోళ వృత్తమే. అందుననే విష్ణుసంబంధములగు నుత్స వముల నిరుప్రైపుల హనుమంత గరుత్మంతుల నిర్వురనుంచుటయు ఊర్ధ్వ పుండ్రశంఖ చక్రములు విష్ణుస్థానమున నుంచి యిరుప్రైపులనా ఇర్వురి చిత్రములుంచుటయు గమనింపగలము. ఇది హనుమంతుఁడు విష్ణుభక్తుఁ డనుటలోఁగల ఖగోళ రహస్యము.

అర్జున కపిధ్వజము : స్వాతి శ్రవణల నడుమ ననగా స్వాతికిఁబైన నారాయణుఁ డున్నటుల స్వాతికిఁ గ్రింద నరుఁడు గలఁడు. ఉత్తర ఫల్గుణి నరుని యనగా నర్జునుని నక్షత్రము. ఆ నక్షత్రమునకు ననంతర మునఁగల హస్తచిత్తలు దక్షిణదిశగ ప్రక్కకుండ స్వాతి మాత్రము సరిగ మీదుగ నుండి ధ్వజస్థానీయమై నరుని కపిధ్వజ విధిని సూచించు చుండును. [2] "కపిధ్వజప్రభల నంధీభూతులం జేయువే" యన్న తిక్కన్న భారత ప్రయోగము దీనినే సూచించును. టెక్కెపుకాంతి శత్రు వులనంధీభూతులఁజేయుటయు సంగతము. అట్టి యెడనట వ్యంగ్యమీ హనుమంతుని స్వాతి కాంతియే. సూర్యుని కెన్నో రెట్లు కాంతిగల స్వాతి వలననే వా రంధీభూతులగుదురనుట. ఇది ఖగోళము ద్వారా నిరూపిత మగు కపిధ్వజ వృత్తము.

లంకాదహనము : హనుమంతుఁడు వాలాగ్నిచే లంకను దగులఁబెట్టెను. అట్టి వాని వాలమును

[3] "ప్రదీప్త లాంగూల కృతార్చిమాలీ- ప్రకాశతాదిత్య ఇవార్చిమాలీ"
యని రెండు పర్యాయములు వాల్మీకి చెప్పెను. స్వాతి హనుమంతుఁ

---

1. అప్పకవీయము 1 - 102    2. భార. ఉ. ప్ర. 321
3. వా. రా. సుం. 53-44, 54-46

డన నటంజకారికారమైన హనుమంతుని వాలము దానిపైగల విశాఖ నక్షత్రమే. ''విశాఖా కులాల చక్రం పంచ' అని పరటంచి విశాఖను కుమ్మరివాని చక్రముతోఁ బోల్చెను. అట్టి వర్తులాకారమునే వాల్మీకి హనుమద్వాలమునందు సూచించెను. 'ససస్య దహనాస్త్రపగాచకన్యా' అని వరాహమిహిరుఁడు బృహజ్జాతకమునఁజెప్పిన కన్యచేతిలోని దహనా మాలాఅగ్నిమయమైనమాల. అదియే అగ్నిపూర్ణవలయముగా లంకఁ గాల్చిన వాలముగా గ్రహింపదగినది. ఇట్లు హనుమంతుని లంకాదహన వృత్తమును ఖగోళశాస్త్రము సూచించుచున్నది.

హనుమంతుని సర్వసమత్వము : హనుమంతుఁడు సహనతకు నిదర్శనము. శివకేశవులకు సమస్థానీయుఁడు. బాహుశక్తి, బుద్ధిశక్తులకు సమస్థానీయుఁడు. భోగమోక్షములకు సమస్థానీయుఁడు. నర - పశు, నర-దైవ తత్త్వములకు సమస్థానీయుఁడు. అట్లే స్వాతియు హనుమంతుని వలె సర్వసమత్వము సాధించునది. సూర్య తులాప్రవేశము నవే, స్వాతి కార్తెసమయమునసే అప్పటి వఱకు హెచ్చు తగ్గులుగా నున్న అహః ప్రమాణ రాత్రి ప్రమాణములు సమములగును. శీతోష్ణస్థితులు సమమగును. తులకు అనగా త్రాసునకు సమత సహజము.

హనుమంతుని రుద్రాంశ సంభూతత్వము : స్వాతి పాశ్చాత్యులు చెప్పు బూటేస్ (*Bootes*) అను చుక్కల గుంపులోనిది. భూతేశుండనఁగా రుద్రుఁడు. ఆ భూతేశ శబ్దము నుండి ఏర్పడినది బూటస్ అనునట్టిది. ఏకాదశరుద్రులలో నొకఁడగు హనుమంతున కాభూతేశ సంబంధము వ్యక్తమగుచున్నది. తిక్కన వానరాకారంబగు మహోగ్రకేతనంబును, దదాశ్రితంబులైన వికృతాభీల నానాభూతంబులం బుత్తెంచి యనుట యీ భావమునే వ్యక్తమొనర్చుచున్నది. ఇట్లు హనుమద్వృత్తాంత మంతయు ఖగోళశాస్త్రాధారమున నిరూపితమగుచున్నది. హనుమత్కథ తోడి ఖగోళ సంబంధముఁదెల్పుచున్నది.

---

1. భార. విరా - 4-170

# మంత్రశాస్త్రము - హనుమంతుఁడు

మననా 'త్రాయత ఇతి మంత్రః' అని మననము వలననే రక్షించు నదిగా మంత్రశబ్దార్థము తెలియుచున్నది. సర్వదేవతలకు మంత్ర సముచ్చయము కలదు. ఒక్కొక్క దేవతకే అవస్థాభేదముఁబురస్కరించు కొని పెక్కుమంత్రము లుండును. అయ్యవి యుపాసకుల కొఱకై మహర్షులచే వివరింపఁబడుచున్నవి. మంత్ర విషయమున 'హనుమంతునకగ్రస్థాన మిచ్చితి' అవలయును. భక్తుల వాంఛాభేదముల ననుసరించి హనుమన్మంత్రము లుండినట్లే వియ్యుఁగానరావు. సుమారు పదాఱువేల మంత్రములున్నఁటుల్లు వినికి. రామకృష్ణా ద్యవతారములు నామమాత్రములుగ నున్నవి. అనగా నాయాకార్యములు ముగిసిన వెనుక నాయంశము మూలమునందుఁగలిసినదని భావము. హనుమంతుఁడట్లు గాక యిపుడున్నవాఁడు. తక్కిన దేవతల కంటె వేగము ప్రత్యక్షమగునని మహర్షియాశయము.

హనుమత్సంబంధము లేని తాంత్రికులు, మాంత్రికులు అరుదు. హనుమదుపాసన విశేషముగాఁగల యాంధ్రమున నా విషయముఁ బ్రత్యేకముగాఁజెప్పఁబనిలేదు. భూతప్రేత పిశాచాదుల దుష్టగ్రహముల బారినుండి రక్షణ, తత్సంబంధములగుఁ బ్రయోగముల విషయమున హనుమదంశముల నేకములు. కాని ప్రముఖ తాంత్రికగ్రంధములు కులార్ణవ శారదాతిలకములందు హనుమత్సంబంధమగు సామగ్రి దొరకదు. శారదాతిలకము యొక్క అర్థద్యోతనికా వ్యాఖ్యయందు కొద్దిమాత్రము చెప్పఁబడినది. ప్రపంచసారమందు నత్యల్ప విషయమే కలదు. 15వ శతాబ్దినాటి ప్రసిద్ధ తాంత్రికులు ఆగమవాగీశ శ్రీకృష్ణానంద విరచిత తంత్రసారమునఁ దృతీయ పరిచ్ఛేదమునఁ గేవల సుదర్శనసంహితోక్త హనుమత్కల్పము మాత్రము కలదు.

పై శాస్త్రగ్రంథముల హనుమద్విషయము విశేషముగ లేనందుకుఁ గారణము నూహింపవచ్చును. హనుమత్సంబంధమగు మంత్రభాగముఁ జెప్పు గ్రంథములు శ్రీ పరాశర సంహిత, సుదర్శన సంహితలు. ఇవి యనాదిగా లోకమున కందకుండుటయే పై లోపమునకుఁ గారణము.

---

శ్రీ రామావతార తత్త్వము పుట 319

ఇటీవల వఱకు నా గ్రంథములు కేవల హనుమదుపాసకుల యింద్లలో వ్రాత ప్రతుల రూపముననే ప్రమగ్గుచున్నవి. ఇటీవలి కాలముననే యవి వెలుగుఁజూడ నోచుకొన్నను వాని యనుష్ఠాన విధులు మాత్ర మాయా గురు పరంపరల వలన లోకమున ననుసరింపఁబడుచునే యున్నవి. కేవల హనుమత్సంబంధమగు సద్గ్రంథము శ్రీ పరాశర సంహిత. కావున దాని ప్రభావము హనుమత్కావ్యజాలముపై యెట్లున్నదను విషయము ప్రధానముగనే యీ వ్యాసమునఁబరిశీలింపఁబడును.

నారద పురాణమున భాగవత తంత్రమున నీవిషయమై విపులముగా విషయము లభ్యమగును. అందలి పూర్వఖండమున 7¹, 75, 78, 79 అధ్యాయముల సుమారు వేయి శ్లోకములలో శ్రీ నారద సనత్కుమార సంవాదరూపమున హనుమంతునిఁ గూర్చి దమ్యములగు విషయములు చెప్పఁబడినవి. అట్లే ఆనంద రామాయణము, రుద్రయామళములందును చాలా విషయము గలదు.

మచ్చునకు నారదీయము నందలి యొక్క మంత్రము. ఇది ద్వాదశాక్షరి. "హం హనుమతే రుద్రాత్మకాయ హుంఫట్" అనునది మూల మంత్రము. దీనికి శ్రీరామచంద్రఋషి, జగతీచ్ఛందము, హనుమాన్ దేవత, హంబీజము, హుం శక్తి

హాం - అంగుష్ఠాభ్యాం నమః; హీం - తర్జనీభ్యాం నమః
హూం - మధ్యమాభ్యాం నమః; హైం - అనామికాభ్యాం నమః
హౌం - కనిష్ఠికాభ్యాం నమః; హః - కరతల కరపృష్ఠాభ్యాం నమః
హాం - హృదయాయ నమః; హీం - శిరసే స్వాహా
హూం - శిఖాయై వషట్; హైం - కవచాయ హుం
హౌం - నేత్రత్రయాయ వౌషట్; హః - అస్త్రాయ ఫట్
అని అంగన్యాస కరన్యాసాదు లోనర్చి దిగ్బంధనము గావింపవలెను.

ధ్యానమ్—

శ్లో॥ ' మహాశైలం సముత్పాట్య-ధావన్తం రావణం ప్రతి
లాక్షారసారుణం రౌద్రం - కాలాంతక యమోపమమ్

---

1. నారద - 74 - 122 నుండి 125

జ్వలదగ్ని సమం జైత్రం - సూర్యకోటి సమప్రభం
అంగదాద్యైర్మహావీరై - ర్వేష్టితం రుద్రరూపిణమ్
తిష్ఠతిష్ఠ రణే దుష్ట - సృజన్తం ఘోరనిస్స్వనం
శైవరూపిణ మభ్యర్చ్య - ధ్యాత్వా లక్షం జపేన్మనుమ్''

మంత్రమహార్ణవ, గాయత్రీతంత్ర గ్రంథము లందుఁ జెప్పబడినదియు లోకమున వ్యవహారమున నున్నదియు నగు హనుమన్మంత్రగాయత్రి ''ఓం అంజనేయాయ విద్మహే వాయుపుత్రాయ ధీమహి తన్నో హనుమాన్ ప్రచోదయాత్'' అనునది.

హనుమంతుని గూర్చిన పరిపూర్ణ విజ్ఞానము మనకు రామాయణమున లభింపదు. అది రామకథను లోకమున కందింప లిఖింపఁబడినది. రామాయణమహామాలా రత్నముగాఁగీర్తింపబడిన హనుమంతున కందు సముచిత స్థానమే కలదు. కాని యదియు పరిపూర్ణ విషయము కాదు. హనుమంతుని గూర్చి యది యసంపూర్ణగ్రంథమనుటకుఁ గారణము రామాయణము త్రేతాయుగ కథ. హనుమంతుఁడు చిరంజీవి. ద్వాపర కలియుగములందును నాతఁడున్నట్లు పురాణములు, భారతేతిహాసముఁ జెప్పుచున్నవి. ఒక రీతిగాఁ జెప్పవలెనన్న హనుమత్కథ అంతులేని కథ. కొంతవఱకయిన నతని చరిత్రమును దెలియఁజేయు గ్రంథములు సంహితలు. ఆ సంహితలనే హనుమత్కథయెడఁ బ్రధానముగా స్వీకరించి పరిశీలింపదగుననుట యథార్థము.

సంహితాశబ్దము మంత్రరూపమగు వేదభాగమునకుఁ జెప్పఁబడెను. ఇదియే చతుర్వింశత్సహస్రికాయాం సంహితాయాం అని రామాయణ గ్రంథాంతమున; మనుసంహిత యని ధర్మశాస్త్రమునకు; మహాభారత సంహితారచన బంధురుఁడయెఁ జగద్ధితంబుగన్'' అని నన్నయ్యకృత భారతమునకుఁ జెప్పఁబడెను. నిఘంటువులీ శబ్దమునకు వేదతుల్యమైన గ్రంథముగాఁ నర్థముఁ జెప్పుచున్నవి. ఇట్లు సంహితయొక్క ప్రామాణికత తెలియఁగలము. వైద్య, జ్యోతిష, పాంచరాత్రాగమాదుల ననేక సంహితలు గలవు. కేవలహనుమత్పరముగా 150 పటలములు గల యుద్గ్రంథము శ్రీ పరాశర సంహిత కానవచ్చుచున్నది. హనుమత్పరమగుఁ నెన్నో గాథలతోఁబాటు మంత్రభాగము, తంత్రభాగములనిది విశేషముగఁ జెప్పుచున్నది.

అంతియె కాక శౌనక సంహిత, ఉమాసంహిత, సుదర్శన సంహిత వంటి సంహితల ద్వారా కూడ ఎన్నో హనుమద్విషయములు తెలియును. ఈ నాటికిని యీ సంహితలఁ గొంతభాగము ముద్రితమై వ్రాతప్రతుల లోనే యున్నది. శ్రీ పరాశర సంహిత పరాశరమైత్రేయ సంవాద రూపమగు హనుమద్గ్రంథము. ఈ సంహిత ఆంధ్రదేశమందే యెంతయో ప్రచారమందినట్లు దాని వ్రాతప్రతుల పరిశీలనము వలనఁ దెలియుచున్నది. ముద్రణము నందకున్నను ఒకరి నుండి యొకరికిగా వ్రాతప్రతుల రూపమున ననేకులకడ కీసంహిత చేరినది. ఆంధ్రదేశమందలి హనుమదుపాసకు లందఱి వద్ద యెంతోకొంత వ్రాతప్రతి తప్పకయుండుటఁబట్టి, ఇట్టి రాహులగు హనుమన్మహోపాసకులకడ సైతము నిది లేనట్లు తెలియుటను బట్టి యాంధ్రులకీ హనుమత్సాహిత్యముతో విశేషసంబంధమున్నట్లు తెలియఁ గలదు. కావున నాంధ్ర సాహిత్యమున హనుమత్కథఁ బరిశీలించుటలో నీ సంహిత నాధారముగా స్వీకరించుటయు నత్యావశ్యకము. అగస్త్య సంహిత, ఉమాసంహితల యందు సుందరకాండ పారాయణ ఫల నిరూపణ మొనర్పఁబడెను. ఈ సంహితలు పురాణాంతర్గతములు. అస్యశ్రీ సుందరకాండ మహామంత్రస్య వాల్మీకిర్భగవాన్ ఋషిః ఇత్యాదిగా సుందరకాండ మంత్రముగానే గురుముఖతః స్వీకరింపఁబడుచున్నది.

ఆంధ్రమునను హనుమత్సంబంధములగు మంత్ర తంత్రగ్రంథములు వెలువడినవి. అవి కేవలము రచనలుగాఁ జేయఁబడినవే కావు. ఆయా రచయితలగు హనుమదుపాసకులు ఆయా మంత్రములనాచరించుచు శిష్యకోటి నాచరింపఁ జేయుచు ననుభూతుల నందియున్నయవి. అందు 'శ్రీహనుమన్మహావిద్యాప్రకాశిక' అనునది మంత్రశాస్త్రాగమ ప్రవీణులు, హనుమన్మహా విద్యోపాసకులు హనుమద్దాస వ్యవహార నామధేయులునగు శ్రీ లంకా వేంకటేశ్వరశాస్త్రిగారు వ్రాసినట్టిది. వీరి యుపాసనాపటిమ నిరూపించు ననేకసంఘటనలు తెలుఁగునాటఁ బ్రచారమున నున్నవి. కవి పండిత ప్రశంసలనందినది వీరి గ్రంథము. అంతియకాక శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారే వీరిని మెచ్చి

[1] ''విమలానంద పయోధిలో మునిఁగి లో విప్పారి దీపించి యా
విమల త్తేజము జూచి తన్మయతఁదృప్తిన్ లేక సేవించి నీ

1. శ్రీ హనుమన్ మహావిద్యాప్రకాశిక పీఠిక - 69

సమయముఁ బక్కరఁ జేయఁ జూచెదవు సుత్సాహంబు వెంటాడ నీ
సముతేరీ కనుచూపుమేర నిట దుస్సాధ్యంబు రూపింపఁగన్''

అని ప్రశంసించి 'కలియుగ వీరాంజనేయ' యను బిరుదము నొసంగిరి.

1 ''నాయనుభవమ్ముఁ దెలిపెద
మీ యిల్లాల్గాఁటు ననియె మేధావి''

తపోలలితుఁడు హనుమద్దాసుఁడు కొలలస్ తొలఁగించుఁదన్నుఁగొలుచు జనులకున్'' అని శిష్టా హనుమచ్ఛాస్త్రిగారు తమయనుభవములవివరించిరి.

ఇట్టి వీరి తంత్ర గ్రంథమున నుపాసనాఖండము, ప్రతిష్ఠాఖండము, స్తోత్రఖండము నున్నవి. శ్రీ పరాశర సంహితాదులఁ జెప్పబడిన యనేక మంత్రవిషయము లిందుఁగలవు. సప్తమంత్రాత్మక మంత్రోద్ధారము షట్పల్లవప్రయోగము, హనుమత్షోడశ ముద్రాలక్షణము అంతర్మాతృకా బహిర్మాతృకాన్యాసములు, కళాన్యాసము లు వంటి వెన్నియో యిందుఁ గలవు. యంత్రదశాంగ విధి, యంత్రధారణ విధి, విభిన్న కవచ ఖడ్గాదులు, యంత్రాధివాసాదులుఁ జెప్పఁబడినవి. పంచముఖములకు సంబంధించిన మంత్ర సముచ్చయ మిందుఁ బరాశర సంహిత ననుసరించి వ్రాయబడినవి.

'శ్రీరామశరణ్' వ్యవహార నామమున శ్రీ రామాంజనేయ విషయముల విశేషకృషిఁ జేసి ప్రచారమొనర్చు శ్రీ కుందుర్తి వెంకటనర్సయ్య పాకయాజిగారు రచించిన ఆంజనేయోపాసన, హనుమన్నిష్ఠలయందు ననేక హనుమన్మంత్రములు తెలియఁజేయఁబడినవి. వేలకొలది శిష్యకోటిచే హనుమదుపాసన నొనరింపించుచు హనుమన్మంత్ర శాస్త్రము నాచరణలోఁ బెట్టుచున్నవారు వీరు. వీరితోడి హనుమదనుభవము లనేకములు శిష్యకోటిచేఁ బ్రశంసింపఁబడుచుండును. ఇందుఁ బంచముఖ హనుమన్మంత్ర, పంచముఖ వీరాంజనేయ యంత్ర, స్వప్నాంజనేయమంత్ర, తద్యంత్రములును, మఱికొన్ని ఆయా ప్రయోజనములకై ధరింపఁదగు యంత్రములనుఁ దెల్పిరి.

మంత్రశాస్త్ర ప్రవీణ, హనుమదుపాసక శ్రీ శిష్టా చంద్రమౌళిశాస్త్రి ప్రణీతమైన 'సుందరహనుమద్వైభవ' మున సుందర హనుమన్మంత్ర ప్రభావము, సుందర హనుమన్మంత్రము, సుందరకాండ మహామంత్రానుష్ఠాన క్రమమునుఁ జెప్పబడినవి. రుద్రయామళోక్త హనుమత్సహ

1. శ్రీ హనుమన్మహా విద్యాప్రకాశిక పీఠిక - 71

ప్రినాసు ప్రోక్తమిందుఁగలదు. హుంకారహనుమ న్మంత్రోద్ధారము వంటి విషయము లీ గ్రంథమున నీయఁబడినవి.

శ్రీ కుంటముక్కల రామారావు విరచిత శ్రీ హనుమాన్ లీలాతరంగిణి యందును నారంభముననే నాల్గుయంత్రములు వివరింపఁబడినవి.

"వడ్లాది వీరాజు సిద్ధాంతిచేఁరచింపఁబడిన "మళయాళమంత్ర రహస్యములు" అను గ్రంథమున ఆంజనేయయంత్రము, పంచముఖాంజనేయ మహామంత్రము, స్వప్నాంజనేయ మహామంత్ర, యంత్రములునుఁగలవు.

తెనుఁగునాట హనుమత్సంబంధమగు నాటుమంత్రములును గలవు. గ్రామీణుల యందు వీని యెడ మిక్కిలి విశ్వాసము. మంత్రమనునది రహస్యమైన దగుట నదియెట్టిది యనునట్టి విచారము గ్రామీణులగు సామాన్యుల కుండదు. వారి విశ్వాసమే వారికి దానివలని సత్ఫలితమునుఁజూపుచుండుటచే వాని ననుసరించువారు ననేకులు కలరు. అందలి యొకమంత్ర మిందీయఁబడుచున్నది. ప్రకాశం జిల్లా యందలి అద్దంకి పరిసరములనున్న ప్రసిద్ధ హనుమ క్షేత్రము సింగరకొండ. అందలి హనుమంతుని గూర్చి యీ మంత్రమున్నది. "హరిః ఓంఓం అకార ఉకార మకార స్వరూప వాయుపుత్ర సింగరకొండ ప్రసన్నాంజనేయ గురుభ్యో నమః – ఓం జై వీరహనుమాన్ మిన్నుకట్టు ఆకాశము కట్టు సూర్య చంద్రాదులు కట్టు, చుక్కలు పిక్కటిల్లుకట్టు, దామోదర కృష్ణారావు హరితసగోత్రం మానవ గ్రహములు కట్టు, మా దుష్టనవగ్రహములు, మాజీవనోపాధిలో కలిగే ఆటంకములు కట్టు, మేము తలపెట్టే పనులకు కల్గే అగ్ని గాలి నీటిలోని భూతప్రేత పిశాచములుకట్టు. ఆటంకములు కట్టు, నరుల ఉప్పతి నరుల ఘోషకట్టు, ఋణశత్రుశేషములు కట్టు, పగవారి కంటి చూపు, నోరు, జిహ్వ, దుష్టబుద్ధులు, దుష్టప్రయోగములు వీడ 64 నాడులు, 64 కీళ్ళు, చెడ్డ ప్రతీతములు, సమస్తకట్టు, సర్వవశీకరణ, సమస్తదేవతలు వశీకరణ, పంచభూతములు వశీకరణ, లక్ష్మీవశీకరణ ఓం అకార ఉకార మకార స్వరూప వాయుపుత్రా సింగరకొండ ప్రసన్నాంజనేయస్వామి గురుభ్యోనమః" అనునది మంత్రము. వీనితో విభూది పెట్టుట, పశువులకు తాడువేయుటవంటివి చేయుదురు. ఇట్లు మంత్రశాస్త్రమున హనుమంతుఁడు వైదిక మంత్రముల మొదలుకొని నాటుమంత్రముల వఱకు ననుష్ఠింపబడుట కాననగును. దక్షిణ వామాచార సంప్రదాయములు రెండిట పరివ్యాప్తమై హనుమన్మంత్రజాల మున్నట్లు తెలియును.

"హనుమా నంజనిసుతో - వాయుపుత్రో మహాబలః
రామేష్టః ఫాల్గుణో గోత్రః పింగాక్షో ఽమితవిక్రమః
ఉదధిక్రమణ శ్రేష్ఠో దశగ్రీవస్య దర్పహా
లక్ష్మణప్రాణదాతా చ సీతా శోక నివర్తనః"

అను ద్వాదశనామములు చెప్పి అంతర్ధాన మందెను అంత హనుమంతుఁడు ఆత్మయోగబలమున, బ్రహ్మచర్యప్రభావమున, ఈశ్వరానుగ్రహమున సర్వాభీష్టదమగు లింగము నటఁ బ్రతిష్ఠించెను. హనుమంతేశ్వరమను ప్రసిద్ధిగల యాలింగ మత్యంత శక్తి గలది.' అనుచు దాని ప్రభావము నకు నిదర్శనమగు సుపర్వుఁడను రాజు చరిత్రఁ దెల్పెను.

అనంతర చతురశీతితమోఽధ్యాయమునఁ గపితీర్థాది మాహాత్మ్య ములు సెప్పఁబడెను. ఇందు హనుమంతేశ్వరమాహాత్మ్య గాథవలెనే నంది చేఁ బ్రహ్మహత్యఁగూర్చి చెప్పఁబడి పరిహార మడిగి శివునిచే గంగాది నదుల స్నానమాహాత్మ్య మెఱిగి యట్లు సేసి రేవాతటమునఁ దప మాచ రించినవాఁడై హరుఁ దృప్తు నొనర్చెను. ఆతఁడు కపి నాలింగన మొన ర్చుకొని వరమిడి నేటినుండి నీపేర నిది కపితీర్థముగాఁ బ్రశంసింపఁ బడుచుఁ బాపహరముఁ బితృకార్యయోగ్యము నగు ననెను. ఇట్లు స్కాంద పురాణమునఁబెక్కురీతుల హనుమత్కథ వ్యాప్తమై యున్నది.

బ్రహ్మాండ పురాణము : బ్రహ్మాండ పురాణమున సుందరకాండ ఫలని రూపణము గలదు. అందలి యగస్త్య సంహితయందలి యైదవయధ్యా యమున "పశు పుత్రప్రదం పౌత్రవృద్ధిదం కల్మషాపహం - ధన మాయుష్య మారోగ్యదాయకంపుణ్యవర్ధనం" ఇత్యాదిగాముప్పదిశ్లోకము లకుఁపైగా నీ ఫలరూపణ మున్నది. అందలిదే ఉమాసంహిత యందును

"శ్రుత్వేమం సుందరంకాండం పురా వాల్మీకినా కృతం
సంతానార్థీ ధనార్థీ వా సామ్రాజ్యార్థీ చ మానవః"

ఇత్యాదిగాఁ గూడ సుందరకాండ పారాయణఫలము దెలుపఁబడినది. సుందరకాండ మనగా హనుమత్కాండమే. ఇట్టి సుందరకాండయొక్క ఫలస్వరూప మీ పురాణమున స్పష్టముగఁ గన్పట్టును.

వరాహ పురాణము: వరాహపురాణమున హనుమజ్జననవృత్తాంతము గలదు. అంజనాద్రివృత్తాంత మిట్లు చెప్పబడినది. పూర్వము వానరవంశమునఁ బుట్టిన కేసరియను మహారాజు భార్యపేరు అంజన. పతివ్రతాపరాయణ యగు నామె సంతానము గలుగనందున విచారించి ఋష్యమూకపర్వత మున నాశ్రమము గల్పించుకొని తప మాచరించుకొనుచుండ మతంగ మహర్షి యాదంపతులను తిరుపతిసమీపమునగల యాకాశగంగా ప్రదేశ మున నాశ్రమము గల్పించుకొని తప మాచరింపుఁడని నారాయణాష్టాక్షరి నుపదేశించెను. కేసరిసహకారమున నంజన ఘోరతప మాచరింప నొక ప్రాతఃకాలమున నంజన స్నానమాడి శుభ్రవస్త్రములఁ దాల్చుసమయ మున లోకరక్షణార్థము తనయందుంచబడిన శివవీర్యము వాయు వామె గర్భమునఁ బ్రవేశపెట్టి పరపురుషస్పర్శకు శపింపఁబోవు నామెకుఁ బాతి వ్రత్యభంగము కానిరీతిఁ దెల్పి సత్పుత్రుఁడఁబడసెదవని యట్లు శివపురాణ విధానమునఁనే చెప్పబడెను. ఆమె యతినిష్ఠతోఁ దపించుచు మార్గశిరశుద్ధ త్రయోదశీ అశ్వనీనక్షత్రయుక్త వృశ్చికలగ్నమున శుభయోగముగల వారమున శుభలక్షణములుగల పుత్రుని గనెను. అంతనాకాశవాణి "ఈత డాంజనేయుఁడనుఁ బేరుగలవాఁడై దేవతాకార్యము లనేకము లొనర్చి చిరంజీవియై ఖ్యాతినందు" ననెను. అంజనాకేసరు లానందించిరి. వాయువు మందమారుతములచే జవసత్త్వము లందించెను. ఒకనాఁట నాకలిఁదాళఁ జాలక యేడ్వసాగెను. అంజన ఫలంబులకొఱకు వనమేగ నాబాలుఁడు సూర్యుని ఫలమని భ్రమించి రివ్వున నెగిరి సూర్యమండలమునకు వెళ్ళు చుండగా దేవేంద్రుఁడాబాలుని గొట్టెను. వాడు క్రిందపడిపోగా వాయుఁ దశదిశల బంధింప దేవేంద్రాదులు వచ్చి బాలుని బ్రతికించి యనేక వరము లిచ్చిరి. బ్రహ్మ చిరంజీవత్వము, వజ్రమయశరీరము నిచ్చి "ఈతఁడు రామభక్తుఁడై సకలవిద్యాపారంగతుఁడై మూఁడులోకములందు మహాప్రఖ్యాతి గల్గియుండు" నన నంజన బ్రహ్మదేవా! ఈ ఆశ్రమము నకు నంజనానామ మేర్పడునట్లు శ్రీమహావిష్ణు విందు వెలసి దుష్టశిక్షణ శిష్టరక్షణలు చేయునట్లు సేవించుమన నట్లేయని యంతర్ధానమందెను. కాన శౌనకాది మునులారా! ఆదిశేషుని శ్రీమహావిష్ణువు అంజనాశ్రమమందుఁ బర్వతాకారముగా నుండున ట్లాజ్ఞాపించి తాను శిరస్సునందు శ్రీ వేంకటే శ్వరరూపమున వసించియుండుటకు, మధ్యభాగముచే శ్రీనృసింహునిఁ

తోకభాగమున మల్లికార్జునుని నుండునట్లు వరముల నిచ్చియుండె ననుచు వరాహగిరి, అహోబిల, అంజనాశ్రమములఁగూర్చి చెప్పి శ్రీశైలవృత్తాంతముఁ జెప్పఁదొడగెను. ఇందు నాంజనేయాంజనావృత్తాంతములు స్పష్టము సేయఁబడినవి.

బ్రహ్మవైవర్త పురాణము : బ్రహ్మవైవర్త పురాణమునందలి శ్రీకృష్ణ ఖండ 62వ అధ్యాయమున శ్రీరామ చరితవర్ణనము గలదు. నారాయణఋషి నారదునిచే నడుగఁబడి చెప్పును. పవమానసూనుఁడగు హనుమంతుని గలిసికొనిన దాదిగా రామాయణగాథ యథాతథముగనే క్లుప్తముగా చెప్పబడెను. శ్రీరాముఁడంజనీకుమారునకుఁ బ్రేమపూర్వకముగా దుర్లభమైన తన పాదధూళి నొసంగి ఆనవాలుగ శ్రీరామముద్రిక నొసంగి సందేశము వినిపించెను. హనుమంతుఁడు రుద్రకళాసంభవుఁడు, వాయుపుత్రుఁడు నగుట సముద్రము లంఘించి వెడలి సీతకు ధైర్యము గల్గింప ననేకరీతులఁ జెప్పెను. ఈస్వర్ణలంకఁ దృటిలో భస్మీపటలము సేయుదుఁ జూడుము. రామానుగ్రహ సంపన్నుఁడనైన నాకు లంకానగరము తృణప్రాయము, సముద్రము మూత్రప్రాయము, అవని గోష్పాదప్రాయము. ససైన్యుఁడైన రావణుఁడు పిపీలికా సమానుఁడు. అర్ధముహూర్తమున వానిని ససైన్యముగఁ జంపగలను. కాని శ్రీరామప్రతిజ్ఞను మన్నించుటకై వానిని చంపఁజాల నని ఆమెకు ధైర్యము చెప్పి లంకాదహన మొనర్చి మరల జానకిఁ జూచి ధైర్యము సెప్పి వచ్చెను.

ఉపపురాణములు - నృసింహ పురాణము : ఉపపురాణములందు నృసింహ పురాణమునఁ బంచాశత్తమోఽధ్యాయమున (50) సుగ్రీవమైత్రీత్యాది రామావతారకథయందు హనుమద్వృత్తాంతము గావనగును. హనుమద్రామ ప్రథమసమాగమము వాల్మీకిరామాయణము వలెనే కలదు. సుఖలాలసుఁడగు సుగ్రీవునకు హనుమంతుఁడు తెలియఁజెప్పుచు సీతాదుఃఖమున ఫలములఁ గూఁడ భక్షించని రాముని, తదనుజు లక్ష్మణుని, భరతుని, జనుల సర్వదుఃఖములకుఁ గారకుఁడవు కాక యన్వేషణ నారంభించు మనును. హనుమ జ్జాంబవదంగదాదుల దక్షిణదిశకుఁబోనంపుచుండ జాంబవంతుఁడు ''రావణుఁడే సీతఁగొంపోయెఁ గాన సముద్రముదాట హనుమంతుఁడే సమర్థుఁడనుచు నిటనే'' ప్రోత్సహింపఁబడ్డెను. సుగ్రీవుఁడు ''నీవలననే

నేను రాజ్యమందితిని. నీవు సర్వసమర్థుఁడ" వనెను. రాముఁడును అట్లు బ్రదిమలాడి యంగుళీయక మీయ రామలక్ష్మణ సుగ్రీవులకుఁ ప్రదక్షిణము సేసి బయలుదేరెను. సముద్రోల్లంఘనమున నిందు సురసవృత్తాంతము దెలుపలేదు. మిగిలిన విషయము లన్నియు యథావాల్మీకముగా సీతావార్త్తఁ దెచ్చిన హనుమంతుని వానరులెల్లరుఁ బూజించిరి. యుద్ధమున నికుంభుని హనుమంతుఁడు చంపుట కలదు. రావణుని శక్తిప్రయోగమున లక్ష్మణుఁడు నేలఁబడ రాముఁడు విలపించుచు "ఏఁడీ! నామిత్రుఁడు పవనాత్మజుఁడు హనుమంతు"డనుచు 'విశల్యకరణిదె' మ్మనెను. హనుమంతుఁడు ద్రోణాద్రినిఁ దెచ్చెను. రావణవధానంతరము పుష్పకవిమానముపై సీత నెక్కించుకొని రమ్మని హనుమంతు నాదేశించిన ట్లిందుఁ గలదు. ఈరీతి నుపపురాణ మగు నృసింహపురాణమున హనుమత్కథ గానవచ్చును. పురాణోపపురాణాంతర్గత హనుమత్కథ యిట్లు పరివ్యాప్తమై యొప్పుచున్నది.



# ద్వితీయ సోపానము

## శ్రీమద్రామాయణము – హనుమంతుడు

కిష్కింధా కాండము : హనుమంతుడు శ్రీమద్వాల్మీకిరామాయణము ఆది కావ్యము. అనాది నిధానమగు వేదము ప్రాచేతసునిచే స్వరూపమున సులభగ్రాహ్య మొనర్పఁబడెను. అట్టి రామాయణవిశిష్టత నెఱిగి దేశవిదేశీయు లందఱును రామాయణములను తమతమ భాషలయందు రచియించిరి. తుదకు రామకథ యేమాత్రమో వ్రాయుట కవిలక్షణ మను నంతగ కవిపండిత గ్రాహ్యమైనది సంస్కృతభాషలో 108 రామాయణము లున్నవని ప్రతీతి. తెనుఁగుభాషయం దంతకుమించి రామాయణములు వెలయుట కానవగును. అన్ని సారస్వతప్రక్రియలందు రామాయణము రచింపఁబడెను. ఆంధ్రదేశమున రామభక్తి ప్రచురము. ప్రముఖ వాగ్గేయకారులు త్యాగరాజ రామదాస తూమునరసింహదాసాదు లందఱు రామసంకీర్తన గావించి జగమంతా రామమయము గావించిరి.[1] 'రాము కథఁబలుకఁడేనియు; నేమెయినేన్ సుకవిగాఁ డదెట్టి బుధుండున్; ధీమహితులమత మిది' యనుస్థాయికి వచ్చెను. నిత్యకృత్యముల నిద్రలేచుట మొదలు జోలపాడి నిద్రపుచ్చువఱకు రామమయముగ బ్రతుకుట యేర్పడెను. ఈరీతి రామకథకు నాంధ్రదేశముసఁ బ్రత్యేకస్థాన మేర్పడి రామాయణములు తెలుఁగు సారస్వతమున బహుళముగ వెలువడుటకుఁ గారణమయ్యెను.

రామాయణమహామాలారత్నము హనుమంతుడు కావున హనుమచ్చరిత రామకథ కనివార్యము. హనుమద్విషయ పరిశోధనమున రామాయణానుశీలన మత్యావశ్యకము. హనుమద్రామకథ లవిభాజ్యములు, నవినాభావసంబంధము కలవి కావున హనుమద్విషయ పరిశోధనమున రామాయణానుశీలన మత్యావశ్యకము. రామాయణమున కిష్కింధా, సుందర, యుద్ధోత్తర కాండలందు హనుమత్కథ కానవచ్చును. ఇందు మిగిలిన కాండలు హనుమత్పరముగ సామాన్యములేకాగా సుందరకాండ హనుమత్కాండయే. రామాయణమున సుందరకాండయందే హనుమంతుని సమ

1. ఆం. వా. రా. పీఠిక 50

గ్రిస్వరూపము కాననగును. కిష్కింధాకాండము హనుమత్ప్రవేశము, యుద్ధకాండము హనుమదుద్యోగ్రద్ధపై పుణ్య ప్రదర్శకము కాగా సుందరకాండ హనుమత్పరముగ సమగ్రకాండ.

కిష్కింధాకాండ: రామాయణాంతర్గతహనుమత్కథకు నిదియారంభకాండ. ఇందు హనుమత్ప్రవేశము, శ్రీరామసందర్శనము, వాక్చాతుర్యమున రామలక్ష్మణులతోడ భాషణము, రామసుగ్రీవులకు మైత్రికూర్పుట, సుగ్రీవునకు హితబోధ, సముద్రోల్లంఘనమున శక్తిప్రకటనములు ప్రధాన ఘట్టములు. ఇందు

1 "నానృగ్వేద వినీతస్య - నాయజుర్వేద ధారిణః
నాసామవేద విదుషః - శక్య మేవం విభాషితుమ్"

అని తొలిపలుకులలోనే శ్రీరామచంద్రునిచేఁ గొనియాడఁబడినట్లు వాల్మీకి హనుమంతుని వాక్పటుత్వమును విశేషముగఁ జెప్పెను. హనుమంతుఁడు సుగ్రీవాజ్ఞపై పంపాసరోవరప్రాంతమునకు వచ్చిన రామలక్ష్మణుల వివరముఁ దెలియ వచ్చెను. వాల్మీకి అవచ్చిన హనుమంతుఁడు భిక్షుకవేషము దాల్చినటులఁ జెప్ప నధ్యాత్మరామాయణము వటువేషధారియై వచ్చినటులఁ జెప్పెను. ఈ విషయమునఁ దెనుఁగురామాయణములలో భాస్కర, గోపీనాథ, వాసుదాస, రామకథామృత, రామాయణకల్పవృక్షాదులు వాల్మీకము ననుసరించి భిక్షుకవేషము దాల్చినటులఁ జెప్ప రంగనాథరామాయణ, శ్రీకృష్ణరామాయణాదులు వటువేషమున వచ్చినటుల వర్ణించినవి.

ప్రథమ సమాగమమున రామునకు దానుగాఁజెప్పికొన్న హనుమజ్జన్మవృత్తాంతము రంగనాథరామాయణమున విపులముగాఁ జెప్పఁబడెను స్కాందపురాణాంతర్గత వేంకటాచలమాహాత్మ్యము ననుసరించి యీకథ యున్నది. ఆంధ్రవాల్మీకి వాసుదాసు తమ మందరమున నీప్రథమ సందర్శనమున రాముఁడు హనుమంతునకు చతుర్భుజునిగా దర్శనమిచ్చినట్లు చెప్పెను. అందుననే తాను సన్యాసివేషమున నుండియు హనుమంతుఁడు గృహస్థులగు రామలక్ష్మణులకు నమస్కరించినట్లు రామాయ

వ్యాఖ్యలలోఁ బరమోత్కృష్టమైన వ్యాఖ్యయగు గోవిందరాజీయము నను సరించి చెప్పెను. రామాయణ సారోద్ధారమునను నట్లే రచింపఁబడెను.

వాలివధానంతరము సుఖలాలసుఁడై కర్తవ్యము మరచిన సుగ్రీవునకు హనుమంతుఁడు హితము సెప్పి కర్తవ్యోన్ముఖునిఁ జేసెను. రామసుగ్రీవులచే సీతాన్వేషణార్థము అంగదజాంబవదాదులతో హనుమంతుఁడు పంపఁబడెను. సముద్రలంఘనావసరమున జాంబవంతునిచే స్తుతింపఁబడి హనుమంతుఁడు తన శక్తియుక్తులను స్మరించి ప్రకటించెను. అట్టి హనుమంతునియం దాంధ్రకవులు వీరోచితమగు నుత్సాహమును చక్కగ పోషించిరి. ఆ సందర్భమున [1] 'అరుదారం బదివేల యోజనము లుద్యచ్ఛక్తిమై దాటెదన్' అని భాస్కరరామాయణకర్త యగు మల్లికార్జున భట్టు, [2] "పరువడి మూఁడులోకములు భస్మము చేసెద శైలశృంగముల్ పఱియలు వొందన్" అని గోపీనాథము వేంకటకవి, [3] 'సవితృమండలము హస్తగతంబు గావింతుఁ గావింతు భుజపాశగతుగఁ బవను' నని పండరినాథుఁడు, [4] 'పుడమిం జీల్చెద రెండుగా నడిమికిన్ భూమీధరంబుల్ పొడిపొడిగాఁ జేసెద నని విశ్వనాథ సత్యనారాయణ, [5] 'వత్తునా వేమారు హత్తి మిన్నొరసెడి, తపనీయగిరికిఁ బ్రదక్షిణంబు' అని వసుదాసు, [6] 'కన మిన్నార్థిఁ గలంచెద న్గిరులు ప్రక్కల్వ్రేసెదన్' అని హనుమద్రామాయణకర్త మేధాదక్షిణామూర్తి, [7] 'చూడఁ జొప్పడకున్న సురవైరితోడఁగూడ లంకాపురి గొనివత్తు వేగ,కాకున్న జలధులు గలఁతు నొండేని' అని రంగనాథరామాయణకర్తయుఁ దమతమ యుత్సాహము మేలుకు వర్ణించిరి. ఈరీతిగాఁ గిష్కింధాకాండమునందు హనుమంతుఁడు మహాజ్ఞానిగను వాక్నిపుణుఁడుగను, మహావీరునిగను నాంధ్రరామాయణకర్తలచే వర్ణింపఁబడెను.

---

1. రా. సారో. కి. 19
2. భా. రా. కి. 828
3. గో. రా. కి. 1388
4. పండరి. కి. 512
5. శ్రీ. రా. క. కి. అన్వేషణ 441
6. ఆం. వా. రా. కి. 1431
7. హనుమద్రామాయణము. కి. 204
8. రం. రా. కి. 1240

# సుందరకాండ - హనుమంతుఁడు

"సుందరే కిం న సుందరం" అని కొనియాడబడిన యీకాండము సర్వశక్తిసముపేతము. రామాయణ మహామాలారత్న మీకాండమే. రామాయణ మహామాలారత్నము హనుమంతుఁడే. బీజకాండముగాఁ గొనియాడబడిన యిది కేవల మొక మహామంత్రమే. [1] "అపి చ కాండోఽయం సుందరహనుమ న్మాలామంత్రరూపత్వాత్ సుందరకాండ ఇతి మహతామాశయః" అని దీనిని సుందరహనుమన్మాలామంత్రముగనే తెలియగలము. [2] "అస్య శ్రీ సుందరకాండ మహామంత్రస్య వాల్మీకి ఋషిః, ఆంజనేయో దేవతా, రామదూతాయకపయ ఇతి బీజం, నమో వాతాత్మజాయ ఇతి శక్తిః, సముద్రతారకాయ ఇతి కీలకం, సర్వాపన్నివారణార్థే సర్వాభీష్టసిద్ధ్యర్థే సుందరకాండపారాయణే జపే వినియోగః" అని దీని మంత్రవిధానము కలదు. ఇంతియకాక [3] అస్యశ్రీ సుందరహనుమన్మంత్రస్య వాల్మీకి ఋషిః, శ్రీఆంజనేయో దేవతా అని ఋషి దేవతా విధానము కలదు. సుందరకాండయందలి

[4] "జయ త్యతిబలో రామో - లక్ష్మణ శ్చ మహాబలః
సమ్పద్ధార్థో గమిష్యామి - మిషతాం సర్వరక్షసామ్"

ఇత్యాది శ్లోకములు మూఁడుపర్యాయములు దర్శన మిచ్చును. [5] దీనిని సుందర మంత్రముగ భావించువారును గలరు.

హనుమంతుఁడే దేవతయైన యీకాండము తన ప్రత్యేకత నన్ని విధముల సంతరించుకొన్నది. తాది తాంతమైన గాయత్రీమంత్రము చతుర్వింశత్యక్షరములు చతుర్వింశతి సహస్రముల సంఘటితములైనవి. ఈసుందరకాండయు నట్టి మంత్రమువలెనే తాది తాంతమై యొప్పుచు గాయత్రీశక్తిపూర్ణత సూచించుచున్నది. హనుమంతుని మహాప్రభావ

---

1. రా. సాటో. సుం. పుట 20
2. సుందరహనుమద్వైభవము పుట 13
3. సుందరహనుమద్వైభవము పుట 9
4. వా. రా. సుం. 42-33 నుండి 36
5. సుందరకాండ మెందుకు సుందరమైనది. పుట 68

# భారతేతిహాసము - హనుమత్కథ

"ఇతిహాస పురాణాభ్యాం వేదం సముప బృంహయేత్" అన్నటుల వేద ప్రయోజనమే ఇతిహాస పురాణములు సాధించుచున్నది. ఇతి హఆస అని యిట్లు జరిగెనటయని చెప్పునది ఇతిహాసముకాన భారతమును కల్పనగాఁ జెప్పు నాస్కారము లేదు. భారతము మనకు సమీప యుగమగు ద్వాపరయుగాంతమున జరిగినది. తత్కర్త కృష్ణద్వైపాయనవ్యాసుఁడు నాభారతమునఁ బాత్రనంది యుండెను. అట్లే భారతమునాట హనుమంతుఁడును కలఁడు. కాన నీ యితిహాస కాల మెఱుఁగుట వలన సమీప కాలమున హనుమంతుఁడున్న సమయము దెలియును. కురుక్షేత్రసంగ్రామ దర్శనమునకు సంజయున కవకాశముగల్పించిన వాఁడు వ్యాసుఁడుకాగా విజయధ్వజమున స్వయముగ నున్న వాఁడు హనుమంతుఁడు.

ఆ మహాభారత సంగ్రామము యథార్థముగ జరిగిన ట్లనేక భారతీయ ప్రాశ్చాత్య పరిశోధకులు స్పష్టమొనర్చిరి. కాలనిర్ణయము కూడ చేసిరి. భారతయుద్ధమునాటికి సప్తర్షులు మఖలో నుండుటవలన దాదాపు నేటి కైదువేల సంవత్సరములనాఁడు భారత యుద్ధము జరిగియుండునని జ్యోతిర్గణనాధారముగా వృద్ధగర్గ, భట్టోత్పల, వరాహమిహిర, ఆర్య భటాదులు చెప్పిరి. ఈ విషయమును 1975 అక్టోబరు 19-21 తేదీలలో ఉత్తర ప్రదేశ్‌లోని విదురసేవి ఆశ్రమం (బిజనూర్)లో ప్రముఖ చారిత్రకపరిశోధకుల, వేదవిదుల, ఖగోళ శాస్త్రకోవిదుల సదస్సు చర్చించినది. గ్రహ తారక స్థితిగతులను కూలంకషముగా పరిశీలించి సూర్యుఁడురాశి చక్రమున 22.75 అంశలోనున్న సమయమున మార్గశీర్షశుక్లఏకాదశి శుక్రవారము కృత్తికానక్షత్రము న్ననాడు మహాభారతయుద్ధ మారంభమైనదనియు, [1] అది క్రీస్తు పూర్వము 3067 నవంబరు 22అగుననియు నిర్ణుఁ దేల్చిరి. ఇది ప్రాచీన ఖగోళపండితుల యభిప్రాయమునకు సరిపోవుచున్నది.

భారత యుద్ధము, ఆయా పాత్రలును యథార్థములని భావించిన యెడల వానితోడ సంబంధబాంధవ్యముగల హనుమత్పాత్రనుగూడ యథా

---

1. ఆంధ్రపత్రిక ది. 27-10-1975

ర్థముగా గుర్తింపవలసి వచ్చును. త్రేతాయుగమువాఁడగు హనుమంతుండు చిరంజీవి యగుటఁ దననిత్య నివాసమగు గంధమాదన పర్వతమునుండి ఈ భారతమునకు సంబంధించిన ద్వాపర యుగమునందును కన్పడును. అట్లే మార్కండేయుని వలన మహనీయుల గాథలఁ జెప్పుటలో ధర్మజునకు వినఁబడును. వేదవ్యాస కృతమగు సంస్కృత మహాభారతమున నరణ్య పర్వమున146-150 అధ్యాయముల సౌగంధిక వృత్తాంతమున, 273-293 అధ్యాయముల రామోపాఖ్యానమునను హనుమద్వృత్తాంతము కన్పట్టును. శ్రీమదాంధ్ర మహాభారతమున నీభాగ మరణ్య పర్వమందలి తృతీయాశ్వాసమున సౌగంధిక వృత్తాంతము, షష్ఠసప్తమాశ్వాసముల రామోపాఖ్యానము గలదు. ఈ భారతభాగాంధ్రీకర్త ఎఱ్ఱన.

అరణ్యవాసమున నున్న పాండవులు గంధమాదన పర్వతమునకుఁ బోయిరి. అట నొక్కనాఁడు ద్రౌపదితో కూడి భీముఁడు విహరించుచున్నయెడ నొక యపూర్వ రమణీయ సుమము లలిత సహస్రపత్ర కమలము సమీర విధూతమై వచ్చి వారి ముందటఁ బడెను. దానిఁ జూచి మురిసిన ద్రౌపది యట్టివి పెక్కులుకావలెనని కోరవానికై భీముడు వెదకుచుఁజనెను. గంధమాదన పర్వతము హనుమంతుని నిత్యనివాసము.

[1] "రంభావన విహారాయ-గంధమాదన వాసినే
సర్వలోకైక నాథాయ-మంగళం శ్రీ హనూమతే॥

అని ప్రమాణము. అందునను కదళీవన నివాసిగా [2] "గంధమాదన శైలాంత-స్వర్ణరంభా వనాశ్రయః॥" అని చెప్పబడియున్నది. గంధమాదన పర్వతమును వర్ణించుచు నెఱ్ఱన [3] "వివిధ రత్న బంధురకందర కదళీషండ దర్శనంబు" ననియే చెప్పెను. కమలాహరణార్థము వెడలిన భీముఁడు [4] "అనేక యోజన విస్తారాయామ రమణీయంబైన కదళీషండంబుఁ జొచ్చి యందు శంఖధ్వానంబు సేసెను. అచ్చట సమీప గుహయందు శయనించు హనుమంతుఁడా శంఖధ్వానము విని మనః ప్రియంబైన దానిఁ దనయనుజుఁడొనర్చినదానినిగా గ్రహించి సంతసించెను. వెంటనే యప్పావని వాయునందనుని మార్గనిరోధంబుగా మహావృక్షం

1. ప. సం. 47-94    2. ప. సం. 48-2
3. భార. అర. తృ. 311    4. భార. అర. తృ.-313

బులం ద్రోచి యడ్డంబుగ శయనించి గిరిగుహలు మాఱ్ఱ్మోగునట్లు లాంగూల స్ఫోటచింబున ఘోరరవంబొనర్చెను. అదివిని చకితుఁడై వచ్చిన భీముడు కదళీషండ మధ్యంబున శయినించిన హనుమంతుఁ జూచెను. ఎఱ్ఱన అట్టియెడ హనుమంతు నీరీతి వర్ణించెను.

[1] "హ్రస్వ పీన గ్రీవు నచలి తాయత హను
వతిచపల స్వభా వాభి రాముఁ
దనుమధ్య కటిచక్రు దహన కణాకార
తామ్రోష్ఠు నతికృశ దశన కరజుఁ
బృధుల విద్యు త్పుంజ పింగాక్ష నుత్తుంగ
దృఢవక్షు నాజాను దీర్ఘ బాహు
నూర్ధ్వ లాంగూల మత్యున్నత ధ్వజతలఁ
గ్రాలుచునుండ నేకాంత యోగ
నిద్ర నున్న ధర్మనిర్మలు హనుమంతుఁ
జూచి పాండురాజసుతుఁడు వాని
నిద్రఁ జెఱుపఁ గడఁగి నిజసత్త్వ మేర్పడ
సింహనాద మొప్పఁ జేసె డాసి." ఇందు నెఱ్ఱన బాహ్యసౌందర్యవర్ణనతో బాటు 'యోగనిద్రనున్న' యని హనుమంతుని యాంతర సౌందర్యమును కూడ వర్ణించెను.

ఇట్టి హనుతుని పాత్ర ఈ ఘట్టమున హాసభూయిష్టమైనది, ఉపదేశపూర్వక మైనదియును. తమ్ముఁడగు భీముని నాటపట్టించి గర్వభంగ మొనర్చి ప్రజయోనముం జేకూర్చుట హనుమంతుని యుద్దేశ్యముకావున నిందు పరిహాసము, ఉపదేశము, సహకారము నను నంశములు ప్రస్ఫుటములగును. హనుమంతుని నటనము హాస్య యుక్తము.

"అతి జరా రోగభరమున నలసి యొలసి
యొదిగి సుఖ నిద్రమై నిట్టులున్నవానిఁ
గడు మదంబున నేమియుఁ గరుణలేక
యేల బోధించితయ్య నీ వెఱఁగి యెఱిఁగి" అని జరారోగభరమును నటించుట హాస్యము.

1 భార. అర. తృ-319 2. భార. అర. తృ-321

వెంటనే [1] "తిర్యగ్జాతులు ధర్మమెఱుంగవుగాక, సర్వభూతదయా స్వరూ
పంబైన ధర్మ మెఱింగెడివారు మనుష్యులు కారె? ఇట్టి మనుష్య జన్మంబు
వడసి వృద్ధోపసేవ సేయవుగాక" యనుచు బల్కుట యుపదేశము. అది
భీమునకే కాక భూతదయారహితులు, వృద్ధసంసేవనము సేయనివా రం
దఱకును నన్నికాలముల నుపదేశమే. ఇట కెవ్వరు రాజాలరెట్లు రాగల్గితివి
వెడలు, మన సాహంకారముగా దనవిషయముఁ జెప్పుకొని నాకుఁదెరు
వీకున్న హనుమంతుఁడు సముద్రము దాటి పోయినట్లు నిన్ను,నీ పర్వ
తమును దాటిపోయెదనని పల్కుటచే నట్టి బలగర్వము నణచు యత్న
మొనర్చెను.అసలా హనుమంతుఁడు సముద్ర మెందుకు దాటెనని యడిగి
చెప్పించుట చమత్కార పూర్ణముగను, నాటకీయముగా నున్నది.

భీముఁడు హనుమత్సముద్రోల్లంఘ నావసరము దెల్ప 'నేను హను
మంతునంత బలవంతుఁడ, ననుటతో 'లేవలేని ముదుసలిఁగాన నాతోఁకఁ
బాయం ద్రోచి' పొమ్మనెను అంతట భీముఁడు వామకరంబున నెత్తబోయి
వశముగాక.

[2] "ఏపున రెండు చేతులను నిమ్ముగ బట్టి యమర్చి యెత్తఁగా
నోపక మొగ్గఁతిల్లబడి యుద్గత ఘర్మజలార్ద్ర దేహుఁడై
కా పురుషుండుఁ బోలె నిజగర్వముదక్కి యడంగియుండె జిం
తాపరుఁడై వృకోదరుఁడు తద్దయులజ్జన ధోముఖంబుగన్"

అని యిట్టి ప్రబల యత్నమొనర్చి విఫలుఁడై గర్వముడిగి క్షమవేడెను.
పై భీముని యత్నమునకు వశముగాని హనుమంతునియందు గరిమా
శక్తిని గనఁగలము. అష్టసిద్ధులు నందినవాడు హనుమంతుఁడు. ఇట్లాతని
జీవితమున నవసరముఁ బట్టి యాయా సిద్ధులుఁ జూపెను. హనుమంతుఁడు
తన జనన విషయమును, సోదరత్వముం జెప్పి

[3] "నరసుర స్తుత్యమై యెంత కాలంబు నా కీర్తి నిలుచు
నిరతంబుగా నంతకాలమును నీవు నిత్యుండ వగుచుంబరగు"

మనుచు రాముఁడన్న "యావత్స్థాస్యంతిగిరయః" వంటివిషయములను
చెప్పి భీమునిచే హనుమంతునిగాఁదెలియఁబడెను.భీముఁ 'డలనాటి సము
ద్రములంఘించినరూపముఁ జూపు' మన కాలంబొకరీతి యుండదనుచునాల్గ

---

1. భార. అర. తృ - 322
2. భార. అర. తృ - 329
3. భార. అర. తృ - 331

యుగముల ధర్మము నాల్గు, మూఁడు, రెండు, నొక్కపాదముతో నుండు రీతిని చెప్పెను. ఈ యుగ ధర్మములు ఆరుపద్యములఁ జెప్పబడెను.

భీముఁడు 'నాటిరూపముఁజూడఁగోరినను హనుమంతుఁడు 'అతిభీషణ మత్యద్భుతమోహాకారాలు ననునట్లు ఘనతరముగ వ్యాప్తమైన రూపము జూపి ప్రశంసింపఁబడెను. భీమునకు సౌగంధిక సరోవరముకడఁ దీసికొన వలసిన జాగ్రత్తలుచెప్పి మరల నేడు పద్యములందు ధర్మబోధఁ గావించి హితముఁ జెప్పెను.

1 "మీ దయచేసి మాకెన్న నంత యత్యంత
వీరులు లే" రని భీముఁడన,

2 "నన్ను రణాంతరంబునఁ దలంచునది; నీయందు సౌహా
దంబున నాహవంబులో నతిరథుండయిన యర్జును
రథ ధ్వజంబు నందుండి మీ బల పరాక్రమంబులం జూతు"
నని కౌగిలించుకొని సౌగంధిక సరోవర మార్గంబు సూపి

హనుమంతుఁ డంతర్హితుండయ్యెను. అట్టి హనుమంతుని యాలింగ నముననే భీముఁడు విగత శ్రముఁడై విపుల జవశక్తియుక్తుం డయినట్టు లనా హనుమచ్ఛక్తి విశేషము నెఱ్ఱన చక్కగ వర్ణించెను.

ఆరీతిగ భీమ గర్వభంగమును జరిగెను. పరాశర సంహితయందు నేబది, యేబదియొకటవ పటలములందు హనుమద్భీమ సంబంధమగు కథ కలదు. అది పురుష మృగాహరణోపాయ కథనము. భీమున కడ్డుగా నుండి బలగర్వ మణగించుభాగ మందునిట్లే కలదు. కాని యది యరణ్య వాస సందర్భము కాదు. సుఖముగ రాజ్యమేలుచు రాజసూయ యాగము చేయు సందర్భము. సౌగంధిక కుసుమమున కేగుటకాక పురుషమృగం బునకేగిన యత్నమది. ఈరీతిభేదములుగల్పాంతరభేదములుగా గ్రహించి సమన్వయించుకొనఁ దగును. ఇచ్చట ఎఱ్ఱన భీమునకు హనుమద్రూపముఁ జూపిన రీతి 3 "అతులితమై ద్వితీయ కనకాద్రియొకోయిది నా నిజాంగ మూర్జితముగఁ బెంచి పుచ్ఛమునఁ జేసి దిగంతము లందుచున్నట్లు చెప్పెను. ఇది హనుమంతుని యష్టసిద్ధుల మహిమా సిద్ధికి నిదర్శనము. ఈరీతి వర్ణనమున

---

1. భార. అర. తృ – 353 2. భార. అర. తృ – 354
3. భార. అర. తృ – 243

[1] ''హనుమాన్ పర్వతాకారో-బభూ వాద్భుతదర్శనః
[2] ''మేరు మందర సంకాశో-బభౌ దీప్తానల ప్రభః''
[3] ''హరిః పర్వత సంకాశో-తామ్ర వక్త్రో మహాబలః''
[4] ''స భూత్వా శైలసంకాశః-క్షణేన పున రాత్మవాన్''
మున్నగు రీతిగా వాల్మీకి చూపిన రూపమునే పోలియున్నది.

భారతయుద్ధమున విజయధ్వజము కపిధ్వజముగా మనకు కన్పట్టును. ''కపిధ్వజ ప్రభలు నంధీభూతులన్ జేయవే'' (తిక్కన); 'జెండాపై కపిరాజు'' (తిరుపతి వెంకట కవులు); వంటి ప్రయోగములు ప్రసిద్ధములు, కానీ యందుకుఁ గారణ మటుఁ గానరాదు. సూచనగా నా కారణమిందుఁ జెప్పబడిన ట్లయ్యెను. ద్వాపర యుగమందుఁ జూపుటద్వారా యుగధర్మములు చెప్పించుట ద్వారా భవిష్యచ్ఛతురాననత్వముఁ బరోక్షముగ సూచించెను. ఈ విధమున శంభుదాసుం డీశ్వరాంశసంభూతునిఁ దన యరణ్యపర్వమ్మునఁ జూపెను.

వాల్మీకి రామాయణమున హనుమంతుఁ డాచార్యునిగా లోకమున కందించిన మూ డుపదేశములం దొకటి [5] ''యది సీతాపిదుఃఖార్తా-కాలో హిదురతిక్రమః'అనునట్టిది. 'కాలో హిదురతిక్రమః' అను నద్భుత సూక్తి వ్యాసుఁడు కూడ తన హనుమంతునిచేతను బల్కించెను.

భీముఁడు సముద్రము దాటిననాటి రూపుఁజూపుమని హనుమంతుని కోరగాఁ దానుకూడ యుగధర్మము పాటింపవలె ననిచెప్పుచు భీమునితో [6] ''యుగం సమనువర్తేऽహం కాలో హి దురతిక్రమః'' అనును. ఈ పునర్గ్రహణము హనుమచ్ఛక్తి యొక్క విశిష్టితను చాటుచున్నది.

భారతమునఁగాననగు మఱియొక హనుమద్ఘట్టము అరణ్యపర్వమునందే షష్ఠ సప్తమాశ్వాసములందుఁ గలదు. ధర్మజాదులఁ జూడవచ్చిన మార్కండేయుని రామకథఁ జెప్పవలసినదిగఁ గోర నాతఁడు చెప్పును. అందు హనుమత్కథ చెప్పబడెను. సీతాపహరణానంతరము వెదకుచు వచ్చు రామలక్ష్మణుల గూర్చి యెఱుఁగ సుగ్రీవుఁడు

---

1. వా. రా. సుం 1 - 49  2. వా.రా.సుం . 37/37
3. వా. రా. సుం - 37/38  4. వా. రా. సుం - 53/41
5. వా. రా. సుం, 16 3  6. సం. భార. అర. 149-10

[1] ''సంతతోత్సాహు, ధీమంతు, శౌర్యవంతు, నుత్తము, హిమ వంతుఁడు బోని యత్యంత సుస్థిరుహనుమంతుఁబనిచె'' నని ప్రచేశము ననే హనుమచ్చక్తియుక్తులఁ బ్రకటించెను. అనంతర కథలో వీనినినిరూపించెను. స్థూలముగ నిందలి కథాబాగము యథా వాల్మీకమే కలదు. కానీ లక్ష్మణుఁడు రాముఁబంపునఁసుగ్రీవుఁ బైకిఁబోయిన నాటికే సుగ్రీవుఁడు కపుల నందఱిఁ బంపి మాసముగడువు విచ్చినట్లు నింక నైదు రోజుల గడువున్నటులు చెప్పను. అట్లయిన నింతకాలము రాముఁడు మిన్నకున్నట్లగును. ఇది మూలమునకు భిన్నము.

ఇట స్కాంద పురాణమున కార్తీక శుద్ధ త్రయోదశినాడు బ్రహ్మాస్త్ర బద్ధుఁడై లంకనంటించి పౌర్ణమికి మహేంద్రపర్వతముఁ జేరినట్లు, మార్గ శిరశుద్ధ పాడ్యమికి మధువన ధ్వంసముగావించినట్లు కలదు. కాగా ''వెండియు నొక్క మాసంబు సెల్లినఁ గొందఱు వనచరులు పఱతెంచి సుగ్రీవుం గని యిట్లనిరి.'' యని మధువనధ్వంస విషయముఁ జెప్పించెను అనఁగా వారు చెప్పిన మాసముగాక పైన మాసమునకుఁ దిరిగి వచ్చినటులఁ జెప్పఁబడెను. ఇదియు నసంగతము రామునకుఁ దెలియకుండగనే హనుమదాదులను సుగ్రీవుఁ డంపియుండుటవలన నంగుళీయక వృత్తాంతము లేదు. చూడామణిని సీత యిచ్చి పంపుటయే కలదు. అట నెఱ్ఱన [2] 'హనుమంతుఁడు జానికి హృదయంబు మూర్తిమంతంబైన పగిది నున్న యమ్మహామణి రాజచూడామణికి సమర్పించిన' అని యనును. హనుమంతుఁడు భక్తుడు. నిరంతర సీతారామధ్యాన తత్పరుఁడు. అట్టి యుపాసకుఁడు మంత్ర కవచ హృదయాదుల ననుష్ఠించుట కర్తవ్యము. సీతోపాసన గావించి వచ్చిన హనుమంతునిచే నిట 'సీతా హృదయముగా' నా చూడామణి నిప్పించుట మంత్రశాస్త్ర సమాలోచన మందించునదై యున్నది.

ఇట హనుమజ్జనన వృత్తముగాని, మహారూపముఁ దాల్చుటఁగాని చెప్పలేదు. ఆ విషయము నెఱ్ఱన తృతీయాశ్వాసమునందే చెప్పెను. ఇందు మరోవిశేషము 'రక్కసుఁడ గానుసుమ్మి' యను హనుమంతునితోసీత

---

1. భార. అర. 6 - 369     2. భార. అర. 7 - 32

[1] “అన్నా! నిన్నె ఱింగితి; నది యెట్లనిన రామహితాన్వేషి యగువాఁడవింధ్యుండను వృద్ధ రాక్షసుండు మున్న యింతయుఁ ద్రిజటచేత నాకెఱింగించె” ననును. త్రిజట స్వప్నవృత్తాంతముగాఁ గూర యిట్లని సీత చెప్పుట చింత్యమగు విషయము. కావున శింశుపావృక్షమునుండి త్రిజటా స్వప్నవృత్తాంతము విను నవకాశము లేదు. వనధ్వంస వృత్తాంతము రాక్షసులతోడి యుద్ధము రావణ సందర్శనము లిటఁ జెప్పఁబడలేదు. హనుమంతునితో యుద్ధభూమిందు ధూమ్రాక్షునితోడి ముఖ్యముగఁ జూపెను. అదియే 85-91 వఱకు నేడు పద్యములఁజాల స్పష్టముగ వర్ణించెను. అందు

[2] “లంకాలుంటాకుఁ దుర్ద్వాల్లము తర గమనోల్లాసి మైదాఁకి పేఁరం
బొంకం బేపారఁ జంచద్భుజరచిత మహాభూరుహం బెత్తి ప్రేసెం
గింకన్ ధూమ్రాక్షు; వాడుం గెడసెను వదనోద్గీర్ణ కీలాలధారా
పంక ప్రాగ్భాగమగ్నాపఘన విఘటిత ప్రాణుఁడై యాహవోర్విన్”

వాడు చచ్చినరీతి నెట్టిన యారభటి నార్భాటముగఁ జెప్పెను.

ఇంద్రజిత్తుతోడి యుద్ధమున నాగాస్త్ర బంధితులై యున్న రామలక్ష్మణుల విభీషణుఁడు బ్రహ్మాస్త్ర ప్రయోగమున వారికి బంధమోక్షణంబు గావించినట్లు [3] సుగ్రీవుఁడు విశల్యకరణి యను నౌషధమున వారల విశల్య దేహులఁ గావించినట్లు చెప్పెను. అవిశల్య కరణ్యాదులఁ దెచ్చిన వాఁడు హనుమంతుఁడు. రాజుకావున నాగౌరవము సుగ్రీవునకందనిచ్చెనని సమర్థించుకొనవలెఁ దప్ప సుగ్రీవుఁడు ఓషధి పర్వతంబు దెచ్చె ననుటకుఁ బ్రమాణము లేదు.

అనేక పురాణములం దీ రామగాథనే చిత్రించిన వ్యాసు డిట్లు చెప్పెనన నిది కల్పాంతర విషయమని గ్రహింపవలయును. ఇట్లు భారతమునందలి హనుమత్కథలో నట్టి మార్పులు కానవగును.

---

1. భార. అర. 7-32
2. భార. అర. 7-87
3. భార. అర. 7-128

# పురాణ వాఙ్మయము - హనుమత్కథ

పురాణ మన సామాన్యార్థము ప్రాచీనము. [1] ''పురానవం భవతి పురాణమ్'' అను యాస్కవాక్యము ననుసరించి ప్రాచీనతలో నవీనతఁ దెలుపునట్టి దిది. ఈ పురాణ శబ్దమునకు [2] 'యస్మాత్ పురాహ్యనక్తీదం పురాణం తేన తత్ స్మృతమ్'' అనగా నతీతవిషయములఁ బొందించునది యని బ్రహ్మాండ పురాణ ప్రక్రియా పాదము. 'యస్మాత్ పురాహ్యనక్తీదం - పురాణం తేన తత్స్మృతమ్' పూర్వవిషయములందు జీవించు నది అని వాయుపురాణము. [3] 'పురా పరంపరాం వష్టి పురాణం తేన తత్స్మృతమ్' ప్రాక్తన విషయాభి రతిని కల్గియుండునది యని పద్మ పురాణము, నిర్వచనములఁ దెల్పుచున్నవి. ఈ పురాణము లతిప్రాచీనములయ్యు నన్నికాలములకు నిత్య నూతనములుగాఁదోచి విజ్ఞానమును ప్రసాదించునవి. మిత్రసమ్మితములగు నివి చెలికానివలెఁ జక్కని యుదాహృతుల కథాకథనమున ధర్మబోధ నొనర్చునవి.

'పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణా స్మృతమ్' అని మత్స్యపురాణము చెప్పుట వలన అన్ని శాస్త్రములకంటె ముందు బ్రహ్మచే స్మరింపఁ బడుటచేఁ బురాణప్రాముఖ్యతతెలియును. ఈ పురాణము యొక్క యర్థమునే నిఘంటువు లిట్లు నిర్వచించుచున్నవి. పురాభవ మితి పురాణం అని అమరకోశము, పురా పూర్వస్మిన్ భూత మితి పురాణం అని గురుబాల ప్రబోధిక, 'పురాభవమితి పురాణం' అని శబ్దకల్ప ద్రుమము, 'పురా నీయతే ఇతి పురాణం' అని వాచస్పత్యము ప్రాచీన విషయములను తనయందుఁబొందుపరచుకొనినది యని చెప్పుచున్నది. 'పురాతనస్య కల్పస్య పురాణాని విదు ర్బుధాః' అని మత్స్య పురాణము పురాతన కల్పవస్తుకముగాఁబురాణమును తెలియఁజేయుచున్నది.

ఈ పురాణములు పదునెనిమిదిగ నష్టాదశ పురాణములుగాఁబేర్కొనఁ బడినవి. అవి దేవీభాగవతమున

---

1. నిరుక్తమ్ - 3-16
2. వాయుపురాణము - 1-203
3. పద్మ పురాణము - 5-2-53

1 "మద్వయం భద్వయం చైవ - బ్రత్రయం వచతుష్టయం
అనాపలింగకూస్కాని - పురాణాని పృథక్ పృథక్" అని సూత్ర ప్రాయముగాఁ జెప్పఁ బడినవి. అట్లే ఉపపురాణములు పదునెనిమిది, అతి పురాణములు పదునెనిమిదియుఁగలవు.

'తత్ర పద్మపురాణం తు ప్రథమం చ ప్రణీతవాన్
తతో౽న్యాని పురాణాని కృత్వా షోడశ తు క్రమాత్
అష్టాదశం భాగవతం సార మాకృష్య సర్వతః
కృతవాన్ భగవాన్ వ్యాసః శుక మధ్యాపయత్ స్వయమ్' అని పద్మపురాణము మొదటిదిగా భాగవతము చివరిదిగాఁబద్మపురాణమునఁ దెలియును.

పురాణముల హనుమత్కథ ముఖ్యముగా బ్రహ్మపురాణము, పద్మ పురాణము, శివపురాణము, భవిష్యత్పురాణము, లింగపురాణము, స్కాంద పురాణము, బ్రహ్మాండ పురాణము, వరాహ పురాణము, బ్రహ్మవైవర్త పురాణము మున్నగువాని యందును నారసింహ పురాణమునందును లభ్య మగుచున్నది. అందు 2 'బ్రాహ్మం మూర్ధా హరే రేవ హృదయం పద్మ సంచితం' అని చెప్పఁబడుట వలన మొట్ట మొదటిదిగా బ్రహ్మ పురాణ మును బరిగణన సేయుచుండిరి.

<u>బ్రహ్మపురాణము</u> :- అష్టాదశ పురాణముల బ్రహ్మపురాణమునఁ బ్రత్యేక హనుమత్కథ కానరాదు. కాని షట్పంచాశ దధిక శతతమో౽ధ్యాయమున (156) కిష్కింధా తీర్థవర్ణనమున మాత్రము 'హనుమత్ప్రసక్తి' కాన వచ్చును. శ్రీరాముఁడు రావణవధానంతరము సీతతో నయోధ్య వెడలుచుఁ డోవలో నీ తీర్థమును చూచి

3 "హరీ న్వర్వా న థా౽మ వ్రృహనుమ త్ప్రముఖా న్మనే' అనుచో వారిని సంబోధించి రాముఁడీక్రింది రీతిగాఁ జెప్పుచున్నట్లు బ్రహ్మ నార దునితో ననును. అట్టి కిష్కింధా తీర్థమును ప్రస్తుతించుచు

---

1. దేవీభాగవతము - 1-3-2
2. పద్మపురాణం - స్వర్గఖండము - 62-22
3. బ్రహ్మపురాణము - 156-8

[1] 'అస్యాః ప్రభావాత్... సీతా చ లబ్ధా హనుమాం శ్చ బన్ధుః' అని యంతీర్థ మాహాత్మ్యమున నందనకు బంధువుగా హనుమంతుఁడు లభించెనని రాముఁడు చెప్పుకొనెను. విభీషణాదుల వాక్యమున నాల్గురోజులట నుండి వానరులు లింగములను ప్రతిష్ఠించి సేవించుకొనిరి. పిదపవెళ్ళునపుడు రాముఁడు 'లింగము లన్నింటిని విసర్జింపు'మని హనుమంతునితో ననెను. హనుమంతుఁడెంత యత్నించినను నవిరాకుండుటచే వానరులు,రాముఁడు నచ్చెరు వందిరి. అట్టి లింగము, గంగయుఁగిష్కింధా వాసులగు వానరులచేఁ బూజింపఁబడుట నది కిష్కింధాతీర్థ మయ్యెను. పంచనవతిత మాధ్యాయము (95) మన్యుతీర్థ వర్ణనము. హనుమంతునకిష్టమగు మన్యుసూక్తాధిదేవతయగు శివస్వరూప మిదియే. ఇట్లు బ్రహ్మపురాణమున హనుమత్సంబంధ విషయము గలదు.

పద్మ పురాణము :- ఇఁక హృదయస్థానీయమగుఁబద్మపురాణమున హనుమత్కథ కొంత కానవచ్చును. అందలి పాతాళ ఖండమున షోడశాధిక శతతమోధ్యాయము (116) నందు జాంబవదుక్త పురాకల్పీయ రామాయణ కథా వర్ణనము కలదు. ప్రస్తుత కల్పస్థుఁడగు రాముఁడొక సాయంకాలము సంధ్యానిర్వహణోద్యుక్తుఁడై హనుమంతునితోఁగూడి బయల్వెడలుట తెలియును. సంధ్యానంతరము సభామంటపమునకు విచ్చేసి జాంబవంతునిచేఁజెప్పఁబడిన పూర్వకల్ప రామాయణకథ వినును. ఆ రామాయణము నందలి హనుమంతుఁడును ఇందుఁ గానవచ్చును.

ఆ కల్పమందలి రాముఁడు సీతను బోకొట్టుకొనుట వంటివి యథాతథముగానే జరుగగా హనుమత్ప్రవేశఘట్టమున భేదము గన్పట్టును. ఇందు లక్ష్మణునితో సుగ్రీవ నిలయమగు ఋష్యమూకపర్వత ప్రాంతమున కేగి యట నిబిడచ్ఛాయంబగు చూతవృక్షముఁజేరి రాముఁడు లక్ష్మణుని తొడపై శిరస్సువెట్టి విశ్రాంతిఁగొనుచు మణికుండల మండితుఁడు, హేమపింగళుఁడు, సుదృఢబద్ధ మౌంజీకౌపీనుఁడు అచ్ఛోపవీతుఁడు నతి చంచలుఁడు, పూలగుత్తులు చల్లుచు గాన మొనర్చుచు చెట్టునెక్కి వీచుచున్న వానిని చూచి "లక్ష్మణా! ఎవరీతఁడనఁ దెలియుదవె'. అంత హనుమంతుఁడే 'సుగ్రీవుని అనుచరుఁడను హనుమంతుఁడ'నని రామునకు

1. బ్రహ్మపురాణము - 156-11

నమస్కరించి సుగ్రీవునికడ కేగి అపర నారాయణునివలె నున్న మేఘ శ్యామునిఁ జూచితిననెను.

అట్లే వాలి మరణానంతరము లంక కేగి సీత వార్త నెఱిఁగి యుద్ధమో సంధియో జరుగుట దెల్పుమని హనుమంతుఁడే పల్కెను. అట్లు జరుగునన జాంబవంతుడే 'హనుమంతుఁడొక్కఁడు వెడలి తెలిసికొని రాగలఁ'డన నట్లే పంపగా రామాయణరీతిగా నన్ని పనులు చేసివచ్చి చెప్పెను.

అట్లే ఉత్తర ఖండము నందలి దశావతార చరిత్ర కథనమునఁగల రామావతార ఘట్టమున హనుమత్కథ కలదు. రామకథ సంక్షిప్తముగఁ జెప్పినదైనను యథావాల్మీకము. హనుమత్కథ యందలి ప్రధానాంశము లన్నియుఁ జెప్పబడెను.

పద్మ పురాణమున నేకాదశీ వ్రతమాహాత్మ్యమున శ్రీరామావతార కథను శివుడు పార్వతికిఁ జెప్పెను. ఇందు రామ సుగ్రీవసఖ్య మేర్పడుట, హనుమంతునే సమర్థునిగా నెంచి యిచ్చిన రామముద్రికఁగొని యేగుట - యిట్లు రామాయణ గాథయే యథాతథముగఁ గలదు. మైనాకునిపై విశ్రాంతి గొని యేగిన ట్లిందుఁ గలదు. హనుమదాదులచేఁ బట్టుపడిన అతికాయ మహాకాయుల వలన లంకాద్వారమునఁగల పంచ వక్త్రముల దారువు నేకప్రయత్నమునఁ బంచఖండములు గావించువానిచే రావణుఁడు నిహతుఁడగు ననుటఁదెలిసి యట్లు రాముఁ డేకశరమున ఖండించెను.

రావణ శక్తిప్రయోగమున మూర్ఛిల్లిన లక్ష్మణుఁదేర్చ జాంబవంతుని మాటపై సుషేణుఁడు చెప్పినట్లు హనుమంతుఁడు వెడలినపుడు మారీచుని కుమారుఁడగుఁ గాలనేమిని రావణుఁడు పంప నాతఁడు మునివేషమున నేగి తనను దాహ మడిగిన మారుతిని మొసళ్ళుగల సరస్సునకుఁ బంపెను. మకరీ శాపవిమోచనము గావించిన హనుమ కాలనేమికడ కేగి నీకుఁ బ్రత్యుపకార మిది యని పిడికిటఁ గొట్ట వాఁడదృశ్యుఁడై ఆకసమునంట నీతఁడునుఁబై కెగసి గ్రుద్దుచు బాధింప వాఁడు మాయారూపుఁడై సుగ్రీవునివలెఁ గానవచ్చి 'హనుమా! నీవు ద్రోణాద్రికి వెళ్ళఁబనిలేదు. లక్ష్మణుఁడు లేచినాఁ'డన నమ్మక వానిఁ జీల్చి చెండాడి ద్రోణగిరి కేగెను. హనుమంతుని ముందుగ నందిగ్రామ మంపుట యిందుఁగలదు.

ఇందుత్తర ఖండమున రామాశ్వమేధ కథ శేషునిచే వాత్స్యాయనున కెఱిగింపఁబడెను. ఆ యశ్వమేధమున దిగ్విజయార్థమై శతృఘ్నునితో హనుమంతుఁడును వెడలును. యజ్ఞాశ్వము దేవాప్రహదమున మునుంగ సుమతి హెచ్చరిక శత్రుఘ్నుఁడు హనుమదాదులతోఁ బాతాళమున కేగెను. రుక్మాంగద వీరమణులకు శతృఘ్నునితో యుద్ధమేర్పడెను. వీరమణికి ప్రమథగణములతోఁ బరమేశ్వరుఁ డండగా నిల్చుట వలన శివునకు హనుమంతునకు ద్వంద్వయుద్ధ మేర్పడెను. రామభక్తుఁడగు సురథుఁడు హయమునే కాక యుద్ధమున హనుమంతుని కూడ బంధించి రామదర్శనము సేయింపుమని హనుమంతునిఁ బ్రార్థింప రాముని హనుమంతుఁడు స్మరింపగాఁబ్రత్యక్షమయ్యెను. రామభక్తుఁడగు సురథుఁడు రామునకు సర్వస్వార్పణము గావించెను. లవకుశులతోడి యుద్ధమున శత్రుఘ్నాదులు మూర్ఛనంద వారితోడ హనుమంతుఁడు పోరి పట్టుబడి సీత మందలింపున వారిచే విడిపింపఁబడెను. రామపట్టాభిషేక వృత్తమున మాత్రము "పవనసుతుండు దీపమును బట్ట" నని యాంజనేయుఁడు దీపధారిగాఁజెప్పఁ బడుట విశేషము. సహజముగ నీ ఘట్టమున హనుమంతుఁడు పాదసేవకుఁడుగా నుండును. కాని ఈ పురాణమున పట్టాభిషేక సమయమున దీపధారణ సేయును. ఇది యొక విశేషము.

ఈ త్తరఖండమునఁ జతుశ్చత్వారంశదధికద్విశతతమాఽధ్యాయమున (24) శ్రీరాముఁడు కాలుని ద్వారా బ్రహ్మసందేశము నందుకొని స్వర్లోకమేగు సమయమున హనుమంతునితో 'ఓ ఆంజనేయా! నాకథ లోకమున విలసిల్లునంత వఱకు నవభూలోకమున వసింపవలసిన' దని చెప్పుట కలదు. ఇది రామావతారమునఁ జివటిఘట్టము ఈ విధముగాఁ బద్మపురాణమున హనుమంతుఁడు సాక్షాత్కరించుచున్నాఁడు.

<u>శివ పురాణము :-</u> శివ పురాణమున హనుమజ్జన్మవృత్తాంతము కలదు. ఇందలి షష్ఠాశ్వాసమున లీలాఖండమున హనుమంతుని వృత్తాంతము చెప్పఁబడినది. తారకాసుర వధార్థము కుమారస్వామి యుద్భవించుటకై దేవతల ప్రార్థనముల శివుఁడు తన వీర్యమును అగ్నిహోత్రుని యందు నిల్పెను. మహాబలుఁడగు వాయువు అద్దానిని హరించి వెడలుచు ఋతుస్నాతయైయున్న అంజనాదేవి చీర వాయువశమునఁ దొలుగ నవయువ సౌందర్యము వీక్షించి మోహించి తా హరించిన శివవీర్యమామె గర్భ

ముఁనఁబ్రివేశపెట్టెను. దాని నెఱిగి యామె శపింపఁబోవ అమృతము ద్రావిన సురల స్పర్శచే పాతివ్రత్యభంగము కాదని చెప్పి 'ఈశ్వ రాంశ సంభూతుఁడైన మహాపరాక్రమ వంతు డుద్భవించు' నని వెడలెను. ఆమెకుఁ గల్గినవాఁడే హనుమంతుఁడు. తల్లిమాటపై అతఁడు భాస్కరుని యొద్ద విద్యాభ్యాసమొనర్చి గురుదక్షిణ నడుగు మన వినయాది సద్గుణ ముల కానందించి త్రేతాయుగమున నీవు రాక్షససంహార సమయమున శ్రీరామునకు దోడ్పడ గలవని తెలిపి నా కుమారుఁడగు సుగ్రీవునకుఁ గూడ సహాయకారిగా వర్తించెదవని దీవించి పంపెను. అని సూతుఁడు శౌనకాది మహామునులకు హనుమంతుని వృత్తాంతముఁదెల్పెను.

<u>శ్రీ మద్భాగవతము :-</u> భాగవతమున నవమస్కంధమున శ్రీరామ చరి త్రము కలదు. అందుఁబోతన యనుప్రాసలతోఁ గుప్పిగంతులు వైచు చున్నట్లున్న హనుమంతునిఁబ్రివేశపెట్టెను.

[1] "ఇల మీఁద సీత వెదుకఁగ
నలఘుడు రాఘవుఁడు పనిచె హనుమంతు నతి
చ్చలవంతున్ మతిమంతున్,
బలవంతున్ శౌర్యవంతుఁబ్రాభవ వంతున్"

ఇందు రామకార్య ధురంధరునకు వలయు వల్లక్షణములన్నియు వివరింపఁ బడినవి. సముద్ర లంఘనము, సీతాదర్శనము, అక్షకుమారాదులవధ,లంకా దహనములు దెలుపఁబడెను. భాగవతమునఁ బట్టాభిషేక ఘట్టమున హను మంతుడుఁ శ్వేతచ్ఛత్రము బట్టినట్లు కలదు. ఇది ఇందలి విశేష విష యము. ఇది భాగవత మందలి హనుమద్దర్శనము.

<u>అగ్ని పురాణము :-</u> అగ్నిపురాణమున నగ్ని వసిష్ఠునకుఁ'బూర్వము నార దుఁడు వాల్మీకికిఁజెప్పిన రీతి' యనుచు రామావతార కథ చెప్పెను. అష్ట మాధ్యాయముగాఁజెప్పఁబడిన దీనియందు హనుమద్వృత్తాంతము కలదు. వాల్మీకి రామాయణమునందుఁగానవచ్చు హనుమత్కథయే యిందున్నను కిష్కింధాకాండ యందు సంపాతియే హనుమదాదులకు సీతలంకలో నశో

1. భాగ - 9-274

కవనమున నున్నట్లు చెప్పును. రామాయణమునన ట్లు చెప్పినరీతి కానరాదు. సంపాతి చెప్పియున్న నిఁక హనుమంతుఁడంతఃపురము లన్నిటిని వెదకునవసరము లేదు. మిగిలిన వృత్తాంతమంతయు సంక్షిప్తముగా వాల్మీకము నందలిదే కలదు. అట్లే శౌనకాదిమునులు అంజనాదేవి కుమారుఁడయిన ఆంజనేయుని ఈశ్వరుని కుమారుఁడని, వాయుసుతుఁడని చెప్పుటకు గారణమడుగ సూతుఁడు హనుమంతుని పుట్టుక గూర్చి చెప్పెను.

అగ్నిలో నీశ్వర వీర్యము పడు సమయమున నొక్క వీర్యకణము ను వాయువు గొంపోవుచు మార్గమునఁ గేసరి భార్యయు, ఋతుస్నాతయు ధౌత వస్త్రమును ధరించునదై యున్న నంజనాదేవిని జూచి మోహమంది కౌగిలించుకొని తన యందలి వీర్యము నామె గర్భమున నుంచెను. మహా పతివ్రతయగు నామె పరపురుష స్పర్శకు శపింపబోవఁదన విషయము జెప్పి పాతివ్రత్యమునకు భంగముకలుగదని, కారణాంతరమున శివవీర్యము నామె యందుంచితినని, ఆమెకు మహాబల పరాక్రమ వంతుఁడుఁద్రిలోక పూజ్యుఁడు సకల విద్యా పారంగతుఁడు బుట్టునని చెప్పి వెడలెను. అంజనాకేసరులు సంతసింపఁగొంతకాలమునకు ఆంజనేయుఁడు పుట్టి హనుమంతుఁడని పేరు పొంది సూర్యుని వలన సకలశాస్త్రములు, ఆయుర్వేదముతోడ నైదువేదములు నవవ్యాకరణములు నభ్యసించి సూర్యాజ్ఞఁ గిష్కింధానగర మేగి యాతని కుమారుఁడగు సుగ్రీవుని కడ మంత్రిగా నుండెను. సీతాన్వేషణ కాలమున రామునకు బంటుగా నుండి సీతావార్తఁ జెప్పి నూరు యోజనముల సముద్రము దాటి వారధిఁ గట్టించి శ్రీరామునిచే రావణ కుంభకర్ణ ఇంద్రజిదాదుల సంహరింపజేసి విభీషణుని లంకాపట్టణమునకు రాజును జేయించి యయోధ్యానగరమున సీతాలక్ష్మణభరతశత్రుఘ్న సమేతుఁడుగా శ్రీరామచంద్ర పరబ్రహ్మమూర్తి సామ్రాజ్య పట్టాభిషేకమునకుఁగారణభూతుఁడైన వాఁడాంజనేయుఁడు, అని యతఁడు చెప్పెను. ఈశ్వరుని వీర్యమున జనించుటచే నీశ్వరాంశసంభూతుఁడని, వాయుదేవుఁడు తీసికొని వెళ్ళుటచే వాయుసుతుఁడని పేళ్ళు వచ్చెనని సూతునిచే హనుమద్వృత్తాంతము చెప్పబడినది. ఇది అగ్నిపురాణమునఁగానవచ్చు హనుమత్కథ.

నారద పురాణము :- నారదీయ మహాపురాణమున హనుమత్సంబంధమగు మంత్రభాగము గలదు. పూర్వ ఖండమున 74, 75, 78, 79 అధ్యాయము లందా విషయములు విపులముగఁ జెప్పఁబడినవి. ఇవి నారద సనత్కుమార సంవాదరూపమునఁ జెప్పఁబడినవి. శృంఖలాబంధమోచక మహావ్యాధి నాశక మంత్రాదులు హనుమత్సంబంధమైనవి కలవు. ఇందు

1 "ధ్యాయే ద్రణే హనూమన్తం - సూర్యకోటి సమప్రభం
ధావన్తం రావణం జేతుం - దృష్ట్వా సత్వర ముత్థితం
లక్ష్మణం చ మహావీరం - పతితం రణభూతలే
గురుం చ క్రోధ ముత్పాద్య - గృహీత గురుపర్వతం
హాహాకారై స్సదర్పైశ్చ - కంపయన్తం జగత్త్రయం
ఆబ్రహ్మాండం సమావ్యాప్య - కృత్వా భీమం కళేబరమ్"
వంటి ధ్యానములు పెక్కు కాననగును.

భవిష్యత్పురాణము :- భవిష్యత్పురాణమునను రాక్షస జాతులు అనంతరమున నెత్తు జన్మలుఁజెప్పఁబడెను. పూర్వకాలీనులగుఁగుంభకర్ణాదులను, వారిని సంహరించిన రామాదుల గూర్చి చెప్పుచో శ్రీ మహావిష్ణువు దేవతల నాయారీతులఁ బుట్టుమనినట్లు చెప్పుచు నీశ్వరుని హనుమంతునిగాఁబుట్టుమనినటులఁజెప్పెను. అట్లే మహావిష్ణువు శ్రీరామునిగాఁబుట్టి హనుమంతుని వలన సీతావార్త నెఱుగుట, లంకావిజయము మున్నగునవియుఁ జెప్పఁబడెను.

లింగ పురాణము :- లింగ పురాణమునం దుత్తరభాగమునఁ బదుమూడవ యధ్యాయమునందు హనుమత్ప్రసక్తి వచ్చును.

2 "పవనాత్మా బుధై ర్దేవ ఈశాన ఇతి కీర్త్యతే
ఈశానస్య జగత్కర్తు ర్దేవస్య పరమాత్మనః
శివా దేవీ బుధై రుక్తా - పుత్రశ్చాస్య మనోజవః
చరా చరాణాం భూతానాం - సర్వేషాం సర్వకామదః"
అని వాయువు శివుని యష్టమూర్తులయందొకఁడై ఈశానునిగాఁ గీర్తింపబడునని అట్టి వాని పుత్రుఁడు మనోవేగముకల హనుమంతుఁడు చరాచర ప్రాణికోటి కంతకు అన్ని కోర్కెలు దీర్చువాఁడని చెప్పఁబడినది.

<u>స్కాంద పురాణము</u> :- ఇక స్కాందపురాణమునందు వైష్ణవఖండాంతర్గత మగు శ్రీ వేంకటాచల మాహాత్మ్యమున ముప్పదితొమ్మిదవ యధ్యాయమున నంజన పుత్రునికొఱకుఁ దపము చేసి పుత్రుఁ బడసిన గాధ గలదు. అందు తీర్థయాత్రలు సేవించుచు భరద్వాజాశ్రమముఁ జేరిన యర్జునునకు భరధ్వాజుఁడు వేంకటాచల మాహాత్మ్యాదులు చెప్పుచుఁ జెప్పును. పుత్రసంతానార్థియై తపస్సు చేయు నంజనతో మతంగుఁడు తపస్సునకుఁ గారణ మడిగెను. ఆమె "ఓ మహాముని! కేసరియను నా తండ్రి పుత్ర సంతానార్థియై శివునిఁ గూర్చి తప మొనర్చి పుత్రావకాశము లేమి, కుమార్తెగా నాఁబుట్టెక, నాకు లోకవిఖ్యాతుఁడగు పుత్రుఁడు కల్గు నవకాశము లేదనెను. తపస్సుఁ [illegible] వారికి శరణముగ [illegible]. పుత్రసంతానార్థియై సమస్తవ్రత [illegible] అయినను పుత్రుఁడు కలుగమి దుఃఖితనై తప మారంభించితిని. నాకు పుత్రుఁడు కల్గు నవకాశముఁ దెల్పు" మని యాచించెను.

అంత నా మతంగుఁడు పుత్రపౌత్రప్రదాయక మగు నావచన మాలకింపుము. ఇక్కడకు దక్షిణదిగ్భాగమున బ్రహ్మతీర్థమునకుఁ దూర్పు [illegible] యోజనముల దూరమున సువర్ణముఖరీనది. దానికి నుత్తర దిక్కున వృషభాచలము, దాని యగ్రభాగమున స్వామిపుష్కరిణి యను శుభప్రద మగు నదియుఁ గలవు. ఆ నదియందు స్నాన మాచరించి వరాహునకు నమస్కరించి వేంకటేశునకుఁ బ్రణమిల్లి పుష్కరిణికి నుత్తర దిగ్భాగమున ఫలవృక్షపూర్ణ మగు ప్రదేశమున నాకాశగంగ యను తీర్థము కలదు కాన దానియందు సంకల్ప విధి పూర్వకముగా స్నానము చేసి తీర్థమున కభిముఖముగా నుండి వాయుదేవుని గూర్చి తప మాచరింపుము. నీ తపఃప్రభావమున పుట్టు సుతుఁడు దేవ రాక్షస విప్ర మనుజుల వలనఁగాని వివిధాస్త్ర శస్త్రములవలనఁ గాని, జంతువుల వలనఁగాని పక్షులవలన గాని చంపఁబడడు" అనెను.

అట్లే యామె భర్తతో బయల్వెడలి వేంకటాచల మేగి మహర్షి వాక్యముల యథాతథముగా నాచరించి ఫల జలాహారముల జీవించుచు నాసాగ్రమున దృష్టి నిల్పి వేయివత్సరములు తపస్సు నాచరించెను

వాయుదేవుఁడు ప్రత్యక్షమై "సువ్రతా! భానుఁడు మేషసంక్రమణముఁ బొందగా, చిత్తానక్షత్రయుక్త పూర్ణిమా తిథియందు నీకోర్కెఁ దీర్చెదను ఇష్టము వచ్చిన వరము గోరుకొమ్మన నామె" నాకు పుత్రుని ప్రసాదింపు మని కోరెను. వాయువు. శుభానన! నీకు సుతుఁడవై కీర్తిమంతుఁడనగుదు నని వర మిచ్చి యచటనే యుండెను. అపుడు బ్రహ్మాది దేవతలు ఇంద్రాది లోకపాలురు, వసిష్ఠాది మహాత్ములు, సనకాది యోగులు వ్యాసాది విప్రేంద్రులు లక్ష్మీసమేతుఁడైన విష్ణువు, మునిపత్నులు, దేవపత్నులు, ఋషిపత్నులు భృత్య సుతాదులతోఁ దమ తమ వాహనముల నెక్కి తప మాచరించుచున్న యంజనాదేవిని చూచుటకు వచ్చిరి. ఈ సన్నివేశమునకు బ్రహ్మాదు లాశ్చర్యచకితులైరి." అని భరద్వాజుఁడు చెప్పినట్లు కలదు. ఇట్లు హనుమజ్జన్మకు మూలకారణ మంజనాపరముగ నీ స్కాందపురాణమునఁ జెప్పఁబడినది.

ఇందు బ్రహ్మఖండమున సేతుబంధకారణ సందర్భమున రామకథ సెప్పబడెను. అందు హనుమద్రామ ప్రథమసమావేశము, సేతుబంధనపర్యంత హనుమత్కథయుఁ గొలది సూచింపఁబడినవి. పంచదశోధ్యాయమున హనుమత్కుండ ప్రశంసయు ధర్మసఖ శతపుత్రావాప్తియుఁగలదు. రామేశ్వరమున బ్రహ్మకుండ స్నానానంతరము హనుమత్కుండమున కేగవలెను. రాక్షస వధానంతరము మరలి వచ్చునప్పుడు లోకోపకారార్థము హనుమంతుఁడు తనపేరున గంధమాదన పర్వతమున నొక యుత్తమ తీర్థము నేర్పరచెను. అట్టి తీర్థము న భూతో న భవిష్యతి అట్టి విశిష్టత నెఱిగిన రుద్రుఁడే స్వయముగా దానిని సేవించును. అట స్నాన మొనర్చినవారు మరణానంతరము శివలోక మందెదరు. ధర్మసఖుఁడను రాజపుత్రికుఁడు వ్రతము లెన్నియో యొనరించి సంతానమందజాలక హనుమత్కుండ వైభవము ఋత్విజుల నెఱిగి యట స్నానమాచరించి పుత్రేష్టి చేసి యా తీర్థమున నవభృథ స్నాతుఁడై ఏకాధికశత సంతానము గని వారికి విద్యా బుద్ధులఁ గఱపి రాజ్యము నప్పగించివార్ధక్యమున హనుమత్కుండ ప్రాంతమున కేతెంచి తప మాచరించుకొనెను.

అందే చతుశ్చత్వారింశో (44) ధ్యాయమున మునులచే దశగ్రీవ వధ దోష పరిహారముగా శివలింగ స్థాపనకుఁ జెప్పబడిన రాముఁడు హనుమంతుని శివలింగము దెచ్చుటకుఁ గైలాసమంపెను. అప్పటికి రెండు

ముహూర్తముల పుణ్యకాలము గలదు. వెంటనే హనుమంతుఁడు గంధ మాదనమునుండి బయలుదేరి ఆకాశమార్గమునఁ గైలాసపర్వతమును చేరెను గాని యట శివలింగము కానరాలేదు. కాన లింగముఁ బొందఁగోరి హనుమంతుఁడు ప్రాగగ్రములుగా దర్భలఁ బఱచి కూర్చొని యూర్ధ్వబాహుఁడు, నిరాలంబుఁడు, నిరుచ్ఛ్వాసుఁడు, జితేంద్రియుఁడు నై శివునిగూర్చి తపించి లింగ మందినవాఁడై వచ్చెను. ఇంతలో విప్రములు ముహూర్తము సమీపించిన దనుటతో సీతతోఁ జేయఁబడిన సైకతలింగమును జ్యేష్ఠశుద్ధ దశమి హస్తానక్షత్రయుక్త బుధవాసరమున వ్యతీపాత యోగమున, కన్యారాశిలోఁ జంద్రుఁడుండగా వృషభమున రవి యుండగాఁ బ్రతిష్ఠించెను

ఇంతలో హనుమంతుఁడు వచ్చి వృథాకృత పరిశ్రమకు ఖిన్నుఁడై "రామా! నాజన్మ వ్యర్థము. నీచే నిట్లవమానింప బడితిని. నావంటి వాని నేతల్లి యుఁగసరాదు. నే నింతటి దుఃఖమును యుద్ధమునందుఁగాని మఱియే నీ కార్యమునఁ గాని పొందలేదు. నీచే నవమానితుఁడనై అనంత దుఃఖము ననుభవించుచున్నాను. కపు లందఱిలోఁ గైలాసమున కేగ నే నాజ్ఞాపింపఁ బడితిని. అట లింగము లేక తపస్సుచే సాధించి తీసికొని వచ్చితని. ఇంతలో మీ రిట్లు ప్రతిష్ఠించి పూజ సల్పుచుంటిరి. ఇక నా యీ దేహధారము వ్యర్థము. నీచే నవమానితుఁడ నగు నా కిక దేహత్యాగముతప్ప చేయగలది లేదు." అని క్రోధ శోకాకులుఁడై భూమిపైఁ బడి దండప్రణామ మాచరించెను.

రాముఁడు 'హనుమంతా! నీ తాత్త్వికజ్ఞానము వీడి ఇట్లు పరితపించుట భావ్యమా! జీవి స్థితిగతు లెట్టివో గ్రహింపవేమి యనుచు నీవు చేసిన కర్మ నేను చేసినట్లే ముహూర్తాతిక్రమణముచే నిట్లు ప్రతిష్ఠించినందుకు దుఃఖింపక యీ శుభదినముననే కైలాసమునుండి తెచ్చిన లింగముఁ బ్రతిష్ఠింపుము. నీ పేరుతో యీ లింగము ముల్లోకములఁ గీర్తింపఁ బడును. హనుమదీశ్వరుని చూచియే రామేశ్వరుని సందర్శింపఁవలెను. బ్రహ్మరాక్షసయూథము నీచేతను సంహరింపఁబడెఁ గాన నీ ప్రతిష్ఠచే నా పాప విముక్తి యేర్పడును. లేదా ఈ సీతచే చేయబడిన సైకతలింగముఁ దీయుము. అప్పుడు నీవు దెచ్చిన దానిని ప్రతిష్ఠింతు ననగా హనుమంతుఁడు సైకతలింగమును బెరికి కైలాసలింగముఁ బ్రతిష్ఠింతు నని తన

ముఁడు హనుమంతునితో ధర్మారణ్యవాసులగు బ్రాహ్మణులగలిఁ జూడ మనెను. పనుమంతుఁడు వృద్ధబ్రాహ్మణవేషము పూని ధర్మారణ్యవాసులగు బ్రాహ్మణుల కడకువచ్చి 'ఇంతటి భయంకరమగు నడవివెంట నెటు వెళ్ళుచున్నా'రన వారు మహారాజు వలన నేర్పడిన బాధనుచెప్పి రామదర్శనము బొందగోరి హనుమంతుని యాశ్రయింప రామేశ్వరప్రాంతమునకు గంధమాదనమునకుఁ బోవుచున్నామనిరి. అంతనాతఁడు 'వారిని దర్శింపఁగోరి భయంకరమగు నడవులబడితిరి. ఆ రాముఁడెక్కడ? ఆ హనుమంతుఁడెక్కడ? వారియత్నము వీడి సుఖముండుఁ'డనెను. వారు వినక హనుమద్దర్శనము కొఱకుఁ దమనిశ్చయము బల్కిరి. అంత వీడి వారల మరునాఁడు మారువేషమున వచ్చియట్లు ప్రశ్నింపసురల తమ నిశ్చయముఁ దెల్పుచు ''హనుమంతుఁడు మాకవకాశమీయకున్నను ఉపవాసదీక్షతో బ్రాణములనైనఁ ద్యజింతు'మని నిశ్చయముఁ జెప్పి' నీవు మాయెడఁ బ్రత్యేకముగాఁ బ్రశ్నించుఁ గారణమేమి? మాయందలి వాత్సల్యమున మీ యథార్థముఁ దెల్పుడన హనుమంతుఁడు ''ఓ విప్రులారా! కలియుగము ప్రాప్తింపనిక మీకు రామదర్శనమెట్లగును? హనుమద్దర్శనమెట్లగును? క్రూరజంతు సంకులమగు నీయటవిఁ దిరుగుటమాని సుఖముండు'డనగా వారు ''నీవింత మాయెడ శ్రద్ధఁజూపుచుంటివి. నీవే మముద్ధరింప వచ్చిన రాముఁడవో హనుమంతుఁడవోయన హనుమంతుఁడు నిజరూపముఁ జూపి రామేశ్వర సేతులంతలఁ జూపి మీభక్తికి మెచ్చితిని వరము కోరుకొం'డనెను.

అంతవారు బహుధా హనుమంతుని స్తోత్రము పేసిరి. వారిని వరము కోరుఁడన ''లంకలోఁ జూపిన రూపముఁ జూపఁగోరి నీవు మాయెడఁ బ్రసన్నుఁడవైన యెడల దుర్మార్గుఁడగుఁ గుమారుపాలుని సంహరింపుము లేదా ఏదయినా చిహ్నమును చూడగనే పుణ్యాత్ముఁడై వేదధర్మముల లోకముఁ బ్రాపించురీతి శక్తికలదాని నిమ్మనిరి. అంత హనుమంతుఁడు ఈ కలియుగమున నా దర్శనము సేయ నసాధ్యము. అయినను వస్త్రము మాటున రూపముఁజూపుదునని మహాకాయమున మహారూపమును జూపెను. వారానందించ 'నీపండ్లు భక్షింపుడు. మీ కెనలేని తృప్తికల్గును. ధర్మారణ్యము లేకున్నను మీ క్షుధ శమించు'వని యిచ్చెను.

ఓ విప్రులారా! కలియుగమున రామేశ్వరము వీడి యెచ్చటకు రాను. కాన నీ చిహ్నముఁ గొంపొండని బాహుకేశము లిడి వీటిని స్వీకరింపగనే ఆ రాజు సన్మార్గమందును. అట్లు స్వీకరింపకున్న వానిద్వార దేశమునఁబడపై చిన వాఁడు సకళ్త్రపుత్రమిత్రముగా దహింపబడి సర్వనాశనమగుననగా వారు మిక్కిలి సంతసించిరి ఆ రాత్రి యట నొకశిలా తలమున నిద్రపొండని, తానురక్షణ నుందునని వరుండనిచ్చి తనతండ్రి నిప్రార్థించి యాశిలనొక్కమాటు ధర్మారణ్యమునఁ బడునట్లుచేయ నారు మాసములు పయనింపదగిన దూరము మూఁడు ముహూర్తములలోఁ జేరి అనంతరము మెలకువఁ గని హనుమదనుగ్రహమున కచ్చెరువంది పునః పునః నమస్కరించుకొనిరి. ఇట్లు హనుమద్రక్షితులగు ధర్మారణ్యవాసులఁ గూర్చి స్కాంధ పురాణమున చెప్పఁబడెను.

అట్లు అవంతిఖండమునఁ ద్రయోవింశోఽధ్యాయమున(౨౩)హనుమత్కేశ్వర మాహాత్మ్యము వర్ణింపబడినది. ఒకప్పుడు రాముని సభయందు హనుమంతుఁడు శివుడు ననువారిలో నెవ్వ రధికులని అగస్త్యుడు ప్రశ్నించెను. రాముఁడు 'శివుఁడెంతటి శక్తిపూర్ణుఁడో యుద్ధమున హనుమంతుఁడంతటి పరాక్రమ వంతుఁ'డనెను. అట్టి శివౌపమ్యమునకు సంతసించిన హనుమంతుఁడు లంకకేగి విభీషణువలని నొకశివలింగము గోరెను. ఆతఁడు వలయునది గొంపొమ్మని యారులింగములఁజూప నొక్కస్ఫటికప్రభల నొప్పులింగమును వలయునని చూపెను. అది కుబేరునినుండి సంప్రాప్తమైనదని దాని విశిష్టతఁజెప్పి యీయఁ గొంపోవుచు నవంతీపురముజేరి రుద్ర సరస్తీరముననుంచి స్నానమాచరించి కొనిపోవ యత్నింప నందలి శివుఁ డాతాపుననే లింగమునుంచి పూజింపుమని, అది హనుమత్కేశ్వర నామమున విఖ్యాతమై భక్తుల సర్వాభీష్టములఁ దీర్పఁ జాలునదగునని చెప్పెను.

అట్టి హనుమత్కేశ్వర మాహాత్మ్యమె మరల ఏకోనాశీతితమోధ్యాయ (79) మునఁ జెప్పఁబడెను. అందుశివుఁడు పార్వతికిఁ జెప్పుచు నొకప్పుడు అగస్త్యాదిమునులు శ్రీరామునభినందింప వచ్చినవారై రామునిచే సత్కరింపబడి ప్రశంసించి విశేషముగా హనుమత్కృత్యముల జెప్పుచుఁబొగడ జొచ్చిరి. అంత రాముఁడు లక్ష్మణుని వీడి హనుమంతునే యంతగా నేల ప్రశంసించుచుండిరన వాడు అసాధారణములగునాతని కార్యపై పుణ్యమఁ జెప్ప రాముఁడు వల్లెయని యాతని వలననే తనకు సీత, లక్ష్మణుడు దక్కె

ననెను. మునులిట్లగు సత్యమనుచు ''హనుమత్సమ గతి మతులు గలవార
లేరు. శాపకారణమున నాతని శక్తి నెఱుఁగడు. బాల్యమున నాతని కృతరు
ములు వర్ణింప శక్యముగావు. వినగోరినవినుము. పుట్టుకతోనే బాలార్కుని
వలె నుండెను. బాలార్కుఁబట్ట నంబరమెగసెను. ఇంద్రుఁడెదిరిగి వజ్రా
యుధమునఁ బడఁగొట్ట హనువు దెబ్బతిని హనుమంతుఁడయ్యెను. అట్టి
మృతకల్పుఁడగు సుతునిఁ గొని వాయువు మహాకాలవనముఁ జొచ్చి పుత్రా
ర్థమాశివలింగము నారాధించెను. తత్స్పర్శనే హనుమంతుఁడు స్వస్థుఁడు
కాగా వాయువు సంతసించి దీనిస్పర్శవలననే నా పుత్రుడు లేచెను. కాన
నిది హనుమత్కేశ్వర నామమున విఖ్యాతమగు ననెను. ఇంతలో దేవేం
ద్రాదులెల్లరు వచ్చి బహువరము లొసఁగిరి. [illegible] ''రావణవధానం
తరము విభీషణునడిగి సన్మానించెద [illegible] ప్రతిష్ఠించు
ననెను. ఇట్లు హనుమత్కేశ్వరుని ప్రభావము బహువిధముల స్కాందము
మునులు చెప్పిరి.

రేవాఖండమున త్ర్యశీతితమోఽధ్యాయము (౮౩) నందు హను
మంతేశ్వర తీర్థమాహాత్మ్యము వర్ణింపఁబడినది. ఈ విషయము ధర్మజు
నకు మార్కండేయుఁడు చెప్పెను. రేవాతట మందలి యీలింగ మాహా
త్మ్యమున బ్రహ్మహత్యాపాతకము తొలగు ననుచు నాగాథ జెప్పెను.
శ్రీరామచంద్రునిచే రావణుఁడు సంహరింపఁబడిన యనంతరము అయోధ్య
సేరగా హనుమంతుఁడు మహేశు నర్చింపఁ గైలాసమున కేగెను. అట నం
దీశ్వరుడు హనుమంతునితోఁనాగు ‘మాగుము, నీకు బ్రహ్మహత్యాపాత
కము గలదుకాన భైరవసభఁ జూడఁ దగ’దనెను. అంత హరు నడిగి పాత
కహరమగు నుపాయముఁ జెప్పుమన నంది ''నీవు రుద్రదేహోద్భవయగు
నర్మదను గూర్చి వినలేదా? ఆనదీతీరమునఁ దపమాచరింపుమని చెప్పెను.
అట్లే హనుమంతుఁడు ఘోరతపమాచరింప నాశివుఁడు ప్రత్యక్షమై నీచేఁ
గష్టతరమగు తప మాచరింపఁబడినది. నీవు స్వామికార్య రతుఁడవై నం
దున నాదర్శనము వలన నీవు రావణసంక్షయమున పాపమొనర్పనివాఁడ
వైతివి.’ ‘అనగా హనుమంతుఁడు శివునకు సాష్టాంగ నమస్కార మాచ
రింప వరముఁ గోరుమనెను. అంత నాతఁడు ‘బ్రహ్మరక్షోవధవలని పాప
ముసుఁబోగొట్టు’మనఁ బుత్రా! నర్మదాతీర్థ మాహాత్మ్యమున, ధర్మయోగ
ప్రభావమున నాసందర్శనము వలనను నీవునిష్పాపుఁడవైతివి మఱియు
లోకానుగ్రహకాంక్షతో నీనామమునఁ బ్రసాదించుచున్నాము.’ అని

సందర్శన మీకాండమునందే మనకు లభించును. ఇట్టి మహాద్రూప మి వాల్మీకమున రెండురీతులఁ జూడఁగలము. సీతకు ధైర్యముఁ జెప్పుచుఁ దా నంసదేశమున నెక్కించుకొని రామునిచెంతకు జేర్చుదు నని మారుతి చెప్పెను. అంతదూరము న న్నెట్లు మోయగల వని ప్రశ్నించిన సందర్భమున [1] 'దర్శయామాస వైదేహ్యాః స్వరూప మరిమర్దనః' అని అరిమర్దనుఁడగు హనుమంతుఁడు తన విశ్వరూపముఁ జూపినట్లు కలదు.

మరో విశ్వరూపము కామరూపధారియగుట వివిధ రూపముల నాయా సమయములఁ జూపుచు నన్నిటఁ దానై విశ్వరూపము నీ సమగ్ర కాండయందుఁ బ్రదర్శించుట. సర్వము తానె యైనటుల హనుమంతుఁడు వాల్మీకిచే నీయారీతుల వర్ణింపఁబడెను. ఉపమింపబడెను. ఆఁబోతు (1-2)కొదమసింగమురీతి(1-4)మదగజము(1-7)పర్వమున పొంగు సముద్రము(1-10)మేఘము (1-32) గరుత్మంతుడు (1-44) పర్వతము (1-49) ముప్పదియోజనములపొడవు, పదియోజనములవెడల్పురూపము (1-76) రెక్కలుగలకొండ (1-78) పక్షిరాజు (1-80) చంద్రుఁడు (1-88 అతిధి (1-131) అంగుష్ఠమాత్రశరీరము (1-158) అతిచిన్నరూపము (1-183) చిన్న పిల్లికూన (2-43) అల్పవానరం (14-2) ప్రచండవాయువు (41-14)భయంకరవీరమూర్తి (43-49)పర్వతమువలె పెద్దరూపము (52-41) ఇట్లు అగ్నిహోత్రుడు, మెరపులతోడి మేఘము, వాయువు, రుద్రుడు, ఇంద్రయమాది సర్వ చరాచర సృష్టియందలి రూపములఁ దనయందుఁ జూపిన సర్వము తానెయైనవాఁడయినది రెండవ విశ్వరూపము. ఇట్లు హనుమంతుని సుందరతర దర్శన మీ సుందరకాండయం దగును. ప్రయోజనాకాంక్షవలనను నీకాండ ఇష్టతరము, సుందరతరముగఁ దోచును.

[2] "ఏత త్సుందరకాండేన - సమో మంత్రో న విద్యతే
బీజకాండ మితి ప్రోక్తం - సర్వరామాయణే ష్వపి
పశుపుత్రప్రదం పౌత్ర- వృద్ధిదం కల్మషాపహం
ధనాయుష్య బలారోగ్య - దాయకం పుణ్యవర్ధనం"

అని పెక్కురీతుల నగస్త్యసంహితయందలి సుందరకాండ ఫలనిరూపణము.

---

1. వా. రా. సుం. 37 - 36
2. అగస్త్య సంహిత - అధ్యాయము 5

‘‘యథాశక్తి పరిత్యా తు - యావజ్జీవం నరోత్తమః
ఐహికం తు సుఖం ప్రాప్య - మోక్ష మియా త్పరత్ర చ’’

అని యమసంహితయు నిహపర సాధకముగా సుందరకాండను గూర్చి పలురీతులఁ జెప్పుచున్నవి. సుందరకాండయందు సర్వశక్తిసమన్వితుడు బ్రహ్మచర్యనిష్ఠాగరిష్ఠుఁడు, ఆదర్శమూర్తి యగు హనుమంతుఁడు నాయకుఁ డగుట యందలి విశేషము. మానవ జీవితోపయోగకర మగు నాదర్శముతోఁబా టిందు ముచ్చటయగు మూఁడు నీతులు బోధింపబడెను. ఇవి మూఁడు హనుమంతుఁ డుపదేశించును. సుందరకాండయందు హనుమంతుడు ఆచార్యవర్యుఁడు కాగా నీమూఁడు జనులకై హనుమదాచార్యోపదేశములు. అందు సీతజాడ గుర్తింపలేక ఆత్మత్యాగమునకు సిద్ధమై వివేచనతో [1] ‘వినాశే బహవో దోషాః - జీవన్ భద్రాణి పశ్యతి’ ఆత్మహత్యయం దనేకదోషములు కలవు. బ్రతికియుండిన శుభములు పొందవచ్చును అనుకొనును. ఇది తొలి యుపదేశము. నిత్యజీవిత కష్టనష్టముల భరింపరాని స్థితులందలి కష్టజీవులు, విరక్తజీవులు నగువా రొంటబట్టింపదగి నిది యమృతవాక్కు.

ఇట్టి సమాలోచనమున నెట్లో జీవించినను పరిస్థితులందు సమాధాన పడుట కష్టము. అట్టి కష్టస్థితియందు మున్న సీతఁ గని మారుతి

[2] ‘‘మాన్యా గురు వినీతస్య - లక్ష్మణస్య గురు ప్రియా
యది సీతాపి దుఃఖార్తా - కాలో హి దురతిక్రమః’’

రామునంతవానికి, ప్రియురాలై లక్ష్మణునంతవానికి పూజనీయురాలైన సీతయే దుఃఖముచే పీడింపబడుటన కాలము మీఱరానిది కదా! యనుకొనుట రెండవది. కావున నెట్టివారికి కష్టము తప్పదని, అది సహింపదగినదని సమాధానపడుట కిది యోగ్యమార్గము.

లంకాదహనానంతరము సీతకూడ యందుఁ దగులబడియుండు నని భయపడి తన మొదలెఱుఁగని కోపమును నిందించుచు [3] ‘నాకార్య మస్తి క్రుద్ధస్య నావాచ్యం విద్యతే క్వచిత్’ కోపిష్ఠికి మాటలాడరానిది, చేయ

---

1. వా. రా. సుం. 13-47
2. వా. రా. సుం. 16-3
3. వా. రా. సుం. 55-6

రానిది ఏదియు లేదు. ఏమయిన చేయును. కావున కోపము నణచి శాంతము బొందువాఁడే పురుషుఁడనును. ఇది మూడవ యుపదేశము.

ఇట్లే నిత్యజీవితమున జనసామాన్యుల కుపకరించు నీతిబోధకవిధు లిం దెన్నియో నుండి విశిష్టత నిడుచున్నవి. యోగుల కిది యోగశాస్త్ర ముగ, శాక్తేయులకు శక్తిప్రతిపాదక గ్రంథముగ, భక్తులకు భక్తిపూర్ణ ముగ సుందరకాండ తోచును. 'షోడశి రామాయణ రహస్యము' నందు సుందరకాండ కుండలినీయోగముగనే నిరూపింపఁబడినది. ఇట్లసామాన్య మగు శక్తియుక్తులతో నలరారు సుందరకాండను రామాయణకర్తలు తమతమ ప్రజ్ఞానుసారముగ నాంధ్రకవిత్వవేదికపైకిఁ గొనివచ్చిరి. ఆంధ్రరామాయణాంతర్గత సుందరకాండ లట్లుండ నీసుందరకాండ మితి వృత్తముగా గొని తెనుఁగున పద్య, గద్య, గేయ, నాటకాది కావ్య ములు లెక్కకు మిక్కిలిగ వెలయుటనే దాని విశిష్టత గ్రహింపగలము.

దివాకర్ల వేంకటావధాని – సుందర సందేశము; యమ్. యస్. రామారావు – సుందరకాండము; సూరంపూడి రాధాకృష్ణమూర్తి–సుందర కాండము; శాంతిశ్రీ – సుందరకాండము; వంటి గేయకృతులు ప్రచార మందియున్నవి. నాటకములలో నొక్కలంకాదహనమునే 1. కాశీనాధుని వీరమల్లయ్య 2. ద్రోణంరాజు సీతారామయ్య 3. గన్నవరపు లక్ష్మీనారా యణ 4. కోలాచలం శ్రీనివాసరావు 5. అవసరాల శేషగిరిరావు 6. చక్రావ ధానుల మాణిక్యమ్మ 7. పసుమర్తి యజ్ఞనారాయణశర్మ వంటివా రనే కులు రచించిరి. మల్లాది అచ్యుతరామశాస్త్రి – రామదూత; గోపాలకృష్ణా రావు – లంకాపతనము; కె. సూర్యనారాయణ – అన్వేషణ; పేర్లతో నాట కముల రచించిరి.

వచనరూపమున తుపాకుల అనంతభూపాలుడు–రామాయణసుందర కాండము; అవ్వారి సుబ్రహ్మణ్యశర్మ – శ్రీహనుమద్విజయము; రాచర్ల కృష్ణమూర్తి – సుందరకాండ; నామధేయముల రచించిరి. పోలుమంచి బసవన; పాతూరి తిరుమలయ్య – హనుమద్విజయమును పేర ద్విపదగా రచించిరి. వాడేల వేంకట శేషగిరిరావు – శ్రీ సీతాన్వేషణ; జనమంచి శేషాద్రిశర్మ – హనుమద్విజయము; దివాకర్ల వేంకటావధాని – శ్రీమధు వనము; వంటి విదే ఇతివృత్తమున వెలసిన పద్యకావ్యములు. పింది

పోశ్రీలు లక్ష్మణకవి యీ వస్తువున 'లంకావిజయ' మను ద్వ్యర్థికావ్యము
రచించెను. బొమ్మరాజు వెంకటసుబ్బయ్య సముద్రోల్లంఘనము సంభా
షణారూపమగు రచనము.

రామాయణ మాదికావ్యము. హనుమత్సందేశ మాదిసందేశము.
ఈ మార్గమున ననేక సందేశకావ్యములు వెలసినవి.

ఇంతటి సుప్రసిద్ధ కథావస్తువును ఆంధ్రరామాయణకర్తలు తమ
తమ రామాయణాంతర్గత సుందరకాండముల నిరూపించిన రీతి పరిశీ
లింపఁదగినది. వాల్మీకి రామాయణము ననుసరించిన యాంధ్రరామాయ
ణములు మిక్కిలిగా నున్నవి. వాని నన్నిటిని వివరించుట ప్రస్తుత వ్యాస
మున కనుపాదేయము. సుప్రతిష్ఠితములై ప్రత్యేకత సంతరించుకొన్న
వాని రీతిఁ బరిశీలించుట యుపాదేయము. ఈ విధానమున నవసరమగు
నాంధ్ర రామాయణాంతర్గత సుందరకాండానుశీలనము జరిగినది.
సుందరకాండయందు, దాని నాయకుఁడగు హనుమంతుని యందు
నొక్కొక్క తెనుఁగుకవి యొక్కొక్క ప్రత్యేకదృష్టి నుంచి వివేచించి
వ్రాసినట్లు కన్పట్టును. అట్టిచో నొకదానితో నొకటి పోల్చుటకన్న
నెవ్వరిదృష్టి వారిదిగ నిరూపించుచుఁ గావ్యవిశేషములు, వ్యాసోద్దిష్టుఁ
డగు హనుమంతుని రీతియుఁ బరిశీలించుట సముచితము. ఆరీతిగనే
ఆయాకవుల విశిష్టతను సమగ్రముగ నిరూపించుటకు, గురుతించుటకు
సాధ్య మగును. కావునఁ గాలక్రమమున నాయాకవుల రచనల యను
శీలన మిందుఁ గావింపఁ బడినది.

సుందరకాండయందు సముద్రోల్లంఘన మైనాక సురసోదంతములు
సింహికా లంకా విజయములు, సీతాన్వేషణము, సీతాదర్శన భాషణములు
అంగుళీయక ప్రదాన చూడామణి గ్రహణములు, అశోకవన ధ్వంసము,
జంబుమాలి, మంత్రిపుత్ర, అక్షాది హననము, లంకాదహనము, తిరోగమ
నము, వానరమేళనము, రామభాషణము లిందలి ప్రధాన ఘట్టములు.

## రంగనాథ రామాయణము — సుందరకాండ

ఆంధ్ర వాఙ్మయమునఁ గల రామాయణములలో మొదటిది రంగ
నాథరామాయణము. ఇది దేశిసాహిత్యమగు ద్విపదలో రచింపఁబడినది.

పండితపామర జనాదరణపాత్రము కాగలందుకు దీనిని దేశీయ ఛందమగు ద్విపదయందు రచించినట్లు గ్రహింపవచ్చును. జనశ్రుతిలో నుండు కథలను గూడ స్వీకరించి ప్రబంధోచితరీతిని సంపూర్ణముగ రచింపబడిన దగుటవలన నీ రామాయణము సర్వజనామోద యోగ్యమై విశేషప్రచారమందినది. పామరజనులు, తోలుబొమ్మలవాండ్రు సైత మీ రామాయణమును పాడుకొనుచుఁ బ్రచారము గావించిరి. ఈ రామాయణకర్త కోన బుద్ధారెడ్డి. కాలము క్రీ. శ. 1240 ప్రాంతము.

రంగనాథరామాయణమున సుందరకాండగాథ హనుమంతుఁడు సముద్రమును దాటివచ్చినపిదప ఆరంభ మగును. లంకయందుఁ బ్రవేశించిన హనుమంతుఁడు [1] "పగటున నీపుడిఁ బగలం జొచ్చితిని పగ లౌను రాక్షసభటులకు నాకు" అని యాలోచించెను. ఇందు మారుతి యాలోచనాశక్తితోబాటు కవి తన శబ్దచిత్రముఁ బ్రకటించుకొనెను హనుమంతుఁడు తన యన్వేషణమునఁ జెలునున్న గరుడోరగామర గంధర్వ సిద్ధసతులఁ గాంచెను. పరిస్థితికి వగచి [2] "పెఱవకుం డిటమీఁద విను రాముఁడింక నెఱి రావణుని వాఱి నిర్జించి ముమ్ము విడిపించు నందఱు వెఱువకుం" డని ధైర్యము చెప్పెను. ఇది మూలమున లేని విషయము. ఇందు హనుమంతుని దయాగుణమును కవి వ్యక్తము గావించెను. సీతకై లంకానగర మంత న దర్శించి యామె కానరామి నిర్వేద మనుభవించినట్లు కలదు. కానీ రంగనాథరామాయణమున నశోకవనము చూచి యందు ప్రవేశించి యటఁ గొంత పరిశీలించిన పిదప విషాదమును బహుధా ప్రకటించెను.

అవసరమగు పట్టున బుద్ధారెడ్డి యలంకారమాత్రము గాక యలంకార పరంపర రచించును. పాల్కురికి సోమనాథుని ద్విపదలయం దిట్టి రీతిఁ గాంచఁగలము శింశుపావృక్షము క్రిందనున్న సీతను రంగనాథ రామాయణకర్త

[3] "ఇనరశ్మి వాసిన యొలపిగెఁబోలె - ఘనధూమయుత దీపకళికయుఁబోలె; జలదమాలికలోని శశికళ పోలె-బలుమంచుఁ బొదివిన పద్మినిపోలెఁ

1. రం. రా. సుం. 28
2. రం. రా. సుం. 148
3. రం. రా. సుం. 213

జెలఁగి పిల్లులలోని చిలుకయుఁ బోలెఁబులులలో నాఁటను బొలెనని యుప మాలంకార పరంపరఁ జెప్పెను. ఇది వాల్మీకి చెప్పని వర్ణనారీతి యగుటయు విశేషము. ఇట్లు బుద్ధారెడ్డి వర్ణనాస్వతంత్రత పహించుట కన్పట్టును. [1] ''నిఖిల సన్నుత పూత నిర్మలఖ్యాత-యఖిల గుణోపేత యయిన యాసీత' యనుటలో నంత్యానుప్రాసము; [2] 'ఇంక పెక్కడి రాముఁ డింక దెటువచ్చు; వచ్చి లంకాపుర వర మెట్లు చొచ్చు - జొచ్చిన నెట్ఫంగి నుగ్రక్కర మెదురు; సెదిరినస్ బొడఁగని యెట్భంగిఁ గదియు' ననుపెడ ముక్తపదగ్రస్తము బుద్ధారెడ్డి శబ్దాలంకార రచనాసామర్థ్యము నుగ్గడింపుచున్నది.

హనుమంతుఁడు శింశుపావృక్షము పెక్కి బాలుఁడై యుల పట పత్రింబున లీలఁ గ్రీడించు విష్ణుండుబోలె నుండె ననుట మనోజ్ఞమగు నౌపమ్యము. హనుమంతునిచేఁ దన జన్మవృత్తాంత మిట

[3] ''వనజాక్షి వాయుదేవత వరంబునను
ఘనుఁడు కేసరి యను కపికులాగ్రణికి
ననుఁ బుత్రుగా నంజనాదేవి గనియె
హనుమంతుఁ డనుపేర నమరినవాఁడ
వసుధ సుగ్రీవుఁడ న్వానరేంద్రునకు
నసమానమతి మంత్రిపై మెలంగుదును'' అని చెప్పబడెను. అట్టి మారుతిని సీత రాఘవకార్యధుర్యునిగ, ఉపకారనిరతునిగ లోకోన్నతచరితునిగఁ గొనియాడెను. రాముముద్రిక నిడిన హనుమంతుఁడు రామునకు విశ్వాసముగల్గ నానవా లిమ్మన జానకి [4] ''ఏను నీ నిజరూప మేర్పడఁ జూచి కాని నా తలమానికము నీకు నీను'' అని యన్నటుల నిందుఁ గలదు. ఈరీతిని మొల్ల యనుకరించుచూ

[5] ''నీ నిజరూపముఁ జూడక
నే నారత్నంబు నమ్మి నీ కీయఁ జుమీ'' అని చెప్పించెను సీతవద్ద

---

1. రం. రా. సుం 219
2. రం. రా. సుం. 289
3. రం. రా. సుం. 477
4. రం. రా. సుం. 590
5. మొ. రా. సుం. 105

సెలవు గొనుచు హనుమంతుఁడు తనరాక రావణున కెఱిఁగింప నిశ్చయించెను. అప్పు డామెతో

[1] ''తల్లి నే నాఁకొంటిఁ దినఁగ నెనయు
నెల్లఫలములు నేను గైకొందు'' నని యనుమతి వడసి వనభంగమునకుఁ బూనుకొనినట్లు బుద్ధారెడ్డి చెప్పెను. ఇది వాల్మీకిరామాయణమున లేదు. అధ్యాత్మరామాయణమున నీరీతి కన్పట్టును. [2] ''రామాయణ''సారోద్ధార మీరీతి స్వీకరించెను. దీని మూల మానందరామాయణముగఁ జెప్పెను.

హనుమంతుఁ డొకొన్న సంఘటనలు రెండును చరిత్ర సృష్టించినవి. పుట్టుకఁ దొలిరోజులనే యాకొని ఫలభ్రాంతిచే సూర్యుఁ బట్టబోయి సంక్షోభము సృష్టించుట యొకటి కాగా రక్కసిమూకఁ జెండి యక్షాంతకుఁ డగుటకుఁ గారణమైన దీ రెండవది. రావణసుతుని నామ మన్నిట యక్షుఁడని యుండ నిం దక్షయుఁడని కలదు. హనుమదింద్రజిత్తుల యుద్ధమున నింద్రజిత్తు

[3] ''హనుమంతు కడిమికి నచ్చెరువంది
వినుతోగ్ర బలవాయు వీర్యాస్త్రమేయ
వాయుపుత్రుఁడు గాన వానరాధీశుఁ
డా యస్త్రమున దూల కచలుఁడై యున్న
నరుదైన రౌద్రాస్త్ర మతనిపై నేయఁ
బెరిగి యాతఁడు రుద్రబీజంబు గానఁ''

గదలక నిలిచినట్లు రంగనాథరామాయణకర్త విశేషముగఁ జెప్పెను. ఈ రంగనాథుని కల్పనమునుగూడ మొల్ల యనుకరించెను. ఇట్లే హనుమంతుని వాలమునకు నిప్పంటించిన సందర్భమున పావని బ్రహ్మమంత్రములుచ్చరింప బ్రహ్మపాశము లూడినట్లు, తుదకు సముద్రజలములో క్రుంకి యగ్నిసూక్తము జపించినటుల కలదు ఈ యమూలక భావములను గూడ మొల్ల స్వీకరించెను. లంకాదహన మైనపిదప వెడలిపోవుచో

1. రం. రా. సుం. 602
2. రా. సారో. సుం. పుట 114
3. రం. రా. సుం. 819

హనుమ పశ్చిమద్వారంబున వెడలుచు తలుపులు బడఁదన్నుట, యవి కూలుటలు చెప్పెను. కపుల మధువనవిహారము గూర్చి విన్నతరి లక్ష్మణుఁడు [1] 'అతత బలసత్త్వులగు వారిచేత - సీతాపతిపను ల్సిద్ధింప నోపు' నవెను. ఇట నా విజయశంక సుగ్రీవుఁకు గావించినటుల మూల మున గలదు.

ఇట్లు కొలఁదికొలఁది మార్పులతో వాల్మీకిరామాయణమును జనసామాన్య ప్రయోజనము నాసించి కోన బుద్ధారెడ్డి రంగనాథరామాయణమున సుందరకాండను రచించెను. ద్విపదల రచనఁ గావించిన శివకవులు పొందని యున్నతస్థానమును ఈ రామాయణరచనద్వారా బుద్ధారెడ్డి పొందెను. మతప్రయోజనమును కాక సారస్వతప్రయోజనమునే ఆశించుట కారణ మీ రంగనాథరామాయణమునకు నన్యములగు రామాయణములఁ బ్రత్యేకస్థానము సమకూర్చిన దని యూహింపవచ్చును.

## రామాభ్యుదయము - సుందరకాండ

రామాభ్యుదయకర్త అయ్యలరాజు రామభద్రకవి. షట్కాండల రామకథ నితఁడు ప్రబంధరచనానుకూలముగా మలచుకొని ఎనిమిది యాశ్వాసముల ప్రబంధముగా రచించెను. కాండల ననుసరించి యాశ్వాసముల నిబంధించని కారణమున సుందరకాండము షష్ఠ సప్తమాశ్వాసములు రెండిట నడచెను. అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయ పీఠికయందు హనుమత్ప్రార్థనముఁ గావించెను. అది ప్రశస్తమైన

[2] "లంకారిన్ జలరాశిలంఘన జవాలంకార జంఘున్ నిరా
తంకు న్నిశ్చలు నిర్భయు న్నిపుణు సీతాశోక లుంటాక ని
శ్శంక ప్రాభవు రామచంద్రచరణాబ్జాతద్వయీ సర్వదా
కైంకర్యప్రియు నాంజనేయు నగదంకారప్రభుం గొల్చెదన్"

అను పద్యము. పీఠికయందు దీని కొక విశిష్టత కలదు. మిగిలిన స్తుతి పరము లన్నియు నరసరాజు నామమున వాని శ్రేయస్సుఁ దెల్పునవి.

---

1. రం. రా. సుం. 1029
2. రామా. పీఠిక - 6

ఈపద్య మట్లు కాదు. తనకు ప్రీతిపాత్రముగ వ్రాసుకొన్న హనుమత్ప్రార్థనము నిందుఁ జొప్పించిన ట్లనిపించును. ప్రత్యేకించి ఎవ్వరైనను హనుమత్ప్రార్థనగా స్వీకరింపఁ దగిన యీపద్యము అనిబద్ధకవితయై రమ్యమై యొప్పుచున్నది. దీనివలన హనుమంతునియెడ నయ్యలరాజు రామభద్రునకుఁ గల ప్రత్యేక ప్రపత్తి ప్రకటమగును.

సుందరకాండగాధ యందలి షష్ఠాశ్వాసమున, నెనుబదిపద్యముల పిదపను, సప్తమాశ్వాసాదిఁ బదునారు పద్యములవఱకును సుమారు నూటతొంబది పద్యములలో రచింపఁబడెను. కథాభాగము యథావాల్మీకము నడచెను. కాని రచనాపాటవముచే నిందు నవ్యతఁ జూపెను. సముద్రలంఘనోద్యమమున మహేంద్రగిరి నున్న హనుమంతుని వర్ణించు రామభద్రుడు.

[1] ''అడుగులొత్తినపట్లఁ బిడుగు మొత్తినయట్ల
బహుమహోపలములు పగిలిపడగఁ
దోకద్రిప్పిన పట్ల మూఁక విప్పినయట్ల
బలుగానలిలఁ గూలి బయలుగాఁగ''

నని వర్ణించెను ఇది రామభద్రుని శయ్యాసౌభాగ్యమునకు నిదర్శనము. ఈతని సీసము లన్నియు నిట్లే నడచును. రామాభ్యుదయమున మైనాక సురసా సింహికా, లంకావృత్తాంతములులేవు. రావణాంతఃపురమున నన్వేషించుచు మణిమయస్తంభ కుంభ ద్దీపకళికలు వేనవే లిరువంక వెలుఁగుచుండ నొక్క మహనీయశయ్యపై నొడలుమఱచి నిదురవోవు రావణునిఁ గాంచి [2] 'ఈ రాజ్యసుఖ మితఁడు చెఱుచుకొనెఁ గాక మనవాని నెఱుకలేక' యనుకొనును. సీత గానరానిసమయమున వచ్చిన చమత్కారభరితమైన యీ భావనలో హనుమంతుని యచంచలవిశ్వాసము ప్రకటమగుచున్నది.

వస్తువు వాల్మీకమైనను వర్ణనలయెడ రామభద్రుడు స్వతంత్రించెను. హనుమంతుఁడు చూచిన సీతను వర్ణించిన [3] ''ఘూకకుటుంబినీ కోటిలో నడిరేయి జక్కవ జవరాలు చిక్కినట్లు'' అను పద్యమునఁ జెప్పఁ

1. రామా - 6 - 88
2. రామా - 6 - 114
3. రామా - 6 - 130

బడిన యుపమ లన్ని యుం గవికపోల కల్పితములు. మూలరామాయణమున మండోదరిని చూచి సీత యనుకొని యామెవర్ణనములవలనఁ బరమానందభరితుఁడయ్యెను. అట వాల్మీకి హనుమంతుని చేష్టలను

1 'ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం ననంద చిక్రీడ జగౌ జగామ;
స్తంభా నరోహన్నిపపాత భూమౌ నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనాం'

అని తోకచఱచి ముద్దుపెట్టుకొని గంతులువైచి పాడి స్తంభము లెక్కి దుమికిన రీతి వర్ణించెను కాని నిజముగ సీతను సందర్శించినప్పుడాచేష్టలు కనపట్టవు. రామాభ్యుదయమున మండోదరి సందర్శనము లేదు. సీతను గాంచినప్పుడే రామభద్రుఁడు

2 ''అప్పుడు నిశ్చయించి జనకాత్మజ యౌనని వాయునందనుం
డిప్పుడుగా ఫలించెఁ బనియెల్ల ననున్ ఫల పుష్ప శాఖపుం
జిప్పిలఁ జెట్టు చెట్టునకుఁ జివ్వునఁ జివ్వున దాటు వాలముం
ద్రిప్పుచు నాఁడుఁ బేరెములు ద్రిమ్మరుఁ గ్రొమ్మల ద్రెళ్ళుఁ
గ్రమ్ముటన్''

అని వర్ణించెను. ఇది పై వాల్మీకివర్ణన కనుసరణము, స్వభావోక్తి మధురము నయి యున్నది.

రావణుఁడు వచ్చి బెదిరించి వెడలెను. త్రిజట తన స్వప్నవృత్తాంతముఁ జెప్పెను. సీతకు శుభశకున మయ్యెను.

3 ''అప్పుడు వేళగాఁ దెలిసి యచ్చెరువారఁగ మోడ్పుఁ గేలుతో
గుప్పున మ్రోల వ్రాలి రఘుకుంజరు సేమపువార్త మున్నుగాఁ
జెప్పి తదంగుళీయకము చేతికి నిచ్చి సమీరనందనుం
డప్పువుఁబోఁడి కాత్మ వినయానుగుణంబుగ మ్రొక్కి నిల్చెనన్''

అని రామభద్రుఁడు హనుమచ్చేష్టను వర్ణించెను. ఇందు హనుమంతుని సమయజ్ఞత, ఉచితజ్ఞత, వినయములు స్పష్ట మగుచున్నవి. సీత తన జడలోని రత్న మిడి దీవెంచెను. హనుమంతుఁడు సీతను బాధించిన రక్కసిమూక యుక్కడప ననుమతిఁ గోరి మెప్పు మిట్టఁ బెరిగెను. వీరిని మన్నింపు మన్న సీతమాటపై ఆచటి వారిని విడి యశోకవనికా భంజన

1. వా. రా. సుం. 10-54
2. రామా - 6 - 143
3. రామా - 6 - 176

మొనర్చెను. తోరణారూఢుఁడై [1] ''గగన మగల జగము డిగులుపడగ' నార్చెను. ఇందు వృత్యనుప్రాసను రామభద్రుఁడు కూర్చెను. తనపైకి వచ్చిన మంత్రిపుత్రులను హనుమంతుఁడు

[2] ''తాచి యొక్కనిఁ దేరితో వైచి యొకని
    గ్రుద్ది యొక్కని మోచేతఁ గ్రుమ్మి యొకని
    నుటిచి యొక్కని మెడ నొక్కి విటిచె యొకని
    నాక్షణంబునఁ దెగటార్చె నాఱుగురను,

ఒక్కొక్క వేటునఁ జంపెను. ఇందుఁ గపివరుని యుద్ధనైపుణ్యము కవి స్పష్టము గావించెను. ఎంత సునాయాసముగ మారుతి చంపెనో యంతటి సునాయాసరచనతో కవి తేటతెల్లము చేసెను. అక్షౌంతకు డక్షునితోఁ జేసిన యుద్ధమును మాత్ర మారుఁద్యములలో విపులముగ వర్ణించెను. ఇంద్ర జిత్తు యుద్ధరంగ ప్రవేశము జేసెను.

[3] ''నియమంకృత బ్రహ్మాస్త్ర
    ప్రయోగమునఁ గట్టివైవ బ్రహ్మోపాస్తి
    క్రియఁ బావని విడివడి యుం
    డియు లోనై చిక్కె నేమిటికో దనుజునకున్'' అని రామ

భద్రుఁడు వర్ణించెను. ఇందలి 'ఏమిటికో' యను పదము అర్థబాహుళ్య సంధాయకము. ఆ ఒక్కపదము హనుమంతుని బ్రహ్మాస్త్ర నివారకశక్తిని, సుదీర్ఘాలోచనను కార్యసాధకు లక్షణమును నిరూపించుచున్నది. రావణుని సమక్షమునకుఁ గొంపోగా నట హనుమంతుఁడు వాలంబునం బీటపెట్టుకొని నెట్టుకొనిన ధైర్యంబున వసించినట్లు రామభద్రుఁడు తెల్పెను. తోకఁజుట్టి దానఁ గూర్చున్న విషయము రంగనాథరామాయణమువోలె జనశ్రుతి నున్నది స్వీకరించెను.

రావణుని యాజ్ఞమేరకు రాక్షసులు హనుమంతునితోకఁ గాల్చిరి. పురవీధులు ద్రిప్పి వారుగా నాతని వీడిన ట్లిందు చెప్పబడెను. ఇప్పట్టున జెప్పిన

---

1. రామా - 6 - 201
2. రామా - 6 - 212
3. రామా - 6 - 229

# భాస్కర రామాయణము — సుందరకాండ

ఆంధ్రరామాయణములందుఁ దొలిచంపూకావ్య మిదియే. ఆంధ్ర మహాభారత, భాగవతములవలె నీరామాయణముకూడా బహుకర్తృకము. దీనిని హుళక్కిభాస్కరుడు, అతని కుమారుడగు మల్లికార్జునభట్టు, శిష్యుఁడైన కుమారరుద్రదేవుఁడు, మిత్రుఁడైన అయ్యలార్యుఁడు సను నల్వురు రచించిరి. వీరిలో సుందరకాండకర్త మల్లికార్జునభట్టు. మల్లికార్జునభట్టు అసాధారణప్రతిభ కలిగి రామాయణమున నెక్కువభాగము రచించినవాడు. ఈతఁడు బాల, కిష్కింధాకాండలను, సుందరకాండను రచించెను. వ్యాకరణశాస్త్రమర్మజ్ఞుఁ డగు నితని రచనము లలితపదబంధు రమై యొప్పును. ఈతఁ డాలంకారిక వచనరచనా చతురుఁడు పరమ పాండిత్య ప్రతిభలచేఁ బెద్దవాఁడగు భాస్కరునిపేరనే యీరామాయణము భాస్కరరామాయణముగ వినుతి కెక్కినది. వాల్మీకిరామాయణాను సారియే యైనను నిందు రంగనాథరామాయణప్రభావము నఁ గాఁబోలు కొన్ని అవాల్మీకాంశములు చోటు చేసికొన్నవి.

మల్లికార్జునభట్టు 2885 శ్లోకములు గల సుందరకాండను 570 గద్య పద్యములలో నేకాశ్వాసముగనే రచించెను. మిగిలిన కాండలయం దవాల్మీ కాంశములు చోటుచేసుకొన్నవి కాని సుందరకాండము మాత్రము యథా మూలముగనే రచించెను కాండారంభమును హనుమత్పూజతోనే ఆరంభిం చుట విశేషము. కిష్కిందాంతమునఁ జేయు హనుమత్ప్రసంగము పూర్తిచేయగనే వానరు లాతనిని పూజించిరి. మూలమున హనుమంతుఁడు సూర్యేంద్రాదులకు నంజలిఘటించుట కలదు. అప్పటిన హనుమంతుఁడు తోటి వానరులతో మహేంద్రపర్వతము నెక్కినటులఁ దెల్పుచు హనుమ ద్విక్రమము వలెఁ దన కవితావిక్రమమును మల్లికార్జునుఁడు

[1] "అనుపమ విక్రమప్రక్రమ సమగ్ర భుజార్గళుఁ డైన వాయునం
దనుఁడు నిజాప్త వానరులుఁ దాను నెక్కె మహోత్సవాంగనా
జన కృత సంగ శృంగచయ సంగతి తారక సూర్య చంద్రమున్
ఘన వనమంద్రముస్ సుజగప్ప నగేంద్రమునమ్మహేంద్రమున్"

1. భా. రా. సుం. 5

1 "పురవీధు ల్గలయంగ ద్రిప్పి యిఁకఁ బోపొమ్మన్న న వ్వీరవా
నరసింహం బొకనవ్వు నవ్వి చనెనే నా కిప్పు డాకాంక్ష? యు
ప్పరిగల్ సెజ్జలు చప్పరాలు చవికల్ పైఁ జూడలే దెక్కి చె
చ్చెఱ మీ రెక్కడఁ జూపినా రిపుడు నిశ్శేషంబుగాఁ జూచెదన్"

అనుపద్యము వ్యంగ్యార్థ బోధకము. ఇందలి 'ఆకాంక్ష' 'నిశ్శేషంబు' అను పదములు వ్యంజనాశక్తి సంయుతములు. ౨౨౪వ పద్యమునందలి 'ఏమిటికో' యను శబ్దమున నెంతయో యాకాంక్ష యుండుట కారణము. ఆ ఏమిటికో శబ్దశక్తి దూరదూరతర వ్యాపారమున నింతదనుక వచ్చియు నింకను నా వ్యాపారము సమసిపోలే దనుట నీ 'యాకాంక్షచనెనే?' యనుటలో వ్యక్తము గావించెను. 'నిశ్శేషముగ' జూచుట సర్వనాశనము గావించుట యని ధ్వనించుచు 'నేమిటికో' యనుటలోని యాకాంక్షను పరిపూర్ణము గావించుచున్నది. ఇట్టి రచనము రామభద్రుని ఉత్తమకావ్య కర్తృత్వ శక్తికి నిదర్శనము. రంగనాథుడు ఉప్పరిగలు గాంచి యోసరుల్లోపలి చప్పరంబులు డాసి సౌధము ల్వెదకి యని ఈ తెలుగుపదములు ప్రయోగించెను.

హనుమంతుఁడు మండెడి తనవాలము చల్లార్పక యట్లే సీతకడ కేగినట్లు రామభద్రుడు వర్ణించెను. మరెవ్వరు వర్ణింపనిరీతి యిది. జాంబవదాదులు విశేషించి హనుమంతుని వాలమునుగూర్చి ఇట్లు కొనియాడిన ట్లిందు గలదు.

2 "దారుణ కంఠపాశమగు దానవకోటికిఁ బంక్తికంఠ కం
ఠీరవ పీఠికిన్ ప్రతిఘటించిన వీర మనుసె గుటుత్వ సం
హారకమైన చూడుఁగొడు పౌ నిది లంకకు బొప్పె యుసా
ధారణ మేమనంగలము తావకవాలము వాయునందనా" అని ఈరీతిగ నయ్యలరాజు రామభద్రుఁడు ప్రబంధముగ నిబంధించిన రామాయణమగు రామాభ్యుదయమున హనుమత్పాత్రఁ బోషించెను.

---

1. రామా - 6 - 244
2. రామా - 7 - 6

అని ప్రకటించెను. ఇందలి రచన మనుప్రాస శోభితమై యొప్పినది. కథాగమనమున కవసరమాత్రము గనే వర్ణనల నుంచి గ్రంథమును కుదించెను. ప్రధానాంశముల బోనిక ఎనుబదియారు శ్లోకముల పెట్టింపబడిన సముద్రోల్లంఘన ఘట్టము నిరువదియొనిదిమిది పద్యముల బూర్తి చేసెను.

సముద్రమును దాటు హనుమంతునకు నాతిథ్య మీయ మైనాకుడు సాగరోపరిభాగమునకు లేచెను. వానిని చూచి మారుతి [1] 'తనకు విఘ్నముగా దలచె' నని మూలమునగలదు. కాని మల్లికార్జునభట్టు [2] 'వీడొక రక్కసుడెడరు వేచి వియుత్తలవీధి నడ్డమున్నాడ' డని తలంచెను. ఈమార్పు సమంజసముగ నున్నది హనుమ ద్యత్నమునకు విఘ్న మేర్పడుటలో కార్యకారణసంబంధము తెలియు నవకాశము లేదు. తను గొంపోయిన రాక్షసుడు సీతాన్వేషణలో నున్న వీని నడ్డగొనగ జూచుట సహజము. తనను వృక్షమున గూర్చిన హనుమంతునితో మైనాకుడు [3] ''ఆకాశంబున నొక్క దివ్యపురుషుండై యాత్మశృంగస్థలి గానంబడి పల్కిన'' ట్లిందు కలదు. ఈరీతి యధ్యాత్మరామాయణమునుండి స్వీకరింపబడినది. [4] ''నానామణిమయైః శృంగైః తస్యోపరి నరాకృతిః ప్రాహ'' అని యందు కలదు. ఈ విషయన మల్లికార్జునభట్టు ఆ అధ్యాత్మరామాయణము ను అనుసరించెను.

పాత్రచిత్రణము వర్ణనముకంటె విశేషమై వ్యంగ్యబోధక మగుచు నొప్పును. హనుమంతుని శక్తిం గూర్చి కవి చెప్పదలచెను. హనుమంతునితో మైనాకుడు [5] 'ఇది శతయోజనం బుదధి'' యన హనుమంతుడు [6] 'ఈ మకరాలయ మిట నూరామడ దీని కేటి కలయిక'' సనెను. శతయోజన శబ్దమునకు నూరామడ యనువాదమాత్రమే. కాని మైనాక వాక్యము అసాధ్యతం దెల్పుచుండ హనుమద్వాక్యము సులభసాధ్యతం బ్రకట మొనర్చు చున్నది. తెలుగు చేయుట మాత్రమున తేలికయిన ఆ యనువాదము వ్యర్థ మగుచు శతయోజన విస్తీర్ణము నిదియెంత

1. వా. రా. సుం. 1-107
2. భా. రా. సుం. 28
3. భా. రా. సుం. 30
4. అ. రా. సుం. 30
5. భా. రా. సుం. 32
6. భా. రా. సుం. 37

యనఁ జాలిన హనుమంతుని యసాధ్యసాధకతను ధ్వనించుచున్నది. ఇట్టిది మల్లికార్జునభట్టుయొక్క యనువాదశోభ.

మైనాకుని వీడి బయలుదేరిన హనుమంతుని చూచి దేవగంధర్వాదులు నాగమాత సురసను బిలిచి హనుమంతునకు [1] 'క్షణకాలము విఘ్నముసేయు' మని కోరిరి. అందుకు కారణ మాతఁ డుపాయముచే గెలుచునో లేక వెనుదిరిగి పోవునో చూడఁగోరుట. కాని అధ్యాత్మమున [2] 'పరీక్షించుటకై సురసను ప్రేరేపించుచూ లంకానగర ప్రవేశమునకు సమర్థుడా? కాడా? యెఱుఁగఁ గోరిరి. ఈ రెంటియందు నధ్యాత్మవిధానమే హనుమంతుని లక్ష్యమునకు ననుకూలముగా నున్నది. కావుననే భాస్కరరామాయణము [3] 'నీయంశమున' అధ్యాత్మరామాయణము ననుసరించినది

[4] 'ఎట్టను జిక్కదీని కటు లేటికి నంకిలి నాకు నిక్కడన్'' అనుకొన్న హనుమంతుని నిశ్చయాత్మకభావనము భాస్కరరామాయణమునందే కాననగును. సురసా హనుమంతులు తమతమ దేహములఁ బెంచిరి. వాల్మీకము దానిని ఇరువది యామడలకు మాత్రము పరిమితము చేయ భాస్కరరామాయణమునందు శతయోజన విస్తీర్ణమువఱకుఁ బెంపు చేయబడెను ఆంధ్రరామాయణకర్తలగు గోపీనాథ విశ్వనాథాదులు ఈ విషయమున భాస్కరరామాయణ విధానమునే యనుసరించి నూఱుయోజనములవఱకు సురసాముఖము, తొంబదియోజనములవఱకు హనుమంతుని దేహముఁ బెంచినట్లు చెప్పిరి. సురసావిజయానంతర మేగు హనుమంతునిగూర్చి [5] 'రఘుకులేంద్రుఁ డలిగి రాక్షసపురముపైఁ బఱపు చిచ్చఱమ్ముపగిది నిగిడె' నని యుపమానము చెప్పెను అట్లగ్నిబాణమువలెఁ బోవుచున్నాఁ డనుట యెంతయు దగియున్నది. అగ్నిఁ జెప్పుట లంకాదహనమునకు సూచ్యార్థ సూచకము. అట్లే బాణమువలెఁ బోవు విషయము [6] 'యథా రాఘవనిర్ముక్తశ్శర శ్శ్వసనవిక్రమః' అని వాల్మీకమున హనుమంతుఁడు చేసిన ప్రతిజ్ఞను సముద్రోచిత వర్ణనయందుఁ జెప్పినట్లయ్యెను. ఈ యౌపమ్యము రామబాణమునకు వలె హనుమద్ద

---

1. వా. రా. సుం. 1-146
2. అ. రా. సుం. 9
3. భా. రా. సుం 41
4. భా. రా. సుం. 46
5. భా. రా. సుం. 52
6. వా. రా. సుం. 1-40

మనమునకు వైయర్థ్యము లేదని, బాణ మెట్లు ధానుష్కునిచే పంప నియు నట్లు రామాధీనుఁడని, దీర్ఘదీర్ఘతర వ్యాపారముల నేటి విలు కాని యిష్టమవలె కార్యసాధకుఁ డని ధ్వనించుచున్నది. ఉత్ప్రేక్ష మాత్రమే కాక రాక్షసహనన లంకాదహన కార్యము లందును సమర్థుఁడని తెల్పుచున్నది.

వాల్మీకమునందుఁ బదునారుశ్లోకములలోఁ జెప్పఁ బడిన సింహికా వృత్తాంతము ను మల్లికార్జునభట్టు నాల్గుపద్యములలో ముగించెను. కావ్య సాధకుఁడు తార్కికబుద్ధితో వివేచనము గావింపవలె ననుట [1] ఏ విధమున నేను సీత నీక్షించెదన్' అని సందేహించి హనుమంతుఁడు వెంటనే [2] 'చని చూచెదఁ గాక యివట సందియ మేలా' అని నిశ్చయమునకు వచ్చెను. మల్లికార్జునభట్టు సూర్యాస్తమయమును

[3] "నా కెంతయుఁ బ్రియశిష్యం
డీ కపివరుఁ డితనిపనికి నెడ గాకుండం
బోక యుచిత మగు కరణి వి
భాకరుఁ డపు డపరశిఖరిపై కరుగుటయున్"

అని యుత్ప్రేక్షించెను. ఈయుత్ప్రేక్ష హనుమంతుని సూర్యశిష్యతను తెలుపుచున్నది లంకలో ప్రవేశింప నెంచిన హనుమంతుడు తనగాత్రంబును సంకోచించి [4] 'యణుమాత్రదేహుఁ' డయినట్లు భాస్కరరామాయణమునఁ గలదు. మూలమున

[5] "సూర్యే చాస్తంగతే రాత్రౌ - దేహం సంక్షిప్య మారుతిః
పృషదంశకమాత్ర స్సన్ - బభూవాద్భుతదర్శనః"

అని హనుమంతుఁడు దేహమును సంక్షేపించి పిల్లియంతవాఁ డయినట్లు కలదు. ఇతరులగు రామాయణకర్త లీరీతినే గ్రహించిరి. హనుమంతుఁ డణుమాత్రదేహుఁ డయినట్లు చెప్పుట తగియున్నది. హనుమంతుని వివిధరూపములం దిదియే యత్యంతము సూక్ష్మమైనదిగా తానే చెప్పు కొనెను. భీమునితోఁ దనరూపభేదములఁ గూర్చి చెప్పుచు

---

1. భా. రా. సుం 66
2 భా. రా సుం 67
3. భా. రా సుం 74
4. భా. రా. సుం 76
5. వా రా సుం. 2 50

[1] "ఏన రూపేణ మే రాజన్ - లాలితా జనకాత్మజా
తాదృశం విద్ధి రూపం త్వం - సూక్ష్మం చ సదృశో మమ"

తాను సీతను లాలించిన రూపమే తన సూక్ష్మరూపముగాఁ దెలిసికొమ్మ నెను. కావున నల్లెఱఁగియు నుల్లికార్జునభట్టు ఈరీతి మార్పు చేసెను. దేహము కుంచించి వెడలుచున్నను గుర్తించిన లంకయను నిశాటిని 'ఎక్కడి మర్కటాధముఁడ వెవ్వఁడ' వనుచు నాపి నన్ను మీఱి యెట్లు వోయెద వన హనుమంతుఁడు [2] 'పోయివచ్చి నీపని మఱి చక్కఁజేసెద' నని పల్కెను. చాల మెత్తనగు నీపని చక్కఁజేసెద నను తెనుఁగుపదముల కూర్పు అర్థమునఁజాల కఱకైనది. ఇది తెనుఁగునుడికారపు సొంపు. వెంటనే

[3] "అని యతఁడు పలుకఁ బరుష
ధ్వని నాతని యురము హస్తతలమున వేసియుం
గనలి నిశాచరి కేలు
క్కునఁ గమియఁగ బట్టి బీతిగొనఁ దిగిచి వడిస్"

పిడుగువలె పొడిచెను అని చెప్పుటలోఁ బరుషధ్వని యా సరళవాక్య మునఁ గలదని గ్రహింపఁదగును. ఈపద్యమునఁ జక్కగ ముష్టియుద్ధ ప్రదర్శనము గావింపబడెను. లంక నతిక్రమించి హనుమంతుఁడు తద్ద్వా రంబు సొరక లంకాప్రాకారంబు దాటి పట్టణమునఁ బ్రవేశించెను. ఇట్లు ప్రవేశించుటలో హనుమంతుని శాస్త్రజ్ఞత, సంప్రదాయబద్ధ సమాచర ణము వ్యక్తమగుచున్నది.

"గ్రామం వా నగరం వాపి - పత్తనం వా పరస్య హి
విశేషాత్పమయే సౌమ్య - న ద్వారేణ విశేన్నృప"

శత్రువుయొక్క గ్రామ నగర పట్టణములను ద్వారముగుండ ప్రవేశింప రా దను రాజనీతిని పాటించి శత్రుస్థానము నద్వారముగఁ బ్రవేశించెను. జరాసంధునిమీదకు యుద్ధమునకు పోవునెడ శ్రీకృష్ణ భీమార్జునులును నద్వారంబుగనే ప్రవేశించిరి.

---

1. వ. సం. 51 - 22
2. భా. రా. సుం. 83
3. భా. రా. సుం. 84

[1] 'అద్వారేణ రిపో ర్గేహం-ద్వారేణ సుహృదో గృహాన్
ప్రవిశంతి నరా ధీరా - ద్వారా ణ్యేతాని ధర్మతః' అని భారతము కూడా తెల్పుచున్నది. సీత నన్వేషించుచుఁ గ్రిపఃమఃగ హనుమంతుఁడు రావణగృహమును బ్రవేశించెను. అచ్చట నగ్నముగా నున్న రాక్షస స్త్రీలు కంటఁబడిరి వారి యవయవము లన్నియుఁ జూచుట తటస్థించెను. సకలధర్మ మర్మజ్ఞుఁడగు హనుమంతుఁ డూహాపోహలతో కర్తవ్యాకర్తవ్యముల నట తర్కించుకొనుటఁ గాంచగలము. ఈరీతిగా వలుతావుల హనుమంతుని వివేచనాజ్ఞానము స్పష్టమగును. మల్లికార్జునభట్టు ప్రస్తుత విషయమున రెండుపద్యములందు ధర్మసందేహ సమాధానములను సుస్పష్టమొనర్చెను.

[2] "అక్కట బ్రహ్మచారి నిటు లన్యపురంధ్రుల గాత్రమర్మముల్
దక్కక చూచితిం గడిసి ధర్మవిహీనుఁడనైతి నాకు నిం
కెక్కడి పుణ్యలోక మని యెంతయుఁ జింతిలి యాత్మలోపలన్
నిక్కముగాఁగ ధర్మపథ నిర్ణయ నిర్మల బుద్ధిఁ దోఁచినన్"

"మన పేమిటిపైఁ దగులమిఁ
దనరం గామించునట్లు తగ మేలును గీ
డును నగు నే నీయింతుల
మనమునఁ గామించి చూడ మన్మథవశతన్"

అని సందేహమునకు ధర్మనిర్ణయముఁ గావించుకొనెను. పూర్వపక్ష సిద్ధాంతముల నిట మల్లికార్జునభట్టు చక్కగ ప్రతిపాదించెను. ఈరీతి హనుమంతుని ధర్మనిరతిని, వివేచనాజ్ఞానమును, సౌశీల్యమును, శాస్త్రపారీణతను నిరూపించుచున్నది. ఇట 'నక్కట బ్రహ్మచారి' ననుట మూలమున లేని విషయము. ఇది అగస్త్యరామాయణమున

[3] 'చింతయామాస హనుమాన్ - స్వాత్మ న్యేవం మహామతిః
నా౽వస్త్రాః స్త్రియ ఈక్షేత - బ్రహ్మచారీ విశేషతః'

---

1. భార సభా.
2 భా రా సుం 95, 96
3 రా. పాదో 4 - 13

అని చెప్పబడినది. హనుమంతుఁడు తన యాత్రలో బ్రహ్మచారి యగు వాఁడు వివస్త్రలగు స్త్రీలను చూడరా దని భావించె నని యందు కలదు. సారోద్ధారకర్త ఈ బ్రహ్మచారి యను విషయమును వ్యాఖ్యానించుచు [1] "బ్రహ్మచారిత్వ్రతం కాణ్వాయనస్మృతి రర్థత ఉపక్రమ్యతే" బ్రహ్మచారీ చతుర్విధః-'గాయత్రో బ్రాహ్మః ప్రాజాపత్యః బృహన్ ఇతి" తత్రోపనయనా దూర్ధ్వంయ స్త్రిరాత్ర మక్షార లవణాశీ గాయత్రీ మధీతే స గాయత్రః, య స్తు వేదస్య గ్రహణాంతం బ్రహ్మచర్యం చరతి స బ్రాహ్మః, ఋతుకాలే స్వదారగామీ నిత్యం పరస్త్రీవిముఖః స ప్రాజాపత్యః, సంవత్సరం వేదకృ ద్వాటు రపి ప్రాజాపత్య ఏవ, ఆమరణాంతం గురుకులవాసీ స నైష్ఠికో బృహ న్నిత్యుచ్యతే" అని ప్రాజాపత్యబ్రహ్మచారిగా నిరూపించెను. అన్యపురంధ్రుల గాత్రమర్మములు చూచుటవలన ధర్మవిహీనుఁడ నైతి ననుకొన్నటుల చెప్పుటచే మల్లికార్జునభట్టుయొక్క యభిమతముకూడ ప్రాజాపత్యబ్రహ్మచారిగాఁ జెప్పుటయే యని వ్యక్తమగుచున్నది. ఇట్లు వర్ణించుటద్వారా హనుమంతుని శీలము నికషోపలమున నిరూపితమైన రీతిగ కవి యొనర్చెను. 'సుదతిని సుదతులలోపల వెదుకక మృగకులములో వెదుకుదురే' యని హేతుబద్ధముగఁ దా నొనర్చిన పని సమంజస మని నిరూపించుకొనెను అనంతరము హనుమంతుఁడు మండోదరిని చూచి సీత యనుకొని సమ్మోద మందెను. ఈ విషయము మూలమున ముందుగాఁ జెప్పఁబడి పిదప అన్యస్త్రీ అవయవములఁ జూచిన విషయమువ తర్కించుకొనుట జరిగెను. కాని భాస్కరరామాయణమున ముందే యావిచారము పూర్తి యయ్యెను. ఇట్లు మార్చుటవలన తాను ముందుగ సమాధానపడి తన యన్వేషణను కొనసాగించుకొనుట, అనంతరమే పతివ్రత యగు మండోదరినికూడ చూచుట సముచితమై యొప్పినది. మండోదరిని చూచి ముందుగ సీత యని యనుమానించియు పిదప కాదని నిశ్చయించుకొనెను. అట్టి నిశ్చయమునకుఁ గారణమగు నీపద్యమును మల్లికార్జునభట్టు అతిరమ్యముగా

[2] "ధరణిజ పుణ్యసాధ్వి వినుతవ్రత పావని సీత లోకసుం
దరి త్రిదశేంద్రవంద్య గుణధాముని రాముని బాసి యన్య కా

1. రా. సారో 4 - 13 వ్యాఖ్య

2. భా. రా సుం. 112

పురుషుల శయ్యపై నిదుర వోవు పుష్ప సుగంధ వాసనతో
త్కరములు వాల్చునే మధువు ద్రావు నెరిగము విచ్చగించునే’’

అని రచించెను. ప్రసాదగుణ భూయిష్ఠమై రమ్యమైన దీ రచనము. కావు ననే యీ సందర్భమున గోపీనాథరామాయణకర్త యగు వెంకటకవి [1] యీపద్యమును యథాతథముగ స్వీకరించెను.

మల్లికార్జునభట్టు కథాగమనమునకు నవరోధము అగు విషయములను, అధికము అనిపించిన వానిని వీడి ప్రధానభాగములనే స్వీకరించెను. అందుననే వాల్మీకి పలు శ్లోకములు రచించిన సీతాన్వేషణను భాస్కరరామాయణమున 43 పద్యములలో పూర్తి చేసెను. సముద్రోల్లంఘన కార్యసాధనకు ముందు దేవతాగణమును సంప్రార్థించినట్లు సీత సందర్శనమునకు ముందును హనుమంతుఁడు దేవతా తతిని ప్రార్థించెను. చతుర్థ్యంతములగు పదములతో నంత్యానుప్రాసను సాధించుచు ననుసరణముతో సంస్కృతోక్తిపూర్ణముగా మల్లికార్జునభట్టు

[2] ‘‘వాయుతనూజుఁ డప్పుడు శివాయ రమారమణాయ భారతీం
ద్రాయ సురేశ్వరాయ పవనాయ పయోరుహబాంధవాయ చ
న్ద్రాయ వినాయకాయ శమనాయ సమీరసఖాయ పాశహ
స్తాయ నమోనమో యనుచు దక్షత వారికి మ్రొక్కి వెండియున్’’

అని హనుమంతునిచేఁ బ్రార్థన గావింపించెను. ఇది మధురతరంబగు రచనము. దక్షత మ్రొక్కుట కపిపరమే కాక కవిపరముకూడ నన్వయించెను హనుమంతుఁడు శింశుపావృక్షము నధిరోహించి గళదశ్రూదకసిక్తవస్త్ర నొక శోకసమేత నా యశోకవనిఁ గాంచెను. ఆమె సీతయగునా యని యాలోచించి

[3] ‘‘నగనగవె నరుగు నప్పుడు
నగచరుఁ డీక్షింప నాఁతి నగశృంగమునం

1 గో. రా. సుం. 303
2 భా. రా. సుం. 127
3. భా. రా. సుం. 148

దాల్చిన పై చేలయు ని
మ్ముగువ ధరించినదియును సమానాంబరముల్’’

అని సీతగా నిశ్చయించుకొనెను. ఇందు హనుమంతుని సునిశిత పరిశీలనాశక్తి ప్రకట మగుచున్నది. తనను విశ్వసింపగలందులకు ముందుగా రాముని స్తుతింప సంకల్పించెను. ఇది యాతని కార్యసాధనా విధానమునకు, చతురతకు నిదర్శనము. వాల్మీకి [1] ‘రాజా దశరథో నామ రథకుంజర వాజిమాన్’ అని యారంభించినట్లు చెప్పెను. కాని భాస్కరరామాయణకర్త [2] ‘తాను సీతను వెదుకఁ బంచిన రాఘవుదూతనని ఆమె యెట్లు చూడఁగల్గుదునో,’ యని యేమియు దెలుఁగనివానివలెఁ బల్కి యనంతరము రామచరితఁ గీర్తించుట సముచితమైన మార్పు అనుమానింపఁ దావీయని రీతి యగును. త్రిజట స్వప్నవృత్తాంతమున ‘రామదూతయగు నొక్కకోతి లంకను తగులబెట్టినట్లు స్వప్నమున గాంచితి’ నని త్రిజట చెప్పుట కలదు. భాస్కరరామాయణమం దది చెప్పఁ బడలేదు. వాఙ్నిపుణుఁడైన హనుమంతుఁడు ఆమె సంశయబాధలు తొలఁగురీతిగను విశ్వాసము కల్గునట్లును ప్రసంగ మొనర్చి సాష్టాంగ నమస్కార మొనర్చి రామముద్రిక నిడెను. అందు కెంతయు సంతసించిన సీత మారుతిని పెక్కుభంగులఁ బొగడెను. [3] ‘శౌర్య ఘనుండవు నానా కార్య సమర్థుఁడవు ప్రజ్ఞ గలవాఁడవు’ అని

[4] ‘అసహాయ శూరుఁడవు నీ
వసమ ప్రజ్ఞుఁడ వుదాత్త యశోమయ బలముఁ బెం
పెసఁగఁగని మ్మెందును రా
క్షసభయములు నీకు లేవు కపికులవర్యా’ అని నీవు సామాన్యుఁడవా! యనుచు నీవలన బ్రతికితి ననెను. ఇందు హనుమత్పరముగఁ జెప్పిన విశేషణము లన్నిటిని మల్లికార్జునభట్టు హనుమత్పాత్ర చిత్రణ వర్ణనము లందు నిరూపించెను. సీతను వీపెక్కి రమ్మని ‘సూక్ష్మరూపుఁడ వెట్లు గొంపోదు’ వనఁ దన యుగ్రరూపమును జూపెను. అట్టి హనుమంతుని

---

1. వా. రా. సుం. ౩౧-౨
2. భా. రా. సుం. 265
3. భా. రా. సుం. 296
4. భా. రా. సుం. 298

[1] ''వజ్రదంష్ట్రా కరాళుండును, దీప్తవహ్ని సన్నిభుండును, బాలార్క తామ్ర వక్త్రుండును మేరుమందరాకారుండు'' నయి యున్నట్లు వర్ణించెను. ఇది హనుమంతుని యుగ్రరూపము. అట్టి రూపుఁ జూపి తన సామర్థ్యముఁ దెలుప సీత 'నీ వెంతకైన సమర్థుండ వగు టెఱుంగుదు' నవెను ఆ యొక్కమాటచే కవి సీతచే హనుమంతునిగూర్చి యెంతో చెప్పించినవాఁ డయ్యెను.

సీతానేషి చూడామణితోబాటు అనుమతియుఁ గొని [2] 'ఊరక పోనేల కొంత పౌరుషంబు సూపెదంకాక' యని యశోకవన భంగమునకుఁ బూనుకొనెను. ఆ భంగ మొనర్చిన రీతిని మల్లికార్జునభట్టు ఒక మనోజ్ఞమగు [3] వచనమున వర్ణించెను. ఈ వచనము బాణభట్టు కాదంబరి యందుఁ జెప్పిన వర్ణనలను గుర్తుచేయునదై యున్నది. వనధ్వంస విషయ మెఱిఁగి రావణుఁడు పదివేలరక్కసుల నా హనుమంతునిపైకి పంపెను. వారిని సంహరించినరీతి వర్ణించిన

[4] ''కాలవ్యాళ కరాళ వాల మొగిఁ జుక్కల్ రాల నభ్రావళుల్
దూలం ద్రిప్పుచు లోకభీకరతర స్థూలాత్ముఁడై యుద్ధలీ
లా లోలాగ్రహవృత్తి నార్చెఁ బెలుచన్ లంకాగుహా గేహ ది
క్కూలానేకప కర్ణకోటర జగ ద్ఘూర్ణ ప్రఘూర్ణంబుగన్''

అను పద్యము వీరరస స్ఫోరకమై భారతీవృత్తి నలరారుచున్నది. ఈ పదము [5] 'లోల ల్లాంగూలపాతేన మమారాతీ న్నిపాతయ' అను మకుటముతో నొప్పు లాంగూలాస్త్రనామక శత్రుంజయస్తోత్రముఁను తలపించుచున్నది జంబుమాలి వధయందు మాత్రము మహోగ్రరీతిఁ దెల్పి రౌద్రరస మొప్పార [6] 'భ్రుకుటి ప్రస్ఫుట కోపనుం' డను పద్యము నారభటివృత్తమున నడిపించెను. వీనియందు హనుమంతుని యుద్ధ ప్రావీణ్యము, కవియొక్క రచనాప్రావీణ్యముఁను వ్యక్త మగుచున్నవి. అక్షవధయందు నిట్టి నేర్పు చూపఁబడెను. అందుననే అక్షాంతకుఁ డను

1. భా. రా. సుం. 309
2. భా. రా. సుం. 332
3. భా. రా. సుం. 334
4. భా. రా. సుం. 348
5. హ. వి. స. పుట 50
6. భా. రా. సుం. 366

విశేషాఖ్య నొప్పెను. శవాసనారూఢ హనుమంతుని శవాసనము అక్షునిదే యన నక్షవధకుఁగల విశిష్టత తెలియును. రావణుఁ డింకెవ్వరు పోయిన నవ్వనచరవీరునిచేతం బొలియుటయ నిశ్చయం బను నిర్ణయమునకు వచ్చెను. ఇంద్రజిత్తును హనుమంతునిపై కంపెను. అతనితోడి యుద్ధమున హనుమంతుని ప్రవర్తనను మల్లికార్జునభట్టు

[1] "శరముల కెదురై నడచును
శరమండలిలోన నాడు శరలక్ష్యముగా
కురుతర జవమునఁ దిరుగును
శరవేగ మడంచు గగనచరుఁడై మలయున్"

అని వర్ణించెను. ఇది హనుమంతుని సమయోచిత యుద్ధనైపుణ్యమునకు నిదర్శనము. ఇంద్రజిత్తు మాయావి. లక్ష్మణునివలనఁ జంపఁబడువాఁడు. కావున నట్టివానికడఁజేయవలసిన యుద్ధపద్ధతి యిదియే హనుమంతుఁడు బ్రహ్మాస్త్ర బద్ధుఁడయ్యెను. మరల రాక్షసులు మోకులతో బిగియఁ గట్టిరి. అన్యబంధ సంబంధమున బ్రహ్మాస్త్రబంధము ప్రిదిలెను. ఈ సందర్భమున [2] 'అస్త్రేణ హనుమాన్ముక్తో నాత్మాన మవబుధ్యత' అని యా బంధమోక్షము హనుమంతుఁ డెఱుఁగనట్లు వాల్మీకి చెప్పెను. కాని భాస్కర రామాయణకర్త [3] 'తనబంధ మూడు టెఱిఁగియు నధికభీతుఁడువోలె' వారు పెట్టు బాధల భరించినట్లు చెప్పెను రావణునివద్దకుఁ గొంపోగా నాతని రూప భుజబలాదులఁ జూచి హనుమంతుఁడు మెచ్చుట మారుతి యుదాత్తతను నిరూపించుచున్నది.

రావణునకు బుద్ధులు గఱుపుచు వాయుసుతుఁడు రాముని శక్తి యుక్తులు ప్రకటించెను. 'అతి వాక్నిపుణః కపిః' అని కొనియాడబడిన హనుమంతునిచే మల్లికార్జునభట్టు [4] 'చరణాగ్రమున నీ భుజాదర్ప మణచిన ధూర్జటి విలు లీలఁ ద్రుంచి పైచె' నిత్యాదిగా వాలి, పరశురామ, ఖరదూషణాదుల జయించినరీతిఁ జెప్పించెను. రావణ పరాజయ కారకులఁ బరాజయ మొనర్చినవానిగా రాముని జెప్పుట యద్భుతవిధానము. అట్లే

---

1. భా. రా. సుం. 414
2. వా. రా. సుం. 48-51
3. భా. రా. సుం. 420
4. భా. రా. సుం. 443

హనుమంతుఁడు [1] 'సుగ్రీవాదుల యెదుట ను; దగ్రగతిన్ నిన్నుఁ ద్రుంతు నను రఘుకుల వీ; రాగ్రణి ప్రతిజ్ఞ రతిన ద; శగ్రీవుఁడ! బ్రతికితీవు వావక నాచేన్'' అని మూలాధికముగ రావణధిక్కారము గావించి వానిని కుటిల భ్రుకుటి భీమఫాల దశక క్రూరోరు నాసాపుటోద్భట లంబోష్ఠ హను ప్రకంపన నట ద్దంష్ట్రాతి ఘోరాస్యుఁ గావించెను. మల్లికార్జున భట్టు దీర్ఘ సమాస భూయిష్ఠరచన కిట్టి వెన్నియేని యుదాహృతులు గానవచ్చును. కోపగించిన రావణుఁడు హనుమంతుని చంపు మని యాజ్ఞాపించియు విభీషణుని ధర్మనిర్ణయమును స్వీకరించి తోకఁగాల్చుట కాజ్ఞ చేసెను. దీని నెఱిఁగిన సీతాదేవి శపథవాక్యముల నగ్నిని శైత్యకారిఁ జేసెను ఇప్పట్టున లంకాదహనము గావించు హనుమంతుఁడు

[2] ''కాలాభీలతరాగ్ని కీలచయ నిర్ఘాతంబు లింటింటిపైఁ
గూలన్ వాలము ద్రిప్పుచుం దిరిగె డక్కాలంకపై గ్రస్ఫులిం
గాలోలచ్ఛట లుద్ధతిన్ వెగయు నుద్యద్భీమ ధూమంబు వా
తూల వ్యాప్త నభోంతరాళముగ మృత్యు క్రూర సంరంభుఁడై''

యొప్పినట్లు కవి యమోఘముగ వర్ణించెను. ఈ హనుమద్విజృంభణము గూర్చి విభీషణసతి [3] 'సరమ సీతతోఁ జెప్పి ధైర్యము గూర్చినట్లు భాస్కరరామాయణమునఁ గలదు కాని మూలయందులేదు. రావణుని యెడ గల కోప - కారణమున సీత యేమగునో యని కూడ విచారింపక లంకను సంపూర్ణముగఁ దగులబెట్టితి ననుకొనుచుఁ గోపమువలని చెడునువివరించుట హనుమంతుని నీతిజ్ఞతకు నిదర్శనము.

సీతవద్ద ననుమతిఁ గొని వానరగణముఁ జేరి వారిచే సంపూజితుఁ డయ్యెను వెంటనే తాను చెప్పదగు విషయమును [4] 'కంటి సద్గుణాభిరాముఁ డగు రాముదేవిన్' అని కంటి పను క్రియాపదము ద్వారా అసందిగ్ధముగ విషయము ముందుంచెను ఇది హనుమంతుని వాక్చాతుర్యమునకు నిదర్శనము ఇట్లే రామలక్ష్మణ సుగ్రీవులకడకు వెళ్ళియునమస్కరించి

---

1. భా. రా. సుం 447
2. భా. రా. సుం. 485
3. భా. రా. సుం 492
4. భా. రా. సుం. 527

[1] "కనుఁగొంటి సీత సేమంబున నున్నది" యని యారంభించి క్రమముగ విషయ మంతను వివరించెను. తుదకు హనుమంతుడే

[2] "అర్ణవము దాఁటి బహుభుజ
పూర్ణం బగు పంక్తికంఠుఁ బొరిగొని జగముల్
వర్ణన సేయఁగ నీ వర
వర్ణిని గొని తేరఁ బోవవలయు నరేంద్రా"

యని మార్గనిర్దేశము గావించెను. ఇట్లు సుందరకాండయందు హనుమంతుని సర్వలక్షణలక్షితుఁ డగుఁ గార్యసాధకునిగా భాస్కరరామాయణమున సుందరకాండకర్త యగు మల్లికార్జునభట్టు వర్ణించెను. ఈరీతిగా ఆంధ్రరామాయణములలో ఆద్యచంపూరామాయణకావ్య మగు భాస్కర రామాయణము సర్వాంగశోభితమై సకల కావ్యగుణాలంకారముల నొప్పుచున్నది.

## మొల్లరామాయణము — సుందరకాండ

ఆంధ్రవాఙ్మయమున రామాయణమును ప్రబంధముగా దిద్దితీర్చిన ప్రథమకవయిత్రి మొల్ల. ఈమె పేర నీకావ్యము మొల్లరామాయణముగ ప్రఖ్యాతి నందినది. ఈమె శివభక్తిరతుఁడైన కేసనసెట్టి కుమార్తె. శ్రీకంఠమల్లేశు వరమునఁ గవిత్వముఁ జెప్ప నేర్చుకొంటినను టచే నీమెయు శివభక్తురా లని తెలయును. తాను వ్రాసినది రామాయణము. పోతనవలె [3] 'చెప్పుమని రామచంద్రుఁడు చెప్పించిన పలుకుమీఁదఁ జెప్పెద' నని రామునివలన రామకథఁ జెప్పి రాముని కంకితము సేయుటఁబట్టి రామ భక్తురాలునై శివకేశవాభేదతత్త్వము గలదిగాఁ దెలియును.

ఈమె తన రామాయణమున మూలమువలెఁ గాండవిభాగమే కావించెను. 2846 శ్లోకముల మూలరామాయణ సుందరకాండ నీమె 249 గద్య పద్యములకు సంక్షిప్తీకరించెను. కాని బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ కాండలు నాల్గిఁటినిఁ గలిపి రెండువందల నలుబదియేడు గద్యపద్యముల లోనే పూర్తిచేసిన మొల్ల యానాల్గిటికి మించి సుందరకాండ రచించుటఁ

1. భా. రా. సుం. 558
2. భా రా సుం 570
3. మొ. రా. పీఠిక. 13

బట్టి యీకాండమునఁ బ్రత్యేకప్రాధాన్యత నిచ్చినట్లే గ్రహింపగలము. వాల్మీకిరామాయణమున లేనిరీతిగ రామునకు సీత తాను తపశ్చర్యయం దున్నట్లు కబురంపుట, హనుమంతుఁడు బ్రహ్మమంత్రము పఠించుట, వాల మంటించినతరి మారుతి అగ్నిజపము చేయుట, సీత అగ్నిమంత్ర బ్రహ్మమంత్రముల నొనర్చుటవంటి యమూల కాంశముల కల్పించుట, తనకు శ్రీకంఠమల్లేశు వరమువలనఁగవిత్వము వచ్చె ననె; 'చెప్పు మని రామచంద్రుడు సెప్పించి'నట్లు చెప్పుకొనుటవలన కవయిత్రి మొల్ల తప శ్శీల యని తెలియును.

మొల్ల తన రామాయణమున నారద వాల్మీకుల వక్తృ శ్రోతలుగాఁ బ్రతికాండయందుఁ బ్రవేశపెట్టెను. మొల్లరామాయణ సుందరకాండము హనుమదాదులు దక్షిణమున వెదుక వెడలుటతో నారంభ మయ్యెను. దక్షిణసముద్రతీరముఁజేరి వార్ధి దాటఁజాలమి కపితతి యంతయు హను మంతుని నుబ్బఁబ్రోద్బలించినటుల మొల్ల సెప్పెను. మూలమునందువలె జాంబవత్ప్రమేయ మిట లేదు.

[1] "పావనమూర్తి రామనరపాలకు పంపున నబ్ధి దాఁటెదన్
దేవవిరోధి దొంగిలిన దేవినిఁజూ చెదఁగాన కుండినన్
లావున గడ్డతోఁబెఱికి లంకయు తెచ్చెద నట్లు గానిచో
రావణుఁబట్టి తెచ్చెదను రాముని సన్నిధి కెన్నిరీతులన్"

అని హనుమంతుడు విక్రమప్రకటనము గావించెను. మైనాక, సురసా, సింహికల నామంబు దప్ప వారియెడ హనుమద్విజయము మొల్ల వర్ణింప లేదు. లంకిణి విషయము నామమాత్రముగూడ యిట లేదు. హనుమం తుని తిరోగమనమున నది గానవచ్చును. సీతకై లంకయంతట వెదకుచు నెక్కడ కానరామి నలిగిన హనుమంతుఁడూహై వలెనె [2] 'తుంతు విధాత జందెము' నకుచు వాగ్విజృంభణము గావించెను. ఇందు మొల్ల వీర రసోచితమ్మగు నుత్సాహము హనుమంతుని వాక్యములందుఁజూపెను. మా రుతి శింశుపావృక్ష మెక్కి రావణుఁడు సీతను బాధించినరీతిగాంచెను.

1. మొ. రా సుం. 17
2. మొ. రా. సుం. ౩౫, ౩౬

అనంతరము తనకు దిక్కులే రనుకొను సీతవాక్య మాధారముగా మనుజ భాషలో

[1] "ఉన్నాఁడు లెస్స రాఘవుఁ
డున్నాఁడిదె కపులఁగూడి యురుగతి రాఁగా
యున్నాఁడు నిన్నుఁగొని పో
నున్నాఁడిది నిజము నమ్ము మూర్వీతనయా!"

యని భాషించెను ఇట్లు సమయానుకూలముగ భాషింపఁజేసి మొల్ల యిట నాటకీయతఁజూపెను. అంగుళీయక మిచ్చినను నమ్మని సీతకు రాముని గూర్చి వర్ణించుచు హనుమంతుఁడు [2] నీలమేఘచ్ఛాయఁబోలు దేహము వాఁడు; ధవళాబ్జ పత్ర నేత్రములవాఁడు' అనుచుఁదచ్ఛబ్దాంతముగాఁబద్య మంతఁజెప్పెను. ఈపద్యము వర్ణనాసామర్థ్యముతోఁ బాటు అంత్యానుప్రాసల సీసమును మనోజ్ఞముగా నడిపించు మొల్ల రచనాపాటవమునుఁ దెల్పుచున్నది.

హనుమంతుఁడు మహోగ్రతపముఁగావించి వాయుదేవుని వరమున నంజనాదేవి తనుఁగన్నటులఁజెప్పి సుగ్రీవుని మంత్రి నగు నన్ను [3] 'హనుమంతుఁడండ్రు' అనెను. 'ఈరీతిగ అంటారు' అని పరిచయము చేసికొనుట తెనుఁగువారి సంప్రదాయముఁదెల్పునదై పెద్దలకడ నిరహంకారత నుండుట నిరూపించుచున్నది. దూతలు రిక్తహస్తంబులతోఁజనుట యుచితంబు కాదని హనుమంతుఁడు సీతతో నన నామె [4] 'నీ నిజరూపము చూడక నే నారత్నంబు నమ్మి నీకీయఁజూమీ' యనెను. ఈవిధమగు భాషణము రంగనాథరామాయణమునఁగలదు. దాన హనుమంతుఁడు చుక్కలు తలపూవులుగా నక్కజమగు రూపు జూపఁబేర్కొనెను. సీత రాము నకుఁజేయఁదగు విన్నపమునఁదాను తపము చేయుచుంటి నని తనకు నాథుడు ప్రత్యక్షంబు గాఁగోరుచున్నా నని చెప్పెను. తపోవృత్తి నున్న దానినిగాఁదనను జెప్పుకొను [5] 'నిడుదపు న్నెఱివేణి జడలుగా నవరించి'

1. మొ. రా. సుం. 91
2. మొ. రా. సుం. 102
3. మొ. రా. సుం. 103
4. మొ. రా. సుం. 105
5. మొ. రా. సుం. 113

యను పద్యము మొల్లయొక్క మనోజ్ఞ భావనాపటిమకు నిదర్శనము. మొల్ల ఆత్మీయతాలక్షణము కూడ యీ పద్యమున గోచరించుచున్నది.

హనుమంతుడు సీతాదేవిబాధఁజూడఁజాలక తనవీపునఁగూర్చొన్నఁ దీసికొనిపోదు నవెను. అప్పుడు జానకి

1 ''నీ వంత వాఁడ వగుదువు
నీ వెంటనె వత్తునేని నెగడవు కీర్తుల్
రావణునికన్న మిక్కిలి
భూవరుఁడే దొంగ యండ్రు బుధనుత చరితా''

అనును. ఇట్లనుట సీతయొక్క వీరపత్నీత్వమును, ఔచిత్యశోభను ప్రకటించుచు మొల్లయొక్క రచనా చమత్కారమును, మాటల వాడిమి, వేడిమిఁదెల్పుచున్నది. తనరాక రావణున కెఱుంగఁజేయవలయు నని తలంచి పావని యశోకవన ధ్వంసము గావించెను. ఈ విషయమును రాక్షసులు చెప్ప రావణుండు విచారించి వాఁడు రామునిపంపున వచ్చిన దూత కాఁబోలని తొలుతనే యూహించుట మొల్లకల్పనము. రాక్షసులతో హనుమంతుని యుద్ధమును సమర్థవంతముగ నీ కవయిత్రి వర్ణించెను పలుతావుల సంక్షేపించిన మొల్ల యుద్ధవిషయమును సముచితముగనేకాక మూలాధికముగఁ గూడ వర్ణించుట విశేషము. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమునకు ముందు వాయవ్యరుద్రాస్త్రములు ప్రయోగించినట్లు చెప్పనైదు గద్యపద్యముల వినియోగించెను. హనుమంతుని రుద్రాంశ సంభూతత్వమిట సూచితము. బ్రహ్మాస్త్రము ప్రయోగింపగా హనుమంతుఁడు

2 ''తనకుఁజిన్నవాఁడు దయచేసి నటువంటి
వనజభవుని చేతివరముఁ దలఁచి
బ్రహ్మమంత్ర మప్టు వఠియింప నది చంప
కతనిఁ గట్టివైచె నవని మీఁద''

నని యందులకే ఇంద్రజిత్తు పరమానందమందినట్లు కవయిత్రి చెప్పెను ఇది యామె కల్పనాశక్తికి తార్కాణము. రావణుని సమ్ముఖంబునఁబెట్టిన

1. మొ. రా. సుం. 119
2. మొ. రా సుం 190

హనుమంతునిఁ గన్న రావణుఁడు [1] 'కుటిలభ్రూకుటీ నటనస్ఫుట ధూమవిలాసపవన పుత్కృతి జనితోద్భటరోషానల కీలోత్కట నేత్రు'డయ్యెను. ఒకపద్యమంతయు నింతటి సుదీర్ఘ సమాసమున బూరించిన మొల్ల సంస్కృతభాషా పటిమ ప్రకటమగును. హనుమంతునితో భాషించి రావణునిచేఁ జెప్పించిన [2] 'శరనిధి దాటి వచ్చుటయు' నన్న పద్యము హనుమంతుని సాహసమును దెల్పునదియే కాక ముక్తపదగ్రస్తమున మొల్లయొక్క శబ్దాలంకార రచనా సామర్థ్యము చాటుచున్నది రావణునిమాటలలో నాందోళన తోడి పారుష్యమును, హనుమంతుని మాటలలో గాంభీర్యతతోడి సారళ్యమునుజూపి సామర్థ్య ప్రకటనమున మరల హనుమంతుని వలుకులు ములుకులు గావించెను. ఇది మొల్లయొక్క పాత్రోచిత సమయోచిత సంభాషణా పటిమకు నిదర్శనము. హనుమంతుని తోకకు నిప్పుపెట్టిన హనుమంతుఁడు వహ్నిజపము చేయగ సీత అగ్నిమంత్రమును, బ్రహ్మమంత్రమును పఠించెను. మూలమునందిట నగ్నిని ప్రార్థించినటులె చెప్పబడెను. సీత హనుమంతుని జగద్ధితకార్యధుర్యగను రాఘవప్రియానుచరునిగను జగత్ప్రాణనందనునిగనే కాక మత్ప్రాణబంధుఁడనుట హనుమంతునకు శిఖరాగ్ర స్థాన మిచ్చినట్లయ్యెను.

హనుమంతుఁడు లంకాదహనానంతరము సీతయనుమతిఁగొని వెడలునప్పుడు లంకిణియడ్డుపడి మడిసెను. ఇట లంకిణీ శాపావసానాదులేవియుఁ జెప్పబడలేదు. అట్లే వెడలునప్పుడు మైనాక పర్వతముపై సేదదీరినట్లు చెప్పబడెను. ఇదియు విశేషము. కపితతిఁజేరిన హనుమంతుఁడు వృత్తాంతమంతయు వినిపించెను. మధువన విహారానంతరము శ్రీరాము సన్నిధిఁజేరి

[3] "కంటిన్ జానకిఁ బూర్ణచంద్రవదనన్ గల్యాణి నాలంకలో
గంటిన్ మీ పదపంకజంబులను నేఁ గౌతూహలం బొప్పఁగా
గంటిన్ మీ కరుణావలోకనము విఖ్యాతంబుగాఁ గీర్తులం
గంటిన్ మాకపివీర బృందములలో గాంభీర్య వారాన్నిధి'

1. మొ. రా. సుం 196 — 3 మొ రా సుం 246
2. మొ. రా. సుం [illegible]

యని తెల్పెను. క్రియాపదముతో నారంభమగునీ కథనము హనుమంతుని వాఙ్నిపుణతకు నిదర్శనము. దోలాందోలిత హృదయుఁడగు రామునకు నట్లుచెప్పి యూరటఁ గల్గించెను ఇట్లు కవయిత్రి మొల్ల తన రచనా ప్రావీణ్యతతో సుందరహనుమత్పాత్ర పోషణము గావించెను ఒక కవయిత్రి గంటము నుండి సరళ గంభీరమగు నిట్టి సంగ్రహరామాయణ కావ్యము వెలువడుట యాంధ్రజాతికి గర్వకారణము.

## గోపీనాథరామాయణము – సుందరకాండ

ఆంధ్రరామాయణము లన్నియుఁ గవిపేర వ్యవహరింపబడుటఁ గాంచుదుము. కాని ఈ వేంకటకవి రామాయణము మాత్రమాతని యింటి పేర గోపీనాధరామాయణమని ఖ్యాతి నడసినది. దీనికర్త గోపీనాథము వేంకటకవి. 19వ శతాబ్దివాఁడై బహుగ్రంధములు రచించి పేరెన్నికగన్న వాఁడు. ఈతఁడు కృష్ణజన్మఖండము, శిశుపాలవధానువాదము, భగవద్గీతానువాదములతోఁబాటు హనుమత్పరముగ మారుతిశతకమును కూడ రచించినవాఁడు. రామాయణమున నారుకాండలు మాత్రమే రచించెను. [1] 'ఇటీవల వెలువడిన రామాయణములలోనిదియే యుత్కృష్ట'మని విజ్ఞులయభిప్రాయము. పూర్వప్రబంధ కవులననుసరించి సర్వవిధములఁ గావ్యశోభల సమకూర్చుచు రచించిన దీరామాయణము. ఇది స్వప్నదర్శనమునఁ గృష్ణునిచే నాదేశింపబడి రచింపబడెను. విశిష్టాద్వైత సిద్ధాంతమున నడచిన గోవిందరాజీయ వాఖ్యావిశేషాదుల సమకూర్చి వెంకటకవి వాల్మీకి రామాయణమును యథాతథముగ ననువదించుచుఁ దనరామాయణమును రచించెను. ఈ విషయమును సుందరకాండారంభముననే స్పష్టముగ గమనింపగలము వాల్మీకి రామాయణమున మొట్టమొదటి శ్లోకము

[2] "తతో రావణ నీతాయా – స్సీతాయాశ్శత్రు కర్శనః
ఇయేష పద మన్వేష్టుం – చారణా చరితే పథి" అనునది.

దీనికి వెంకటకవి సరిగా ఆరంభముననే చెప్పుచు [3] "ఇత్తెఱంగున శత్రుకర్శనుండగు హనుమంతుఁడు రావణనీతయైన సీత యున్న పదం బన్వే

---

1. తెలుగు సాహిత్యము – రామకథ పుట – 64
2. వా. రా. సుం. 1 – 1
3. గో. రా. సుం. 2

షించుటకు గగన మార్గంబునం బోవ సమకట్టి' అని అనువదించెను. ఇది యథానువాదమనుట స్పష్టమగుచున్నది.

సముద్రముపైకి వచ్చిన మైనాకునిం గాంచి వాల్మీకిహనుమంతుఁడు విఘ్నముగఁ దలంచెను. భాస్కరుఁడు రక్షకుఁడట్లు మైనట్లు భావించెను. ఆ భావనలను సముచితముగ భావించిన వేంకటకవి మూలమును గూడ కాదనక [1] 'కని వీఁడొక్క నిశాచరుండగుట నిక్కం బిక్కడన్ నాకుఁజయ్యైన విఘ్నం బొనరింప వచ్చె నని యుభయతారకముగఁ జెప్పెను. హనుమంతుని సముద్రోల్లంఘన కార్యమును వాల్మీకి పునః పునః దుష్కరకర్మయనుచుఁజెప్పెను. ఆ శబ్దము యొక్క శక్తిని గ్రహించిన జయదేవుఁడు చంద్రాలోకమున అర్థాంతరన్యాసాలంకారోదాహరణముగ 'హనుమానబ్ధి మతరత్ – దుష్కరం కిం మహాత్మనాం' అని స్వీకరింప నట్లు గుర్తించిన వెంకటకవి 'ఇట్టి దుష్కర కర్మంబు'(23) 'నీవీ దుష్కరకర్మ మొనర్చి' (76) 'తదీయ దుష్కర కర్మంబుఁ జూచి' (86) అని ప్రయోగించెను. సింహికఁ జంపినప్పుడు నాలవదియైన తన్మహాద్భుతంబు (122) అనెను. ఈనాల్గు దుష్కర్మలు నాల్గువిధములైనవి. నాల్గింట మతిమంతుఁడగు హనుమంతుఁడు నాల్గువిధముల లక్షణములఁ బ్రదర్శించెను. ఆవిషయము నాకాశచరులగువారు వచ్చి యిట్లు చెప్పిరి.

[2] ''మహాత్మా! ఘోరంబైన యీ సత్వంబు నీచేత నిహతం బయ్యె
నీకు శుభంబగు నిక నెయ్యదియు నసాధ్యంబు లే దెట్టి కర్మంబుల
యందైన నీకు ధృతియు, దృష్టియు, మతియు, దాక్ష్యంబును
నశియింపకుండుననియనిరి. దీనికి మూలము

[3] ''యస్యత్వేతాని చత్వారి – వానరేంద్ర యథా తవ
స్మృతి ర్ధృతి ర్మతి ర్దాక్ష్యం – సకర్మసు న సీదతి'' యనునది.

ఈరీతిగా హనుమంతుని యందుఁగల ధృతి, దృష్టి, మతి, దాక్ష్యము నను నాల్గునిట దుష్కరకార్యములు నాల్గిట సాధకము లయ్యెను. ఈ భావమును [4] 'తత్త్వదీపిక వ్యాఖ్య విపుల మొనర్చెను.

---

1. గో. రా. సుం. 73
2. గో. రా. సుం. 122
3. వా రా సుం. 1-199
4. తత్త్వ. పుట - 126

ధృతి : వ్యవసాయాత్మక బుద్ధి - నిరాలంబముగ నాకాశమున బయ
నించి నూఱుయోజనముల సముద్రము దాటుటలో పూనిక.

దృష్టి : సత్కార, మాన, పూజలకు వశపడకుండ లాభాలాభములలో
సమత్వదృష్టి కల్గియుండుట - మైనాకవృత్తాంతమున.

మతి : విహితకర్మాచరణము - సురస నుపాయమున జయించెను.

దాక్ష్యము : నిషిద్ధకర్మత్యాగము - అందుకు సామర్థ్యము - సింహికా
వృత్తాంతమునఁ జూపట్టును.

ఇట్టి లక్షణములు కల్గియున్న హనుమత్స్వరూపమీ వృత్తాంత
ములఁ దెలియును. మతిమంతుఁడగుట నాతఁడు సురసతో [1] 'కర్తుమర్హసి
రామస్య సాహ్యం విషయవాసిని' యనెను. దీనిని వెంకటకవి స్పష్టపర
చుచూ [2] 'రఘుపుంగవు కార్యము భక్తియుక్తితో నీవునుఁ జేయఁ
గావలయు నెమ్మిగ రాఘవరాజ్య వాసినీ' అని రామరాజ్యములో నున్న
టులనే సంబోధించుట సాభిప్రాయము. ఇదేయభిప్రాయము సారోద్ధార
వ్యాఖ్యయందు [3] 'కర్తుమర్హసీతి విషయవాసిని రామరాజ్య నివాసినీ
త్యర్థః' అని కలదు.

మారుతి తొంబది యోజనములు పెరిగి సురస నూరుయోజనముల
నోరు పెంచినంతనే యంగుష్ఠమాత్రుఁడగుటలోఁ 'గరముమతిమంతుడౌట'
నని వెంకటకవి కారణముఁ జూపెను. [4] 'నావిని శ్రీమంతుఁడగుపావని'
యని వేంకటకవి యనెను. వాల్మీకి ప్రతిదుష్కర కార్యమునెడ హనుమం
తుని శ్రీమంతుఁనిగా జెప్పును ఇది ఐశ్వర్యవంతునిగాఁగాక కార్యశూరు
నిగాఁజెప్పు నుద్దేశ్యమును [5] 'తత్త్వదీపిక వ్యాఖ్యానించెను. ఇట శ్రీమం
తుఁడనుట హనుమంతుని శ్రీవిద్యోపాసనా దక్షత గ్రహింపదగినది దాని
వలన సంప్రాప్తమైన అష్టసిద్ధులవలననే హనుమంతుఁడు అట్టి దుష్కర
కార్యముల సాధకుఁడయి శ్రీమంతుఁడయినట్లు చెప్పుట వాల్మీకి యాంత
ర్యము. 'పాణినా శైలమాలభ్య' అన్న వాల్మీకమునకు 'శైలంబుపైఁ
గేలూది'యని వెంకటకవి చెప్పెను. అప్పట్టున 'మరలవచ్చునపుడునీతోడఁ

---

1. వా. రా. సుం. 1-155
2. గో. రా. సుం. 98
3. రా. సాకో. సుం. పుట - 9
4. గో. రా. సుం. 96
5. తత్త్వ పుట - 120

గూర్మి నెటిపెద' ననియు ననెను. ఇది యమూలకము. ఇట హనుమ దాశ్రి నారాయణము [1] 'ఉద్ధూర్ఛితమ ముఖాంబుజోద్రి శిరసి న్యస్తాగ్రి పాదాంగుళిః' అని పాదాంగుళి నుంచినట్లు చెప్పుచున్నది. అట్లయిన వ్యోమగాముఁడు కష్టాంతరమునకై పునర్ఛేదనము గావించుకొన్నట్లు హనుమంతుఁడు నొనర్చినరీతి తెలియును. లంకను జయించి మారుతి యద్వారంబునఁబురిఁజొచ్చి

[2] "పడతుక నెపమునఁ బతిచేఁ
జెడగల దీ లంక యింక సిద్ధం బనుచున్
ఎడమయడుగు మును పెట్టుచుఁ
గడు రయమున రాజమార్గగతుఁడై యరిగెన్"

అని యనుటలో నా వాక్యకోవిదు వాక్యము శాపమె యయ్యెను. అంతియ కాక యాతనిచేష్ట యెడమయడుగు ముందుపెట్టి పోవుట యందు కనుగుణ చర్య. శాస్త్రవిహితచర్య.

[3] "ప్రయాణకాలే చ గృహప్రవేశే
వివాహకాలేఽపి చ దక్షిణాంఘ్రిం
కృత్వాగ్రత శ్శత్రు పురప్రవేశే
వామం నిదధ్యా త్పురతో నృపాల" అని బృహస్పతివచనము

చెప్పుచున్నది. ఇట్టి నీతిశాస్త్రజ్ఞునిగా గుర్తించిన కారణమునసనే వేంకటకవి [4] 'శోభన నీతిమార్గ వర్తియుఁ, గృతప్రియుత్నుండును, దూరసాక్షాత్కార సమర్థుండు నగుఁబవననందను'డని కొనియాడెను. అట్లే పుష్పక విమానమున సీతను వెదుకుటలో దూరప్రణిహి తేక్షణుండై పాదన్యాసంబునం జప్పుడు కానీక' యనును. ఇవి హనుమంతుని కార్యకుశలతకు నిదర్శనములు.

వెంకటకవి తనకుఁబూర్వులు భాస్కర రంగనాథులు వ్రాసిన రామాయణమును బరిశీలించి యందలి విశేషముల గ్రహించి తనరామాయణవచనముఁగావించెను. వారిరచనల నున్న గుణములు స్వీకరించు

---

1. రా. సారో. సుం పుట - 9
2. గో. రా. సుం. 181
3. రా. సారో సుం పుట - 21
4. గో. రా. సుం. 35

నుదాత్తభావము కలవాఁడు కాన తనకు నచ్చిన భావములను స్వీకరించుటయు కాక పద్యములను కూడ స్వీకరించి తనకు వారియందుఁ గల గౌరవమును ప్రదర్శించుకొనెను. [1] 'కాన నిది పంక్తికంఠుని మానిని గానోపు' నని భాస్కరుని హనుమంతునివలెనే [2] 'కాన నిది రాక్షసేంద్రుని మానిని గానోపు' నని వెంకటకవి హనుమంతుఁడు కూడ తలఁచెను.

[3] 'ధరణిజ పుణ్యసాధ్వి' యను పద్యము భాస్కరునినుండి యథాతథము గ వెంకటకవి స్వీకరించెను. సీతాన్వేషణలో రావణాంతఃపురమున నభ్యంతర గృహములఁ దప్పక పరస్త్రీల మర్మస్థానములు చూడవలసివచ్చె నని చింతించెను. ధర్మలోప మొనరించుఁగదా యని విచారించెను. ఇంతలోనె నిశ్చితైకాంతమతి కా వనేచరునకు నర్థనిశ్చయదర్శినియగు బుద్ధిజనించె నని చెప్పెను. కావుననే తనచర్యను మూఁడుకారణముల సమర్థించెను.

1. మానసమున మన్మథవకతఁజూడమి.

2. సుదతిని సుదతులలో వెదుకవలసియుండుట.

3. పుణ్యశ్లోకుఁడు రామునిపనుపున వచ్చుట నెల్లపనులు శుభంబు లగుట.

ఇట్లు గోపీనాథరామాయణమున నిశ్చితైకాంతమతిగా హనుమంతుని చిత్రించెను.

అశోకవనమున శింశుపావృక్షమునుండి క్రింద సీతను గుర్తించినంతలో రావణుఁడు వచ్చెను. ఇట వాల్మీకి

''అవప్లుతో మహాతేజా - హనుమాన్ మారుతాత్మజః
స తథా ప్యుగ్రతేజ స్సన్ నిర్ధూత స్తస్య తేజసా
పత్త్రగుల్మాంతరే సక్తో హనుమాన్ సంవృతోఽభవత్''

అని మహాతేజస్సు కలవాఁడయ్యు రావణుని చూచి ఎగిరిపడినట్లు, రావణుని తేజస్సుచే చెదరకొట్టబడి ఆకులగుబురులలో నణిగియున్నట్లు చెప్పెను. అతువాదకు లితరులు నట్లు గ్రహింప వేంకటకవి. [5] 'దనుజుని చం

---

1. భా. రా. సుం. 111
2. గో. రా. సుం. 302
3. భా. రా. సుం. 112, గో.రా.సుం. 303
4. వా. రా. సుం. 18-31
5. గో. రా. సుం. 445

దము గనుఁగొని మనమున వెసఁ బర్ణపనము మాటున నుండెన్'' అని చెప్పి హనుమంతుని యుదాత్తతను కాపాడెను. త్రిజట స్వప్నవృత్తాంతముఁ జెప్పుచు [1] 'నీ లంక రామకింకరుం డగు నొక్క వానరునిచే భస్మీభూతమై కూలినట్లు' ననెను. వాల్మీకమునందుఁగల ఈ విషయము భాస్కర రంగనాథులు చెప్పలేదు.

ఉత్తమ దౌత్యలక్షణము నెఱిఁగి యూహాపోహల విచారించి కార్యనిర్వహణ మొనర్చినటుల హనుమంతుని గూర్చి గోపీనాథరామాయణమునఁ గలదు. అందుననే యతిసూక్ష్మరూపంబున నావృక్షముమీదనే యుండి ప్రయోగసౌష్ఠవ లక్షణసంస్కార యుక్తంబైన కోశలదేశస్థిత మనుష్య సంబంధి భాషచేత సీత నాశ్వాసింప నెంచెను. సీతకుఁగానవచ్చిన హనుమంతుని వేంకటకవి

[2] ''ఉదయగిరిమీద రవిభంగి నొప్పువాని
పుల్ల కింశుకసుమకాంతిఁ బొలుచువాని
వేష్టితార్జునచేలుని విద్రుమాభ
వతన దీప్త చామీకర వర్ణనయను'' నని

''సుగ్రీవసఖునిఁగపివం
శాగ్రేసరు నల నమీరణాత్మజుఁగుతుక
వ్యగ్రమనస్కుని రఘువం
శగ్రామణి దూత ననిలజవు హనుమంతున్''

అని రెండుపద్యముల వర్ణించెను. ఇందుఁదొలిపద్యము అవయవ వర్ణనము దెలుప రెండవది యవయవిని గూర్చి వర్ణించునది. ఇట్లు హనుమంతుని పూర్ణమూర్తిని పాఠకులముం దుంచినవాఁడయ్యెను అద్భుత మగునట్టి హనుమన్మూర్తిని చూడగనే సీత [3] 'కలయో దైత్యుని మాయయో హృదయమైకల్యోద్ధమో నిక్కమో, తెలియ న్నేరక యున్నదాననో ధరిత్రిపుత్రినో కానో' యని యాలోచించును. ఇది శ్రీకృష్ణునినోట భువనత్రయము చూచి యశోద యనుకొన్న [4] 'కలయో వైష్ణవమాయయో ఇతర

1. గో. రా. సుం. 640
2. గో. రా. సుం 695, 696
3 గో. రా. సుం. 702
4. భాగ. 10 - 314

సంకల్పార్థమో సత్యమో యశోదాదేవినో కానో' యన్న పోతన భాగవత పద్యమున కనుకరణము

సీత మారుతియందు విశ్వాస మేర్పడ రామలక్ష్మణుల రూపగుణ విశేషములు తెల్పు మని కోరెను. అందుకు 'మద్భాగ్యవిశేషంబున రామ లక్ష్మణుల సర్వావయువ సన్నివేశ ప్రకారం బెటింగింపు మని యడిగితి' వని చెప్పుట పావని యనన్యసామాన్య భక్తిని ప్రకటించుచున్నది. అంగుళీయకము నిచ్చుటతో నాతనిని రామదూతగ నిశ్చయించి సీత

1 ''శతయోజనాయత జలనిధి నెవ్వాఁడు
గోష్పదంబును బోలెఁగోరి దాఁటె
కపివీరుఁడెవ్వఁడొక్కఁడు సాహసంబున
బొలుపార నీ దైత్యపురము సొచ్చె
నసురేశువలని భయం బించుకయు లేక
ఘనత నెవ్వఁడశోకవనముఁజేరె
నెవ్వాఁడు రాముని హేమరత్నపరిభా

దీప్తము ద్రిక నాకుఁదెచ్చి యిచ్చె
నట్టి నీవు విక్రాంతుండ వతిహితుఁడ
వతిసమర్థుండ వధిక శౌర్యాన్వితుండవు
విపులయశుఁడవు సామాన్యకపివి గావు
మిగుల నాతోడ భాషింపఁదగుదు వీవు'' అని

2 ''ఓహరివంశశేఖర! రఘూత్తముఁడెంతయు నీ ప్రభావము
న్సాహసముం బరాక్రమము శౌర్యమ దాక్ష్యము నార్జవంబు న
ర్థాహిత నీతియున్ ధృతియు నాతత తేజ మెఱింగి రావె యు
త్సాహ మెలర్ప నాకడకు సమ్మతి నిన్ననిచెన్ గృపామతిన్''

అనియును కొనియాడెను. ఇందు హనుమంతుని యసాధారణ కార్యనిర్వ హణ దక్షత, శౌర్యము, కీర్తి, ప్రభావము, సాహసము, పరాక్రమము, ఆర్జ వము, నీతిశాస్త్రజ్ఞత, ధృతి, తేజము ప్రకటితము లగుచున్నవి. ఈ పద్య

1. గో. రా. సుం. 833
2. గో. రా. సుం. 835

ములు హనుమ ద్విశిష్టతను వ్యక్త మొనర్చును. గోపీనాథుని యాలంకారికరచనాశక్తికి [1] 'కమనీయ నవమల్లికా వల్లికలఁజూచి' పద్యము చక్కని యుదాహరణము. స్వతంత్రభావములతో మనోజ్ఞముగ కావ్యనిర్మాణము గావింపగల సామర్థ్యము నిట్టిపద్యము ను తెలియజేయును. రావణుని తర్జనవలన నిరాశ వహించి యున్న సీత నెన్నో విధముల హనుమంతుఁడు నూరడించెను. ఇంకనూ నమ్మకముగా

[2] ''సరసిజనేత్రు రాఘవుఁడు చయ్యన వచ్చి దశాస్యు నాజల
బొరిగొని నిన్నుఁదోఁడుగొని పోవు నిజం బిది నమ్మవేని సు
స్థిరముగ నాదువీపున వసింపుము వే గొని యబ్ధి దాటి భూ
వరునకు నిన్నొసంగెదను వహ్ని బలారికి హవ్యము న్బలెన్''

అని పల్కెను. [3] 'ప్రాపయిష్యామి శక్రాయ - హవ్యం హుత మివానలః' అనునది మూలము. ఇట నీ యుపమాన మెంతయు సముచితము 'అగ్నిర్మాణవకః' వంటి లక్షణామూలక ధ్వనివాక్యముల మాణవకునివలె హనుమంతుఁడు బ్రహ్మచర్యనిష్ఠా గరిష్ఠత నగ్నివంటివాఁడు. అట్టి యగ్నినిఁ దాకుట దోష మనుకొను నాస్కారమే లేదు. అగ్నిసంశోధనమున నన్నియుఁ బవిత్రము లగును. మృణ్మయములకుఁ దాపమువలన శుద్ధి యని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. పార్థివశరీరము మృణ్మయ మగుటయ కాక సీత భూపుత్రి. కాన నా యగ్నివలన శౌచమేతప్ప వేఱుకాదు.

హనుమంతుఁ డగ్నిసంభవుఁడు కూడ. శివవీర్యము వాయువుకన్న మున్ను వహించినవాఁ డగ్నియే. కాన 'ఆత్మావై పుత్రనామాసి' యన్నటుల నా హనుమంతునియం దగ్నితత్త్వ ముండును 'ఆకాశాద్వాయుః; వాయో రగ్నిః' అని వాయుజన్ముఁ డగ్నియు. అట్లే 'అగ్నిం దూతం వృణీమహే' ఇత్యాది ఋఙ్మంత్రంబులు నీయర్థమునే తెలుపుచున్నవి. సీతాన్వేషణకార్య మొక మహాయజ్ఞము. అందు సీతను రామున కందఁ జేయుట పూర్ణాహుతివంటిది. రాముఁడు దైవతము. 'అగ్నిముఖా ఇవహి

1. గో. రా. సుం. 864
2. గో. రా. సుం. 874
3. వా. రా. సు... 7 - 21

దేవాః' అనువాక్యా నాగేవతలకు నగ్నిద్వారా అన్నియుఁ జేరవలె ననుట సీతామాతను దైవతమగు రామునకుఁ జేర్చుటలోఁ దా నగ్ని హోత్రినిగా నుండు నను ధ్వని వ్యక్త మగుచు హనుమంతుని ప్రజ్ఞా నావాక్యము తెలియఁజేయుచున్నది. ఉత్ప్రేక్షను భావింపఁజేయుచున్నది. ఇట్లు యూహమాన మానసమానమై యొప్పుచున్నది.

హనుమంతుని కార్యకుశలతను బహుధా ప్రశంసించి సీతాదేవి ఈ కార్యసంఘటనంబునందు వ్యవస్థాపకుఁడ వనును. అనిన నామెకడ

''అచట నున్న వానరవీరు లందఱును స
మానబలులు మత్తుల్యులు మద్విశిష్టు
లరయ నాకంటెఁదక్కువ యైనవాఁడు
వారిలో నొక్కఁడును నిక్కువముగ లేఁడు''

అని తెల్పుట యామెకు ధైర్యవిశ్వాసములు కల్గఁజేయుట కైనను హనుమంతుని యవికత్థనతను చాటుచున్నది. అంతటి దుఃఖిత కెంతయో ధైర్యము గల్గించినందుననే జానకి [1] 'అనఘాత్మ ప్రియవాది వైన నిన్గని వృష్టి సంప్రాప్తి నర్థసంజాత సస్యమైన వసుంధర యట్లు సంతసమున వెలసితి' నని ప్రియవాదిగఁ బొగడెను.

హనుమంతుఁ డెంతటి వాక్ఛక్తి, బుద్ధిబలము కలవాడో అంతటి యోద్ధ. యూపాక్ష విరూపాక్షాదులతోడి యుద్ధమున గజములచే గజముల రథములచే రథముల ద్రెవేసి చతురంగబలముల నతిభయానకరీతిలోఁ జంపెను. రావణసుతు నక్షుని వేయిమారు లాకసమునఁ ద్రిప్పి చంపి నేలఁ బడవైచెను. అందుననే రావణుఁడే ఇంద్రజిత్తునకు 'అయ్యగచరుండు కాలాగ్ని కల్పుండు గావునఁ బాణితల ముష్టిప్రహరణాదులచేత వధించుటకు శక్యుఁడు గాడు. వానికి వాయువుకంటె నధికజవంబుకలదు. కావున వానియందు సైన్యంబులు పనిగొనవు' అని జాగ్రత్తలు చెప్పెను. యుద్ధరంగమున ఇంద్రజిత్తే హనుమంతుని యవధ్యత్వంబును, లక్ష్యగోచరుండు కాక చిత్రగతులం బరిభ్రమించుటయునుం దలపోసి మనంబున

---

1. గో. రా. సుం. 1103

[1] ''వీని భుజా విజృంభణము వీని విచిత్రగతి ప్రమాణముల్
వీని పరాక్రమ క్రమము వీని జయోచితజన్య దాక్ష్య మె
వ్వానికి లేదు ముజ్జగమువారలలోపల వీఁ డవధ్యుఁ డె
ట్లో నితనిన్ రణంబున జయింపుదు నెద్ది యుపాయ మారయన్''

అని మెచ్చెను. బ్రహ్మాస్త్ర బద్ధుఁడయి మరలవిముక్తుఁడగు దెఱిఁగియు వీఁ డెంత సంపన్నుఁడో' యని యెంతగనో కొనియాడెను. ఇట్లు హనుమంతుని యువక్రవిక్రమము ప్రకట మగుచున్నది. తనముం దుంచబడిన హనుమంతుని చూచిన రావణుండు పరమ విస్మయవ్యగ్ర మానసుండై 'అహో వీని యుదగ్ర రూపవిభవం బాహో భుజా విక్రమం' బనుచుఁ బొగడక యుండలేకపోయె నన హనుమచ్ఛక్తి యట్టిదిగఁ దెలియును. హనుమంతుఁడు తన లాంగూలమున సుప్రతిష్ఠితుఁడైన శిఖికి సంతర్పణము గావించుట రుద్రుఁడు త్రిపురముల దహించుటగా వర్ణించెను. రుద్రావతారుఁడగుఁబావనియెడ నా భావనము సముచితము. మధువనమున వానరు లొనర్చిన రగడ నంతను వేంకటకవి వృషభగతిరగడయందు సముచితముగఁదెల్పెను. హనుమత్కార్యమునకు మెచ్చిన రాముఁడు.

[2] ''పరమ ప్రీతి యుతుండై
పరవీరఘ్నుండు రామభద్రుఁడు కరుణా
పరికలిత కటాక్షంబులఁ
బరికించి బహూకరించెఁబవనతనూజున్''

అని రామానుగ్రహప్రాప్తి హనుమంతునియందుఁజెప్పెను. ఇట్లు గోపీనాథము వేంకటకవి సుందరకాండయందలి హనుమంతుని వాల్మీకి యడుగు జాడలలోఁజక్కఁగఁజిత్రించెను.

## శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము - సుందరకాండ

ఆంధ్రవాఙ్మయమునఁ గల రామాయణములలో వాల్మీకమును పూర్తిగా ననుసరించుటయు కాక గ్రంథనామమునే వాల్మీకిరామాయణ ముగాఁబేర్కొన్న దీ రామాయణము. దీనిని శ్రీవావిలికొలను సుబ్బారావు గారురచించిరి. గ్రంథమాత్రము నాంధ్రీకరించుటయుకాక, దీనికి మందర

1. గో. రా. సుం. 1103 2. గో. రా సుం. 1458

మనుష్యాళ్ళనుకూడ రక్షించిరి. వీరు వైష్ణవమతానుయాయు లగుట వీరి రచనము గోవిందనామావళ్యాది వైష్ణవ సంప్రదాయ విధానములలో నడచెను. వీరి దీక్షానామము వాసుదాసు-రామకార్యమునకై వీరు శ్రీ కోదండరామ సేవక ధర్మసమాజము స్థాపించి హనుమంతుని దాని నాయకునిగా స్వీకరించుట విశేషము. ఒంటిమిట్టకోదండరామస్వామి, సంజీవరాయుడు వీరి కారాధ్యులు. ఆ రామునకే తమ రామాయణకావ్యము సంకితము గావించిరి. గుంటూరు జిల్లా అంగలకుదురునందు దాసకుటీని స్థాపించిరి. భక్తి ప్రచారార్థ మెన్నియో మార్గము లవలంబించిరి. వానిలో భాగముగా భక్తి సంజీవిని యని యొక పత్రికను స్థాపించిరి.

వావిలికొలను సుబ్బారావుగారు రామాయణము నందలి హనుమంతుని ప్రత్యేకదృష్టితో బరిశీలించిరి హనుమంతునియందు నాచార్యత్వము గుర్తించి దానినే తమ గ్రంథ వ్యాఖ్యానములందు పోషించిరి. ఇందు హనుమంతుని నొక యోగిగా దర్శించి యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధులను నెనిమిది యోగాంగములను ఎడనెడ హనుమంతునియందు దర్శించి వ్రిదర్శించిరి. ... రామాయణ విధానము లన్నిటిని పాటించినట్లిందు నాద్యంత నియమమును పాటింపబడెను. వాల్మీకి సుందరకాండను తాదితాంత మొనర్చినట్లు ఈ యాంధ్రవాల్మీకియు నొనర్చెను. [1] 'తతో రావణనీతాయాః - సీతాయా శత్రుకర్శనః' అనునది వాల్మీకిరామాయణ సుందరకాండయందు తాది కవిరచితమైన శ్లోకము. వాసుదాసుకూడ [2] 'తరువాత రావణాసుర పరిసీత ధరాత్మజాత పదము న్వెతకన్' అని తొలిపద్యమును రచించెను మంగళార్థ పద్యము కాగానే గ్రంథాదిపద్యముగా నిదియే రచింపబడెను ఉల్లేఖపఱకు

[3] ''తతో మయా వాగ్భి రదీనభాషిణా - శివాభి రిష్టాభి రభిప్రసాదితా
జగామ శాంతిం మమ మైథిలాత్మజా-తవాపి శోకేన తథాభిపీడితా।''

అని యాద్యంత తకారశ్లోకమువలెనే వాసుదాసు

[4] ''తత భవ ద్దుఃఖమునకును ధరణి గోత్రి

---

1. వా. రా. సుం. 1 - 1
2. ఆం. వా. రా. 1 - 2
3. వా రా సుం. 68-29
4. ఆం. వా. రా. సుం. 1458

వార్ధిచంద్రిమ యట్లు తా బాధపడుచు
శుభము నిష్టంబు నగు నాదు సూక్తి ధృతి నొ
సంగ శ్రీరామ వహియించె శాంతి సీత" అని యాద్యంత తకార పద్యము విరచించెను. ఇందుఁదొలిపద్యమ్ము హనుమంతునిగూర్చి కవి చెప్పినది కాగా మలిపద్యము స్వయమ్ముగ హనుమంతుఁడే చెప్పెను.

ప్రధానమగు మూలము నెంతమాత్రము తొలిగింపక 2846 శ్లోకములు గల మూలరామాయణ సందర్భమును వాసుదాసు తన యాంధ్ర వాల్మీకమున 1460 గద్యపద్యములలో కూర్చెను. పద్యములు అనుష్టుప్ కంటె పెద్దవిగనే యుండుటవలన భావమువలెనే పదసముదాయముకూడ మూలమునకుఁదక్కువకానిరీతినే స్వీకరించె నని గ్రహింపవలెను. వాసుదాసుని హనుమంతునియందుఁబ్రధానముగ గుర్తింపదగినది యాతని యాచార్యత్వము. దానిని హనుమంతునియందుఁబ్రతిపాదించుచునే గ్రంధ రచనము గావించెను.

తొలిపద్యమునందే శిష్యుఁడున్న చోట వెదకునట్టి యాచార్యస్వరూపమును నిరూపించెను. రాముఁ డను నిత్యవిభూతి నున్న సీత మారీచుఁడనుమాయవలన లీలావిభూతియం దాసక్త యయ్యెను. భక్తిరూపుఁడగు లక్ష్మణునికూడ దూరము చేసికొనెను. అందుకుఁ దగిన ఫల మనుభవించుచుఁబరమాత్మకై పరితపించుచుండెను. అట్టి యామెనె శిష్యగా గ్రహించి రామముద్రయమ్ము మంత్రము నిడి యుద్ధరించిన యాచార్యుఁడు హనుమంతుడు. కావున వాసుదాసు హనుమంతున కాచార్యపీఠ మొసంగెను. [1] 'సుందర స్సుముఖ స్స్వచ్ఛః - సులభో బహుమంత్రవిత్' అని యాచార్యలక్షణము చెప్పఁబడెను. సుందరుఁడగు నాచార్యుఁడు కాన సీతనిని ప్రతిపాదించు నీ కాండయు సుందరకాండ యయ్యె నని గ్రహింపవలెను.

శిష్యుఁడు సద్గురువు నన్వేషించునట్లు ఆచార్యుఁడును సచ్ఛిష్యు నన్వేషింపవలెను. అట్టి శిష్యాన్వేషణ సంప్రదాయ మీ తొలిపద్యమున వాసుదాసుచే నిరూపింపఁబడెను. నృపదూతయను హనుమత్పరమగు

1. సుందర హనుమద్వైభవము 111 పుట

పదము నృప = నృ = నరులను, జీవకోటులను, ప = పాలించువాఁడు అనగా జీవాత్మల కీశ్వరుఁడై వానియం దంతర్యామియై ప్రేరకుఁడై యుండువాడు. అట్టివాఁడు భగవంతుఁడు. ఆయనదూత 'సందేశహరో దూతః'యని యమరము కాన; దూఙ్ పరితాపే' వీనిచే శత్రువు తపింపఁ జేయఁబడును కాన దూత యగుట - రామవాక్యము దెల్పుట, శత్రువుల సేనాసంహార, లంకాదహనములఁ దపింపజేయుటలవలన సార్థకుఁడగు దైవప్రేరితుఁడగు నాచార్యునిగా హనుమంతుఁడు నిరూపింపబడెను. 'చారణా చరితే పథి' యన్న మూలపదములను 'గురుచారణ మార్గం బున' అని గురుశబ్దము, చారయంతి ఇతి చారణాః - ధర్మము నమంష్ఠిచు వారు. అనగాఁబూర్వాచార్యులు. వారి మార్గమున నరుగ నెంచిన వానిగా నా శబ్దముకూడ హనుమంతుని యాచార్యత్వబోధకముగా నిరూపించెను.

సముద్రోల్లంఘనము చేయు హనుమంతుఁడు అనేకవిధములుగ నుపమింపబడెను. అట్లే యథామూలము

[1] ''పదియామడ వెడలుపు ము
ప్పదియామడ నిడివి యగుచుఁబరఁగి రుచిరమై
యుదధిని బావనినీడ వి
శద ఘన ఘనపంక్తి యనఁగఁజనుచుండె వడిన్''

అని సముద్రముదాటుచున్న హనుమంతుని నీడను వర్ణించెను. ఇది

[2] ''దశయోజన విస్తీర్ణా - త్రింశద్యోజన మాయతా
ఛాయా వానరసింహస్య - జలే చారుతరాఽభవత్''

ఇత్యాది శ్లోకానువాదము. దీనిని ప్రతిఫలించిన ద్వేహప్రమాణముగా స్వీక రించిన మూడంజలలోనే చేరినట్లు చెప్పవలెను. కావున మందరమున కృతికర్త వివరణ మిదుచు ఉదయకాలము కావున నీడలు దీర్ఘములై యుండు నని, నీటికి చాలయెత్తుఁగఁబోవుచున్నందున నీడ యంతపెద్ద దిగా యేర్పడునని వివరించెను. కాని పరాశరసంహితయందు

[3] ''దశయోజన విస్తీర్ణం - త్రింశద్యోజన మాయతం

---

1 ఆం. వా. రా. సుం. 61 3. ప. సం. 51 - 32
2. వా. రా. సుం. 1-76

తేనైన రూపభేదేన - తీర్ణో హి సరితాంపతిః
తద్రూప దర్శనా త్సద్యో - భీమసేనో ముమూర్ఛ సః''

అని కలదు. అది సంజీవపర్వతానయన సమయమందలి రూపమై యుండవచ్చును. యోగసాధనచే నణిమాదిసిద్ధులు కలవాఁడు హనుమంతుఁడు. అట్టిశక్తిని ప్రదర్శించుచుఁబెంచిన యాకారము నొక్కమారు చిన్నదిగాఁ జేసి యంగుష్ఠమాత్రుఁడై సురసనోరఁజొచ్చి వెలువడెను. అప్పుడు సురసతో నాడిన మాటలు కార్యసాధకుఁడగు హనుమంతుని సౌమ్యతను ప్రకటించునవి. రచనయం దిట్టి సౌమ్యత కలుగు.

[1] ''తల్లీ! నివదనంబుఁజొచ్చితిని సత్యం బయ్యె నీకోర్కి, సం
చల్లీలం గరుణించి నాదగు నమస్కారంబు గైకొమ్ము నే
నుల్లాసంబుగ జానకి న్వెదకు నుద్యోగంబునం బోదు నీ
యుల్లంబందు శుభంబు సంఘటనగా నూహింపు దాక్షాయణీ''

ఇది మూలాధిక శోభతో నడిపిన సంభాషణము. ఇందు తల్లీ! అని హనుమంతుఁడు సంబోధించుట సాభిప్రాయము. లోనుండి వెలువడుటవలన నిట్లు సంబోధించుట సార్థకము. హనుమంతుఁడు లంకలోఁజొచ్చు నుపాయమాలోచించుచు దేశకాలజ్ఞుఁడై దూత యుండవలె ననుకొనుచు

'దీని నిటు సల్ప సఫలం
బౌ నని ప్రాజ్ఞులు విధించునట్టిది కార్యం
బై నను జెఱుచును బండిత
మాని యయిన దూత శక్తిమంతుఁడు గామిన్''

అని తలచెను. ఈ తలంపుద్వారా హనుమంతునియందుఁగల దూత లక్షణముల వివరించుచు

దూతం చైవ ప్రకుర్వీత - సర్వశాస్త్ర విశారదమ్
ఇంగితాకార చేష్టజ్ఞం - శుచిం దక్షం కులోద్గతమ్'' అనియు
అనురక్తః శుచి ర్దక్షః - స్మృతిమాన్ దేశకాలవిత్
వపుష్మాన్ వీతభీ ర్వాగ్మీ - దూతో రాజ్ఞః ప్రశస్యతే''

1. ఆం. వా. రా. సుం. 109
2. ఆం. వా. రా. సుం. 154

అనియు మందరమున దూతలక్షణముల నిడెను. కావున హనుమంతుఁడు సర్వశాస్త్రవిశారదుఁడు, ఇతరులమనస్స్వభావము ఆకారచేష్టాదికము గ్రహింపఁగలవాఁడు, పరిశుద్ధుఁడు, సమర్థుఁడు, సర్వాంశసంజాతుఁడు, అందరియందు ననురాగము కలవాఁడు, జ్ఞాపకశక్తి కలవాఁడు, దేశకాలములనెఱిఁగినవాఁడు, చక్కనిదేహము గలవాఁడు, భయము లేనివాఁడు, మాటకారిగా నీరామాయణమునఁ జిత్రింపఁబడెను. హనుమత్కార్య సాధనయందు లంకా విజయము విశిష్టమైనది. లంకావిజయమే సర్వవిజయములకు కారణము. అదియే రాక్షసతతికి 'వినాశ' మేర్పడినట్లు గుర్తుగా బ్రహ్మదేవుఁడు పల్కెను. ఆత్మసాక్షాత్కారము గోరువాఁడు ముందుగా దేహమును జయింపవలె ననునదే సీతాన్వేషణలో లంకావిజయోద్దేశ్యముగాఁ జెప్పఁబడుట. ఇట వాసుదాసు

[1] ''శాపోపహతం బగు లం
కాపురముం జొచ్చి జనకకన్యకఁ గన ని
చ్ఛాపూర్తి యొదవఁగపికుల
దీపః యథాసుఖముగాఁగ ద్రిమ్మరు మునినన్''

అని లంకావాక్యములఁ జెప్పెను. పై పాదమున 'లం'తో విఱిచెను. అట్టి విఱుపు విశేషార్థ ప్రతిపాదకము. 'లం' అనునది పృథివీతత్త్వబీజాక్షరము. అదికలది యనగా లంక దేహము. దేహము జయింపనివాని కాత్మావలోకనము లేదు.

లంక అహంకారప్రతీక. అహంకార దేహాభిమానములు తొలఁగినఁ గాని యాత్మాన్వేషణ సాధ్యముకాదు. వాల్మీకమున [2] 'అహం రాక్షస రాజస్య'-'అహం హి నగరీ లంకా' ఇత్యాదిగా పునఃపునః అహంకార ప్రకటనఁగావించును. బ్రహ్మనిష్ఠుఁడగు హనుమంతుఁ డహంకారమును తొలగించుకొని యాత్మావలోకనమున కవకాశము నందెను. అతడు బ్రహ్మనిష్ఠుఁ డనుట [3] 'కస్త్వం? కేన చ కార్యేణ ఇహ ప్రాప్తో వనాలయ' అన్న లంకావాక్యమందలి ఈ [4] 'వనాలయ' శబ్దములో హనుమ బ్రహ్మనిష్ఠుఁ

1. ఆం. వా. రా. సుం. 183
2. వా. రా. సుం. 3 - 28, 30
3. వా. రా. సుం. 3 - 23
4. తత్త్వ పుట 143

డని ధ్వనించుచున్నది. వనము = బ్రహ్మము, ఉపనిషత్తులలో 'బ్రహ్మ వనం' 'బ్రహ్మ స వృక్ష ఆసీత్' అని బ్రహ్మను వనముగా రూపించును. ఈ వనమునందు వసించువాఁడు కావున ఆతనిని 'వనాలయుఁ' డనెను. హనుమంతుఁడామెను [1] 'కా త్వం విరూపనయనా' అనెను. అది ప్రకృతి పరమగు శబ్దము, విరూపమును = మారురూపమును, నయనా = పొందించునది ప్రకృతి. ఆత్మకాని దేహమునం దాత్మయను బుద్ధి కల్గించుటే విరూపము నొందించుట. అట్టి మాయచే కల్గు దేహాత్మభ్రాంతియే లంక యని ధ్వని. ఇట్లు హనుమంతుఁడు దేహాత్మాభిమానమును జయించుటయే లంకిణిని జయించుటలో సూచింపబడెను.

అట్లే లంకలో ప్రవేశించునప్పుడు హనుమంతుని

[2] "సత్యవిక్రముఁడైన కేసరిసుతుండు
కామరూపిణి లంకను గడిమి గెలిచి
తడయ కా పత్తనంబు నద్వారమునను
జొచ్చి ప్రాకారమును దాఁటి శూరవరుఁడు"

అని యద్వారమునఁ బ్రవేశించునట్లు చెప్పుటయు నీయర్థమునే బోధించును. దేహములోనికిఁబోవుటకు నవద్వారములు గలవు. ఆత్మయందు మనస్సు బోవుట కీద్వారములు పనికిరావు. కావున ప్రాకారము దాఁటెను. ప్ర + ఆకారము = స్థూలదేహమును భేదించె ననుట. ఇట వైష్ణవసంప్రదాయానుయాయి యగు తత్త్వదీపికయుఁ అద్వారేణ అనుచో [3] 'లంకశరీరము; అందు ప్రవేశించు ద్వారము కర్మ; అట్టికర్మనిమిత్తములేక యనుటకే అద్వారేణ యనెను. అట్లేమరియొక యర్థమున; అ = భగవంతుఁడు ద్వారముగా నిమిత్తముగాఁబ్రవేశించె నని యనఁగా భగవదాజ్ఞచే భగవంతుని పనిమీద ప్రవేశించె నని వివరించెను. అందుననే [4] 'భగవాన్ శశాంకః' 'భగవాన్ ప్రదోషః'అని భగవంతుఁడే ఆయారీతుల సహకరించినట్లు గ్రాహ్యము. [5] 'తథా హి లంకా విచారణేన శరీరం ద్యోతితం' అని

---

1. వా. రా. సుం. 3-26
2. ఆం. వా. రా. సుం. 184
3. తత్త్వ పుట - 145
4. వా. రా. సుం. 5 - 6, 8
5. సారో. సుం. పుట - 2

సారోద్ధారము. రావణాంతఃపురమున నాతనిభార్యలు రావణుఁగూడియుం డుట హనుమంతుఁడు

1 "ఈ రావణు భార్యలవలె
శ్రీరాముని ధర్మపత్ని చేరినచో దే
వారాతి సుకృతి యనెడు వి
చారం బుదయించె హరికి సద్బుద్ధి కటన్"

అని హనుమంతుఁడు భావించినరీతిఁజెప్పి యా హనుమద్భావనను గోవిం దరాజీయము ననుసరించి మందర మీరీతి వివరించెను.

1. రావణుఁడు సీతను రామున కిచ్చిన పుణ్యవంతుఁడగును. 2. సీతాదేవి రాముని వరింపకముందే యీస్త్రీలవలె రావణుని వరించియున్న వీఁడ దృష్టవంతుఁడు. 3. రావణుభార్యలు రావణుతోవలె సీత యిట్లపహరింపఁ బడక రామునితోఁగూడియున్న రావణు నైశ్వర్యము చెడకుండునుకదా యుని ఈ యాలోచనలలో ఆసదృశ గుణ విశిష్టయగు సీతను గూర్చి రెండవ యాలోచన వచ్చుటవలననే బాధపడె ననుచు ననంతరపద్యమున హనుమంతుఁడు వ్యసనపడినట్లు చెప్పెను.

వాల్మీకిరామాయణమున అశోకవన ప్రవేశసమయమున హనుమం తుఁడు చెప్పిన

2 "నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై
నమోఽస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో
నమోఽస్తు చంద్రార్క మరుద్గణేభ్యః"

అను శ్లోకము చాల ప్రశస్తమైనది. భక్తకోటియందు ధ్యానశ్లోకముగాఁ బ్రచురమై యున్నది. దీనిని వాసుదాసు-మధురముగా

3 "మ్రొక్కెద రామచంద్రునకు మోడ్చెదఁగేలు సుమిత్రపట్టికిన్
మ్రొక్కెదఁ దద్విదేహప తనూజకు శ్రీరఘురాము దేవికిన్
మ్రొక్కెద ధర్మ వాసవ మరుద్గణ మారుత రుద్రపాలికిన్

---

1. ఆం. వా. రా. సుం. 289 3. ఆం. వా. రా. సుం. 398
2. వా. రా. సుం. 13 - 59

ౘ్రమొక్కెద సూర్యచంద్రులకు ౘ్రమొక్కెదఁ దామరసప్రసూతికిన్''
అని యనువదించెను. ఇందు సంజయుఁడు రాయబారమునఁ బల్కిన తిక్కనయొక్క [1] 'ౘ్రమొక్కెద వాసుదేవునకు మోడ్చెదఁజేతులు సవ్యసాచికిన్' అను సంజయునిచేఁబల్కించిన పద్యఛాయలు కన్పట్టుచున్నవి. ఇట్లు వాసుదాసు తిక్కనయెడఁగల యభిమానమునుఁ బ్రకటించుకొనెను. సీతను సందర్శించిన హనుమంతుఁడు అమెను ప్రత్యభిజ్ఞచే సీతగా నిశ్చయించుకొనెను. రావణుఁ డపహరించిన నాటి సీతరూపమును [2] 'నిండుఁ జందురుఁబోలు నెమ్మోముగలదాని బొలుపు లీనెడి కనుబొమలదాని' అని హనుమంతుఁడు భావించినట్లు వాసుదాసు రచియించెను. అట్లే సర్వవిధముల సీతారాములు పరస్పరము తగినవారని యామె మాహాత్మ్యము మనసునకుఁదెచ్చుకొన్నట్లు [3] 'ఈకాంతకై కదా యిషువున నొక్కట బలశాలి యవ్వాలి భంగపడియె' నను పద్యమున రచించెను. ఈ రెండు పద్యములు వావిలికొలనువారి సీసపద్యముల రచించుటయందలి సామర్థ్యమునకుఁజక్కని యుదాహరణములు. చక్కని శయ్యనొప్పిన పద్యములు.

యథామూలము త్రిజట తన స్వప్నవృత్తాంతమున క్రోతి యొకటి లంకను బూదిసేయు నని చెప్పుట కలదు. ఇది భావ్యర్థ కథనము. [4] 'అంగుళీయక ప్రదానమున శిష్యునకు జ్ఞానమిడు నాచార్యత్వము కలదు. సీతాదేవితోడి సంభాషణ మయినపిదప సెలవుఁగొని కార్యశేషము నాలోచించుచు హనుమంతుఁడు

[5] ''సామము మేలుగాదు దనుజప్రకరంబులపట్ల దానము
ద్దామ ధనాఢ్యులందు ఫలదంబునుఁగా దిక భూరివిక్రమో
ద్దాము లభేదసాధ్యులుగదా యటుగానఁబరాక్రమం బొకం
డే మెయిఁజూడ యుక్త మని యెంచెదఁబ్రస్తుత కార్యభంగికిన్''

అనుకొనెను. ఇందు హనుమంతుని ఆలోచనాదక్షత వ్యక్తమగుచున్నది. ప్రసాదగుణ భూయిష్ఠ మగు రచన నిందు వాసుదా సొనర్చెను. చూచి

---

1. భార. ఉద్యో 1 - 302
2. అం వా. రా సుం 441
3. అం. వా. రా. సుం. 462
4 తత్త్వ. పుట - 316
5. అం. వా. రా. సుం. 1006

రమ్మన్న కాల్చివచ్చుట హనుమంతుని ఆలోచనద్వారా కవి యిట్లు సమర్థించెను.

[1] ''సీతనుఁజూచిర మ్మనుచుఁజెప్పెనుగాక రఘూద్వహుఁడు దు
ర్నీతులతోడఁబోరు మనెనే యని యాత్మ దలంతునేనియున్
ఖ్యాతయు నీతమైన పనితోఁబలుకార్యములన్ ఘటించుచో
ఖ్యాత మనస్విత ప్రథమకార్య విరోధములేమిఁగన్గొనున్''

అని హనుమంతుఁ డాలోచించియే సముచితమనియే యొనర్చెను. లంకా దహనమువలన సీత కపకారము జరిగిన ప్రథమకార్యవిరోధమగును.కాన విచారించెను తప్ప దహనాది కార్యములు సమర్థనీయములే. హనుమంతుఁడశోకవనమును భగ్న మొనర్చెను. వానిపైకి రావణుఁడు ఎనిమిది వేలమంది కింకరులఁబంపెను. వారు హనుమంతుని వీరమున కాలంబన విభావము. వారిని గాంచుటచే హనుమంతునియందుఁ బ్రకటమైన యుత్సాహమును, దానివలన నొనర్చిన చేష్టాదికమును సహజసుందరముగ

[2] ''ఖాల మల్లార్చి జాడించి వసుధ మోఁది
యార్భటించిన నా గర్జ కఖిలపురము
నిండి మాఱ్మ్రోసెఁబక్షులు నింగి కెగిరి
గుండె లగలంగ ధారుణిఁగూలె నపుడు''

అని వర్ణించెను. ఇందు స్వభావో క్త్యలంకారము రమ్యముగఁజెప్పబడెను. అనంతరము నాల్గుశ్లోకములలో హనుమంతుఁడుత్సాహజనక మగు ప్రకటనము గావించెను.

[3] ''జయ త్యతిబలో రామో - లక్ష్మణ శ్చ మహాబలః
రాజా జయతి సుగ్రీవో - రాఘవే ణాభిపాలితః
దాసోఽహం కోసలేంద్రస్య - రామ స్యాక్లిష్టకర్మణః
హనుమా ఞ్ఛత్రుసైన్యానాం - నిహన్తా మారుతాత్మజః
న రావణసహస్రం మే - యుద్ధే ప్రతిబలం భవేత్
శిలాభి స్తు ప్రహరతః - పాదపై శ్చ సహస్రశః

1. ఆం. వా. రా. సుం. 1008
2. ఆం. వా .రా. సుం 1033
3. వా. రా సుం 42-33, 34, 35, 36

అర్దయిత్వా పురీం లంకా-మభివాద్య చ మైథిలీమ్
సమృద్ధార్థో గమిష్యామి - మిషతాం సర్వరక్షసామ్''

అను శ్లోకములు మంత్రసమములుగ పెద్దలు చెప్పుట, అనుష్ఠించుటయుఁ గలదు. అట్లే కార్యారంభమున, ప్రయాణాదులం దీ శ్లోకములు స్మరించుట కలదు. వీనియందలి విశిష్టత కారణముగనే వాల్మీకియే ముఖ్య ఘట్టములం దిట్లే ప్రకటింపఁజేసి విజయము సూచించెను. ఇట్లు 43వ సర్గయందు 8, 9, 10, 11 శ్లోకములు; 52వ సర్గయందు 23, 24 లందును చెప్పఁబడెను. వీని యాంధ్రీకరణలందు వాసుదాసవిరచితములే మేటి యనిపించఁగలవు. అవి

[1] ''జయము జయంబు రామునకు సారపరాక్రమ ధన్యమూర్తికిన్
జయము జయంబు విద్విషదసహ్యతరస్వి సుమిత్రపట్టికిన్
జయము జయంబు దాశరధి సంపరిపాలితుఁడౌ వలీముఖో
చ్ఛయపతి సూర్యపుత్రునకు సాహసవిక్రమ కీర్తిశాలికిన్''

''దాసుఁడ సర్వ సద్గుణవితాన మనోహర రామమూర్తికిన్
గోసలదేశ వల్లభునకున్ హతశత్రుఁడ వాయుపుత్రుఁడన్
నా సరిగారు సంగరమునన్ దశకంఠులు వేయురేనియున్
వాసి యడంతు జాల ద్రుమపాళుల నే హనుమత్సమాఖ్యుఁడన్''

అని యిం దనువదింపఁబడెను. వీని వ్యాఖ్యయందు కర్తయే 'ఈ రెండు పద్యముల మూలశ్లోకములు క్షుద్రప్రయోగముల నెల్ల హరించు నని యనుభవజ్ఞులు, పెద్దలు చెప్పిరి' యనుచు వ్రాయుటబట్టి మూలశ్లోకముల శక్తియుక్తులు తెలియును.

జంబుమాలి గొప్పపరాక్రమవంతుఁడు. రావణుపంపున వచ్చిన వానిని హనుమంతుఁడు పొడిపొడియై నుగ్గై రాలఁజేసెను. ఇప్పట్టున నాంధ్రవాల్మీకి

[2] ''తల యేదో చెయి యేదో
మొల యేదో చాపమేదొ మొకా శ్చేవో
తెలియక యుండఁగ దితిజుడు

1 ఆం. వా. రా. సుం. 1034, 1035
2. ఆం. వా. రా. సుం. 1057

నులినులియై నేల రాలె నుగ్గై నూచై''

అని వర్ణించెను. ఇందుపొడిపొడిపదముల విడివిడిగాఁ బ్రయోగించి హనుమచ్ఛౌర్యతనరచనయందు స్పష్టమొనర్చెను. అట్లే మంత్రిపుత్త్రుల సంహరించినరీతి

''కొందఱఁగేల బాఁది మఱికొందఱ నేలను మోఁది గ్రుద్దుచుం
గొందఱి వెండి గొందఱను గోళ్ళను చీల్చుచు, నట్టె తాఁకుచున్
గొందఱి గుండు వోలె నొకకొందఱి డిర్దిర ద్రిప్పి వైచుచున్
గొందల మందఁ గూల్చె రిపుకోటి వనాటి విభుం డుదగ్రుఁడై

అని వర్ణించెను. ఇందు వారిని చెల్లాచెదరుగ నెవరికివారినిఁ గొట్టుట పదముల విడివిడిదనమునఁజెప్పెను. ఇందు హనుమంతుని యుద్ధవిధానము స్పష్ట మగును. నియుద్ధ మొనర్చుచు దన యవయవములనే యాయుధములుగ నేరీతిఁగొట్టె ననునది స్పష్టము కాగలదు. రావణు సమ్ముఖమునకుఁగొనివచ్చిన పిదప హనుమంతుఁడు రావణుఁగూర్చి యొనర్చిన యుపదేశమును వాసుదాసు గూఢార్థసంయుతముగ రచియించెను. అది కపిరాజుయొక్క కవిరాజుయొక్కయు ప్రజ్ఞకు నిదర్శనము. [2] 'నీవశమంద యుండి ధరణీసుత యంచును నీవు చూచు నాభామిని' యను పద్యమున సీతాదేవి సర్వసంహారక శివశక్తిగా నిరూపింపఁబడెను.

తిరిగివచ్చి కపితతిఁగూడిన హనుమంతుఁడు [3] 'చూచితి సీత'నంచు సంగ్రహముగఁజెప్పినట్లు కవి చెప్పెను. ఇది హనుమంతుని ప్రాజ్ఞ్య పుణ్యమునకు నిదర్శనము. వెళ్ళినపని యేమైనదో యని ప్రాణము అరచేతఁబట్టి యున్నవారి ప్రాణములు నిల్పుటకై ప్రధానాకాంక్ష లేకుండునట్లు క్రియాపదముతో నారంభించి యూరటఁజెందఁ జేయుట యందలి యుద్దేశ్యము. ఈ సంగ్రహవాక్యమునకు విపులముగాను, సుందరకాండమొత్తమునకు సంగ్రహరూపముగాను [4] 'ఆద్యంతవృత్తాంతమాలింపఁగా' ననుచు దండకము చెప్పఁబడెను. ఇట్లింతటి దండకముద్వారా యావద్వృత్తాంతముఁదెల్పిన యాంధ్రకవి వాసుదాసే. ఇది సమగ్ర సుందరకాండ స్తవము గావించుకొన నుపకరించునది. ప్రధానకథ నంతను హను

---

1. ఆం. వా. రా. సుం. 1064
2. ఆం. వా .రా. సుం. 1169
3. ఆం. వా. రా సుం 1308
4. ఆం. వా. రా. సుం. 1317

మంతుఁడు కపితతికిందు విన్పించెను. హనుమంతుని కార్యసాధనకు సుగ్రీవుఁడు

[1] "ఈ కార్యము సాధింపఁగఁ
జేకుఱుఁబావనికె యొరులచే నిది యానే
యా కపివరునకె శక్తియు
ధీకలిమియు శ్రుతము తెంపు తేఁకువ గలుగన్"

అని మెచ్చెను. ఇందు సుందరకాండయందుఁబ్రకటమైన హనుమంతుని గుణములు బాహుశక్తి, బుద్ధిశక్తి, శాస్త్రజ్ఞానము, సాహసము, ధైర్యము వంటి వన్ని యుఁదెలుపఁబడెను ఇట్లు సర్వసద్గుణ గరిష్ఠునిగాను జీవబ్రహ్మైక్యకారకునిగను, ఆత్మాన్వేషకునిగాను, ఆచార్యవరునిగను శ్రీవావిలకొలను సుబ్బారావుగారిచేహనుమంతుఁడు-ఆంధ్ర వాల్మీకిరామాయణమున చిత్రింపఁబడెను.

## శ్రీరామ కథామృతము - సుందరకాండము

శ్రీరామ కథామృత కర్తలు శ్రీ తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రిగారు వీరి పుత్రులు శ్రీ రాఘవనారాయణశాస్త్రిగారు. ఈ పితాపుత్రులు తపస్సంపన్నులుగా లోకప్రసిద్ధులు. వీరి రామకథామృతము మంత్రశాస్త్ర గుప్తమై ఆధుని కాంధ్రరామాయణములలో విశిష్టస్థానము నలంకరించినది. గాయత్రీమంత్ర బీజాక్షరసంపుటితో వాల్మీకివలెఁదమ రామాయణమును రచియించు వ్రతముఁ గొని యిరువదినాల్గక్షరముల సంపుటితో నిరువది నాల్గువేల గద్యపద్యములు వ్రాసిరి. వేంకటప్పయ్యశాస్త్రిగారు 18 వేల గద్యపద్యములు మాత్రము రచియించి పరమపదించగా శేషభాగమగు నారువేలు గద్యపద్యములు శ్రీ రాఘవనారాయణశాస్త్రిగారు పూరించిరి. గాయత్రీమంత్ర సంపుటీకరణ విషయమున వాల్మీకమునుమించి స్వర సంయుక్త బిందు నియమము లన్నియుఁబూర్తిగఁబాటించుట నీరామాయణముననే ఇట్లు చూడగలము.

| గాయత్ర్యక్షరము | వాల్మీకిరామాయణము | శ్రీరామకథామృతము |
|---|---|---|
| 1) త | - తపస్స్వాధ్యాయ బాల 1 - 1 | తపమున బాల 1-1 |
| 2) త్స | - సహత్వా - బాల 30 - 23 | త్సరువొకఁడె-బాల 3-161 |
| 3) వి | - విశ్వామిత్రస్తు - బాల 67 - 12 | విశ్వవిభుఁడు - బాల 6-125 |

1. ఆం. వా. రా. సుం. 1374

4) తుర్ - తుష్టావాస్య-అయోధ్య-15-21 తుర్యాతీత - బాల - 8 - 160
5) వ వనవాసంహి - అయోధ్య 40 - 14 వహియింప-అయోధ్య 1-126
6) రే - రాజాసత్యం - అయోధ్య 67-34 రేచకపూరక-అయోధ్య 3-338
7) ణ్యం - నిరీక్ష్య - అయోధ్య 99 - 25 ణ్యంతముఠము-అయోధ్య 677
యదిబుద్ధిం - అరణ్య 11-44
9) భర్ - భరతస్యార్య - అరణ్య 43-17 భర్మమయ-అయోధ్య-10-282

పై వానిలో త్స, తుర్, ణ్యం పంటి వాని యెడఁ బాటింపఁబడిన నియమము స్పష్టము. పందొమ్మిదవశతాబ్ది రచనమయ్యు సర్వసంప్రదాయ బద్ధమై మంత్ర యోగ రహస్యముల నింపుకొని నడచిన దీ రామాయణము.

శ్రీరామ కథామృతమున నాంజనేయుని నామముల నెక్కుడు హనుమఁడు అనునది ప్రయోగింపఁబడెను. సముద్రోల్లంఘనమున మైనాకుండు హనుమంతుని బొమ్మఁతాఁకు వడసి దివ్యరూప మంది శిఖరమున నిలిచినటుల భాస్కరరామాయణరీతి యిందుఁగలదు. అట నుసలఁగా దనుచు హనుమంతుఁడు కేల్సాఁచి కవుఁగిలించుకొనినట్లు చెప్పెను. ఇది తాడేపల్లి వారి కల్పనము. సురసావృత్తాంతమున సీతావార్త నెరిగి వచ్చి యార్తివడక 'యెుడలు నీక యర్పించెద, శపథమ్మున వర్తిలుదు' నని నొక్కి వక్కాణించెను. సురస యంగీకరింపక నోరెత్తఁ బెరిగి తుద కంగుష్ఠమాత్రుఁడై లోఁబ్రవేశించివచ్చి [1] "అంబ! నీ యుదరంబునయందు నలఁతిఁజొచ్చి వచ్చితిఁజెల్లె నీయిచ్చ యింక సెల వొసంగు" మని సాభిప్రాయముగ సంబోధింప నదియు [2] 'తనయా! నినుఁబోలినవానిఁగాన మెందును జనుమిక జయించి తెల్లజగముల నొకటన్' అని తదనుగుణముగ తనయా!యని సంబోధించెను. గర్భముఁజొచ్చి వెలువడుటవలన వారిమధ్య నా సంబంధము కవిచే రమ్యముగ సంబోధనారూపమున నిరూపింపఁబడెను.

హనుమంతుఁడు శతయోజనవిస్తీర్ణ సముద్రము నవలీలగ దాటెను. అట్టి హనుమచ్ఛక్తిని కవి యాతనినోటనే చెప్పించుచు

---

1. శ్రీ. క. సుం. 1 - 81
2. శ్రీ. క. సుం. 1 - 82

[1] ''అతఁ డూర్పు వుచ్చఁ డలమట నొందఁడ
యబ్ధి దాఁటు టెక్కుఁడని తలఁడు
పెక్కు లామడలునుఁబేర్కొన నిది యేటి
లెక్క నాకు నూటిలెక్క యనుచు''

అనెను. ఇందు నబ్ధి యనునది తప్ప మిగిలిన వన్నియు నచ్చ తెనుఁగు పదములే. ఇట్లే రామాయణమునఁదెనుఁగుఁదన మెక్కుడుగనె కన్పట్టును. అంతటి యాతని శక్తికిఁగారణము రామసేవకుఁ డగుటయే యని యనంతర పద్యమున శివుఁడనును ఆ వాక్యము శివాంశసంభూతుఁ డగు హనుమంతు నభిప్రాయమే తెల్పును.

[2] ''ఎవని నంతకాల మెనయుచో నొకపరి
యేనిఁదలఁచి మనుజు లీఁదువార
లల భవాబ్ధి నతని యలఘు కింకరున కి
క్కడలిఁగడచు టెంత కమలనయన''యను నీ పద్యభావ మధ్యాత్మ రామాయణమునుండి గ్రహింపబడినది. అందు హనుమంతుఁడే

[3] ''ప్రాణ ప్రయాణ సమయే-యస్య నామ సకృ త్స్మరన్
నర స్తీర్త్వా భవామ్భోధి - మపారం యాతి తత్పదమ్''

అని పై భావము వ్యక్తము చేయును. అధ్యాత్మరామాయణమున నిది సముద్రలంఘనమునకు ముందు చెప్పబడినది. ఇందు లంఘనానంతరము చెప్పబడినది. సూర్యాస్తమయమున భాస్కరరామాయణము శిష్యకార్యమునకు భంగము కాకుండుటకై సూర్యుఁడస్తమించిన ట్లుత్ప్రేక్షించెను. రామకథామృత మా శిష్యప్రయోజనముతోఁబాటు తన వంశమునకు మేలగు పని యగుటయుఁదలచి సూర్యుఁడస్తమించినట్లు చెప్పెను. లంక లో ప్రవేశించు హనుమంతుని లంక యడ్డగించి 'దొంగవై యెటు పోయెద వు?ఎవడవు?దీనికి తగు ఫలిత మనుభవింతు' వనుచు నిలవైచెను అట్టి లంకతో

[4] ''అట్టు లడరెడుదాని వ ల్కాలకించి
యింతలో నింత వేగిరం బేల యేమి

1. శ్రీ. క. సుం 1-100
2. శ్రీ. క. సుం. 1 - 131
3. అ రా. సుం 1 - 4
4. శ్రీ. క. సుం. 1 - 158

చెడియె నీ వెవ్వతెవొ సుంత నొడువు మవలఁ
దెలుపుదును నా యుదంతంబు తేటపడఁగ''నని తేఁటగీతిఁదేటతెనుఁ

గుపదముల హనుమంతుఁడు పల్కెను. ఇది చమత్కారపూర్ణ రచనము. 'ఇంతలో'—'ఏమిచెడియె'నను తెలుఁగుపదముల కూర్పు చమత్కారమును సాధించుచున్నది. అధ్యాత్మరామాయణము ననుసరించి యిందును సీత యునికి లంకయేఁజెప్పఁబడెను. 'లంకిణి'శబ్దము జనవ్యవహారమునఁ గన్పట్టినను లంకాశబ్దమే లంక కాపరిఁదెల్పుటలో రామాయణకర్తలు ప్రయోగించుట కన్పట్టును. రామకథామృతమున లంక శాపాంతమున సీత ప్రమదావనమున నున్నటులఁజెప్పె కాన౨-౩౯ నధ్యాత్మరామాయణము నందువలె నిందును 1-౩౩౩లో లంకావాక్యము స్మరింగెను.

హనుమంతుఁడు లంకలోని యంతఃపురము లన్నియుఁ దూర్పారఁ బట్టినకరణి నెమకియు కాంతలు పురుషులెలయునే కాంతస్థలములఁగలయ వెదకియుఁజిత్త మనేకాంతము గానీయలే దని కవి హనుమంతుని దీమత్త్వము నిరూపించుట కాక యెట్టిదృశ్యములు కళ్ళఁబడినను గార్యయోగంబు కతనఁబావనాత్ముఁడతఁడనెను. ఇందుఁగార్యయోగమున యోగసాధనముఁజూపిపావనాత్ముఁజేయుట యోగిపుంగవులగుఁగవివర్యుల సమ్మతము. 'యోగః చిత్తవృత్తి నిరోధః'అను పతంజలి యోగసూత్రమున కిట హనుమంతుఁడు లక్ష్యముగా నీయఁబడెను. అట్టి పర్యాలోకనమున నొక చోఁగన్నులు మొగిచి యొకచో మార్మొగము పెట్టినవాఁడు గీతిక్రమం బాస్థన్విసెను. అటగీతకోవిదుఁడని హనుమంతునికై ప్రయోగించుటద్వారా కవి సమర్థించుటయు కాక గాన ప్రియా!యని శివునిచే పార్వతిని సంబోధింపఁజేయుట పదప్రయోగ కౌశల్యమునకు నిదర్శనము. ఇట్లు హనుమంతుని సంగీతశాస్త్రప్రవర్తకత్వము సూచింపబడెను. సీతాదేవి యెచ్చటనుఁగానరాకున్న మారుతి

[1] ''చిత్కలాఖ్య లక్ష్మి సిరిని విద్యుల్లేఖ
భాతి నెందు దాపఁబడెనొ కాల
మహిమ రాముదేవి మహిత యాయమఁబోడ
గాంచి భవము గడవఁగాతు నొక్కొ''

---

1. శ్రీ. క. సుం. 1 - 230

యనుకొనును. ఇట్లు వర్ణించుట యోగవిధానమును సూచించుచున్నది. సుందరకాండ యోగశాస్త్ర మనుటను నిరూపించుచున్నది. [1] "చిత్కళా౽౽నందకళికా" అని శ్రీలలితా సహస్రనామ స్తోత్రము. [2] సీత చిద్రూపిణి. హనుమదయోగి. అతఁడామెను బొడగాంచుట చిత్కలదర్శించుట. సాధకుఁడు సిద్ధిఁబొందుట.' ఇట్టిసంప్రదాయార్థమునలతిపదములఁజెప్పి వేంకటప్పయ్యశాస్త్రిగారు తమ దక్షతఁబ్రదర్శించిరి. యోగభావు లిం దింకను భావన చేయుగల పదసామర్థ్యము కానవచ్చును.

మండోదరిని చూచిన హనుమంతుఁడామెను సీతగా భావించి లక్ష్యము నెరవేరె ననుకొని పరమానందభరితుఁడయ్యెను. ఇటఁగని

[3] "కొట్టెఁజప్పట్లు ముద్దిడుకొనియెందోఁక
నందె నానంద మెద నాటలాఁడె బాటఁ
బాడెనడిచెఁ గంబములకుఁ బ్రాఁకె దుమికెఁ
గపులప్రకృతి నిదర్శింపఁగాఁగడంగి"

అని వర్ణించెను. దీనికి మూలము

[4] "ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం
ననన్ద చిక్రీడ జగౌ జగామ
స్తంభా నరోహ న్నిపపాత భూమౌ
నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనాం" అను శ్లోకము.

ఇది తాడేపల్లివారి యథామూలానువాదమునకుఁ జక్కని యుదాహరణము; యోగార్థ వ్యంజకమును. సాధనలో యోగికి కుండలినీయోగమున మహాసిద్ధి చేకూరకముందు నణిమా ద్యష్టసిద్ధులు చేకూరును. వానివలన సంతృప్తుఁడై సాధన వీడి వాని యనుభవమున నానందించువాఁడు క్రమముగ యోగభ్రష్టుఁడగును. కావున వానివలన నుప్పొంగక సాధకుఁడు యథార్థసిద్ధికై సాధన చేయవలెను. ఈ హనుమచ్చర్య సత్యసందర్శనమువలన నొనర్చినది కాదు. అసత్య సందర్శనముననే భ్రాంతిమూలకానందముననే ఆభాసానందముననే యిట్టి చిందులు నుప్పొంగుటలు కాన

1. శ్రీ లలితా సహస్రనామ స్తోత్రము శ్లో 141
2. శ్రీరామ కథామృతము సమగ్ర సమీక్ష. పుట 180
3. శ్రీ. క. సుం. 1 - 293 4. వా. రా. సుం. 10 - 54

వచ్చును. సత్యసందర్శనమూలక మగు నిజమగు నానందమున నిట్టి చిందు లుండవు. నిజముగ సీతను చూచినప్పుడు ఈరీతిఁగానము. అది యలౌకి కానందము; బ్రహ్మానందము; ప్రశాంతరూపము; అప్పట్టున [1] 'సీతాదర్శన సంహృష్టో - హనుమాన్ సంవృతోఽభవత్' అని మాత్రము చెప్పెను. అప్పుడు చిందులువేయుట యటుంచిసంవృతుఁడయ్యెను. నిరాడంబరత మహాసిద్ధుని లక్షణము. అట్టివారి సత్యానందమే శాశ్వతానందము, చిదానందము, బ్రహ్మానందము. [2] 'నా కిది ప్రత్యవాయమొకో' యని హనుమంతుఁడు ప్రశ్నించుకొనుట కవివర కపివర ధర్మశాస్త్రవైదుష్యమును ప్రకటించుచున్నది. హనుమంతుఁ డశోకవనమునకుఁ జని యామెను గాంచుటఁ జెప్పుచు [3] 'దివ్యమూర్తి యతని కృతిసిద్ధి వోలెఁ బ్రత్యక్షమయ్యె' ననెను. ఇది యోగిపుంగవుఁ డగు హనుమంతుని సిద్ధి. గోవిందరాజీయ భావమున నశోకవనము సహస్రారము సీత శ్రీచక్రేశ్వరి. హనుమంతుఁ డామెను సందర్శించిన యోగిపుంగవుఁడు. హనుమంతునకు దర్శన మిచ్చిన సీత 'ఉపవాసములఁ గ్రుస్సియునుఁ జంద్రరేఖయట్లతిదర్శనీయత్వ' మందియున్నది.

[4] ''ఉపవాసకృశాం దీనాం నిఃశ్వసన్తీం పునఃపునః
దదర్శ శుక్లపక్షాదౌ - చంద్రరేఖా మివామలామ్॥

అనునది దానికిమూలము. లలితా సహస్రనామావళియందు 'ప్రతిపన్ముఖ్య రాకాంత తిథిమండల పూజితాం'అని కలదు. ఈ ప్రతిపత్కళ సహస్రారమున నుండును. [5] 'ఇదియే ధ్రువకళ, ఆత్మకళ' యనబడును. ఈ ప్రతిపత్కళ పరాశక్తి. ఈ పరమరహస్య మగు నుపాసనా విషయములను వాల్మీకిభావమున నెఱిఁగిన తాడేపల్లి పితాపుత్రులు తమ రామకథామృతమునఁ బదిలపఱిచిరి. సీతాదేవికి హనుమంతుఁడు రామకథ వినిపించినరీతిని

[6] ''తేనియ ద్రాక్షాద్రవమున
మానుగ సమకూర్చినట్లు మలయించె సమా

---

1. వా. రా. సుం. 17-32
2. శ్రీ. క. సుం. 1-308
3. శ్రీ. క. సుం. 1-371
4. వా. రా. సుం. 15-19
5. షోడశిరామాయణ రహస్యములు పుట. 18
6. శ్రీ. క. సుం. 2-223

ఖ్యానము రాముని చరితము
తో నవరసభృతి నతఁడు వధూజన తిలకా!

అని తెల్పెను. ఇది హనుమంతుని వాజ్మైపుణ్యముతోబాటు శ్రీరామకథామృతమందలి నవరస భృతిని దెల్పుచున్నది. అట్టి సమన్వయమున కుపోద్బలకము

1 ''రామ చరితామృతమ్ము సారస్య మింత
చెవికి సోకిన మాత్రన చిగురుఁబోడి
చిగురువుట్టించె జడ నొందు చిత్తమునకు
మోడు లిగురించు నను మాట మొదలిమాట''

అనువద్యము. మోడు నిగుర్చ శక్తి నీయగలది యమృతము. తమ రామకదామృతమున నట్టి సారస్యము గలదని కవి భావము. ఇదే భావము 2 'అనుపమ రససార నిహిత రామకథాసుధ వినిచె'నని హనుమంతుఁడు రామకథామృతమే చెప్పినట్లు చెప్పిరి. బహుభంగుల హనుమత్పాత్రను చిత్రించిన వేంకటప్పయ్యశాస్త్రిగారు సీతకుఁగన్పట్టిన హనుమంతుని

3 ''ఉదయుంబందెడు భానుబింబమున నా నోజ న్మొగంబొప్ప వి
ద్యు దతిక్రాంతికి మేనికాంతు లెగువ జ్యోతస్ఫుర ల్గన్నులం
బొదల న్వేష్టిత నిర్మలాంబరుఁడు నై పొల్పారు న మ్మేటిన
మ్మొదలా కాన్పనఁగాంచి విభ్రమదశా మూర్ఛా సమాక్రాంతమై''

అనిరి. ఇందు నోజఃపూర్ణుఁడగు హనుమంతుఁడు వర్ణితుఁడు.

సీతకు హనుమంతుఁడు తనచరిత్ర చెప్పుకొన్నరీతి 4 యొక్క 'వచనమునఁజెప్పఁబడెను. ఇందు కేసరి, యంజనలకు వాయువరమున హనుమంతుఁ డుదయించుట, హనుమంతుఁ డగుట, సూర్యుకడ విద్యాభ్యాసను, సుగ్రీవునికడ మంత్రిపదము వంటి కథాభాగము వివరింపబడెను. అట్లే సురస పొగిడిన 5 హనగ్రత్తలందు, నిట సీతాదేవి 6 ప్రశంసయందు హనుమంతుని గుణగణములు వర్ణింపఁబడెను. సీతచే హనుమంతుఁడు సత్యవాదిగ, ప్రియువాదిగనుఁజెప్పఁబడుట యాతని యాత్మీయతకు వాక్ఛక్తి

1. శ్రీ. క. సుం. 2-239
2. శ్రీ. క. సుం 2 287, 488
3. శ్రీ క. సుం. 2 - 542
4. శ్రీ. క సుం 2-349
5. శ్రీ. క సుం. 1-82, 83, 84
6. శ్రీ క. సుం. 2-361

కి మెచ్చుతునక. పావని వాఙ్నైపుణ్యముకల్గియుండుట తోఁబాటు ఉత్తమోత్తమ మార్గగామియు కావున స్వామి కార్యమునకు భంగముకాకుండ నధికము సాధింపనెంచి యశోకవనధ్వంసముఁ దలపెట్టెను. అట్టియెడఁ జెప్పిన

[1] "తా మున్న శోకలతికా
రామతఁ బ్రమదావ నాభిరామం బయ్యెన్
దామున్న శోకలతికా
రామతఁబ్రమదా వనాభిరామం బయ్యెన్

అను పద్యము కవివరుల కవితాచిత్రమున కుదాహరణము. అట్లే జంబుమాలివధ

[2] "లేదు శిరమ్ము దైత్యునకు లేవు భుజమ్ములు జానుయుగ్మమా
లేదు విభూషణమ్ములును లేవు శరమ్ము శరాసనమ్మనన్
లేదు రథాశ్వ సూతముఖలీలయు మారుతపుత్రుఁ డమ్మెయిన్
బాదిడుకిన్క నా గుదియ వైచిన యంత నిమేషమాత్రలోన్"

అని చమత్కారపూర్ణముగ వర్ణించెను. ఈ వర్ణనాచమత్కారము హనుమంతుని మారణదక్షతయందుఁ బరిణమించును. రావణుని సేనాధిపతులు చూచిన హనుమంతుఁడు

[3] "కాంచిరి వారు వాతరునిఁగాన్పులకున్ భరమైన మూర్తిచే
మించెడువాని రశ్మితతి మేళన మొప్పఁగ రశ్మిమాలి తే
జెంచెడువాని విక్రమము నీదృశమై నెగడంగ నొడ్ల స్రు
క్కించెడువానివేగ బలకీర్తుల కిమ్ముగువాని నమ్మెయిన్"

అని వీరసుందరమూర్తిగా వర్ణింపఁబడెను.

రావణసమ్ముఖమునకుఁగొంపోబడిన హనుమంతుఁడు ఆత్మతత్త్వమును, రాముని శక్తితత్త్వమును విస్పష్టము గావించెను. ఫలితముగా నాతని వాలము మండింపఁబడెను. అట్టియెడ నా చండవిక్రముఁడు నభోలంకారముగ వాల మున్నతంబు గావించి లంకనంతను దగులఁబెట్టినరీతి యొక్క [4] గద్యయందుఁగవి వర్ణించుచు విభీషణుని సంస్థానప్రకాండం

1. శ్రీ. క. సుం 3 - 25
2. శ్రీ. క. సుం. 3 - 74
3. శ్రీ క సుం. 3 - 95
4. శ్రీ. క. సుం. 3 - 293

బున కెట్టికడగండ్లను బుట్టవేక పాడిమెయిం గాపాడినట్లు చెప్పెను. అట్టి హనుమంతునిశక్తిని బ్రహ్మాదిదేవతలు [1] నారుపద్యముల మెచ్చిరి కవి యీమెప్పు ద్వారా హనుమంతుని యసామాన్యప్రతాపము ప్రకట మొనర్చెను. పురల సముద్రము దాటి హనుమంతుఁడు కపితతిఁ జేరెను. అచ్చట వారలచేఁబూజితుఁ డయినప్పుడి

[2] ''వారలచేఁ బూజితుఁడై
వారని కౌతుకమునఁ బ్లవగవరు లర్థింపన్
ధీరుఁడు 'దృష్టా సీతే'
త్యారంభో క్తము సుధామయం బొనఁగూర్చెన్'' అనుపద్యము

[3] ''సతాభ్యాం పూజితః పూజ్యః - కపిభి శ్చ ప్రసాదితః
'దృష్టా సీ'తేతి విక్రాన్తః - సంక్షేపేణ న్యవేదయత్॥''

అను శ్లోకమున కనువాదరూపము. ఇందు 'దృష్టాసీతా' యను సంస్కృతానుకరణ మగు వాక్యము యథాతథముగ స్వీకరింపఁబడినది అట్లు స్వీకరించుట యీ శబ్దశక్తినివ్యక్త మొనర్చుచున్నది. ఇతర రామాయణ కర్త లనువాదమాత్ర మొనర్చిరి. క్రియాపదముతో నారంభించి వానరుల యాందోళనను తత్క్షణము మాన్పఁజేసిన యత్నమది. వాల్మీకి యందలి హనుమద్వాక్యమునందలి గౌరమున నదేవాక్యముస్వీకరించుట కవి యౌచిత్యపోషణమునకు నిదర్శనము. హనుమద్విజయముల సన్మానమున రాముఁడు

[4] ''అన్నా! ఇటు రా రమ్మను
సన్నాహము సొందరితర రసపరిస్రుతముగా
నన్నేత హనుమ! నీకృతి
గన్న ఫలం బనుచు గ్రుచ్చి కౌఁగిటఁజేర్చెన్''

ఇది జీవబ్రహ్మైక్యంపు సద్భుతసన్నివేశము. దాన 'నానందసాంద్రుఁడైన పవమానాత్మజుఁ డొప్పెఁబ్లవగమండలి పొగడెన్' అని తాడేపల్లి పితాపుత్రులు తమ రామకథామృతమున హనుమంతుని రామకార్యధురంధరుఁ డగు సర్వసమర్థునిగాను, యోగనిష్ఠునిగను జిత్రించిరి.

---

1. శ్రీ. క. సుం. 3-315 నుండి 320
2. శ్రీ. క. సుం. 3-397
3. వా. రా. సుం. 57 - 35
4. శ్రీ. క. సుం. 3-578

## శ్రీమద్రామాయణ కల్పవృక్షము - సుందరకాండ

ఆధుని కాంధ్రవాఙ్మయమున సర్వప్రక్రియలందుఁదన ప్రత్యేకత నిరూపించుకొన్న మహాకవి విశ్వనాథసత్యనారాయణ. జ్ఞానపీఠ అవార్డు నందిన వారి రామాయణకల్పవృక్షము వారియందలి ఋషిత్వమును నిరూపించి ఎనలేని కీర్తిని సంపాదించి పెట్టినది. 'అరయఁగ నొక్క విత్తనమునందు మహాతరు వొప్పురీతి' ఉషఃఖండాది నన్నడుల రామకధయను బీజమును స్వీకరించి కల్పవృక్షమును వృద్ధిచేసి సహృదయులకు కావ్యానందఫలములఁ బ్రసాదించిరి. అసాధారణ ప్రజ్ఞాధురీణులగు విశ్వనాథ ప్రతిపద్యమున, ప్రతిభావమున తమదగు ప్రత్యేకతను నిరూపించుకొనుచు నీ రామాయణమును తీర్చిదిద్దిరి. వినూత్నకల్పనలు, రచనాచమత్కృతులతోఁ జదువునది తా మెఱిగిన రామాయణకథ కాదనిపించుచు నూతన కావ్యపఠనమునఁగల్గు నుత్సుకతను సహృదయులకు తమ కావ్యముద్వారా అందజేసిరి.

స్వయముగ రామానుష్ఠాతలు, ఆంజనేయోపాసకులు నయిన విశ్వనాథ తమ కావ్యమునందు వారిని దర్శించి దర్శింపఁజేసిరనుట నిక్కము. వారి నెంతగా నధ్యయనము చేసిన వారి కంతగా వారికల్పవృక్షము కావ్యశోభల నీనుచుఁగన్పట్టును అసాధారణ శేముషీమహిమ వెలుగొందిన ఉత్తమకావ్యము, మహాకావ్యము, శ్రీమద్రామాయణకల్పవృక్షము. విశ్వనాథ ఆ కావ్యమునఁజూపిన ప్రజ్ఞ ఇట్టి దని సమగ్రముగ నిరూపించుట యసాధ్యవిషయము. విశ్వనాథ తాముగా చెప్పుకొన్న [1] ''పూర్వకవు లెన్ని పోకడలు పోయినారో నేను అన్ని పోకడలూ పోయినాను. ఏదైనా అంతర్దృష్టి ఉంటేకాని అర్థం కాదు. నేను వాల్మీకిరామాయణానికి భాష్యం వ్రాశాను. నా రామాయణం అనువాదం కాదు. నా తరువాత మళ్ళీ కొన్ని వందల ఏండ్లకుగాని మళ్ళీ ఇట్లా వ్రాసేవాఁడు పుట్టఁడు'' అన్న వాక్యములు అయథార్థములు, డాంబికములు కావు. అట్టి దర్పమునఁబలుక్క శక్తికి కూడ విశ్వనాథ అర్హులు. వారి రామాయణమునేకోణమునఁజూచువారల కాకోణమున నది యగాధము, పరిపూర్ణము తాము గుర్తించినమాత్రమే యందు విశేషము కలదని సాహసింపగలవరెవ్వరుండరు.

1. రా. డొ. రా. పుట - 79

హనుమత్పరముగఁగల్పవృక్ష పరిశీలనఁ గావించినప్పుడెన్నియో హనుమద్రహస్యముల నందుఁబదిల మొనర్చుట స్పష్టమగును. సుందర కాండమున కధిష్ఠాన దేవత హనుమంతుఁడు. అట్టి హనుమంతుని అవతారములలో పంచముఖాంజనేయావతారము శక్తిమంత మైనది. విశ్వనాథ వారి సుందరకాండ పంచముఖాంజనేయుఁడు. ఆ విషయము ధ్వనింపఁ జేయుటకే విశ్వనాథ అన్ని కాండలవలె యిందు 1. పూర్వరాత్రి 2. పర రాత్రి 3. ఉషః 4. దివా 5. సంధ్యానామక ఖండము లైదింటిని గూర్చిరి. ఈ పంచఖండములుఁగూడియే పంచముఖాంజనేయము పూర్ణరూప మగును

ఇట్లైదు ఖండము లొనర్చుటయందు మఱియొక రహస్యమును గలదు. [1] హనుమంతునకు పంచసంఖ్య ఇష్టము. హనుమత్ప్రీత్యర్థము పత్ర పుష్ప ఫల ప్రదక్షిణ నమస్కార దానాదు లన్నియుఁ బంచసంఖ్యలో నొనర్చవలె నని తెలియుచున్నది. ఆ రహస్య మెఱిఁగి యీ హనుమత్కాండను పంచ ఖండములు గావించెను.

విశ్వనాథ తన రామాయణ మనువాదము కా దన్నటులే స్వీకరించిన వాల్మీకాంశములను కూడ నట వాచ్యముల నిట వ్యంగ్యముగా, నట వ్యంగ్యముల నిట వాచ్యములుగాఁ జెప్పెను. హనుమంతుఁడు తోడి వానరులతోఁ [2] 'యథా రాఘవ నిర్ముక్త శ్శర శ్శ్వసనవిక్రమః' శ్రీరామచంద్రుఁడు విడిచిపెట్టిన బాణమువలె వెడలెద నని మూలమునఁ జెప్పెను. అదేవిషయము మైనాకోదంతమున [3] ప్రతిజ్ఞా చ మయాదత్తాన స్థాతవ్య మిహాంతరా'' యని వానరులకు తాను రామబాణమువలె తిరుగులేక అగ్రముందుకు వెళ్ళెదనని మాటయిచ్చియుంటిని కాన నిటమధ్యలో నాగుటకు వీలులే దనును. ఈ యంశమును విశ్వనాథ హనుమంతుని వర్ణనలో

''అత్త నవారుణారుణ నిభానన ధూనన మూర్తి దక్షిణా
దిక్తట రాక్షసాపశదదేశ విదాహక రామచాప ని
ర్ముక్త శతఘ్ని బాణమున రూక్ష వియ త్ప్రవిదారణ క్రియా
శక్తము వాయుసూతి సహసా ప్లవమాన మహోగ్రవేగుఁడై''

---

1. హ. వి. స. పుట 10
2. వా. రా. సుం. 1-40
3. వా. రా. సుం. 1-112
4. శ్రీ. రా. క. పూర్వ 25

అని యాభావమును వ్యంగ్యముగ సూచించెను. అట రామబాణము వేగ మునే సూచింప, నీ రామబాణము ఉరుదారుణ నిభాననముగా కపిము ఖముబాణముఖముల కౌపమ్య మొప్పుచున్నది. రాక్షసాపసదదేశ విదాహక మనుట లంకాదహనమును, శతఘ్ని యనుట అక్ష జంబుమాలి ప్రభృతి రాక్షసహననమును ధ్వనించుచున్నవి. గజయాతగాం డెంతటి లోతు కయినవెడలి యానందింప గల్గినట్లు విశ్వనాథ పద్యములయందు సమర్థు లెంతటి లోతులనయిన చూడగల్గవచ్చును.

అనంతర పద్యముననే యట్టి సమర్థుండగు కొడుకు వెనుక నీలలు వేసికొంచు వాయువు వెడలుటఁజెప్పను. ఇందుఁబరుగుపందెముల నుత్సా హపఱచుచుఁదమపక్షమువారు యీలలువేయు రీతి కనులకుఁగట్టను. ఇం తటి తెనుఁగు సందుగొందుల పందెముల నంతటి వినువీధి నతిమానుష కృత్యమున ప్రభంజన సుతవిషయమున నున్నత స్థాయిఁజెప్పుట విశ్వ నాథ సామర్థ్యము. కల్పవృక్షమున ప్రతిపద్య. ప్రతిపద చమత్కృతుల నిట్లు పరామర్శించుట గ్రంథవిస్తృతి నసాధ్య మగును. కానఁ బరిమిత ముఖ్యాంశములు పరిశీలింపఁ బడుచున్నవి. హనుమంతునకు సాయ మొనర్ప నెంచిన సముద్రుఁడు మైనాకునితో

[1] "నీ జనకుండు మున్ను గగనేచరుఁడై చన నేను చూచితిన్
నీ జనకుండు తా మరల నింగిని బోయెడు నంచుఁజూచితిన్
రాజిత బాహువిక్రమ ధురంధరుఁ డాకపిరాజు మింట నీ
రాజన మెత్తు వక్త్రి మిహిర చ్ఛవి భూత సపర్య చేయుచున్"

అనును. మొదటి రెండుపాదముల నొకేరీతి నడపుట నౌపమ్యము చెప్పు టలోఁ జమత్కారము. ఇట మైనాకుని జనకవరిసంగము 'నింతకుముందు నీ జనకుండు నాకుఁ గడు నేస్త' మని యనుటయు నీ కార్యమున మైనా కున కాత్మీయతఁగల్పించి ప్రవేశ పెట్టుటకు. ఇది పని చక్కపెట్టుకొన గలవాని యం దుండు నేర్పు. సముద్రముపైకి లేచిన మైనాకుని వాల్మీకి హనుమంతునివలె విఘ్నముగఁదలచుట కాక భాస్కరునివలె విశ్వ నాథ హనుమంతుఁడు మహాసురునిగఁదలఁచెను. తొమ్మునఁదాకిన మైనాక పర్వతము పగులుచూపి నటులఁజెప్పెను. అన్ని రామాయణములందును

1. శ్రీ. రా. క. పూర్వ 41

మైనాకుని యాతిథ్య మంగీకరించిన సూచనగాఁ దాకిన విషయమును [1] 'అనుచుం జిట్లినచోటఁజె నిమిరి' యని పగులు చూపినచోట నిమిరి నట్లునుఁజెప్పెను. ఇది విశ్వనాథ చమత్కారము. ఇట హనుమంతుఁడు చెప్పిన సమాధాన మలతి యలతి పదములతో విశ్వనాథ చెప్పించును. త్వరగ నేగు వాఁడలతి యలతి వాక్యములతోఁ జెప్పు నీలక్షణము వాల్మీకి సమాధానమునను భావింపబడెను. [2]

వాల్మీకి దుష్కరకార్యముగాఁజెప్పిన దానిని విశ్వనాథ మహాద్భుత కార్యముగాఁజెప్పెను. అందుననే సముద్రలంఘన, మైనాక, సురసా సింహికోదంతంబుల

[3] ''మరియు మహాద్భుతంబు హనుమంతుని విక్రమమున్ భుజాబలం
బురు వినయంబు కార్యకరణోర్జిత మార్దవమున్ శచీ పురం
దరుఁడు మదిం గనుంగొనుచుఁద న్మహనీయుని భావనా సమా
ధి రచిత దేవతాకృతమతిందలపోసె హృదంతరంబునన్''

అని మఱియు నిట్టి పంచముఖ మహాద్భుతపద్యములు ఈ 61, 76, 79, 397, పర-204 లందుఁ జెప్పెను. ఈ పునరుక్త పద్యములు మఱి రెండు కూడ వానితోఁ గన్పట్టును. ఇందు విశ్వనాథ మంత్రరహస్యము పదిల పఱచెను. వాసుదాస హనుమంతుఁడు ఆచార్యదేవుఁడు, తాడేపల్లివారి హనుమంతుఁడు మహాయోగి కాగా విశ్వనాథ హనుమంతుఁడు పంచముఖాంజనేయుఁడు. విశ్వనాథహనుమదుపాసకులు. ఆయన ఉపాస్యమూర్తి హనుమంతుని చతుర్థావతారము, శక్తిపూర్ణము నగుఁ బంచముఖ హనుమన్మూర్తి.వారియామంత్రమునకు ఋషిపురందరఋషి, ఋషి,మంత్రము. దైవము అను నీ త్రిపుటిని విశ్వనాథ యీ పద్యములయందుఁ బ్రతిష్ఠించుట గ్రహింపగలము. ఇది మంత్రరహస్యము. ధ్యానావాహనములును దీనఁ గమనింపగలము. ఋషి యగు శచీపురందరుఁడు భావనాసమాధి రచిత దేవతాకృతమతి హృదంతరమునఁదలపోయును. ఆదేవత పంచముఖవీరుఁడు. ఆ విషయమును

---

1. శ్రీ రా. క. పూర్వ 55
2. తత్త్వ. పుట. 118
3. శ్రీ. రా. క. పూర్వ 58

1 ''మంగళరూప! యయ్యా! హరిమర్కటమర్కట! పంచవక్త్ర! ఖ
ట్వాంగ మహాసి ఖేట కుధ రామృతకుంభ సృణి ప్రదీపితో
త్తుంగ కరాంబుజాత! నవతోయదమూర్తి! త్రి పంచ నేత్ర
సర్వాంగద కంఠహార! యసురావళి మర్ధన బాహు! మారుతీ!''

అను నీ పద్యము ద్వారా తెలియగలము. పంచవక్త్ర! యనియే సంబోధనము. ఇందు నా దైవతము యొక్క ధ్యానము, మంత్రము కూడ నిబంధింపఁబడినది. పై పద్యమునఁగల మంత్రము - 'ఓం హరి మర్కట మర్కటాయ స్వాహా' యను నట్టిది. గురుం ప్రకాశయేద్ధీమాన్ మంత్రం యత్నేన గోపయేత్'' అని మంత్రశాస్త్రము మంత్రమును రహస్యముగ నుంచమనుటవలన హరిమర్కట మర్కట యను సంబోధనలో నా మంత్రము గుహ్యముగా గావింపఁబడెను. పంచముఖహనుమత్ మంత్రధ్యానము

2 ''వందే వానర నారసింహ ఖగరాట్ క్రోడాశ్వ వక్త్రాంచితం
నానాలంకరణం త్రిపంచనయనం దేదీప్యమానం రుచా
హస్తాబ్జై రసి ఖేట పుస్తక సుధాకుంభాంకు శాద్రీ హలం
ఖట్వాంగం ఫణి భూరుహం దశభుజం సర్వారి గర్వాపహమ్''

పై పద్యమున నీ ధ్యానమందలి ఖట్వాంగ, అసి, ఖేట, అద్రి, సుధాకుంభ అంకుశాద్యాయుధములు చెప్పఁబడినవి. త్రిపంచనయనత్వము కూడ జెప్పఁబడగా ననంతరపద్యము

3 ''ప్రాసంగోత్థ కకుద్భుజావనత! సర్వజ్ఞా! సమీచీన బా
హా సంపాదిత రామకార్య! దితిసూనుహా! నిత్యతృప్తా! స్వతం
త్రా! సింహాసన వైనతేయ చటులాస్యా! యగ్నిగర్భా! మహా
త్మా! సర్వగ్రహ బీ నివారణ సముద్రాంభో మహాపత్తరీ''

యనుదానియందు సింహ, ఖగరాట్, ముఖాదిక విషయము నిక్షిప్తము. ప్రతిమహాత్కార్యమునను తత్సాధక సమర్థుఁడగు పంచముఖాంజనేయుని శచీపురందర ఋషి ద్రష్టగా కవి ధ్యానమున దర్శనమంది సహృదయులకా దర్శన భాగ్యము కల్గించును. ఇది విశ్వనాథ రచన యందలి మహాద్భుతమగు హనుమద్విషయము. సురసా వృత్తాంతమున వేల్పులు హనుమ

1 శ్రీ రా. క. పూర్వ 59
2. వ. సం 2 - 41
3. శ్రీ రా. క. పూర్వ 60

నడ్డగింపుమని నాగమాతయగు సురసను పంపిరి. ఇట విశ్వనాథ కల్పించిన కారణము విచిత్రమైనది. వేళాదుష్టముగాఁ గనఁబడి వేల్పులట్లు పలపిరనుట మఱియెవ్వరియందుఁ గానరాని కల్పన. ముహూర్తము అలస్యము గావింప నెంచి పంపినట్లు చెప్పఁబడెను. మరల యనంతర పద్యముల వాల్మీకి యుద్దేశ్యము కూడా స్వీకరించుచు నుపాయముఁజూపునో తొలగిపోవునో వాని నేర్పుఁజూడవలె ననిరి.

సింహికావృత్తాంతమున హనుమంతుని గుంజునట్టి రీతిని విశ్వనాథ మూడుపద్యములఁజెప్పెను. అంతగా సింహికశక్తి, ప్రవృత్తులఁజెప్పుట దానిని నిగ్రహించిన హనుమంతునిశక్తిని నిరూపించును. [1] అంటార్కిటాలోని కాల్పనిక త్రికోణం – బెర్మూడా (Bermooda triangle) తో నీ సింహికావృత్తాంత మన్వయించుట గమనార్హము. బెర్మూడా ట్రయాంగిల్ అనుభవమే నాడు '[2] ప్రతిలోమేన వాతేన మహనౌ రివ సాగరే' అను వాల్మీకి వాక్యమున వ్యక్తమగుచున్నది. ఆధునిక కాలమందు విశ్వాసబుద్ధికన్న హేతువాదబుద్ధి యెక్కుడను విషయము గ్రహించిన విశ్వనాద రామాయణముపై వచ్చు నవకాశమున్న ప్రశ్నలను తానే వైచి వివరించుట కన్పట్టును. సురసతోఁబాటు హనుమంతుఁడు తొంబదియోజనములు పెరిగెను. ఈవిషయమున నొక్కప్రశ్న యెట్టివారికయిన వచ్చును. కావుననే

[3] ''హనుమ కొక్క యూహ తనరాదె నెడఁదలో
నురక పెరిగి వంద యోజనములు
పెరిగి కాలు లంకఁ బెట్టినఁ జాలదే
సంద్ర మెగురు టనవసర మటంచు''

హనుమంతునకే ప్రశ్న వచ్చినట్లు చెప్పెను. అట్లే హనుమంతుఁడు తన రాక రక్కసులు గుర్తింపకుండుటకై యనేకరీతుల సూక్ష్మరూప మందుట వంటి జాగరూకతలు వహించె నని చెప్పఁబడెను. అసలు సముద్రలంఘనమును మహాకారుఁడై యెనర్చుటే చూడరా? యను ప్రశ్న యుదయింప వచ్చును. కావుననే విశ్వనాధ

---

1. హనుమత్సేవ జూలై 86 పుట 13
వ్యాసకర్త శ్రీనివాసరామానుజం-సింహాచలం
2. వా. రా. సుం. 1-185
3. శ్రీ. రా. క. పూర్వ 80

[1] "బురుజుల నిల్చి గిచ్చలును పోయెడు వచ్చెడు శత్రుచారమున్
గడకొని చూడఁగాఁదగిన కౌణప రాజభటుల్ ప్రమత్తులై
గరువముచేత వార్థిపయిఁ గాంచరు మాటుకి వచ్చుటే యెఱుం
గరు పరిగుప్త యాత్రుఁడు ప్రకంపన సూనుఁడు చేరుసంతకున్"

అని సమాధానము చెప్పెను. ఇట్టి సునిశిత విమర్శతో విశ్వనాథ రచనఁ గావించెను. లంకలోఁ బ్రవేశించిన పిదప కూడఁజూపటును వంచనచేయుచు ధృష్టుఁడై సంచరించెనని చెప్పెను. ఈ హనుమత్కార్యమున మరల విశ్వనాథ పంచముఖునిఁజూపెను.

[2] "కొంచెము సేపు వానరము కొంచెము సేపు మృగేంద్రమున్ మఱిం
గొంచెము సేపు గృధ్రమును గ్రోడము కొంచెము సేపు చూడఁగా
కొంచెముకాల మశ్వమును గుజ్జగు రూపము లంది యేగుచున్
వంచనచేసెఁజూపఱను బావని పావనమూర్తి ధృష్టుఁడై"

ఈ పద్యమునం దాయా జంతువుల రూపము లెత్తుచుఁ దెలియరాకయుండె ననుటలో నా జంతురూపము లన్నియుఁ బంచముఖావతారమునఁ బంచమూర్తులగుట గమనార్హము. ఇట్లు లంకయందును బంచముఖ హనుమద్వరుని దర్శింపఁజేసిన విశ్వనాథ రాక్షసులయెడ వంచనఁ జెప్పి, వారియెడనే హనుమంతుని ధృష్టునిగఁబల్కెను. '[3] సాపరాధుఁడై యలుకనివాఁడు ధృష్టుడు! ఈ అపరాధముకూడ రాక్షసులయెడ నగుటనది సముచితమే యనియు, నానింద హనుమంతునకుఁజెంద దనియు సూచించుటకై వంచన-ధృష్టుఁడై యనువానికి మధ్య పావనమూర్తి యని హనుమంతుని పవిత్రత రూఢిగఁజెప్పెను.

అనంతర పద్యములందుఁ ద్రికూటాద్రిపైఁజేరిన హనుమంతుని గూర్చి యొక్కొక పద్యము నొక్కొక్క పంచముఖాంతర్గత రూపముగా విశ్వనాథ వర్ణించెను. 98వ పద్యమున తిర్య గూర్ధ్వాధ శ్శబ్దములచే పంచముఖవీరుని దిఙ్ముఖమూర్తిని సూచించి క్రమమున దక్షిణనారసింహ, ఊర్ధ్వహయానన, వామకోడ్రి, పశ్చిమగారుడ, పూర్వవానరరూపముల వర్ణించెను. ఇట్లడుగడుగునా దీనిని హనుమచ్ఛాస్త్రముగా రచియించెను.

---

1. శ్రీ. రా. క. పూర్వ 96
2. శ్రీ రా. క. పూర్వ 97
3. నరసభూపాలీయము: 2-10

[1] "చిరకాలంబు శచీపురందరమహర్షి ధ్యేయమున్ దృష్ట మం
బర మాకారముగొన్న మోహన మహామంత్రాధిదైవంబు నా
శరరాట్పట్టణ వప్ర గోపుర దిదృక్షా ప్రౌఢతేజంబు వా
నరరూపం బొక తేజ మబ్ధితట మంథానాద్రి రూపంబునన్"

అని శచీపురందరఋషిని, మహామంత్రమును, తన్మంత్రాదిదేవతయగు హనుమంతుని సూచించి భక్తితత్పరత విశ్వనాథయే దేవతార్చావిధిని హనుమంతుని సంతృప్తిపఱచి తాను తృప్తినందెను. [2] సారోద్ధారముకూడ హనుమదుగ్రరూపమును పంచముఖవీరునిగాఁ జూపెను.

[3] "విహరించెం బ్రభువాంజనేయుఁడు నగోర్విన్ వాయుపుత్రుండు స్వా
మి హనూమంతుఁడు తత్త్రికూటగిరి భూమీజాళి లాజాళి చ
ల్లి హరిం బూజయొనర్చెఁబుష్పభర వల్లీ నృత్యమర్యాద సూ
పె హిమానీ మధుబిందు పాద్యములఁ దన్పెన్ దేవతార్చావిధిన్."

ఈ పద్యము తన యిష్టదైవముయెడ భక్త్యావేశమునఁ జెప్పినదే యనిపించును తప్ప యొకరాజదూతను వర్ణించుట కాదు. ప్రభు వాంజనేయుఁడు, స్వామి హనుమంతుఁడు వంటివి భక్త్యావేశావిర్భూత పదములేయనిపించును. అట్టి తన యారాధ్యున కిందు, పాద్యాద్యుపచారము లనర్చనఁగావించుట స్పష్టము. సీతాన్వేషణార్థి యగు హనుమంతుఁడు లంకయందుఁబ్రవేశింపఁబోవునెడ విశ్వనాథ లంకనుగూర్చి

[4] "ఏదన్ స్వాత్మవిచారణ శ్రమములే కింతేని జ్ఞానంబు కా
మాదుల్ తీవ్రములై వెలుంగనగు జీవాకారమై తోచె లం
కా దుర్గాంతర పట్టణంబు పెనుచీఁకట్లందు హృదస్థ్సలీ
ప్రాదుర్భూత విచిత్ర దీపకలచే రాజిల్లు చాయాళిచే"

అని వర్ణించెను. ఇందు ధ్యాత్మవిదులు లంకనుగూర్చి చెప్పురీతి చెప్పఁబడెను. ఆత్మరూపిణి యగు సీత లంకయను శరీరమునఁగలదు. [5] విశ్వకర్మ నిర్మాత. లంక బ్రహ్మనిర్మిత శరీరము. అజ్ఞాన తిమిరపూర్ణమై కన్పట్టునది. భోగాయతన మగు శరీరమువలె నీ లంక భోగస్థానము.

---

1. శ్రీ. రా. క. పూర్వ 103
2. రా. సారో. సుం. 108
3. శ్రీ. రా. క. పూర్వ 104
4. శ్రీ. రా. క. పూర్వ 131
5. తత్త్వ. పుట 134

హనుమంతుఁడు లంకను సంహరించెను. దాని శవము నెవరేని చూచిన సమస్య యనుకొనుచుండగా మానుషరూపము లోచి శవము కన పడలే దని చెప్పుట విశ్వనాథ కల్పనాచమత్కృతి. చంద్రోదయవర్ణన గావించుటలో 180వ పద్యము నుండి 199 వఱకు నిరువది పద్యములను విశ్వనాథ రచించెను. ఇవి యన్నియు నాటవెలదు లగుట శతకమును బోలి వీని కన్నిటికిఁ 'గలువచెలిమికాఁడు' మకుట ముండుట విశేషము. ఈచంద్రవర్ణనయందు హనుమంతుఁడు మందరమైనఁజంద్రుఁడు అమృతకుంభముగా; హనుమంతుఁడు బ్రహ్మయైనఁ జంద్రుఁ డొక గోళముగా ఆంజనేయుఁడు ప్రళయాంబుధియైనఁ జంద్రుఁ డొక ధారుణీమండలముగా ని ట్లీవర్ణన హనుమత్పరము గావించుట విశ్వనాథ భావనాపాతురికి నిదర్శనము. లంకానగరమున సీతకై వెదకు మారుతి భవనసముదాయముఁ జూచునెడ

1 "కుతకుత లాడు నిప్పుకలు కూడలి నిద్దురపోవు నగ్నిప
ర్వత చున నున్న దీ గృహము భగ్గన నెప్పుడు విచ్చునో మహా
ద్రుతిఁ బడఁబోసికొం చెగసి దూఁకెడు నిప్పగు నీటికాల్వలో
క్షితి సకలంబు బూదియగు వేటగునట్లుగఁ దోచుచుండగన్"

అని తలపించుట లంకాదహన భావ్యర్థ సూచనము. ఆ భవనసందర్శనమున విభీషణ గృహవర్ణనము పరమసాత్త్వికముగా నొనర్చుటలో విశ్వనాథయొక్క జాగరూకత వ్యక్తమగును. విభీషణుని యింట నన్యగృహము లందువలె క్రొవ్వుదీపముగాక ఆముదపుదీపముఁ జూచెను. సాత్త్వికరీతి నింత సునిశితదృష్టి వర్ణించుట కల్పవృక్షనిర్మాతకే చెల్లెను. రాక్షసాంతఃపుర దృశ్యములఁగాంచుచో నొక్కచో

2 "పరమవైరాగ్యవంతుఁడౌ పావనికిని నామెఁగనినంత జగ దయా దార్ద్ర్యసరణి యొక్కపెట్టునఁ దోచె" నని చెప్పును. ఇది భావుకుం డాభావన నెట్టిస్థితియందునుఁ బొందఁగలఁ డనుట నిరూపించుచున్నది. దీనినే వైరాగ్యవంతుండు తన విషాదభావంబు చిత్రచిత్రంబులయిన యూహలతో నపనయించుకొను ననును. 'సృష్ట్యాది సర్వ దేవ దానవ మానవ

1 శ్రీ రా. క. పూర్వ 220
2. శ్రీ. రా. క. పూర్వ 246, 316

కథాకోవిదుండైన యాంజనేయుఁ డని చెప్పిన విశ్వనాథ యట్టి హను మంతుని చిత్ర విచిత్ర విశేషభావనల నడుఁగడుగునఁజూపెను. అంతకు మించిన విశేషముఁగ నా బవిష్యద్బ్రహ్మచే భవిష్య దంశమును సైతము చెప్పించెను. సీత కానరాకపోవుటతోఁ గుపితుఁడైన మారుతి నిద్రించు రావణుఁగాంచి మేలుగొల్పి మెడపైఁ గాలూది జానకిని దాచినచోటు చెప్పించెద ననుకొనుచు [1] "ఓహో! యెవండో కలిప్రాదుర్భావము వేళఁ జేయుఁపని నిద్రావేళఁ గాటించుటల్" అనును. ఇది యశ్వత్థామ యుప పాండవులఁజంపిన విషయము. ఈ ద్వాపరాంత విషయమును త్రేతా యుగమునఁ జెప్పించుట యొక విచిత్రము.

అంతటి హనుమంతుఁడు మండోదరిఁగాంచి సీతగా భ్రాంతిపడుట కొంత యసంతృప్తి కల్గించెను కాబోలు నా విషయమును [2] 'ఎంత యా లోచనాపరుండేని నుంత తొందరంపడు శ్రమపడి తోనతోన'' అని 'ప్రమా దో ధీమతా మపి'యనునటుల సమర్థించును. హనుమంతునిగూర్చిన తన యున్నతాభిప్రాయమును [3] 'అమ్మహావానరుండు కపి శిల్పి ఋషి భావ భావనా పరమేశ్వరుం' డని యొకచో వెలిబుచ్చును. పూర్వరాత్రాంత మున నశోకసందర్శన సమయమున మరల శచీపురందరఋషి భావనాగ తుఁడైన పంచముఖాంజనేయుఁడు దర్శన మిచ్చును.

పరరాత్రిఖండము సీతాసందర్శన మగు ఖండము. ఖండాది పద్య ము శివుని నిరంతభిక్షునిగఁ జెప్పుచు స్తుతించునట్టిది. శివాంశ సంభూ తుఁడగు హనుమంతుఁడు పూర్వరాత్రమున

[4] ''హనుమ భిక్షకుఁడనుట యెంతైనఁగాని
తగియె నెక్కెడు గడపయు దిగెడు గడప
మఱియుఁదగె నేది యర్థించె మహితమూర్తి
యద్ది లభియించ దొకట గేహాంతరమున''

ననును. అట్టి విఫలభిక్షువుగఁజెప్పిన విశ్వనాథ యిప్పట్టున సఫలభిక్షుని గావించుటలో నా భిక్షునియం దాదిభిక్షుత నారోపించుచుఁ బరరాత్రి ఖండాదిపద్యముఁ జెప్పెను. వెంటనే యానఫలత నిరూపించుచు

1. శ్రీ. రా. క. పూర్వ 350
2. శ్రీ. రా. క. పూర్వ 337
3. శ్రీ. రా. క. పూర్వ 386
4. శ్రీ. రా. క. పూర్వ 251

[1] 'ముని భావంబునఁ జేరినట్టి కపికిన్ బుష్పాభిషేకంబు చేసెను సామీరికిఁ బూవుదోట' యని యతిథిసత్కారములఁ జేయించెను. శింశుపావృక్షముఁజేరిన మారుతి యటకు సీత రావచ్చునని యూహించెను. ఇట విశ్వనాథ [2] మహేశ్వరుఁడౌ రామునిదూత వచ్చునని రావచ్చుం బ్రతీక్షార్థియై యని యంతట దన దొకయడుగు ముం దనిపించెను. మహేశ్వరుం డౌ రామునిదూత యనుట హనుమంతుని శివాంశసంభూతత్వము సూచించు చున్నది.

రావణుని చూచిన హనుమంతుఁ డాతని తేజస్సుచేఁ జెదరఁ గొట్టఁబడిన తేజస్సుతో నాకుల గుబురులదూరి కన్పడకుండ నున్నటుల పురాలమునఁగలదు. కల్పవృక్షమునందును హనుమంతు డనుకొనక గుబురుల దూరి యిది యేమా యని బీతిగా గ్రహించెను. తాను సృష్టించు హనుమత్పాత్ర కది యసంగత విధానము. కావున దానిని సమర్థించుటకై యిట నైదుపద్యములఁజెప్పెను. సీతతో భాషించు రావణుఁ డొక్కమారు వికటాట్టహాసము గావించెను. సమాధిగతుఁడైన యాంజనేయుఁడు చెదరిన మనఃప్రవృత్తి కలవాఁడై రావణు శిరముపైకి లంఘింప నెంచ దేశకాలానునిర్భర మూర్తియై శచీపురందరబుషి స్తుతించెను. ఇట మరల మంగళరూప, ప్రాసంగ్యోక్త పద్యములచే పంచముఖాంజనేయ సందర్శనము చేయించినట్లు స్తుతి గావింపించెను. ఆరీతి విశ్వనాథ హనుమంతుని స్వస్వరూపసంధానుఁజేసి రామకార్యమున నిల్పెను.

త్రిజటా స్వప్నవృత్తాంతమున వానరుం డొక్కఁడు లంకను దగ్ధము గావించినట్లు మాత్రము మూలమునఁగలదు. దాని నాంధ్ర కర్తలఁ గొందఱు గ్రహించిరి. కొందఱు గ్రహింపలేదు. ఈ స్వప్న వృత్తాంతమున గూడ హనుమద్విషయము మూడు పద్యములఁ జెప్పుచు విశ్వనాథ యిందును [3] 'కొలదుల్ మీరిన నారశింహ ఖగరా ట్పోఁడాశ్వ శాఖామృగంబుల'నని పంచముఖాంజనేయునే దర్శింపఁజేసెను. ఈ స్వప్న వృత్తాంతమునందలి హనుమత్త్వశక్తిని పొడిగించి చండోదరిచే

1. శ్రీ. రా. క. పర 2
2. శ్రీ. రా. క. పర 28
3. శ్రీ. రా. క. పర 375

[1] తెలవారువేళ వచ్చిన
గలల ఫలము తోన గలుగుఁగద రే పెల్లుం
డుల లోపలనే యంత త
గులఁబడి పోయిననుఁ జూచి కొందముతేవే''

యని యనిపించెను. ఇందలి పదప్రయోగ మత్యద్భుతము. ఆ యద్భుతము 'అంత తగులబడిపోయినచూచుకొంద'మను తెలుఁగు నుడికారములోఁ గలదు. ఈ భావ మన్యభాషలందు సాధింవరానిది. విశ్వనాథ పద ప్రయోగ దక్షతకు నిదర్శనమైనది. అంతతో నాగక

[2] ''అంతకోఁతి యొకఁడె యవనిలో నాతఁడు
వాలి రావణునకు వాఁడు సఖుఁడు
అంతకోఁతి మరల నగుపించవలె నన్న
శివుఁడు కోఁతిరూపు చెందవలయు''

ననును. శివాంశ సంభూతుఁ డగు హనుమంతునియెడఁ బల్కిన ఈ పదము సార్థక మగుటయ కాక కవి ప్రయోగ చాతురిని నిరూపించుచున్నది. రాక్షస ప్రభావము, సీతయొక్క స్థితి నెఱిఁగిన హనుమంతుఁడు తన నామె నమ్మ టెట్లా యని విచారించుచు ''రాముఁడైన వృక్షస్థితుఁడౌచుఁ గ్రిందికి వెనక్ డిగివచ్చిన నమ్మ'దనుకొనును. ఇది విశ్వనాథ చమత్కార ధోరణిఁదెల్పును.

ప్రతి విషయమునను విశ్వనాథ వివేచనము ప్రత్యేకత నలరును. సంస్కృతభాష మాటాడిన రావణునిగా తనను సీత యనుమానించు నను కొని మారుతి అయోధ్యకుఁజుట్టు పట్ల వాడుకలోనున్న మైథిలీ ప్రాకృత భాషలోఁజెప్పిన సీత మనస్సు ప్రసన్న మగునని తలచును. సీత మైథిలి. భాష మైథిలి. అది యామె కాత్మీయ మగుటలో విప్రతిపత్తి లేదు ఇట సారోద్ధారము [3] అత్ర వాక్యస్య మనుష్యత్వం కోసలదేశవర్తి మనుష్య సంబంధిత్వం వివక్షితం. తాదృ గ్వాక్యస్యైవపరిచితత్వాత్'అని చెప్పెను. ఏ భాషా శబ్ద మైనను నామెతోఁబా టామెకుఁ గాపున్నవారికి విన్పించును గదాయను ప్రశ్న యుదయించును. అందుకు సమాధానముగా [4] ''అంజ

---

1. శ్రీ. రా. క. పర 381
2. శ్రీ. రా. క. పర 382
3. రా. సారో. సుం. పుట 89
4. శ్రీ. రా. క. ఉష: - 33

నీసూనుండు రసవిహీన ప్రకృతులకు నిద్రామాంద్యంబు సంఘటించు నదియు రసారామ విహరణ శీలుర మే నధిక జాగ్రదవస్థా సంధాయకం బును నగు కంఠస్వరంబునుగూడ జోడించి వృక్షశాఖాంతర్లీనుండై సవ్వ డి యేదో దూరమునుండి మరుత్తరంగములపైఁ బయనించుచున్నట్లుగా నిట్లు వచించె'ననెను. ఈ వచనము సూత్రప్రాయమై ప్రతిపద స్వార స్యము కల్గి సహేతుక మైనది. చెప్పిన వృత్తాంతముకూడ హనుమంతునిచే మత్తకోకిల యందుఁ జెప్పించుట మఱియు విశేషము. అది ఉష: ఖండము. అందుఁ గోకిలలఁ ధ్వనులు సహజములై యనుమానము కల్గిం పవు. తామస ప్రవృత్తులకు మత్తత గూర్చు నవియు నగు మత్తకోకిల లవి. సీతకు సైతము గంధర్వగాన మనిపించుటచే నట నిక రాక్షసులు సందేహించు నాస్కారము లేని రీతిగఁ గవిసమ్రాట్టు రచించెను.

రామవృత్తాంతము చెవి సోకిన సీత శింశుపావృక్షముపైకి చూచెను. ఆమెకు కన్పడిన హనుమంతుని విశ్వనాథ బదుగీతులఁజెప్పెను. ఆ హను మంతునియందును పంచముఖ వీరుఁడే నిగూఢముగఁ గలడు. అందలి యొక పద్యమున

1 "పరమ బుద్ధిమంతు బహుబీక రాకారుఁ
బరమ సత్త్వమూర్తిఁ బరమ శూరుఁ
బరమవాగ్మి మఱియుఁ బరమవరౌనాకారుఁ
జూచెఁ జెట్టు మీద క్షోణిజాత"

అని హనుమంతుని యాంతర రూపముఁ దెల్పుచుఁబరస్పర భిన్న శక్తుల సమీకరణము నాతనియందుఁ జెప్పి మఱియొక టగు

2 "తెల్ల నారచీర ధృతిఁ దాల్చు నాతని
వెల్లజన్నిదంబు వెలయువాని
బ్రహ్మచారివేష భాసురు వానరుఁ
జూచెఁ జెట్టుమీద క్షోణిజాత"

యనుపద్యమునఁ బావని బాహ్యస్వరూపమునుఁ జూపెను. సీతకు విశ్వా సము కలుగ హనుమంతుఁడు మాటకూర్పు నేర్పు నర్థసంగ్రహణంబు

---

1. శ్రీ. రా. క. ఉష: – 57
2. శ్రీ. రా. క. ఉష: – 58

తిర్యగ్భావ సంధానశక్తియుఁ జూపుచుఁ బల్కె ననుట హనుమంతుని వాఙ్నైపుణ్యత నిరూపించును. భరింపరాని బాధ నున్న సీత హనుమంతునితో 'నాస్వామి బ్రతికియున్న నీ భూమినంతను తగులబెట్టడే' మని కోపమునఁ బల్కు ఈరీతి యన్ని రామాయణములఁ గలదు కాని యందుకు హనుమంతుఁడు

[1] ''ఉపసంహరింపు మింతటి; కృపమాలినయట్టి కోపమొవడౌ తులువ తా
నపమార్గగామి యయ్యెనను; విపులను సర్వమున నిప్పెట్టెద రటవే'

యని మీరు మీరు బాగుగ నుంటిరి చాలు. ఈ పిచ్చి జగమును కూల్చకుఁడని ప్రార్థించుట వేఱొకచోఁ గానరాని యమూల్యమగు విషయము. అందుననే స్వయముగ భూపుత్రి జానకీదేవి 'జగత్తుపై నింత మక్కువ గల యితఁ డెవ్వఁడొ సృష్టికర్త' యనుకొనును. ఇందు హనుమంతుని భవిష్యచ్చతురాననత్వము సూచితము. సీత కోరికపై హనుమంతుఁడు తన జన్మవృత్తాంతము 'మాల్యవంత పర్వతమునఁ గేసరి యను వానికి నంజనయందు వాయుదేవుని వరమునఁ బుట్టినవాఁడ' నని చెప్పెను.

సీతను తన భుజముల నెక్కించుకొని కొనిపోదు నన్నప్పుడు మారుతితో జానకి పరిహాసముగా '[2] నేను నీ యంస మెక్కిన నాకాళ్ళులు నేల కంటుఁగదవే' యనును. అందుకు సమాధానము జెప్పుచు హనుమంతుఁడు

[3] ''ఎంతటివాఁడు కావలయు నెప్పుడు యత్ప్రతిభా విశిష్టుఁడై
యంతటివాఁడు నే నగుదు నప్పుడు తత్ప్రతిభా విశిష్టుఁడై
యంతక ప్రాంగణ స్థిత మహాధ్వజవ ద్భుజదండ తీవ్రుఁడన్
జింతిత కార్యముల్ తనరఁజేయఁగఁ గల్పతరూపమానుఁడన్''

అనుట ఆతని శక్తియుక్తులఁ బ్రకటించుచున్నది. ఇది [4] 'హనుమాన్ కల్పవృక్షో మే' యన్న పరాశరవాక్యమును సూచించుచున్నది. రామాయణకల్పవృక్షతను నిర్దేశించుచున్నది. పై హనుమద్వాక్యములవలెనే యాతని మహాభయంక రాకారముఁ జూచి జానకి [5] 'నీ వెంతవాఁడ

---

1. శ్రీ. రా క. ఉష: - 209
2. శ్రీ. రా క. ఉష: - 272
3. శ్రీ. రా. క. ఉష: - 280
4 ప. సం. 6-84
5. శ్రీ. రా. క. ఉష: - 282

వంటివా నీ పంతటివాఁడ వగుదు' వనుట కవి వాక్చాతురిత. పద్యమున మొదటి రెండుపాదములు సమముగ నడిపించుచు శబ్ద పునర్గ్రహణ మొనర్చుట విశ్వనాథ రచనలోఁబ్రత్యేకత. అనంతర మా పద్యముననే 'నిఖిల దనుజమాలా విక్రమ హేలా పరిభావన బాహాప్రచండ' యని యొక్క పెద్దసమాసముతో సంబోధించుట హనుమంతుని పెద్దదగు రూపమునకు సూచనము. ఇట్లు విశ్వనాథ హనుమంతునియెడ గావించిన సంబోధన లన్నియు నాతని సమగ్రస్వరూపమును మనమ్ముం దుంచగలవు.

హనుమంతుఁడు సీతను వీపుపై నిడుకొని గొంపోదు ననుట కంగీకరింపక యామె యందులకుఁ గొన్ని కారణములఁ జెప్పెను. అందొకటి యామె రాముని తప్ప పరపురుషుని తాక ననుట. ఈ విషయము నన్ని రామాయణములు జెప్పినవి. కాని ఇట విశ్వనాథ సీతచేతనే 'పరపురుషున్ స్పృశించ నని పల్కుట నిన్నుఁ బరాభవించు టౌ' ననిపించి హనుమంతు నెంతకో యెత్తెను కాని యట్లన్నవా రేమిచేసిన ట్లను ప్రశ్న యుదయించును. కాని పిదప హనుమంతునిచేతనే [2] 'పరపురుషున్ స్పృశింప నని పల్కిన పల్కు త్రిలోకవంద్య మౌ' నని య ట్లనుటను సమర్థింపఁ జేయును. ఇది విశ్వనాథయందుఁజెప్పెడి గడుసరితనము. ప్రజ్ఞావంతుల కిది యలంకారము.

ప్రతి సంభాషణయందును ఒకరిమాటలచే మఱియొకరిని, వారిర్వరి మాటలచే సహృదయ పాఠకులను ఉక్కిరిబిక్కిరి చేయు విధానము విశ్వనాథకు సహజము. సీతవాక్యముల వలన హనుమంతుఁడు 'సిగ్గుపడి, సమాశ్వసింపఁబడి, ప్రశంసింపఁబడి, లాలింపఁబడి, ప్రేమింపఁబడి గౌరవింపఁబడి నిశ్చలుం డయ్యె' నని కవియే స్వయముగఁజెప్పుట యథార్థప్రదర్శనము. సీత హనుమంతుని వాక్యమున 'యముఁడు నగ్నిహోత్రుఁడు రమించు' నను. ఇది సాధ్యవసాయలక్షణ. యముఁడనుట ధర్మము, అగ్నిహోత్రుఁ డనుట శౌచమునుఁ జెప్పును. అది హనుమ ద్వాక్తృత్వము. హనుమంతుఁడు వెడలునప్పుడే సీయెడ నగ్నికి దాహకత్వ శక్తి యుండు ననుట భావ్యర్థ సూచకము. అట్లే రావణుని రాముఁడే

1. శ్రీ. రా. క. ఉ. షః - 288
2. శ్రీ. రా. క. ఉ. షః - 294

చంపు మను విషయముఁజెప్పుచు సీతయే [1] 'అతని భార్యను దొంగిలె నతఁడు చూచికోపలయుఁ గాని నీకు నాకునున దేల' యని హనుమంతు నితో ననుట గొప్పచమత్కారము.

విశ్వనాథ దివాఖండమున లంకాదహనముఁ జెప్పెను. ఖండాదినే యందలి మంటల వేడిఁజూపించుచు రచన గావించెను. శివ సంబోధన పరమగుఁదొలిపద్యమున 'భస్మానులిప్త దేహ!' యని సంబోధించుటయు కాక 'అగ్నిమయుండుగా నయి మహాకపి' యని, 'కోపపు నిప్పు మండిం చగా బాడబంబు శిఖి శిఖాగర్భ విభూతి'; 'అగ్గి నురుకు' నను పదముల మొదటి నాల్గుపద్యములనే నిప్పులు కురిపించెను. ఇది యీ ఖండమందలి లంకాదహనమునకు సూచకము. లంకాదహనము సమర్థనీయ మొనర్చుట కపికి కవికి నవసరము. కావున

2 "ఎవడో వచ్చెను వెళ్ళెన
ఎవడో యని లెక్కచేయ డెవఁడో చూపిం
చవలయుఁ జూపించుట భూ
ధవనీతి; రఘుపతి నీతితత్పరుఁడుగదా!

అని తా నొనర్చు కార్యము రాజనీతిసమ్మతము, రామానుమతముఁగావిం చుకొనెను. అనంతరము

3 "చూచి రమ్మన్న యెడలఁగాల్చు టిదియైనఁ
జూపులో నగ్నికలవానిఁజూడు మనుట
కాల్చవలసిన దానినిఁగాంచు మనుట
తనరఁబూర్వాప రావిరోధంబుకాదు"

అనునది యుద్భృతావహ భావనము హనుమంతుఁడు రుద్రావతారము. అతఁడు ముక్కంటి. ముక్కంటిఁజూచుట కాల్చుటయు. చూపులో నగ్ని కల రుద్రావతారునిఁ జూడు మనఁ గాల్చుమనుటే కాన చూచి రమ్మన్న కాల్చిరమ్మనుట తప్పు యిందు విరోధము లేదు. విశ్వనాథ హనుమం తుఁడు పంచముఖుఁడు. త్రిపంచనయనుఁడగుట ప్రతి హనుమత్ప్రద మగు వర్ణనయందును గాననగుదు. చిన్న తేటగీతియుం దింతటిభావ

1. శ్రీ. రా. క. ఉషః – 401
2. శ్రీ రా. క. దివా – 9
3. శ్రీ. రా. క. దివా – 11

మిముడ్చుచు 'చూచిరమ్మన కాల్చివచ్చు' టను తెనుఁగునానుడిని సమ
ర్థించుట విశ్వనాథప్రతిభకు నిరూపణము.

హనుమంతుని మహద్రూపము వర్ణించు పట్టున త్రివిక్రముతోఁ
బోల్చుట యన్యరామాయణములఁగన్పట్టును. అట్లు వాచ్య మొనర్చుట
విశ్వనాథ తీరు కాదు. అట్టి హనుమంతునిఁగూర్చి [1] 'ఇంతింతై మఱి
యింతయై మఱియు దా నింతై నభోవీథిపై నంతై'యని చెప్పెను.
ఇది పోతన పద్యమున కనుకరణమని గుర్తించుట సహజము. అట్లను
కరించుట విశ్వనాథ యవసరము కాదు. అభిమతము కాదు. ఆ పద్యము
త్రివిక్రముని వర్ణించునట్టిది కాన యీ హనుమద్రూప మా త్రివిక్రముని
తో సమాన మని ధ్వనింపజేయుటే యిందలి కవి ప్రౌఢత. వాల్మీక
మునకు భాష్యముగాఁ దన రామాయణమును చెప్పుకొన్న విశ్వనాథ
విమర్శనీయ వివాదాంశముల కెన్నిటికో సమాధానరూపమునఁగవిత
నడుపుట కెన్నియేని యుదాహరణములు లభించును. సీతతో హను
మంతుఁ డెవ్వ రెఱుఁగనట్లు మాటాడెను. కాని రాక్షసస్త్రీలు రావణునితో
నెవ్వడో వానరుఁడు వచ్చి సీతతో మాటాడె ననిరి. ఇట్లనుట వా
రెఱిగియుఁ నూరుకొనుట యసంగతము కావున విశ్వనాథ మగతనిద్దుర
నుండగా నా కోతి మాటాడినటు లుండె నాతఁ డెవ్వరని రాక్షసస్త్రీలచే
నడిగింగెను మగతనిద్దురలో నుండ జరిగినవి తెలిసియుఁదెలియనట్లుండి
ముందు గుర్తింపలేనిపై తుదకు గుర్తింపఁబడుట సహజము, సమర్థ
నీయము. అట్లే రాక్షసస్త్రీలు ప్రశ్నింపగాఁదన కేమియుఁ దెలియదని సీత
యనుట యబద్ధము చెప్పినట్లు విమర్శనీయము. విమర్శకులు దానిని
[2] అసత్యముగా నంగీకరించి ధర్మసూక్ష్మముగా సమర్థించిరి. అగతిక
గతిగా సమర్థనము సమ్మతింపని విశ్వనాథ సీతచే

[3] ''నిజముగ నే నెఱుంగ నతనిన్ మును పెన్నడు చూడలేద య
క్కజముగ మీరు నే నతనిఁగాంచితి మిప్పుడె యొక్కసారి యు
ర్వీజములు పెల్లగించుట కపిప్రకృతిఁబడి దాని నే నెఱుం
గఁజూడి యెఱుంగ నిక్కువముగాఁ గపిబాసనుగాని సుంతయున్''

---

1. శ్రీ. రా క. దివా. 37
2. తత్త్వపుట 591 రా. సారో. సుం. పుట 116
3 శ్రీ. రా. క. దివా 133

అని చెప్పించెను. ఇది కవి ప్రౌఢోక్తిసిద్ధ సత్యము అన్యరామాయణముల కంటె నే నెఱుంగ ననుచు నెక్కువ పర్యాయము లన్నను నిందు సత్యదూరము లేదు. ఇది వ్యంగ్యోక్తి పూర్ణము. హనుమంతుని మునుపు సీత ఎఱుఁగక పోవుట, చూడకపోవుటయు నిజమే. ఆశ్చర్యముగ నిటఁగాంచుటయు నిజమే. వృక్షములు పెళ్ళగించుట చెప్పి చేసినది కాదు కావున నది యెఱుంగకుండుట నిజమే. కపి భావ తెలియకుండుట నిజమే. కావుననే కపిచేకవి మైథిలీభాషలో చెప్పించెను. ఇట్టి ప్రతి పద్య, పద, దళ, భావ సార్థకతలు విశ్వనాథ రచనయం దెల్లెడలఁగాననగును

హనుమంతునిపైకి రక్కసులను రావణుఁడు పంపుచుండ వారందఱ హనుమంతుఁడు చంపుచు [1] 'ఏ నుత్తరోత్తర సమ్మర్థకృతాధి కాధిక బలోద్య ద్బాహుఁడ నగుట రావణుఁ డెఱుంగ' డను కొనును. అందుకుఁ దగినట్లె యొకటిమించి యొకరితో యుద్ధము గావించుచు నైపుణ్యముఁ జూపెను. ఇట్టి హనుమంతుని యుద్ధనైపుణ్యము రావణువాక్యములఁ జెప్పించుటలోఁ గవి నేర్పు గన్పట్టను. ఇదే విషయము నింద్రజిత్తుతోడి యుద్ధమున 217వ పద్యమున నిరూపించెను. హనుమంతుఁడు యుద్ధకార్యము ననే కాక యుద్ధనీతియందును సమర్థతఁజూపుట కన్పట్టును. రావణుని సభయందుఁబ్రసంగించుచు [2] 'ఇంతకు యుద్ధము సంగతి విచారించుము. ని కొలువులోనివారిని విచారించుకొమ్మను. నీకై వా రేల చావవలయుఁ ననుచు భేదోపాయ యత్నము సేయుట, విభీషణునితో రావణునకు భేద మేర్పడు రీతి యొనర్చుట అందుకు నిదర్శనము

హనుమత్తత్త్వము శివకేశవాభేద తత్త్వము. అతఁడు శివాంశ సంభూతుఁడు. విష్ణ్వవతారమగు రాముని దూత అందుననే రావణునితో "సౌమిత్రి వైష్ణవుఁడు, నీవేమో శైవుఁడవు నాకు నిద్దఱు నొకటే'యనును. విశ్వనాథ రావణసభ యొక న్యాయస్థానము. అందు హనుమంతుండు తన ప్రజ్ఞా పాటవములు చూపుచు నేఁబది పద్యముల సుదీర్ఘోపన్యాస మొనర్చెను. వాదన నిల్పెను. అందు [4] 'దుందుభి యస్థిచయంబు సుఖోన్నతి బొట్టనవ్రేలఁ గాల దా సారామడల దూరము విసరె ననుచు శక్తిని

---

1 శ్రీ రా. క. దివా 275 3. శ్రీ. రా. క. దివా 288

2. శ్రీ. రా. క. దివా 275 4. శ్రీ. రా. క. దివా 268, 289, 293, 303

త్యాగ మొకఁడే పరమార్థము, త్యాగియె మోక్షపథగామి; యనుచు నీతిని, 'నీ కాయుస్సున స్వస్తి యౌ' నని మేలును; ''దైవాధీనముల్ జయాపజయముల్ దైవంబు శ్రీరాముఁ''డని సహేతుకవాదమును చక్కగవినిపించి హనుమంతుఁడు తన వాక్యజ్ఞత నిరూపించుకొనెను.

ఆ సభలో హనుమంతునియెడ దోషారోపణమున ప్రాడ్వివాకులు నధికృతులు(Members of Jury) న్యాయస్థానము శిక్ష విధించుచు వధార్హుఁడని, ఆహనుమంతుని సమాధానము గూడ విని, యాతనిపక్షము వాదించువారెవరైన నుండిరా యనుటతో విభీషణుఁడు లేచెను. ఇది యంతయు ప్రస్తుత కాలమునఁ బ్రత్యక్షముగ విశ్వనాథ గాంచు న్యాయస్థాన (Court) వ్యవహారము. దీనిని త్రేతాయుగమునకుఁ గొంపోయి సమకాలీన సమాజ స్థితిని ప్రతిబింబింపజేసెను. విభిషణుఁడు విజయమందిన న్యాయవాది (Lawyar) మరణశిక్షను తప్పింపఁగల్గెను. విభీషణుచే ''తా ననివట్టి మాట లవి తా నని నట్టివి కా' వనిపించుచు సర్వనామపూర్ణముగఁ జెప్పించి హనుమంతుని శిక్షార్హుఁడు కాఁ డనుటయు కాక

1 "తాను భగవంతుఁడని చెప్పెఁ గాన సీతఁ
డతఁడు భగవంతుఁ డని చెప్ప టయ్యె నిచట
వాఁడె భగవంతుఁడో మరి వీఁడు నగునొ
వార్థి మాత్రము దాటినవాఁడు వీఁడు''అని హనుమంతుని భగవంతునిగనే చెప్పెను. హనుమంతునకు పుచ్ఛదాహశిక్ష విధింపబడెను. అతం డూరంత రెుుక్కమారు చుట్టుపెట్ట నన్నియిండ్లును గలిసి రామార్పణ మయ్యెను. అనంతరము తోకఁ జల్లార్చుకొని సీతకడ కేగెను. ఇట నన్య రామాయణములవలె నాత్మనిందంజేసికొనుట చెప్పక విశ్వనాథ హనుమంతునియందుదాత్తత నిల్పెను.

లంకాదహనముఁజేసిన కారణముఁగూర్చి హనుమంతుఁడు రామస్వామి యత్నమునకు విఘ్నములు చేయక వారి పురనిర్మాణమున తీరిక లేకుండుట కని చెప్పెను. ఇది విశ్వనాథ రమ్యకల్పన మైనను హనుమంతుని దూరదృష్టిని తెల్పుచున్నది. మరల సముద్రము లంఘించి కపితతిఁ జేరఁగనే హనుమంతుఁడు 'దృష్టా సీతా' యని క్రియాపదముతో

1. శ్రీ. రా. క. దివా 320

నాకాంక్షానుగుణ సమాధానము చెప్పినట్లు వాల్మీకి రచించెను. ఈ యర్థము నాంధ్రరామాయణకర్తలందుఁగొందఱు గ్రహించి కొందఱు గ్రహింపక యుండ విశ్వనాథ

1 "కనుపించినది సీత కనుపించిన దటంచు
నిట్టనిటారుగా నిలువఁ బడియె
చూచితి జానకిం జూచినాఁడను జాన
కీదేవి నంచుఁజెక్కిళ్ళ నవ్వె"

నని వారిక సందేహింప ప్రశ్నింప నవసరములేనిరీతిగ నదే క్రియాపదాదిని ద్విరుక్తి నొనర్చి చతురుక్తిగఁ జతురోక్తిగఁ జెప్పెను. ఇట్లే రామునితోఁగూడ 'కాంచితి సీత' నని యారంభించెను. ఆ యారంభ విశిష్టత దానివలనఁ బ్రిభావితుఁడైన రామునియందు నిరూపించెను. అట్టి రాముని మానసికభావనయందుఁ గ్లిష్టతర మగు హనుమత్కృత్యము లన్నియుఁ గొనియాడబడుట హనుమద్విశిష్టతకు నిరూపణము.

చూడామణి నిడి హనుమంతుఁడు వెడలెను. నాటిరాత్రిరాముఁడు ఫలహారంబు సేయునప్పుడు లక్ష్మణుఁడు కొంతవిషయముఁ జెప్పెను. సీతను బుజములపైఁ గొనితెత్తు నన్న విషయము, అందుకు సీత సమాధానముఁ జెప్పుట ద్వారా రామునియందు సహజదరహాసము నింపఁబడెను. ఈ సమయ సందర్భ కల్పనము విశ్వనాథ విచిత్రము. అదియు జాంబవంతుఁడు తనతోఁజెప్పె నని యంగదుఁడు తనతోఁజెప్పెనని లక్ష్మణుఁడు చెప్పెను. చెప్పవలసినవాడు చెప్పదగని విషయములఁ జెప్పించుట యందలి నేర్పిది. ఇంకను ఇట్లే రాత్రి ప్రొద్దుపోయినపిదప సుగ్రీవుఁడు వచ్చి యశోకవన భగ్నాదులఁ జెప్పుటయుకాక రావణదర్శనార్థ మట్లు గావించె నని తుదకు 'వలచె దానవరాజు' నసెను.

2 "మరియు నొక హాస్యరస మైన మాట కలదు
అందఱము మేము మున్నె నీ వన్న భయము
అసురరాజున కని నిశ్చయంబు చేయు
వచ్చి పావని 'యది యెల్ల భక్తి'"

---

1. శ్రీ. రా. క. సంధ్యా 31
2. శ్రీ. రా. క. సంధ్యా 137

యనెను. ఇది జయవిజయ శాపవృత్తాంత ధ్వని. ఇదియే [1] 'సీతాదర్శనమున రావణునకు దశావతారములు తోచుటయందు ధ్వనితము. ఇది యధ్యాత్మంబగు రహస్యము. దీనిని చెప్పనట్లు చెప్పి విశ్వనాథ చతురితఁ బ్రదర్శించెను. ఇందుకుఁ గారణము అధ్యాత్మరామాయణమునఁ గల

[2] "రావణో రాఘవే ణాశు - మరణం మే కథం భవేత్
సీతార్థ మపి నాయాతి - రామః కిం కారణం భవేత్॥
ఇత్యేవం చింతయ న్నిత్యం - రామ మేవ సదా హృది
తస్మి న్దినేఽపరరాత్రౌ - రావణో రాక్షసాధిపః॥
స్వప్నే రామేణ సందిష్టః - కశ్చి దాగత్య వానరః
కామరూపధర స్సూక్ష్మో - వృక్షాగ్రస్థోఽనుపశ్యతి॥
జానకీం వాక్శరై ర్విధ్య - దుఃఖితాం నితరా మహం
కరోమి దృష్ట్వా రామాయ - నివేదయతు వానరః
ఇ త్యేవం చి న్తయన్ సీతా - సమీప మగమ ద్ద్రుతమ్"॥

రావణుఁడు "తనకు రామునివలన మరణము త్వరగా ఎట్లుకల్గును? రాముడు సీతకొఱకుకూడ రాఁడేమి? యని యెల్లప్పుడు తలచుచుండుటవలన నా యపరరాత్రమున రావణునకు కలవచ్చెను. అందు రామునిచే బంపబడిన యొక కోఁతి వచ్చి సూక్ష్మరూపమున వృక్షముపై నుండెను. ఇప్పుడు కనుక నేను సీతను నామాటలచే బాధించినయెడల దీని నా వానరుఁడు చూచి తప్పక రామునకు చెప్పును." అనుకొనుట రావణ సమాలోచనము. ఈ రహస్యాంశమును వ్యంగ్యముగ నొక్కమాటలో విశ్వనాథ నిబంధించెను. మరియు [3] మారుతి యచ్చట నొక కొంటెపని చేసె నది నీకుచెప్పవచ్చునో రాదో యని చెప్పక వెడలెను. దానిని తొలిసంజవేళ రామదర్శనముచేసిన వినత సుషేణ శతముఖులు లంకా దహన వృత్తాంతముగఁ జెప్పిరి. ఈ రీతిఁ జెప్పుట కవినే ధ్వనియో చమత్కార మనియో యనిపించును కాని నిజమున కిది యౌచిత్యము.

ఈ కృత్యము లన్నియు రామాదేశము లేక హనుమంతుఁడు స్వయం నిర్ణయమునఁజేసినవి వానిని రామునికడ నేకరువు పెట్టుటలో

---

1. శ్రీ. రా క వర 133 నుండి 137  3 శ్రీ. రా. క. సంధ్యా 172
2 అ. రా. సుం. 7-15, 16, 17, 19

నౌచిత్యము లేదు. మఱియు హనుమంతుఁడు రామునిముం దిట్టివి చెప్పు కొనని పరమభక్తుఁడు. కావున వారివారిచేఁ జెప్పించెను. ఒక్కమారుగఁ జెప్పిన నివి యన్ని మరచి జానకీవిరహబాధతో నే రాముఁడు మిగులును. ఈరీతిఁజెప్పుటవలను రామునియం దా కరుణముఁదొలగించి హాస్యాద్భుతముల కవకాశముకల్గించుట యగును. రామునికడ డాంబికములఁబల్కని హనుమంతుని యవికత్థనత నిరూపించినటులు నగును. కాన విశ్వనాథ చతురమతి నిట్లు చెప్పెను.

ఇట్లు విశ్వనాథ కథాకథన, సంభాషణాదులఁ దన ప్రత్యేకతను విశిష్టతను నిరూపించుకొనుచు సుందరకాండయందు హనుమంతుని పాత్ర ను పోషించుచుఁ దన యుపాస్యదైవ మగు పంచముఖాంజనేయుని సహృదయపాఠకుల ముందు సాక్షాత్కరింపఁ జేసెను. పంచముఖాంజ నేయుని తన రామాయణమున దర్శింపఁజేసిన విశ్వనాథ ఆ హనుమం తుని రుద్రాంశత, సూర్యశిష్యత, ప్రముఖముగఁజూపినట్లు విశేషణ సం బోధనలవలనఁదెలియును. కపిపరమేశ్వరుఁడు - పూర్వ-221: వానరలోక ధూర్జటి - పర-24; మహాకపీశ్వర-ఉష: 281; కపిలోకధూర్జటి-దివా 205; కపిలోకధూర్జటి - సంధ్యా 141; అని యిట్లు ప్రతిఖండమునఁ జూపుచు పంచముఖుఁడు పూర్ణరుద్రావతారుఁడనుట నిరూపించెను. విశ్వనాథ తన కల్పవృక్షమును ఈశ్వరాంకిత మొనర్చుటయు నిట గ్రాహ్యము. అట్లే రవిశిష్యునిగ-సూర్యశిష్యుండు - పూర్వ 213, 182 వంటి వానియందుఁ జెప్పుటయు కాక లంకానగరమున సీతాన్వేషణలో నా మేడలనుండి వచ్చు సన్నినిమేళము [1] 'జ్ఞాపకము వచ్చె హనుమకు జలజబంధు నొంటిచక్రం పు టరదంపు మింటి యుల్వు' తన విద్యాభ్యాసమును గుర్తుకుతెచ్చెను. తిరిగి సముద్ర దాటి వచ్చిన హనుమంతుఁ డంగదాదులకు యావద్వృత్తాంతముఁ జెప్పఁబోవుచు [2] 'నే నమస్కరింతు నీరజాతాప్తుని సకల వివిధ శబ్దశాస్త్ర గురుని' యనును. ఇట్లు అవసరములందెల్ల గురుస్మరణ మును హనుమంతుఁడు సేయ గురుశిష్యసంబంధ స్మరణము కవి యొన ర్చెను. గ్రంథాదిపద్యముననే యీ విశేషము గన్పట్టును.

1. శ్రీ. రా. క. పూర్వ 224

2. శ్రీ. రా. క. సంధ్యా 37

## యుద్ధకాండము — హనుమంతుఁడు

రామాయణమున హనుమద్విజయమన సముద్రోల్లంఘన మొన ర్చి సీతను గాంచి రక్కసుల యుక్కణచి లంకను భస్మీపటలము గావించి తిరిగి వచ్చిన సుందరకాండ గాధయే. యుద్ధకాండయందు హనుమత్సహాయమున రామవిజయము వర్ణితము హనుమత్పరముగా నీ కాండయందు రామవిజయమున ముఖ్య దోహదకారి యగుచు జంబుమాలి, ధూమ్రాక్ష, అకంపన, దేవాంతక, త్రిశిర, నికుంభులను సంహరించుట; రావణ కుంభకర్ణులతోఁబోరు; మూర్ఛిత లక్ష్మణుని రక్షింప సంజీవనిఁ దెచ్చుట; కాలనేమివధవంటివి ప్రధానఘట్టములు. సుందరకాండయందలి విజయమునకు సీతావార్తఁ దెచ్చినందుకు సంతసించిన రాముఁడు

[1] "ఉపకృతమతి నీకుం బ్రి
త్యుపకారము సేయ నెద్దియుం గల్గమి నీ
యుపగూహనంబుఁ గైకొను
కపికుంజర! యనుచుఁ దిగిచి కౌఁగిటఁ జేర్చెన్"

అని హనుమంతుని కౌఁగలించినరీతి యుద్ధకాండారంభమునఁజెప్పఁబడెను. తత్జ్ఞులచే నిది జీవబ్రహ్మైక్యముగఁ బ్రశంసింపఁబడినది. వర్ణనాతీత మగు నీ సన్నివేశమును రంగనాధరామాయణము 16, గోపీనాధరామా యణము 13 పద్యములలో రమ్యముగ వర్ణించెను. సేతుబంధనము గావిం పఁబడెను. రామునికోరికపై ఆంజనేయుఁడు లంకయందలి ద్వారపాలకా రాది స్థితిగతు లన్నియు వివరించుటలో నాతని పరిశీలనాదక్షత వ్యక్తమగును.

విభీషణ శరణాగతియందు మిగిలిన వానరుల యాలోచనకు భిన్న ముగ విభీషణునకు శరణ మిడుట యోగ్యముగ నిరూపించుటలో హనుమం తుని ప్రజ్ఞ వ్యక్తమగును. ఇట [2] "వివక్షితార్థ ప్రతిపాదన శక్తంబును, శ్రవణమాత్ర సుఖ ప్రతిపాదకంబును, స్నిగ్ధంబు, నర్థగౌరవ యుక్తం బును, మితాక్షరంబు నగు వాక్యంబున నిట్లనియె" నని గోపీనాధము వేంకటకవి హనుమంతుని బుద్ధిమద్వరిష్ఠత నిరూపించెను. రామరావణ

1. భా. రా. యు - 7
2. గో. రా. యు - 342

సంగ్రామమున హనుమంతుఁడు లంకా పశ్చిమద్వారమున యుద్ధము సేయ నియుక్తుఁడయ్యెను. ఘనవర్ణ, ఉగ్రరూప, మహాదంష్ట్ర, మహానాదాదులందఱనుఁ దోఁకతోఁ గొట్టి చంపెను. ఈరీతిగా యుద్ధకాండమున హనుమంతుని బహువిధ యుద్ధకౌశలము నాంధ్రకవులు వర్ణించిరి.

సీతకు రామవిజయవార్తఁ జెప్ప హనుమంతుఁ డంపఁబడెను. రామాగమనవార్త భరతునకుఁ జెప్పుటకు నాతఁడే పంపఁబడెను. అట్లు పంపుటకు హనుమంతుని యుచితజ్ఞత వాక్యజ్ఞతలే కారణము. శ్రీరామ పట్టాభిషేకావసరమున హనుమంతుఁడుత్తరసముద్రజలముఁ దెచ్చెను. పట్టాభిషేకానంతరము విశేషముగ సమ్మానితుఁ డయ్యెను. శ్రీకృష్ణ రామాయణమున సీపట్టున హనుమంతుఁడు రొమ్ముఁజీల్చి సీతారాములఁ జూపిన వృత్తాంతము కలదు. రంగనాథ రామాయణమున రాముని భోజనపాత్రఁ గొంపోయి హనుమంతుఁడు మునివృక్ష మధివసించి దాని దళములఁ గపితతికిఁ బ్రసాద మిడిన ఘట్టము కలదు. ఇట్టి యవాల్మీకాంశములను సైతమాంధ్రరామాయణకర్తలు సముచితముగ రచియించిరి. ఇట్లు రామాయణ యుద్ధకాండయందు హనుమత్కథ మనోజ్ఞముగ విరచితమై కన్పట్టును.



# ఉత్తరకాండము - హనుమత్కథ

శ్రీమ ద్వాల్మీకిరామాయ ణాంతర్గత మగు నీ యుత్తరకాండను గూర్చి ప్రక్షిప్త మను వాదము కలదు. ఆ పక్షమువారు రామాయణమును షట్కాండపరిమితముగనే స్వీకరింతురు. తెనుఁగు రామాయణముల నెక్కుడు షట్కాండపరిమితములే. వాల్మీకిరామాయణము గాయత్రీమంత్ర సంపుటితో చతుర్వింశ త్యక్షర గాయత్రిగా చతుర్వింశ త్సహస్ర పరి వ్యాప్త గ్రంథ మని యెల్ల రంగీకరించు విషయము. గాయత్రియందలి 'చోదయాత్' అను మూడక్షరములు నుత్తరకాండమునఁ గలవు కాన నుత్తరకాండఁ దీసివైచిన గ్రంథలోపము, మంత్రలోపము నగును. అందుచే నుత్తరకాండ లేక సంపూర్ణరామాయణము కాజాలదు.

గాయత్రీమంత్ర సంపుటీకరణము గావించిన ఆంధ్రరామాయణ కర్తలు వాసుదాస, తాడేపల్లి పితాపుత్రులు ఉత్తరకాండను స్వీకరించిరి. అధ్యాత్మరామాయణమునను నుత్తరకాండ గలదు అవతారమునందు త్తరాంశమై అవతారము చాలించు విషయమును, ఎల్లవారిని నుత్తరగతికి నంపు విషయము నందుఁ గలదు కాన నది యుత్తరకాండముగా సార్థకము. గ్రంథమున ననంతర భాగ మగుట, కావ్యలక్ష్యము స్పష్టపఱచుట ద్వారా శ్రేష్ఠతఁ దెల్పుటలలోను నీ యుత్తరత్వము సార్థకము. ప్రత్యేకముగ ఆంధ్రకవులలో తిక్కనసోమయాజి నిర్వచనోత్తరరామాయణము రచించెను. కంకంటి పాపరాజు శ్రీమ దుత్తరరామాయణమును రచించెను. పాపరాజు పుష్పగిరితిమ్మన సహాయమున నాతని సమీర కుమారవిజయగాథతో వాల్మీకమును మేళవించి నడపెను.

ఉత్తరకాండయందు నాంజనేయోపాఖ్యానము ప్రశస్తమై యున్నది. అగస్త్యునితో రాముఁడు 'మహాబలశాలియగు హనుమంతుఁ డండియు ప్రభు వగు సుగ్రీవుని దుఃఖము చూచి వాలినిఁ జంపక యేల మిన్నకుండె' నని ప్రశ్నించుట వలన నగస్త్యుఁడు హనుమత్కథ నంతనుఁ జెప్పెను. [1] 'న హి వేదితవాన్ మన్యే - హనుమాన్ ఆత్మనో బలమ్' అని తనబలము నెఱుఁగమి మిన్నకుండె నని వాల్మీకి [2] 'ఆంధ్రవాల్మీకియుఁ

1. వా. రా. ఉ 35-12
2. ఆం. వా. రా. ఉ 791

దెల్పిరి. కాని రంగనాథరామాయణము 'సుగ్రీవునకుఁ బూని శూరత మెరసి యుగ్రజు నా వాలి నుర్విఁ గూల్చుకుము' అన్న తల్లియాజ్ఞచే మిన్న కున్నటు లన రామకథామృతమున [1] 'గురు నిదేశము సుగ్రీ;వామాత్యుఁ జేసెఁగా తన; సామర్థ్యము పైరిమీద సాగింపనికిన్' అని గురువాక్య పరిపాలకుఁడై య ట్లుండినట్లు చెప్పెను. వాల్మీకమునందు 35, 36 సర్గలలో జెప్పఁబడిన యుత్తరరామాయణాంతర్గత హనుమత్కథను తిక్కన ముప్పదియేడు పద్యములఁజెప్ప వాసుదాసు నలుబదియేడు పద్యముల; కంకంటి పాపరాజు అరువదిరెండు పద్యములఁ జెప్పిరి. తాడేపల్లి వారు సర్వాధికముగా నూటడెబ్బదియేడు పద్యముల విపులముగా నీ హనుమత్కథను వర్ణించిరి. అధ్యాత్మోత్తరకాండమున నీకథ చెప్పఁబడలేదు. రామాయణముల స్పష్టముగా గానవచ్చు హనుమ జ్జననాదికకథ యిదియే.

రామాయణ కిష్కింధాకాండయందు జాంబవంతుఁడు చెప్పిన హనుమత్కథ, ఈ యుత్తరకాండకథల తారతమ్యముఁ బట్టి ఒక్కకవియే ఒక్కకథ రెండుమార్లు చెప్పఁ డనుటనుబట్టి ఆ వాల్మీకియు, నీ యుత్తరకాండ రచించిన వాల్మీకియు భిన్ను లను వాదము గలదు. ఈ వాదములు [2] 'ఉత్తరరామాయణ విమర్శయందు ఖండింపఁబడినవి.

ఉత్తరకాండాంతర్గత హనుమత్కథ స్థూలముగ ని ట్లున్నది. మేరుపర్వతమునఁ గేసరి రాజుగఁ బాలించుచుండెను. అతని భార్య అంజన వాయుదేవుని వరమువలన కుమారుని గనెను. అతఁడే అంజనేయుఁడు. శైశవముననే ఆకలిగొన్నయతఁడు ఫలభ్రాంతి సూర్యుని పట్టఁబోయెను. సూర్యగ్రహణమునకై వచ్చిన రాహువు భయమంద నింద్రుఁడు వచ్చి వజ్రాయుధమున నా బాలుని వైచెను. దానితాకునఁ బూర్వాద్రిపైఁబడిన బాలుని హనువు భగ్నమయ్యెను మూర్ఛిల్లిన పావనిఁగొని పవనుఁడు లోకంబున వాయువు నిరోధింప బ్రహ్మ ఆ బాలుని బ్రతికించెను. దేవేంద్రాదులు వరము లొసంగిరి. హనుమంతుఁడు వరప్రాబల్యంబున జలనిధి యట్లు పొంగి మున్యాశ్రమంబుల నల్లరిసేయుచుఁగార్యభంగము లొనర్చుచుండ గత్యంతరము లేక బలవిస్మృతి కల్గునట్లు మునులు శపించిరి.

---

1. శ్రీ. క. ఉ 7-361
2. ఉత్తరరామాయణ విమర్శ పుటలు - 9, 10

అంత నతఁ డఋశ్యమూక పర్వతము నుండి సుగ్రీవుఁ జేరిననాఁడును దనశక్తి నెఱుఁగమి వాలి సుగ్రీవుఁ దఱుమఁగ వానివెంటఁబరుగిడుట తప్ప ఎదుర్కొన్నవాఁడు కాఁడు. విషయమెఱుఁగక సుగ్రీవుఁడును మిన్నకుండెఁగాక హనుమంతునకు సము లెవరున్నా రనుచుఁబుట్టుగట్టునుండి గుర్తింతుగట్టు వఱకు వెనుకకుఁజనుచు సకలవిద్యలు సూర్యునివద్ద నేర్చుట నగస్త్యుఁడు కీర్తించెను.

హనుమత్ప్రస్తావన మిందుఁ గలదు. శ్రీరాముఁడు సుగ్రీవున కంగదాదుల నప్పగించుటలో 40వసర్గ ప్రత్యేకము హనుమత్ప్రార్థనగాఁ జెప్పఁబడెను. రాముని వీడి వెళ్ళుటకు బాధనందిన హనుమంతుఁడు [1] 'ఏమనువాఁడ నెట్టు లవనీశ! ననుం దొలఁగం దలంతె మా స్వామి నెపంబుతో నకట సంకెల వైచితె నోరువాదు' అనుచు నెల్లవేళల రాముని స్నేహమునకుఁ దాను స్థాన మగునట్లు వరము కోరు ఘట్టమును తాడేపల్లివారు హృదయంగమముగ వర్ణించిరి. అట్టియెడ రాముఁడు మారుతిని బిగ్గఁగౌఁగిలించుకొని

[2] ''ఏవ మేతత్ కపిశ్రేష్ఠ - భవితా నాత్ర సంశయః
చరిష్యతి కథా యావ - దేషా లోకే చ మామికా॥
తావ త్తే భవితా కీర్తిః శరీరే ప్యసవ స్తథా
లోకా హి యావత్ స్థాస్యంతి - తావత్ స్థాస్యంతి మే కథాః॥
ఏకైక స్యోపకారస్య - ప్రాణాన్ దాస్యామి తే కపే
శేష స్యోపకారాణాం - భవామ ఋణినో వయమ్''

అని రాముఁడు ప్రతిపద సార్థకముగాఁదనకథ లోకమున నున్నంతకాలము హనుమత్కీర్తి నిలచు నని ఒక్కహనుమదుపకారమునకే ప్రాణమీయ దగిన దని, మిగిలిన యుపకారము లన్నిటికిఁ దాను ఋణగ్రస్తునిగనే యుండు నని తీరనిఋణముగ వర్ణించెను.

హనుమంతునితోఁ బాటు జాంబవంత, మైంద, ద్వివిద, విభీషణుల నుండఁగోరి మిగిలినవారిని తనతో రాఁగోరువారిని మహాప్రస్థానమునకు రాముఁ డనుమతించెను. హనుమంతుఁడు చిరంజీవిగాఁ దన నిత్యనివాస

---

1. శ్రీ. క. రా. పూ - 184
2. వా. రా. ఉ 40-20 నుండి 22

మున నుండి యన్యయుగములందునుఁ దగు చరితఁ గల్గి భక్తుఁడుగా రాముసేవఁ జేయుచు నుండెను. ఇట్లు

"ఆవల రామభద్రుఁడు గుణాంబుధి వాయుజుఁ జూచి ప్రీతితో
జీవితమందు నాశ యెడసేయకు మానకు మా ప్రతిజ్ఞ యీ
భూవలయంబునందుఁ గపిపుంగవ! మత్కథ యెంతదాఁకఁ బెం
పై విలసిల్లు నందనుక హాయి రహింపుము ధ్రువ స్థితిన్"

అన్న వాసుదాసపద్యము హనుమత్కునకు రామునిచేఁ బలుకఁబడిన భరతవాక్యముగా నుత్తరకాండయందు హనుమత్కథ పరిపూర్ణము గావింపఁబడెను. ఈ రీతిగ నుత్తరకాండపర్యంతమగు సంపూర్ణరామాయణమునఁ గల హనుమత్కథ ఆంధ్రరామాయణ కర్తలచే మనోజ్ఞముగ వర్ణింపఁబడెను.



# సమీర కుమార విజయము

హనుమత్కథ తెలియఁదగుఁబ్రధాన గ్రంథములు రెండు I. శ్రీమ ద్వాల్మీకిరామాయణము II. పరాశరసంహిత. ఆ రెంటియందలి హనుమ త్కథను స్వీకరించి హనుమత్కథనంత నేకసూత్ర మొనర్చినకవి పుష్ప గిరి తిమ్మన. హనుమత్కథను ప్రధానేతివృత్తముగా గ్రహించి యతఁడు సమగ్ర కావ్యమొనర్చెను. అతని కావ్యమే సమీరకుమార విజయము. ఈ ప్రబంధ మాంధ్రవాఙ్మయమున నుత్తమప్రబంధములలో నొకటనఁ దగినది. ఈ ప్రబంధనాయకుఁడు హనుమంతుఁడే

శ్రీమద్వాల్మీకి రామాయణ శ్రీపరాశర సంహితలకు వారధి నిర్మించిన సమీరకుమార విజయమున నా మూలగ్రంథముల ప్రభావమెట్లు గ్రహింపఁ బడినరీతి మూలగ్రంథములతోఁ దులనాత్మక పరిశీలనము నిందలి ప్రధానాంశములు. ప్రస్తుత పరిశోధనవ్యాసమునకు జీవమగు నిట్టి యంశ సోపానమునం దీసమీరకుమారవిజయానుశీలన మత్యంత ప్రధానాంశము.

కర్తృవిచారము : సమీరకుమార విజయకర్త పుష్పగిరి తిమ్మన. 'తిమ్మన నామధేయ ప్రణీతంబైన' యని యాశ్వాసాంత గద్యలోఁ జెప్పుకొనుట వలనను, దీనిని పూర్వపక్ష మొనర్చినవారు లేని కారణమునను ఆంధ్రకవులలో ననేకులవలె కాక యిది నిర్వివాదాంశమగుట యదృష్టము

[1] "ఇది శ్రీమదంజనా తనయదయారస లసత్కటాక్ష వీక్షామహత్త్వ సంప్రాప్త కవిత్వ విద్యాతథానగుణ" శ్రీహనుమత్పాద సేవాగతాధ్యాత్మతత్త్వకవిత్వ మహత్వవిదుఁడ" నిత్యాదిగాఁజెప్పుటచే నితఁ డనన్య హనుమద్భక్తుఁడగుట స్పష్టము. 'పుష్పగిర్యప్పనార్యతనూజ' యనుటవలన నీతని తండ్రి పుష్పగిరి అప్పన. ఇవి యన్నియు స్వతః ప్రమాణములఁ దెలియఁదగునవి కాగా నన్య ప్రమాణముగా

[2] "హనుమద్దివ్య పదారవింద మకరందానంద నేందిందిరా
త్ము ననేకాంధ్ర కృతి ప్రకల్పన సమర్థుం బుష్పగిర్యప్పనా
ర్యుని సత్పుత్త్రునిఁ దిమ్మనాఖ్య కవి చంద్రున్"

అని కంకంటి పాపరాజు చెప్పుట వాని యథార్థ్యతఁదెల్పుచున్నది.

1. సమీర పీఠిక 12
2. శ్రీ. ఉ. రా. పీఠిక 24

అందే 'మత్స్యహంశోత్త' యనియుఁ జెప్పుకొనుటవలనఁ దిమ్మనకుఁ బాపరాజు సమకాలికుఁడు, ననేకకృతులు విరచించినవాఁడనియుఁ దెలియును.

ఈతనికి 'కవిమిత్ర' యనుబిరుదము కలదు. ఈతఁడు కంకంటి పాపరాజు ఉత్తరరామాయణమునకేకాక విష్ణుమాయావిలాస యక్షగాన రచనయందు [1] 'టేకుమళ్ళ రంగశాయి - ద్విపదభాగవత రచనయందు' కంకంటి నరసింహం-విష్ణుమాయావిలాస ద్విపద కావ్యమందు, ధరణి దేవుల రామమంత్రి - దశావతారచరిత్ర యందును సహకరించినవాఁడు కావున నీతని బిరుదము సార్థకమైనది. [2] దశావతారచరిత్రవిషయమునఁ బుష్పగిరితిమ్మనయే ఆగ్రంథమును రచించి రామన పేరున పెట్టెనందురు కూడ. ఈతఁడు వైదికశాఖా బ్రాహ్మణుఁడు. పుష్పగిరియింటిపేరు. ఆశ్వలాయన సూత్రము, విశ్వామిత్రగోత్రము. అప్పన, ఓబలమ్మలపుత్రుఁడు. వేంకటకృష్ణయ్య, వెంకటకవియు నన్నలు. నెల్లూరి మండల చరిత్ర సంగ్రహముఁబట్టి ఈకవి నివాసస్థలము నెల్లూరుజిల్లా, కోవూరు తాలూకా, మోడెగుంట గ్రామమని తెలియుచున్నది. ఈతని కాలము 1750 - 1790 హనుమంతునీతఁడిష్టదైవమ గనే కాక గురునిగాఁగూడఁ జెప్పెను. అందును

[3] ''స్వప్నమున మున్ను నాకు సాక్షాత్కరించి
తత్త్వమస్యాది వాక్యసంతతికి నర్థ
మెఱుక చేసిన గురుఁడ నేనే యటంచు
నాన తిచ్చిన హనుమంతు నభినుతింతు"

అనుటచే ననుమానప్రమాణమునఁ గొన్ని విషయముల గుర్తింపఁగలము. ఈతఁడు స్వాప్నాంజనేయు మెఱిఁగినవాఁడు కావచ్చును. లేదా స్వప్నోపదిష్ట మంత్రోపాసకుఁడు గావచ్చును.

ఇందుఁదత్త్వమసి వాక్యమునకు స్వామివివరణఁజెప్పుటన 'దేవో భూత్వాదేవంయజేత' తత్ = ఆ ఉపాస్యదైవతమగు నేను నీవేయనుట,

1. తెలుగు సాహిత్య సమీక్ష సంపుటం 2-పుట 556
2. రా. దొ. రా. పుట 517
3. సమీర పీఠిక 7

యన్న వాక్యము నిరూపించుటచే [1] 'జీవబ్రహ్మైకత్వ నిరూఢమానస్కులై నవారలు అన్న జీవబ్రహ్మైక్యమిది. తత్త్వమస్యాది పద్యప్రథమపాదము హనుమంతుని బ్రహ్మత్వమునే' భావింపంబడ భవప్రభుతఁ దోపయుని చెప్పుచున్నది.

ఇట్లాతఁడు సిద్ధుఁడగు నుపాసకుఁడని తెలియనగును. మంత్ర సిద్ధులలో స్వప్నసాక్షాత్కారము నొకరీతి. కాగాఁ 'తత్త్వమసి' యను నది మహావాక్యమే యయిన నందుకుఁగారణము కలదు హనుమంతుఁడు రామరహస్యోపనిషత్తునందు ''ఐహికేషు చ కార్యేషు - మహాపత్సు చ సర్వదా-నైవ యోజ్యో రామమంత్రః-కేవలం మోక్షదాయకః ఐహికే సమనుప్రాప్తే - మాం స్మరే ద్రామసేవకం' అని ఐహికములందా నిత్తు నని, తన దైవమగు రాము నందుకు వినియోగించుకొనక మోక్షమునకే వినియోగించుకొనఁదగునని తెల్పెను. అగుచోఁదాను పరము నొసంగఁ జాలఁడా యను మీమాంస వచ్చును. అదికూడఁ దనవలన నగుననుట తనదైవమును తక్కువచేసిన ట్లగును. కాన యునలేదు తప్ప యాతఁడందుకుఁ జాలఁడనుట హనుమద్భక్తుఁడగుఁ దిమ్మన యంగీకరింపలేని విషయము. కావుననే జ్ఞానాత్ మోక్షము కాన 'అహం బ్రహ్మాఽస్మి - తత్త్వమసి' వంటివాని జ్ఞానమే మోక్షము కాన నాజ్ఞానముఁగల్గించె నన మోక్షమొసఁగె నన్నటులే. హనుమంతుని యనన్యభక్తుఁడగుఁదిమ్మన తన దైవముయొక్క శక్తిసామర్థ్యముల నింతగా నిరూపించినవాఁడయ్యెను. ఇందు కుపోద్బలక మగు సంహితావాక్యము కలదు.

[2] ''యత్రాస్తి భోగో న హి తత్ర మోక్షః
యత్రాస్తి మోక్షో న హి తత్ర భోగః
శ్రీమారుతే స్సేవన తత్పరాణాం
భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ'' (శౌనక సంహితా)

యనునది పై యవకాశమును స్పష్టపఱచు చున్నది. మహావాక్యములు నాల్గుండగా నీ వాక్యముఁజెప్పుటలో హనుమంతుని బేధా తిమ్మనభావ ముపాస్యోపాసకభావమే.

సమీరకుమార విజయమును సమగ్రముగఁబరిశీలింప నిందలి

1. సమీర పీఠిక 18
2. సుందరహనుమద్వైభవము - పుట - 29

వస్తువు ముఖ్యముగ మూఁడు మార్గముల సేకరించిన దని స్పష్టమగును. అవి 1. పూర్వరామాయణము 2. ఉత్తరరామాయణము 3. పరాశరసంహితయు. ఈకావ్యము నీతఁ డేఁ డాశ్వాసములుగా రచించెను. ఉత్తరరామాయణకథతోఁ గావ్య మారంభమై పరాశరసంహితతో నడచి ప్రథమాశ్వాస మాఱెంటిగాథలఁ గూడియుండెను. రెండవయాశ్వాసము ఉత్తరరామాయణ పరాశరసంహితలతోఁ గూడినదే. తృతీయాశ్వాసము పూర్వరామాయణకథతో నడచినది. చతుర్థ పంచమ షష్ఠాశ్వాసములు ప్రధానముగాఁ బరాశరసంహిత ననుసరింప సప్తమాశ్వాసము శ్రీపరాశరసంహిత వస్తువునే కల్గియుండి భారతగత మగు సౌగంధికకుసుమాహరణ వృత్తము మాత్రము కూర్చుకొని యున్నది. మొత్తము మీద తెలుఁగుసాహిత్య సమీక్షకర్త జి. నాగయ్యగారి మాటలలో నిది హనుమత్పురాణము.

హనుమత్కథావిషయమునఁ బుష్పగిరితిమ్మన పై కావ్యములతో నెట్టి సామ్యభేదములు కల్గిన రచన సాగించె ననునది పరిశీలింపఁదగిన విషయము. ప్రథమాశ్వాసమునం దుత్తరకాండగతమగు నగస్త్యాగమ వృత్తాంతముఁ జెప్పుటద్వారా వశిష్ఠుడు శతానందునకుఁజెప్పినట్లారంభించిన యీకావ్యము నగస్త్యప్రోక్తమగు రామాయణ ప్రామాణికమార్గమునకు నడిపెను. అగస్త్య రామ సంభాషణమున వాలి సుగ్రీవుల జనన వృత్తాంత మయినపిదప రావణునికంటెను, వాలికంటెను, మించినవాఁడగు హనుమంతునిఁజెప్పియాతని శాపము ప్రస్తావింపఁబడెను. రాముఁ డాశాప కారణ మడుగుటద్వారా హనుమత్కథ యంతయుఁజెప్పఁబడినది. కాని యిందు నాకాశవాణిద్వారా మాయాపురి రాజధానిగ నేలు శతకంఠరావణునికి జెప్పఁబడినది. అగస్త్యుఁడు వానిజనన విషయముఁ జెప్పెను. ఇదియు దశకంఠుగాథనే పోలియున్నది.

ప్రథమాశ్వాసమున నారంభ మయిన యీ శతకంఠరావణవధ వృత్తాంతము పంచమాశ్వాసము 78వ పద్యమునందు వాని మరణముతో నంత మయ్యెను. అనఁగాఁ బంచముఖాంజనే యావతారఘట్ట మనుట. ఈలోగా సీతచే నడుగఁబడినవాఁడై రాముఁడు హనుమంతుని ఏకపాదరుద్రావతరణాది గాథలఁజెప్పెను. శతకంఠు వధఁగూర్చి చింతించు రాముఁడు హనుమంతుఁజూచి [1] 'ఓయీ! వాయుకుమార! సారజవ శౌర్యో

1. సమీర 1 - 81

త్సాహ బాహుబలో పాయ శ్రీల భవత్సమానుఁడు దలంపన్ లేఁడు లోకం బునం దేయుద్యోగములన్ సమర్థుఁడవు నీకే యేకపాదాఖ్య చెన్నా యెన్ నాయము నీవు సేయఁగల కార్యం బిట్టు పేక్షింపఁగన్' అని పొగడుట విన్న సీత 'హనుమంతుఁడేకపాదరుద్రుఁ డీధరిత్రి నేల కపిరూపు వహించె' నని ప్రశ్నించెను. రాముఁడు పావని పావనచరిత్ర నప్పుడు చెప్పినట్లిందుఁ గలదు. పై రీతిగా సాక్షాచ్ఛ్రీమహావిష్ణ్వవతారమూర్తి, ధర్మస్వరూపుఁడగు శ్రీరామునినోటనే హనుమంతుని యనన్యసామాన్యశక్తి వివరింపఁబడెను.

<u>ఏకపాద రుద్రావతరణకథ :</u> ద్వాత్రింశ దర్బుదముల రుద్రు లనుసరిం పుచుండ బ్రహ్మాండము నేలు ఏకపాదరుద్రుఁడు పేరోలగమున నుండి భావమున రాముఁడు దోప బయల్వెడలివచ్చి తపోనిష్ఠుఁడగు శివునిఁ జేరెను. అట్టి శివవీర్యమున హనుమంతుఁడు జనించుట నేకపాదరుద్ర రూపుఁ డయ్యెను. 'హనుమంతుఁ డజైకపాదరుద్రావతారఁ' డని హను మల్లీలాతరంగిణి తెల్పుచుండ[1] 'సాక్షాద్రుద్రావతారుఁడతఁ' డని యానం దరామాయణముచెప్పుచున్నది. అజ, ఏకపాద అనునవి రుద్రునిభిన్న అంశ లుగా[3] 'రుద్రాధ్యాయమువలనఁ దెలియును. తిమ్మన ఏకపాదరుద్రుని గానే గ్రహించినట్లు ప్రథమాశ్వాసము 85, 87, 88, 96, 102, 116 ఇంక ననేకపద్యముల పరిశీలనమునఁ దెలియును. [4] 'అతని సన్నిహితుఁడగుఁ గంకంటిపాపరాజు యొక్క ఉత్తరరామాయణమునను 'ఏకపాదరుద్రుం డితఁడని ప్రయోగము అష్టోత్తరనామముల 'రుద్రవీర్యసముద్భవాయ నమః' అని కలదు. స్కాందపురాణ పరాశరసంహితాదులందలి మర్కట మిధున సందర్శనమువంటి విందునుఁగలవు కాని ఏకపాదరుద్రావతరణ స్థితిమాత్రము తిమ్మనకృతియందే కన్పట్టును.

కావ్యమునందు వస్త్వైక్య సాధనమునుఁ గవికర్తవ్యము. సమీర కుమార విజయము భిన్నభిన్న కథాభాగముల కేకీకరణము. మాలాకా రుఁడు భిన్నభిన్న పుష్పముల నొక్కసూత్రమునఁ గూర్చినట్లు తిమ్మ నయు హనుమత్కథావసరమగు నుపకథలను గుది గ్రుచ్చెను. అట్టి

1. శ్రీ హనుమల్లీలాతరంగిణి - పుట - 2
2. ఆనందరామాయణము - మనోహరకాండ 16-19
3. రుద్రాధ్యాయము - ముఖపత్రము
4. ఉత్తరరామాయణం 5-83

యోజనకై సీతారాముల సంభాషణనాధారముగాఁగొని సీతచే నడుగఁబడి రాముఁడు చెప్పునట్లుగ నాయాఘట్టముల మధ్య సీతారాములఁ బ్రవేశ పెట్టుచుఁగథనడిపెను. హనుమంతుఁడు జనించినరీతి నడిగితివి కానఁజెప్పె దననుచు రాముఁడు శివవనవిహారాది హనుమజ్జన్మ కారణ విషయములఁ జెప్పెను.

శివవనవిహారాది వృత్తాంతము : కైలాసాచల రాజశృంగమున శ్రీకం ఠుడు నోత్కంఠుఁడై యుండి సతిమతి వన విహారమునఁగలదని యెఱిఁగి విహరింపఁజొచ్చెను. రతినున్న కపిమిధునముఁగని వారు నారూపముల నెత్తి రమించిరి. అట్టి యవసరమున శివవీర్యము పార్వతియందు నిక్షి ప్తము చేయఁబడెను. ఆమె దానిని భరింపఁజాలనన భూమియందు, నగ్నియందు వాయువునందు నుంచఁబడెను. ఈ విధానమంతయు పరా శరసంహితోక్త విధిఁజెప్పఁబడెను. వాయువువలన నావీర్య మంజన గొనె ననుటతో నాయంజన యెవ్వరని, హనుమంతుని తండ్రి యెవ్వరని ప్రశ్నించుటవలన రాముఁడు సీత కావృత్తాంతములు చెప్పినట్లు నిబంధిం చెను. ఆ వృత్తాంతములు ద్వితీయాశ్వాసమునఁగలవు. హనుమంతుని తండ్రియగు కేసరి వృత్తాంతము వాల్మీకి ఉత్తరరామాయణము రీతని నడచెను. పరాశరసంహితయం దీకేసరి జన్మకుఁగారణమగు రాథంతర కల్పవృత్తాంతమును చెప్పఁబడెను. [1] 'తవ కశ్యపః పుత్రస్స్వాఽహం - హనుమన్నామవానహమ్' అను శివువరమున నాకశ్యపుఁడే కేసరిగా జన్మించెను. సుకంఠియను విద్యాధరపుత్రి శాపవశమున నహల్యాగౌత ములకు అంజనగ జనించినట్లిందుఁజెప్పఁబడెను.

ఆనందరామాయణ స్కాందపురాణ పరాశర సంహితాదులన్నియు నంజన తపమొనర్చిన స్థలము వేంకటాచలముపై నంజనాద్రియని చెప్పుచుండఁ దిమ్మన దీనిని పుంజికస్థలముగాఁ జెప్పెను. వాయువు తనవద్ద ఫలాకృతి నుంచిన శివవీర్యము సమర్పింప భక్షించి యంజన గర్భముఁదాల్చెను. అగ్నిపురాణము, శివపురాణాదులగాథ కొంతభిన్న ముగఁగన్పట్టు నీ విషయమును తిమ్మన పరాశర సంహిత షష్ఠపటలము ననుసరించిచెప్పెను. [2] 'ఆనందరామాయణాద్భుత రామాయణములు రాము

1. ప. సం. 82 - 18
2. ఆనంద. సార. 1-2 నుండి 7 అం. వా. రా. బాల 481

నివలెనే హనుమంతుఁడు కూడ యజ్ఞపురుషుఁడిడిన పాయసభాగము వలనఁ బుట్టినట్లు చెప్పుచున్నవి. అంజన కన్న బాలుని తిమ్మన [1] 'నిడుద వాలము వానినెలఁబొల్పు తలనిల్పు బలువేల్పు తులవేల్పు బలిమివాని' నిత్యాదిగాఁవర్ణించెను. ఇది హనుమంతుని ప్రథమ స్వరూపవర్ణనము. ఇందు బాలాంజనేయరూపమును కన్నులకుఁ గట్టినట్లు చూపించెను. అనుప్రాసశోభితముగ నిందుఁ దిమ్మన రచనఁ గావించెను.

సూర్యగ్రహణము : ఒక్కనాఁడంజనపర్ణశాలలో సుతునకుఁగోమల పల్లవాళ శయ్య ఘటించి పండ్లు తేనేగెను. ఆకటవాపోవు పాపఁడుతూర్పున నుదయ భానునిఁగాంచి ఫలమని భ్రమించి యాకసమున కెగిరెను. అద్భుతము గను, భయంకరముగను నేగివచ్చు నాతనిఁగని దివాకర పారిపార్శ్వకు లారవిని శరణువేడ నాతఁడు

2 "ఈతఁడు సర్వలోక హితుఁ డీశ్వరవీర్యజుఁ డాంజనేయుఁ డ
త్యాతత బాహుశౌర్య నిధి యయ్యును గేవల శైశవంబుచే
నీతఁడు నన్నుఁ గన్గొని ఫలేచ్ఛ గ్రహింపఁగ వచ్చె నిందునన్
బీతిల నేలః"

అని జగచ్చక్షువు పల్కెను. ఇందు హనుమంతుని భావిజీవిత విధానము సూచితము. ఇంద్రుని వజ్రఘాతమున నాబాలుఁడు హనువుపగిలి యుదయాద్రిపై వివశుఁడై పడెను. కుమారుని యట్టి గతికిఁగోపించిన వాయువు సుతుఁగొని వ్యాపారముడిగి యుండెను. సర్వప్రాణులు నిష్ప్రాణులు కాగా బ్రహ్మాది దేవతలువచ్చి హనుమంతునకు వరములు ప్రసాదించి వాయువును ప్రసన్నుని గావించుకొనిరి. అంజనాతనయుఁడు హనుమన్నామ ప్రసిద్ధుఁడగుటకి ఘట్టమే ముఖ్యకారణము. వజ్రాయుధమువలన దెబ్బ తిన్న హనువు కల్గినందున హనుమంతుఁడయ్యెను. ఈ యంశమున కంకంటి యుత్తరరామాయణ సమీరకుమారవిజయములసమతగానవచ్చును.

సకలదేవతల వరమునంది వట్టశక్యముగాక జగత్ప్రళయ కారకుఁడుగా విజృంభించు హనుమంతునిఁగాంచి భార్గవకులులైన మునులు [3] 'ఇంతటిశౌర్యశాలి కొకయించుకయడ్డములేకయున్న నేవింతలుసేయఁ

1. సమీర 2 - 118
2. సమీర 2-137
3. సమీర 2 - 195

జూచునో' యని సముద్రమునకు వేలవలెఁదనశక్తి తనకుఁదెలియనట్లు శాపంబిడిరి. ఇందు హనుమంతుని శౌర్యము సముద్రమువలె ననంతమను వ్యంగ్యమును కవి తనయుపమచేఁజెప్పినవాఁ డయ్యెను. ఆ శాపమున సాత్త్విక గతిఁబొందిన హనుమంతునకదియు నొక్కభూషణ మయ్యెనని శాపము నుచితరీతి సమన్వయపరచి హనుమత్పాత్రను తిమ్మన చక్కగఁ బోషించినవాఁ డయ్యెను. లోకోపకారార్థము పొట్టియైన దిట్టహరితో నర్థాంతరన్యాసముఁజెప్పెను.

అంజన తన కొమరునకు వాలిసుగ్రీవుల బాంధవ్యముదెల్పి వారిలో సుగ్రీవునకు హితమంత్రివి కమ్మనుచు నామెయే [1] 'తమలోఁ దాఁజెడసిన సుగ్రీవుని గూరిచి యింద్రజునిఁగూల్పకుము మామసుమీ' యనిసోదర ప్రేమతోఁజెప్పెను. ఇట్లువాలియెడ హనుమంతుని యౌదాశీన్యకారణము సహేతుకముగాఁజెప్పబడెను. అందుననే [2] 'అశక్తుపోలికందాళె మరుత్సుతుం డతని దఁడనసేయక తల్లియాజ్ఞచేన్' అని 'ఘను లంబయనజ్ఞ క్రమింపరేకదా!'యనియర్థాంతరన్యాసమున సమర్థించుచు ఘనతనిల్పెను. ఉత్తరరామాయణము గురునాజ్ఞచే సుగ్రీవుఁ జేరినట్లు చెప్పెను. దాని ప్రకారము సుగ్రీవునిఁజేరుసరికే రవికడ విద్యలనభ్యసించినట్లు తెలియును. తిమ్మన మాత్రము సుగ్రీవుని మంత్రియైన యనంతరమే సూర్యునికడవిద్యలు నేర్వఁబోయినట్లుచెప్పెను. ఇదితిమ్మనచేసినమార్పు.

వాల్మీకి హనుమంతుని త్రివిక్రమునితోఁ బోల్చుట గ్రహించిన తిమ్మనయు రవికడ విద్యలనభ్యసింప వచ్చి దేహము పెంచిన హనుమంతునిఁ త్రివిక్రమునితోఁబోల్చెను. హనుమంతుని విరాడ్రూపము [3] మూడు పద్యముల వర్ణింపఁబడెను. ఇట్లే 2-197, 4-179, 183, 7-88 వంటి వానిలో త్రివిక్రమావతార విషయము సూచింపఁబడుట హనుమంతుని యౌన్నత్యమును చాటుచున్నది. సూర్యునిఁజేరి మారుతి 'తుభ్యంనమస్సత్త్వజ్ఞానకళాత్మనే' యని నమస్కరింప నతఁడు 'భవతస్సంకల్ప సిద్ధిర'స్తనెను. ఇందలి పదములు సాభిప్రాయములు. పూర్వము రవి యొసగిన వరముల జ్ఞప్తిచేసి వేదశాస్త్రవిద్యల నర్థించిన హనుమంతునకు

---

1. సమీర 2-201
2. సమీర 3 - 3
3. సమీర 2-217, 218, 219

భానుఁడు తనపేరు, ప్రదక్షిణవేగముఁ దెల్పెను. అంత

[1] ''పావని పల్కె నో భువనపావన! నా వడి నేనె పేర్కొనం
బోవుట యెంత గర్వి యని బుద్ధిఁ దలంపకు పూర్వపశ్చిమ
గ్రావయుగంబునం బదయుగం బిడి వెంబడిఁజెంది యుందునో
దేవరకంటె ముందు నడతెంతునొ యానతి యియ్యవే యనన్''

అని హనుమంతుని నిగర్వశక్తిమత్త్వము నిరూపించెను. పూర్వపశ్చిమా ద్రుల నిలచి విద్యలనేర్చిన ఈహనుమద్రూపము మధ్యమరూపము.

[2] ''యాదృశం రూప మాలంజ్య-లోకానుగ్రహ కారణాత్ ...
తాదృశం మధ్యమం రూపం - మామకం విద్ధి పార్థివ'

యని సంహిత పై 'లోకానుగ్రహకారణాత్' అను దానినే [3] 'చదివెసామీరి లోకైక సంగ్రహేచ్ఛ' యని యనువదించెను. ఇట్లు ద్వితీయాశ్వాసమున ముఖ్యముగా నుత్తరరామాయణాంతర్గత హనుమద్గాథను శ్రీపరాశర సంహిత మలచి ప్రబంధోచిత వస్తువు నేర్పఱుకొని పుష్పగిరి తిమ్మన రచనఁజేసెను.

సుగ్రీవమైత్ర్యాచరణము: సమీరకుమారవిజయ తృతీయాశ్వాసము పూర రామాయణ కథా సంకలితము. హనుమంతుఁడు సుగ్రీవునికడనున్న రీతి

[4] ''కార్యాకార్యవిధిం బ్రధానుఁ డయి శోక ధ్వంసనాయుక్తి నా
చార్యుండై బహుచింతితార్థ ఘటనా సంపత్తిచే దేవుఁడై
ధైర్యోత్పాదన శక్తి దాత యయి నిత్యంబున్ మరుత్పౌత్రి త
త్పూర్వప్రోద్భవుఁ బ్రోచె దీనజన సంతోష ప్రదుల్ గా బుధుల్''

అనిచెప్పెను. ఈ యాశ్వాస మందలి హనుమత్కృత్యములయెడ నిది సూత్రము. రామ ప్రథమ సమాగమమున హనుమంతుండు వెడలిన రీతిఁజెప్పుటలో నాంధ్రరామాయణములు రెండుగ చీలిపోయినవి. వాల్మీకము ననుసరించి భాస్కర, గోపీనాథ, వాసుదాస, తాడేపల్లివారలు హనుమంతుని భిక్షుక వేషమునఁజూప నధ్యాత్మము ననుసరించి రంగనాథ, మొల్ల, శ్రీపాదాదులు వటువేషధారిగాఁ జూపిరి. పుష్పగిరి తిమ్మనయు వటు రూపమునే తన కావ్యమునఁజూపెను. [5] రాకేందుకరనిభ బ్రహ్మ

1. సమీర 2 - 215
2. ప. సం. 51 - 23
3. సమీర 2 - 225
4. సమీర 3 - 5
5. సమీర 3 - 20

సూత్రంబుతో ననుపద్యమున నప్పటి స్వరూపముఁగన్నులఁ గట్టినట్లు చూపెను. ఇటఁదనయాభరణములు గుర్తించిన రామునే తనదైవముగా బ్రహ్మవాక్యముల స్మరించి గ్రహించెను. ఇదియు రంగనాథరామాయణ మునననుసరించి చెప్పినరీతి సుందరకాండకథ యథావాల్మీకము తిమ్మన నడిపెను. అశోకవన ధ్వంస సమయమున

[1] ''సకలబల హేతుభూత పంచకము కడిమి
జార్చి సప్తపరిధా నాత్మజ వ్యసనము
లడఁచి విజితాక్షుఁడై సుస్థిరాత్మయోగ
మతిశయిల సంతసిల్లె న య్యతివిభుండు''

అనునొక్కతేట గీతిలో మంత్రిపుత్ర, సేనానాయక, అక్షాదుల నణచినరీతిఁ జెప్పెను. సుందరకాండ నొక యోగవిశేషముగ తత్జ్ఞులు చెప్పుదురు. ఈ యొక్క పద్యమున నట్టియోగవిశేషమంత నద్భుతముగఁ గవి చిత్రించెను. హనుమంతుని యతిశ్రేష్ఠునిగఁ జూపెను. ఆయోగముతోఁబాటు మహాయాగముఁజేయించి పూర్ణాహుతి, యవభృథస్నానములఁ బరిపూర్తి గావించినరీతి [2] 'సుర లుపద్రష్ట లుద్ధుర సింహనాదంబు శ్రుతి సూత్రనికరంబు దితిజకులము' అని సాంగోపాంగ యాగముగాఁ జెప్పెను. హనుమద్విజయమునకు రాముఁడు గుచ్చి కౌఁగిలించుట సమ్మానించెను.

సంక్షిప్తముగ కథఁ జెప్పించి యనంతరము ప్రశ్న వేయించి సమాధానముగా సమగ్రవృత్తాంతమును వివరించుట తిమ్మన రీతి. అటులనే [3] 'సౌహృదస్థితి విభీషణునియం దెఱిగించి పతిఁ జేర్చి స్థిర రాజ్యపదవిఁ గూర్చె'' నను పద్యమున యుద్ధకాండయందలి హనుమత్కృత విశేషములఁజెప్పి 'శతానందునకు వశిష్ఠునిచే వివరింపఁజేసెను. సేతువును నలునిచేఁ గట్టించె'నని కర్తృత్వము మారుతియందే యుంచెను. వాల్మీకి రామాయణమునఁ దెలియఁదగువాని కధికప్రాధాన్య మీయక యవాల్మీకముగుఁ గాలనేమివృత్తాంతము మాత్రము తొంబదిపద్యముల వర్ణించెను.

కాలనేమి వధ : ఈ యుపాఖ్యాన మధ్యాత్మరామాయణ యుద్ధ కాండమున షష్ఠ, సప్తమ సర్గలందు, నానందరామాయణమున సారకాండమున

1. సమీర 3 – 109
2. సమీర 1 – 123
3. సమీర 3 – 136

నేకాదశ సర్గయందుఁ జెప్పఁబడెను. వాల్మీకికృతమే యానందరామాయణ మైనను ప్రసిద్ధమగు చతుర్వింశత్సహస్ర శ్లోక పరిమిత రామాయణమున లేమి నిది యవాల్మీకముగా గ్రహింపఁబడుచున్నది. అట్లవాల్మీక మైనను నాంధ్రరామాయణముల భాస్కర, రంగనాథ, మొల్ల, గోపీనాథ, పండరినాథ, రామకథామృతాదు లన్నిటఁ జెప్పఁబడెను. సరసము, జనరంజకము, నద్భుతావహము నగుటవలనఁ దిమ్మనయు దీనికిఁబ్రాముఖ్యత నిడి తన కావ్యమున స్వీకరించెను.

మూర్ఛనందిన లక్ష్మణుని బ్రదికింప సంజీవకరణిఁ దే నేగిన హనుమంతుని వంచించి లక్ష్మణ ప్రాణరక్షణ గావింపకుండునట్లు చేయుటకై రావణ ప్రేరితుఁ డైనవాఁడు కాలనేమి. హనుమంతుఁ డేగు త్రోవలో ఆశ్రమము నిర్మించుకొని మునిరూపమున నుండి దాహ మడిగిన హనుమంతునకు భయంకరమగు మొసళ్ళుగల సరస్సుఁజూపెను. శాపవశమున మొసలిగ నున్న ధాన్యమాలిచేఁ బట్టఁబడి దాని నిశాపవిముక్తఁ జేసి యథార్థ మెఱిగిన హనుమంతుఁడు కాలనేమిని వధించెను. యుద్ధకాండగత హనుమద్విజయములఁజెప్పి పాతాళలంకావిజయమునకు సూచనఁగావించుచు [1] 'అట్టి జగజెట్టి గాడుపుపట్టి గట్టి దిట్టతన మిట్టి దని మాటఁ బట్టు కొలువ నెట్టివారికి బె ట్టనుచు హనుమత్సామర్థ్యమున వ్యత్యనుప్రాస సామర్థ్యమునఁ గవి చూపెను.

మైరావణ వధ : ఇది యాంధ్రదేశమున మిక్కిలి ప్రచారమందిన కథ. ఈ వృత్తాంతము నాధారముగఁజేసికొని యనేకరచనలు వెలసినవి. అంతే కాక ప్రాచీనకాలమునుండి జనసామాన్యమున వినోదసంధాయకమై యున్న తోలుబొమ్మల ఆటలయం దీకథ విశేషప్రచారము పొందినది. తిమ్మన దీనితో చతుర్థాశ్వాస మారంభించెను.

ఈ మైరావణవృత్తాంతము పరాశరసంహితయందు 44, 45, 46, 47 పటలములు నాల్గింటియందు విపులముగఁ జెప్పఁబడెను. ఆనందరామాయణమున సారకాండయందు నేకాదశసర్గయందుఁ గలదు. సామ్యభేదముల పరిశీలనమున సమీరకుమారవిజయము పరాశరసంహిత నాధారముగఁగొనె నని తెలియును, రావణుఁడు హనుమద్రామ పరాక్రమములఁ దలచి భయ

1. సమీర 3 - 286

మంది యుపాయమున జయింపఁగోరి తన చెలికాఁడు, నాగలోక లంకావిభుఁడు, మాయదారి యగు మైరావణుని పిలిపించెను. వాఁడు రామలక్ష్మణులఁ దన పురిఁ గంకాళికి బలియొ నర్తునని చెప్పి వచ్చి తనప్రియత్న ముఁగూర్చి భార్యతో ననెను. ఆమె రామునియొక్క, విశేషించి హనుమంతునియొక్కయు శక్తియుక్తులఁ జెప్పఁచి 'చ్చొడిఁ గట్టవ' ద్దనెను. ఇట నామెచేతను హనుమంతుఁడు సూర్యునిఁ బట్టిన గాద చెప్పఁబడెను. ఇట్లు పునరుక్తమైన యా వృత్తాంతమున భిన్నత కానవచ్చును.

హనుమంతుఁడు సూర్యునిఁ బట్టుటఁ జూచి రాహువు బ్రహ్మతోఁ జెప్ప నాతఁడు వైచిన బ్రహ్మాస్త్రమును హనుమంతుఁడు వాలమునఁ గొట్టి పడగొట్టినట్లు మైరావణసతి తెల్పెను అంత నాతోక నింద్రుఁడు వజ్రాయుధమునఁ గొట్టెను. దాని నెఱిఁగి యంజన వచ్చి బాలునిపై నిట్లు క్రోధమూని కొట్టఁదగునా? యన నీతనితో నెవ్వరు పోరగల రని సమాధాన మిచ్చినట్లుఁ గలదు. ఇట్లు తాను చెప్పిన కథకే భిన్నముగ నీకథఁ జెప్పటకుఁ బ్రత్యేక ప్రయోజనము కానరాదు.

[1] ''సాధింపం దరమే రఘూత్తముని దత్పన్మంత్రియై భృత్యుఁడై
మేధాశాలి జగత్త్రయైక నుత గాంభీర్యుండు ఖండేందుభృ
ద్వేదోముఖ్య బుధేంద్ర దత్త వర వర్ధిష్ణు ప్రభావుండు సం
బోధాంభోధి చుహాబ్జమిత్రుఁడు మరుత్పుత్రుండు వర్ధిల్లగన్''

అనుచుఁ జెప్పిన మూడుపద్యములందు హనుమ దసాధ్యపరాక్రమము వివరింపఁబడెను. భార్యమాటఁ బెడచెవిఁ బెట్టిన మైరావణుఁడు మాయల మారివేషముఁబూనెను. రామలక్ష్మణ రక్షణకై హనుమంతుఁడు తన వాలమునఁ గోటఁ గట్టెను. దానిని భేదింపఁబంపిన సూచీముఖ, ఘటకులు విఫలులుకాగా మైరావణుఁడే విభీషణురూపమున వచ్చి, లోఁ బ్రవేశించి, రామలక్ష్మణులఁ గొంపోయి తన పట్టణమున భద్రకాళిచెంత నుంచెను. విభీషణునివలన విషయ మెఱిఁగిన హనుమంతుఁడు పాతాళలంక కేగి మత్స్యవల్లభుఁ డను తన కుమారునితో పోరుసల్పి, దుర్దండి సాయమున బురముఁ బ్రవేశించి, మైరావణుఁ జంపి, దుర్దండి సుతునకు రాజ్యమప్పగించివచ్చిన వృత్తాంత మంతయు [2] నొక్క సీసపద్యమునఁజెప్పివైచెను.

1. సమీర 4 - 8
2. సమీర 4 - 29

కొన్ని యితరములఁ బెంచి రచించియు సాహసకృత్యమగు దీని నిట్లు సంక్షిప్తీకరించుటలోఁ గారణము గ్రంథవిస్తరభీతికాక యీ ఇతివృత్తమునఁ బలురచనలు తెలుఁగున వెలువడుటయే యని యూహింప వచ్చును.

మృతు గంధమాదనుఁ దెచ్చుట : రావణ వధానంతరము పుష్పకముపై నెల్లరఁ గూడి యయోధ్యకేగ బయలుదేరిన రాముఁడు గంధమాదనుఁడు కానరామి గమనించెను. కుంభకర్ణునితోఁ బోరున వాని క్రిందఁబడి పఁడిసి యుండుట విని వానిఁ బ్రతికించితెచ్చువా రెవ్వ రన జాంబవంతుఁడు హనుమంతుని సూచించెను. రామునిమాటపై మారుతి యమపురి కేగి గంధమాదనునికై చూచి యట లేఁ డని, బ్రహ్మలోకమునఁ గలఁ డని వినిబ్రహ్మలోకమున కేగి బ్రహ్మయు[1] 'వినుత ప్రభావతేజోఖని వగు నీయందె చెల్లెఁగాక' యని పొగడ గంధమాదనుఁదెచ్చెను. కపితతియు [2] 'అనిలజ నీవె విధాతవు వినుమదిగాకున్న మృతుని వెనుకొని మరలం గొని తేవచ్చునే? ఇతరుల' కని పొగడిరి. ఇందు హనుమంతుని భవిష్య ద్బ్రహ్మత్వము సూచితము. దీని కాధారభూతమగు కథ ఆనందరామా యణ సారకాండ ద్వాదశసర్గయందుఁ గలదు.

శివలింగప్రతిష్ఠ : చతుర్థాశ్వాసమున నీ విషయమును కవి వందపద్య ములలోఁ జెప్పెను రామాయణోత్తరరామాయణ, పరాశరసంహితల యా ధారమున నాయాభాగముల విరచించినటులఁ దిమ్మన యీ కథాభాగ మును స్కాందపురాణము నుండి స్వీకరించెను. శతానందుఁడు 'రాముఁడు శివలింగప్రతిష్ఠ నేల చేసే' నని, హనుమంతుఁడద్భుతకర్మయేమి యాచ రించె నని ప్రశ్నింప నా ప్రస్తావనఁగొని వశిష్ఠుఁ డావృత్తాంతముఁ జెప్పఁ దొడగెను. రాముఁడు రావణబ్రహ్మ సంహారమువలని దుష్కృతికిఁబరి హార మేమి చేయవలె నన నగస్త్యాది మునులు శివలింగప్రతిష్ఠ సేయు మనిరి. కైలాసమునకు వెడలి శివలింగము దెమ్మని రాముఁడు కోర హను మంతుఁడు వెడలెను. అచట లింగములు కానరాక శివునికై కఠోరతపము గావించి ప్రసన్నుని గావించుకొనెను. శివుఁడు రెండులింగముల నిచ్చెను.

1. పమీర 4 – 52
2. పమీర 4 – 55

ఊలోగా ముహూర్తము పోవు నని మునులమాటపై సీతాదేవి చేసిన సైకతలింగమును రాముఁడు ప్రతిష్ఠించెను. అట్టి లింగమునకు జరిగిన యర్చనఁ జెప్పుచు [1] 'పవనవనంద నానీత గంగాది కానేక తటినీ జలంబుల నభిషేచనంబు చేసి' యని చెప్పెను. ఇది యసంగతము. హనుమంతుఁడు కైలాస మేగెను. పవననందన యనుట యతిభంగ కారణము నగుచుండుటవలన నిది ఖిలభాగ పరిష్కరణమున జరిగిన పొరపాటుగ గ్రహింపవలెను. ఇటఁ దపననందన యని యున్నచో నితివృత్తభంగము, యతిభంగము పరిహరింపఁబడును. కావున కవివాక్య మది యని తోఁచుచున్నది. తాను శివలింగముఁ దెచ్చులోపలఁ బ్రతిష్ఠ జరుగుట తన కవమానముగ భావించిన హనుమంతుఁడు ప్రాణత్యాగమున కుద్యుక్తుఁ డయ్యెను. ఇట్టియెడ రాముఁడు ఇరువదినాల్గు పద్యములలో వేదాంతోపన్యాసము గావించెను.

[2] ''మత్కృతము త్వత్కృతం బగుఁ
ద్వత్కృత మగు మత్కృతంబు ద్వైతము వలదో
సత్కృతి లింగస్థాపన
సత్కృతి నీ వాచరించ సత్కృతికాదే''

యని యద్వైతము స్థాపించెను. ఇందు జీవాత్మపరమాత్మల కభేదరూప మగు నద్వైత మొకటి, శివకేశ వాభేదరూప మగు నద్వైతతత్త్వ మొకటియు భావింపఁ దగినవి. పీఠిక యందుఁ [3] 'తత్త్వమసి' యని హనుమంతునిచే బోధ నందినదాని పరిపూర్ణత యిందు నిరూపించెను.

రాముఁడు ముహూర్తము దప్పునని ప్రతిష్ఠించిన కారణముఁ దెల్పి యనేక బ్రహ్మరక్షస్సుల సంహరించిన కారణమున హనుమంతునిఁ గూడ శివలింగముఁ బ్రతిష్ఠింపు మనెను. సైకతలింగము దీయగల్గితివేని తీసి నీ తెచ్చిన లింగముఁ బ్రతిష్ఠించు మనియు ననెను హనుమంతుఁడామాటపై సైకతలింగముఁ బెకలింప నుద్యుక్తుఁ డయ్యెను. హనుమంతునంతటి జ్ఞాని రామునిచే నింత వినియు నట్లుచేయుట యసంగతము. కావున శతానందునిచే నడిగించి యట్లు విజృంభించుటలోఁ గారణము వసిష్ఠునిచేఁ జెప్పించెను. కావ్యకర్త నాయకుఁ డగు హనుమంతుని

1. సమీర 4 - 77
2. సమీర 4 - 121
3. సమీర పీఠిక - 7

యం ఇసుమంతయు లోపముఁ జూపనిరీతి జాగరూకత వహించుచు నిట్లు సమర్థించెను.

[1] ''శ్రీరామలింగంబు సికతామయంబుగాఁ
    జింతించు లోకుల భ్రాంతిఁ బాపఁ
బదరి సాంబద్రోహ మొదవించి ఘనుఁడైన
    నెఱదూలు ననుమాట నిర్వహింప
నతలాది లోకముల్ వ్యాపించె శివుఁ డన్న
    రాము వాక్యము నిదర్శనము సేయ
నణురేణువైన రామావనీశుఁడు నిల్ప
    నొరుల కసాధ్య మౌ టెఱుక పఱుపఁ
దలచి రామనాథ దైవ తోత్పాట నో
ద్ధతి వహించెఁగాక ధర్మవేది
వరమపుణ్యుఁ డతఁడు ప్రత్యక్షపరమేశుఁ
డజ్ఞుఁడే చెలంగ నవల వినుము''

అని తనదైవత మగు శ్రీరామచంద్రుని సామర్థ్యము హనుమంతుఁడు నిరూపించినట్లు తన దైవత మగు హనుమంతుని సామర్థ్యమును సమీర కుమార విజయకర్త చక్కగ నిరూపించెను. అనంతర గద్యయందు లింగోద్ధరణ మహాయత్నమును వర్ణించెను. అట్లు యత్నించి నవరంధ్రములఁ బొరగు రక్తముచే రక్తకుండ మేర్పడ మూర్ఛిల్లి పడియున్న మారుతిఁ జూచి శ్రీరాముఁడు తన తొడపై నాతని శిరము నిడుకొని విలపించుచు గనుగవ పెన్నీట నతని కాయము దడుపుటఁ బదిపద్యముల శ్రోతృమనస్పూర్తిగాఁ జెప్పెను. అనంతరము మూర్ఛఁదేరిన హనుమంతునిచేఁ జిక్కని నిరోష్ఠ్యదండకమున శ్రీరాముని స్తుతింపఁజేసెను. సీతాదేవియు హనుమంతుని సంబోధించి

[2] ''తావకీ నాంగ కీలాలధార జాతి
వఱలు కుండంబు నీపేర వన్నె మీఱి
ఘోర దురితాపహార ప్రకార మగుచు
నిది మొదలుగాఁ బ్రసిద్ధి వహింపఁగలదు.''

---

1. సమీర 4 - 129
2. సమీర 4 - 154

అని హనుమంతుఁడు స్వానుభవముఁ జెప్పెను. ఇంకను నిందు హనుమంతుఁడు రామాగమనవార్త భరతునకుఁ జెప్పినట్లుల, శ్రీరామపట్టాభిషేకమునకు నుత్తరాంబునిధినుండి నీటినిఁ దెచ్చినటులఁ జెప్పెను. సీతారాములు హనుమంతుని సమ్మానింపుటతో నిందలి రామాయణగాథ ముగింపఁబడెను.

పిదప తిమ్మన తాను ప్రథమాశ్వాసమున నారంభించి వీడిన శతకంఠరావణవృత్తాంతమును మరల ఈచతుర్థాశ్వాసమున కొనసాగించెను. ఇంతగాఁ తన గాథఁ దెలుప వినియు గర్వ మూనక హనుమంతుఁడు [1] 'మీ కారుణ్యమునం జెలంగు భటునిన్ మీ రింత వర్ణింతురే? యో కారుణ్యచరిత్ర! శత్రుహృతి కుద్యోగింపరే నావుడున్' అని వినయమును ప్రకటించి యనికి నుద్యుక్తులఁ గమ్మనెను. ఇందు హనుమంతుని యవికత్థనత ప్రకట మగుచున్నది. రాముఁడు సర్వసన్నద్ధుఁడై హనుమని వలపలి మూఁపుపై హస్తమూని నగరోపవనముఁ జేరి యందఱి బరాముర్శించి హనుమఁ జూడ నాతఁడు రాముభావ మెఱిఁగి బ్రహ్మాండము నిండు విశ్వరూప మందెను. అట్టి వానిని విభీషణుఁడు ఆపదుద్ధారక హనుమన్మంత్రముచేఁ బొగడెను. హనుమన్మంత్ర విదుఁడగుఁ దిమ్మన యిట [2] 'ఆపదుద్ధారకం బను మనూత్తమముచే సద్భక్తుఁడై విబీషణుఁడు పొగడె' నని మాత్రము చెప్పెను. కానీ యిందొక మంత్రరహస్యము కలదు. ఇది విభీషణునిచే గరుత్మంతునకుఁ జెప్పఁబడినట్లు

[3] ''విభీషణ కృతం స్తోత్రం - తార్క్ష్యేయ సముదీరితమ్
యే పఠంతి సదా భక్త్యా - సిద్ధయ స్తత్కరే స్థితాః''

అని పరాశరసంహిత చెప్పుచున్నది. దీని న్యాసమున 'అస్య శ్రీ ఆపదుద్ధారక స్తోత్ర మంత్రస్య విబీషణ ఋషిః, అనుష్టుప్ఛందః, హనుమాన్ దేవతా' యని హనుమ దుపాసకులచే ననుష్ఠింపఁబడుచున్నది. తిమ్మన యూ వాక్య మొక్కదానిచే స్తోత్రమంతను చేయించిన వాఁడయ్యెను. అట్టి హనుమంతునిపై సకలసేనలతోడ నెల్లరు నెక్కిరి. క్రమమునఁ జని మారుతి రామాజ్ఞతో ద్వీప ష త్పు రోపవనమున దిగెను. ఇట్లు చతుర్థాశ్వాసాంతము జరిగెను. ఇట నెల్లవారిని దనపై నెక్కించుకొని వెడలినట్లు

---

1. సమీర 4 - 174
2. సమీర 4 - 183
3. ప. సం. 66 - 46

చెప్పెను. కాని మూలమున తోకతో వారధి నిర్మించి దానిపై నందఱేఁ బోఁజేసినట్లు కలదు. ఇదియు హనుమంతుని మద్యపరూపము గా సంహిత 51-25 చెప్పుచున్నది. సమీరకుమారవిజయమున వాలసేతువు మాయాపురి యుద్ధమున నేర్పరచెను.

వానర రాక్షస యుద్ధము : ఈ శతాననునితోడి యుద్ధమునం దంతట యుద్ధచ్ఛాయలు గన్పట్టును. ఇట యుద్ధార్భాటము మించిన శబ్దార్భాటము తిమ్మనచేఁ జూపఁబడెను. రామాయణమున దుశ్శకునములవలె నిందును శతకంఠునకు దుశ్శకునము లెదురయ్యెను. హనుమంతుని పిడికిటి పోటును రావణుఁడు మెచ్చిన ట్లీ శతాననుఁడు మెచ్చెను. కుంభకర్ణుని శూలము విఱచినట్లు వీని శూలమును హనుమంతుఁడు విఱిచెను. శతాననుఁడు సుగ్రీవ విభీషణులను లంకాద్వీపమునకు విసరెను. వారు తిరిగి వచ్చుటకై హనుమంతుఁడు తన వాలమున సేతు వేర్పరచెను. యుద్ధమున శతాస్యు లనేకులై అన్నివైపుల వ్యాపించి యుద్ధము సేయుతరి [1] 'అందఱకు నందఱై తోఁచు నవనివిభుఁడు హనుమ యొక్కరుఁ డా రహస్యం బెఱుంగు' ననెను. హనుమంతుని వాలసేతువు మూఁడు (5-43, 44, 45) పద్యముల వర్ణింపఁబడెను.

ఈ యుద్ధమున [2] శతముఖ ప్రపంచంబుఁ గీలాలధార ముంచుచు న ప్పంచముఖ హనుమత్కపి' యని పంచముఖునిగా నట చెప్పఁబడెను. అతని యాటోపము ఆ సుదీర్ఘవచనమున విశేషముగా వర్ణింపఁబడెను. శతముఖవధ సీతావిజయమె యైనను సీతయే స్వయముగ

[3] ''ఒక్కనిఁ జంపితి మీ దయ
నిక్కవముగ నే నితండు నేలనె రాచెన్
బెక్కండ్రి పెక్కడక్కడ
ని క్కలిగిన జయవిధాన మితనిది గాదే!

అన్నటులఁ జెప్పి సమీరకుమారవిజయము సార్థక మొనర్చెను. రావణవధకుఁ బ్రతిబింబమైన శతముఖరావణ వధానంతరమును హనుమంతునకు దివ్యహారము బహూకరింపఁబడెను. అట్లే రాముఁడు

1. సమీర 5 - 62
2. సమీర 5 - 66
3. సమీర 5 - 87

[1] ''నీ వెప్పుడు మాతాపితృ
భావమునను మమ్ముఁ గొలిచి ప్రబలితి గానన్
భావిబ్రహ్మ పదశ్రీ
ప్రాపం గల మహిమ మింకఁ బొందెదు తండ్రీ!
అని భవిష్యద్బ్రహ్మగా వర మిడెను. లోకమున హనుమంతునకు 'భవిష్యద్బ్రహ్మ' యను ప్రసిద్ధి కలదు. అట్టి ప్రసిద్ధికి కారణమైన గాధ తిమ్మన యిట్లు తెల్పెను. 'భవిష్యద్బ్రహ్మతా ప్రభావకథన' మను యేఁబదినాల్గవ పటల పరాశరసంహితయందు రాముఁడే హనుమంతుని భవిష్యద్బ్రహ్మగా దీవించెఁ గాని గాధయందు మార్పు గలదు. అనంతర మయోధ్యలో విందుభోజనమున రాముని యారగింపు కాగానే హనుమంతుఁడు భోజన భాజనముఁ గొంపోయి యగిసెచెట్టెక్కి కపు లందఱిఁ బిలచి యొక్కొక మెతుకు ప్రసాదముగ నిడ నందఱు మెచ్చిరి. ద్వాదశినాఁ డగిసెచెట్టు ఆకును కూరగఁ జేసికొని ప్రసాదమువలెఁ బవిత్రముగ స్వీకరించు నాచారము ఆంధ్రమునఁ గలదు. దానికి కారణ మా హనుమద్గాదయే. ఈ కథాభాగ మానందరామాయణ, రంగనాథరామాయణములు రెండిటఁగలదు. తిమ్మన రంగనాథరామాయణము ననుసరించెను. ఆరెండిట రాము డారగింపకమున్ను పాత్ర గొంపోయినట్లు తెలుప నిందు సంతుష్టిగ భోజనమైనపిదప గొంపోయినటులఁ దెల్పి హనుమంతునియం దౌచిత్యముఁ బోషించెను.

హనుమ ద్దినచర్య : రామరాజ్యమున హనుమంతుని దినచర్యనుఁగూర్చి శతానందుఁడు ప్రశ్నింప వసిష్ఠుఁడు చెప్పుటవలన [2] 'నత్వా రామం వాయుపుత్రో యయౌ తప్తుం హిమాలయమ్' మున్నగు రామాయణ వాక్యములవలె వెడలిపోక రామునిసన్నిధి నున్నట్లు తెలియును అందుననే [3] 'వారలు నేఁగఁగా హనుమ యొక్కం డుండెఁ దత్సన్నిధిన్' అని స్పష్టముగఁ జెప్పెను.

హనుమంతుఁడు సర్వవిధులందు రామున కుచితసేవ యొనర్చుచుండి రాత్రివేళల గూఢచాతురి లోకవార్త లెఱుఁగు చుండువాఁడు.

---

1. సమీర 5 - 91
2. ఆనంద. సార. 12-65
3. సమీర 5 - 142

[1] 'తాను సహకారిగ నుండి రామునిచే నెన్నియో క్రతువులు చేయించెను ఇట్లు పదునొకండువేలేండ్లలెను.' తిమ్మన యీ కథనమున [2] రంగనాథ రామాయణము ననుసరించెను. ఇట్టి హనుమత్సేవవలన సంతుష్టుఁడై రాముఁడు చిరంజీవిత్వము ప్రసాదించెను. హనుమంతుని సేవానిరతిని, రామభక్తిని అద్దముపట్టి చూపునదై ఈ దినచర్య తిమ్మనచే రచింపఁబడెను. అటనే హనుమన్నిత్యనివాసము.

[3] ''వనచరలీలఁ గింపురుషవర్షములోపల గంధమాదనం
బను నొక శైలమున్న దితదగ్రమునన్ రహిమించు మంచి కాం
చన కదళీవనం బతివిశాలతలంబును గామరూపకం
బును నయి యుండఁగల్పతరు మూలమునన్ వసియింపు మింపునన్'

అని రామునిచే సూచింపఁబడెను. భారత, పరాశరసంహితలఁ జెప్పఁబడిన రీతియు నిదియే.

రామాయణమున కుంభ నికుంభ వధ కలదు. ఇందునట్లే సకుంభ నికుంభవధ చెప్పఁబడెను. జయద్వీపమున నున్న వీరు శాపగ్రస్తులై మదవారణములుగా నుండి శాపానంతరము రావణ కుంభకర్ణాదుల వధ నెఱిఁగి దానికిఁ గారకునిగ విభీషణునియందుఁ బగ వహించి వానిపైకి దండెత్తిరి. అతఁడు గంధమాదనమున నున్న హనుమంతుని శరణు వేడెను. హనుమంతుఁడు రామాదులఁ దెచ్చి వారల జంపించి విభీషణుని రక్షించెను యుద్ధమున భరతశత్రుఘ్నులు మూర్ఛిల్లగా హనుమంతుడు స్వర్గపురి కేగి యమృతముఁ దెచ్చి వారల బ్రతికించెను. ఇదియే ఇందలి హనుమత్కృత్యము. వాల్మీకిరామాయణమున నికుంభుఁడు హనుమంతునిచేఁ జంపఁబడెను. ఇందాతఁడుకూడ హనుమంతునివలనఁ జచ్చినట్లు చెప్పలేదు. ఇట్టిమార్పిందుఁ గన్పట్టును.

హనుమన్మంత్రమాహాత్మ్యము : పుష్పగిరి తిమ్మన హనుమన్మంత్ర విషయమును సకుంభ నికుంభోపాఖ్యానమునకుఁ బూర్వమే [4] సూచించి ఈ షష్ఠాశ్వాసమునఁ బూర్తిగ వివరించెను. ఇది మంత్రశాస్త్రభాగము. ప్రబంధరచన కిట్టి శాస్త్రవిషయము లనావశ్యకములు, సారస్యభంజక

1. సమీర 5 - 178
2. రం. రా. యుద్ధ 8-852
3. సమీర 5 - 182
4. సమీర 5 - 192

ములుగూడ. కాని తిమ్మన తనకు లభ్యములైన, లేదా తన యుపాస్య ములైన మంత్రముల నందించుటద్వారా తనభక్తిని, ఉపాసకత్వమును ప్రకటించుకొనెను. ఈ మంత్రభాగమును ఉమాసంహిత, పరాశరసంహితల ననుసరించి చెప్పెను.

[1] "శ్రుణు దేవి! ప్రవక్ష్యామి - స్తోత్రం సర్వ భయాపహం
సర్వ కామప్రదం నృణాం - హనుమత్ స్తోత్రముత్తమమ్"

అని యారంభమగు నీ యుమాసంహితోక్త మగు నాంజనేయ స్తోత్రము భక్తకోటియందు విస్తృతప్రచారము కలది. తిమ్మనయు నీ స్తోత్రభావమును శంకరుఁడు పార్వతికిఁ జెప్పినట్లే యారంభించి, [2] 'తప్తకాంచన ధగద్ధగిత దివ్యశరీరు నానావిధ ప్రసూనమయ హారు' నిత్యాదిగాఁ బదునైదు పద్యముల రచించెను. ఇది 'తప్తకాంచన సంకాశం - నానారత్న విభూషితమ్' అని మొదలైనదాని యనువాదముగ స్పష్టమగును. ఈకవచము, మంత్రభాగము పరాశరసంహితయందలి డెబ్బదిరెండవ పటలమునఁ బూర్తిగఁ గానవచ్చును. తిమ్మన హనుమ ద్దైవతత్త్వప్రతిపాదకముగా షష్ఠాశ్వాసమును రచించెను. హరునియందు నక్షహరునియందు భేదము లేదని చెప్పుటయు కాక

[3] "హరియై వైష్ణవ పూజ్యుఁ డయ్యెఁ బరమే శాంశస్థుఁడై శైవ భ
వ్యరతిం గాంచె భవిష్య దబ్జభవుఁడై హైరణ్యగర్భార్చనా
విరళత్వంబు వహించె జ్ఞానఖనియై వేదాంత విద్యోన్నతిన్
బరగెన్ దా నొకఁ డయ్యుఁ బెక్కుగతులం బాటించి కుంభోద్భవా!"

అని త్రిమూర్తిత్వమును నిరూపించెను. ఇంతతో నాగక [4] 'మూఁడు మూర్తుల కిరవైన' అను పద్యమునఁ ద్రిగుణాతీతునిగను, జ్ఞానరీతి నని ర్వాచ్యునిగఁ బరబ్రహ్మతత్త్వముగఁ బ్రతిపాదించెను. ఇది మహోపాసక భావము. ఇతఁడు హనుమ ష్షోడశాక్షర మనువు విశేషముగఁ బేర్కొనెను. పరాశరసంహితయం దిరువదియవ పటలమున నా మనువు చెప్పఁబడెను.

కావ్యనాయకుఁ డగుఁ బంచముఖుని రూపమును [5] "ప్రాగ్దిశా

---

1. ప. సం. 72-14
2. సమీర 6 - 51
3. సమీర 6 - 20
4. సమీర 6 - 23
5. సమీర 6 - 37

సౌమ్య మై బాలార్క రమ్య మై' అని వర్ణించెను. ఇది పరాశరసంహి తో క్త మగు పంచముఖహనుమంతుని దిఙ్ముఖమూర్తి స్వరూపము. ఇట్లే వీరాంజనేయ (64) జ్వాలాహనుమ (65) ద్రూపములను ఋషి ఛ్ఛందాదులతో షట్త్రింశద్వర్ణ మంత్రమును (68) అనుష్టుబాఖ్య మంత్రము (74) లను చెప్పెను. పరాశరసంహితయందు దరువదియేడవ పటలమున నీ విషయము గలదు. ప్రసిద్ధమగు హనుమత్ప్రార్థనము

1 "బుద్ధిర్బలం యశో ధైర్యం - నిర్భయత్వ మరోగతా
అజాడ్యం వాక్పటుత్వం చ - హనుమ త్స్మరణా ద్భవేత్"

అనునది. దీనిని

2 "మతి భుజబలంబు కీర్తియు
ధృతి నిర్భయ మజడభావర్తి యరోగ
స్థితి వాక్పటుత్వ మనిలజు
స్మృతిఁ గల్గఁగ మంత్రజపము సేయఁగలేదే?

అని చక్కగ యనువదించెను. తిమ్మన ప్రధాన హనుమద్విషయములన్నిటిని తన కావ్యమున నిల్పి తన హనుమద్భక్తితత్త్వమును గావ్య రచనాశక్తిని నిరూపించుకొనెను. అట్లే పంచముఖాంజనేయుని

3 "ధ్యాయేద్వానర నారసింహ ఖగరాట్క్రోడాశ్వ వక్త్రాంచితం
పాలాక్ష స్ఫుట పంచవక్త్ర రుచిరం బాలార్కకోటి ద్యుతిం
హస్తైశ్శూల కపాల ముద్గర హలం కౌమోదకీ భూరుహం
ఖట్వాం గాంకుశ పాశ పర్వత ధరం పీతాంబరం వానరమ్"

అను ధ్యానము ననుసరించి

4 "అలరుం గీశ నృసింహ పక్షి కిటీ వాహాస్యంబులం దూర్పుగు
బ్బలిపై సుబ్బెడు సూర్యకోటి రుచితో బాహా దశాగ్రంబులన్"

అని యనువదించెను. ఇట్లు ప్రధానాంశముల నెల్లఁ గూర్చెను.

---

1. ప. సం. 76 - 25
2. సమీర 6 - 87
3. ప. సం. 25 - 59
4. సమీర 6 - 35

# యుగాంతర కథలు

## గరుడ, సత్యా, తుంబుర, నారద గర్వభంగము :

హనుమంతుఁడు చిరంజీవి. కాన యుగాంతరములందును నాతనికిఁ బ్రవేశము కలదు. తిమ్మన యీ గాథలఁగూర్చి శతానందుఁడడుగ వసిష్ఠుఁడు వివరించినట్లు చెప్పెను. అందు ద్వాపరయుగ సంబంధులగు హనుమత్కృత గరుడ, సత్యా, తుంబుర, నారద గర్వభంగములు షష్ఠాశ్వాసమున 107 మొదలు సప్తమాశ్వాసాంతమువఱకుఁ జెప్పఁబడెను. ద్వారకవేలు కృష్ణుఁడొక్కమారు

[1] ''గానలీల వీరి ఘన శౌర్య జవములఁ
బక్షిరాజు భక్తిపటిమ సత్య
నడఁప సుగుణవంతు హనుమంతు బిలిపింతు''

నని తలంచి గరుడుఁ బిలచి గంధమాదనగిరిఁ జెన్నొందు మారుతిం దెమ్మనఁ గపిమాత్రుం బిలువ నన్నంపఁదగునా యనియుఁ; గృష్ణుఁడు వివరింపఁ దే నేగెను. గర్వితమతి గరుడుఁడు తొలుత [2] 'జెట్టిగ నొక పీంద్రు' నిన్నుఁ బిల్చుకరమ్మనె శౌరి" యనెను. పరాశరసంహితయందలి వైనతేయ గర్వాపహరణ కథనమను 48వ పటలము దీనికి మూలము. అందు [3] 'ఆహూతోఽసి కపిశ్రేష్ఠ! శ్రీకృష్ణేన మహాత్మనా' యనికలదు. ధ్యానమగ్నుఁడైన హనుమంతుఁడు దీనిని గమనింపకున్నఁ గుపితుఁడై హనుమంతుని శిక్షింతు నని గరుత్మంతుఁ డాతని వాలముఁ బట్టి లాగఁబోయి; మారుతి దానిని విదల్చ ద్వారకాపురిఁ బడి నెత్తురు గ్రక్కెను. పిదపఁ గృష్ణ బ్రహ్మ రుద్రాదులచేతనే కీర్తింపబడునట్టి హనుమచ్ఛక్తి నెఱిఁగెను. గర్వము వీడి మరల వచ్చి [4] 'ఆంజనేయా! నిను సీతయున్ రఘుకులాగ్రణి రమ్మని రప్పు' అని సగౌరవముగఁ బిల్చెను. [5] 'కపే! భవంత మాహ్వాతే సీతారామౌ మహా నితి' యనునది మూలము. హనుమంతునకు దర్శన మిచ్చుటకై కృష్ణుఁడు రామునిగ నగుచు సీతగ సత్యభామను కమ్మనెను. ఆమె యందు కశక్త యగుటతో నామెకు గర్వభంగ మాయెను.

---

1. సమీర 6 - 139
2. సమీర 6 - 166
3. ప. సం. 48 - 18
4. సమీర 6 - 181
5. ప. సం. 48 - 63

సమీరకుమారవిజయమున నిప్పట్టునఁగల తుంబుర నారద గర్వ భంగము పరాశరసంహితయందు ఏకత్రింశ త్పటలము (31) నఁగలదు. సంగీత పాండిత్యముఁ గూర్చి వివాదపడువా రిర్వురఁ జూపి హనుమంతు నితోఁ గృష్ణుఁడు [1] 'ఈ యతిచంద్ర గాయకుల యిద్దఱిపాటల మేలుఁ దెల్పఁగా' బిలిపించితి ననెను. హనుమంతుఁడు తన వినయమును బ్రద ర్శించుచునే వారిని పరీక్షించుట కంగీకరించెను. వా రిర్వుర నొక్కొక గీతముఁ బాడుఁ డనఁ బాడిరి. వారిఁ బొగిడిన మారుతి తానునుఁబాడుదు నని గాన మొనర్చి కరగిన గండశిల నా విద్వాంసుల తాళముల నుంచి యవి బిగియ వానిని గొమ్మనెను. వారు యత్నించి విఫలులై గర్వము డిగి కేల్మోడ్చి తమ తాళములఁ గోర; నిచ్చి వారిచేఁ బొగడఁబడి గంధ మాదనమున కేగి నిశ్చలభక్తిఁ దపమున నిల్చెను. హనుమంతుఁడు సంగీత ప్రవర్తకుఁడను విషయము ఈ ప్రథమసోపానమున నిరూపితము. కొద్దిమాత్రము భేద మున్ననుఁ బరిశీలనమునఁ బరాశరసంహితయే దీనికి మూలముగఁ దెలియును. మూలమున నీగాథకుఁ గారణము గుండక్రియా గానము. 'గుండక్రియ' అనున దొక గానవిశేషము. [2] 'గుజ్జరి మలహరి గుండక్రియ వరాళి దేవగాంధారియు' నని గణపవరపు వేంకటకవియుఁ దన ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయ విలాసమునఁదెల్పెను. తిమ్మనయు

[3] ''చండింపక తాళంబు లి
టిం డని కొని కరగు రాతియెడ నిడి ప్రౌఢిన్
గుండు క్రియఁ గావించిన
గండోపల మెప్పటట్ల కఠినం బయ్యెన్''

అని ఆ విషయము స్ఫురింపఁజేసినవాఁ డయ్యెను. కాని మేఘరంజిగాన మును హనుమంతుఁ డొనర్చినటుల వాచ్యముగఁ జెప్పెను. మూలమున గల గుండక్రియా శబ్దముయెడ సందేహమున నిట్లు వ్రాసెనని యను మానింపవచ్చును. ఇట్లు హనుమంతుని గానవిద్యాపైపుణ్య మీ కథాభాగ మున వ్యక్త మొనర్చెను.

అర్జున కపిధ్వజము : అర్జునుని టెక్కెమున హనుమంతుఁ డుండును.

1. సమీర 6 - 195
2. ప్రబంధ....విలాసము - 95
3. సమీర 6 - 214

'జెండాపై కపిరాజు' అను తిరుపతి వేంకటకవుల పాండవోద్యోగవిజయ పద్యము వినని తెనుఁగువాఁ డుండడు. అందుకుఁ గారణమగు గాథ సమీరకుమారవిజయ సప్తమాశ్వాసమునఁ గలదు. కేశవుతో సముద్రతీరముఁ జేరిన గుడాకేశుఁడు [1] 'దాశరథి శరములుండగఁ దాశరథి నదేల శైలతతిఁ గట్టించె' నని ప్రశ్నించెను. సీతావేదన నాలోచన రాకనా? అక్షయబాణంబులు లేకనా? యనియుఁ బ్రశ్నించెను. రాముచెంతఁగపితతి మిక్కిలి బలముకలదనియు, నందును మరుదేవాత్మజు శక్తి యసామాన్యమనియుఁ గృష్ణుఁ డన నర్జునుఁడు

[2] ''అన విని యాంజనేయుఁడు బలాధికుఁడేని శరాళి సేతు బం
ధన మొనరింతు నాతని పదప్రహతుల్ ప్రకటింపఁ బంపుఁ''

డనెను. వెంటనే కృష్ణుఁడు తలఁచిన మారుతి వచ్చెను. అర్జునుఁడు మహాయత్నమున బాణముల సేతువు నిర్మింప దానిపై హనుమంతుఁడు దుమికిన నది భగ్న మయ్యెను. అంతట

[3] ''పావనిఁ జూచి యింక నొకపారి ఘటించెద నిల్వదేని గాం
డివముతో శిఖిం బడుదు నిక్క మనన్ భవదీయ సేతువిం
కేవడి దూఁకినన్ నిలిచెనేనియు నీ చెలిపై ధ్వజంబునం
దే వసియింతుఁ బోర ననియెన్ హనుమంతుఁడు శౌరి చెంగటన్''

అనున దీసందర్భమున నరవానరేంద్రుల ప్రతిజ్ఞలుగా తిమ్మన చెప్పిన రీతి. దీనికి మూలము

[4] ''భిద్యతే శరబంధోఽయం - భవతా యది మారుతే!
తదా సద్యః ప్రవేశ్యామి - సగాండీవో హుతాశనమ్''

అని యర్జునుని ప్రతిజ్ఞ కాగా [5] 'న చేత్తవ పతాకాంకో - భవేయం విజయోన్ముఖః' అనునది హనుమంతుని ప్రతిజ్ఞ. ఈ కథాభాగము పరాశర సంహితయందు హనుమ దష్టాక్షరీప్రభావ విజయచరిత్ర కథన మను పదునారవ పటలమునఁ గలదు. అర్జునుఁడు మరల సేతువు నొనర్ప వరుని రక్షింపఁ గృష్ణుఁడు కూర్మరూపమున సేతువుక్రింద నుండెను. దాన

1. సమీర 7 - 12
2. సమీర 7 - 18
3. సమీర 7 - 31
4. ప. సం. 16 - 24
5. ప. సం. 16 - 28

హనుమంతుఁడు దూకినను సేతువు భగ్నముకామి కృష్ణలీలఁ దెలిసియు విచారింపక యర్జును డెక్కెముఁ జేర నంగీకరించి వెడలెను. వెంటనే కృష్ణుఁడు రక్తముఁ గ్రక్కి మారుతి నాపుటలోఁ బడిన ప్రయాస వివరించెను. విజయుఁడు హనుమంతుని శక్తి నెఱిఁగి సంతసించెను. కపిధ్వజ మువలని విజయముఁ గవి

[1] "సారసగర్భ నిర్మితము సర్వ శుభావహ ముగ్రవానరా
కారము నగ్నిదత్త మగు గాండివి టెక్కెముఁమీఁద నెక్కి య
క్కౌరవరాజుసైనికుల కన్నులకున్ మిఱుమిట్లు గొల్పుచున్
మారుతి మున్ను దాననినమాట నిజంబుగ నిచ్చె సౌఖ్యమున్"

అని వర్ణించెను. ఈ వర్ణనము 'కపిధ్వజప్రభల నంధీభూతులన్ జేయువే' యన్న తిక్కనభావమును విశదపఱచు చున్నది.

భీమ గర్వభంగము : పాండ వారణ్యవాస సమయమున ద్రౌపది మనసు పడిన కాంచన సౌగంధికాకుసుమముఁ దెచ్చుట కేగిన భీముని బలగర్వము హనుమంతుఁడు పోఁగొట్టుట యందలి యితివృత్తము. ఈ కథా భాగము భారతారణ్యపర్వ తృతీయాశ్వాసమునఁ గలదు. కవిత్రయమున నీభాగను నెఱ్ఱన యాంధ్రీకరించెను. ఎఱ్ఱన నలుబదియైదు పద్యములలో ననువదించిన యీ భాగమును తిమ్మన యరువదిపద్యములఁ జెప్పెను. ఎఱ్ఱనను బూర్తిగ ననుసరించి యాతనియెడ తన గౌరవమును తిమ్మన ప్రకటించుకొనెను. [2] 'తిర్యగ్జాతులు ధర్మ వెఱుంగవు గాక సర్వభూత దయాస్వరూపం బైన ధర్మ వెఱింగెఁడువారు మనుష్యులుకారే' యన్న హనుమద్వాక్యమును [3] 'తిర్యగ్జాతులు ధర్మవుల్ తెలియ వింతేకాక' యని తిమ్మన ఛందస్సుమాత్రము మార్చి యదేభావమునఁ జెప్పెను ఇట్లే భీముఁడు తననుపరిచయ మొనర్చుకొను [4] 'క్షత్రియప్రవరుండ విఖ్యాతబలుఁడఁ బాండురాజు తనయుఁడు' [5] 'క్షత్రియుఁడఁ బాండురాజ క్షేత్రంబున....నను పద్యముల భేదము లేదు. ఇట్లింతట నడచెను. ఎఱ్ఱనను మించి హనుమద్భక్తిని బ్రకటింపుచుం దిమ్మన రగడ

---

1. సమీర 7 - 41
2. భార. అర. 3 - 322
3. సమీర 7 - 58
4. భార. అర 3 - 323
5. సమీర 7 - 60

నొనర్చి భీమునిచే నుతింపఁజేసెను. హనుమంతుఁడు భీమున కొనర్చిన నీతిబోధ యుగధర్మములందుఁజెంచితిమ్మన లోకశ్రేయస్సుకై యత్నించుటఁ గావ్యభాగమునఁ బెంపుజరిగెను. హనుమద్భక్తితత్పరుఁ డగుఁ దిమ్మన భీమునిచే సర్వభక్తజన గ్రాహ్యమగు హనుమత్స్తుతి చేయించెను. పిదప వసిష్ఠుఁడు ఇంక నొక్కవింత గల దనుచుఁ బురుషమృగము దెచ్చు గాథకు సూచనఁ గావించెను.

<u>పురుషమృగాహరణము</u> : భీమునకు హనుమంతునితోడి సంబంధము కల మఱియొక కథాభాగ మీ పురుషమృగాహరణము. ధర్మజుఁ డశ్వమేధ యాగ మొనర్చుచు ననవరత భోజనక్రియల నంటువడు నింటిని నిత్య శుద్ధము గావించి యాగముఁ బూత మొనర్చు నుపాయముఁ జెప్పు మని కృష్ణుని వేడెను. పురుషమృగమున్న తావు పరమపవిత్రము కాన దానిఁ దేర భీము నంపు మన భీముఁ డందుకేగి హనుమంతు నుతించి యుపాయము వేడెను. హనుమంతుఁ 'డా పురుషమృగము గర్జనచేసిన వారిని వీడక వెన్నంటి చంపు నని దానికి చిక్కకపోవుట యసాధ్యము కాన నీ యేఁడురోమములఁ గొని మార్గమధ్యమున వీడుచుఁ జను మనెను ఆ హనుమంతుని రోమములు నేలఁబడి శివలింగము లగును. పురుషమృగము పరమశివభక్తికలది కాన నా లింగములనర్చించికాని మరల వెన్నంటదు కాన యట్లు హస్తినాపురికిఁ జేర్చవచ్చు ననెను. అట్లే భీముఁ డొనర్చి పట్టణమునఁ బ్రవేశింప వెన్నంటిన పురుషమృగమును బ్రసన్న మొనర్చుకొని ధర్మజుఁడు మఖముగుపర్యంత మట నుండు వర మందెను. హనుమత్సహాయమునఁ గృతకృత్యుఁ డయ్యెను. ఇట్లు తుదకు హనుమంతుని రోమమాత్రమునకు సైతము గల శక్తి యమోఘమని తిమ్మన నిరూపించెను.

ఈ పురుషమృగాహరణమునకు మూలము పరాశరసంహిత. అందలి పంచాశత్పటలాన నీగాథ కలదు. రాజసూయయాగ మని యట నుండ నశ్వమేధముగాఁ దిమ్మన చెప్పెను. సంహితయందు భీముఁ డన్నకుఁ దృప్తిఁ గల్గింపఁదానే స్వయముగాఁ బురుషమృగముఁ దే నేగెను. ఇంచుక భేదముతో భారతమునఁ జెప్పఁబడిన భీమగర్వభంగ మిటఁ జెప్పఁబడెను. [illegible]మ గరిమాశక్తి ముందు చూపి తోకను లేపలేక భీముఁడు విగతగర్వుఁ

డైన పిదప నాతని కోరికపై మహిమాశక్తిచే విశ్వరూపముఁ జూపినట్లు చెప్పగా నిట గరిమాశక్తియు, మహిమాశక్తియుఁ జూపి భీమున కందని వాఁడై గర్వ ముడిగించినటులఁ జెప్పఁబడెను. సంప్రార్థితుఁ డైన హనుమంతుఁ డనుగ్రహించి భీమునకుఁ దన రోమము లిడి సంకల్పితము నెరవేరఁ జేసినట్లుఁ గలదు. భారతమునందుఁ బురుషమృగాహరణకథ లేదు. సంహితయందు సౌగంధికాహరణము లేదు. కావున నా రెంటియందు భీమునియెడఁ బరీక్షగా వాల మడ్డుపెట్టుట చెప్పఁబడెను. ఆ రెండు గాథలఁ దిమ్మన చెప్పెను. కాన పూర్వకథయందే యా వాలశక్తిని నిరూపించి రెండవదానియందు వాలరోమశక్తిని నిరూపించుట ద్వారా హనుమంతుని యనన్యసామాన్యశక్తిని, మహత్త్వమును నిరూపించెను. ఈ పురుషమృగాహరణకథ నన్నమాచార్యులు కూడఁ దన కీర్తనయందు గ్రహించుట కాననగును.

కావ్యాంతమున హనుమన్నిత్యనివాస మగుఁ గింపురుషవర్షము, అందుఁ [1] 'బెద్ద కోలు వుండు హనుమత్కపిప్రభుండు' వర్ణింపఁబడెను. హనుమంతుఁ గొల్వు ఘటించు నచ్చరలు భయభక్తులఁ జరించురీతిఁ దెల్పెను. హనుమంతు భజించు పుణ్యులు కింపురుషవర్షమున జనించి యవ్యయాస్పదముఁ జేరుదు రనియు సామీరిచరిత్ర చదివిన, విన్న, వ్రాసిన, వ్రాయించిన నిహపరసుఖము లందుననియు ఫలశ్రుతిఁ బల్కి తిమ్మన కావ్యాంతమును శుభాంతము గావించెను.

---

1 సామీర 7 – 134

# మైరావణ చరిత్రము

ఆంధ్రవాఙ్మయమున నన్ని ప్రక్రియలందు రచన చేయఁబడి విశేషప్రచార మందిన యవాల్మీకి హనుమత్కథాంశము మైరావణవధ వృత్తాంతము. దీనిని మాదయ్యకవి మూఁడాశ్వాసముల ప్రబంధముగ 536 గద్యపద్యముల రచించెను. 'ప్రోడ వన్నెంట సర్వయ మాదనుకవి' యని కీర్తి నడసిన మాదయ కృష్ణామండల గుడివాడ వాసి సర్వయ మంత్రికుమారుడు. సర్వాగమ శబ్దశాస్త్ర చతుర వివేకుఁడు 1485-1508 కాలమువాడు. ఈ కావ్యము నాతఁడు లేజర్ల గోపమంత్రి కంకితమిచ్చెను.

తోలుబొమ్మలాటలు వంటి జానపద ప్రక్రియులం దిది విశేషప్రచార మందినది 'కథలోని యద్భుతాంశములు, మాయోపాయములను పరికించిన స్వరూపస్వభావములను పరిశీలించిన నిది జానపదుల కల్పితమే' యని [1] 'జానపదసాహిత్యము-పురాణగాథలు' వ్యాసము తెల్పుచున్నది. కాని ఆనందరామాయణమున, పరాశరసంహితయందును నీగాద చాల విపులముగ నున్నది. రుద్రయామిళాది ప్రామాణిక తంత్రగ్రంథములు ప్రతిపాదించు భిన్నము లగు హనుమదష్టోత్తరనామముల దుర్ధండీబంధమోచకాయనమః - 13; నీలమేఘరాజ్యదాయకాయనమః - 14; మైరావణమర్దనాయనమః - 19; అను నామములు కానవచ్చుచున్నవి. కావున దీనిని పూర్తిగ నప్రామాణిక మగు జానపదవృత్తాంతముగ నిర్ణయింపజాలము.

అయోధ్యానగర మేలు శ్రీరామచంద్రుఁడు పేరోలగమున నుండ నారదాది మునులు వచ్చిరి. వారిలో నగస్త్యుఁ డనేకరీతుల రాముని పొగడ నా రాముఁడు హనుమందుని చూచి తన విజయమునకు కారకుఁ డనుచు

[2] ''పరికింప మారుతాత్మజు
చరితము లిట్టిట్టి వనుచు సన్నుతి సేయన్
గరు డోర గామ రాసుర
వరులకు బ్రహ్మాదులకును వశమే తలఁపన్''

---

1. జానపద సాహిత్యము - పురాణగాథలు - పుట 283
2. మైరావణ చరిత్రము - 1-79

అని పొగడెను. అంత నగస్త్యుఁడు 'మా యోగదృష్టిచే పేం మపె యున్న్న యు నెఱుంగుదుము. మీరు కని విని యెఱుఁగని దొకటి విన్పించెద'నని మైరావణచరిత్ర చెప్పఁబొడగెను. రావణ ప్రేరితుఁడై మైరావణుఁడు వచ్చు చున్నట్లు చారులవలనఁదెలిసి హనుమంతుఁడు

[1] "నక్షత్ర గ్రహ పంక్తు లోలి పదవిన్యస్తంబులై యొప్పఁగా
న క్షీణ స్ఫుట సత్త్వుఁడై పెరిగి బ్రహ్మాండావళుల్ మీఱుచున్"

దక్షుండై ఘన వాలవప్రము నేర్పరచిన రీతి మాడయు అద్భుతావహా గ వర్ణించెను. ఆనందరామాయణము మైరావణునితోబాటు [2] 'ఐరావణ ని గూడఁ జెప్పుచున్నది. రామలక్ష్మణులఁ దెచ్చి కాళికకు బలిసేయ నెంచిన మైరావణుని భార్య రామాంజనేయుల శక్తియుక్తులఁ జెప్పి యత్నము వారింపఁ జూడ రామునిచేఁజచ్చి వైకుంఠముఁజేరఁ దన నిశ్చయమును మైరావణుడు చెప్పుటతో ప్రథమాశ్వాసము పూర్తియయ్యెను.

ద్వితీయాశ్వాసమున సూచీముఖ ఘటకులతో మైరావణుఁడు ప్రవేశించెను. హనుమంతుని తోకకోటను కొట్టబోయిన సూచిముఖుని ముక్కు విరుగుట పరాశరసంహిత ననుసరించు చున్నది. విభీషణుని వేషమున వచ్చి మైరావణుడు చొక్కుమందు చల్లి రామలక్ష్మణులఁగొంపోయి భద్ర కాళీభవనమున నుంచెను. ఆనందరామాయణమున కామాక్షిఆలయముగ జెప్పఁబడెను. జాంబవదాదులచేఁ బ్రేరేపింపఁబడిన వీరాంజనేయుఁడు

[3] "సాదింపున్ మఱి దైత్య గంధవహ దృత్సామామరాధీశులన్
గ్రోధింతుం గ్రహ తారకాగణ మరు ద్రుద్రాది సంఘంబులన్
శోధింతున్ బెగడొంద వారిధి హరిక్షోణీధరశ్రేణులన్
బాధింతున్ భువనత్రయంబు వణఁకన్ బ్రహ్మాది దైవంబులన్

అని యనుటలోఁగవి వీరరసోచిత రచన గావించెను. విభీషణుని సూచన మేరకుఁ బాతాళలంకఁజేరిన మారుతిని మత్స్యవల్లభుఁడు ఢీకొ. ను. ఇది పరాశరసంహితా విధానము. ఆనందరామాయణమున నీతని పేరు మకరధ్వజుఁడని కలదు. తనతో ఢీటువచ్చు బలము గని హనుమంతుఁ డాతనితో 'నెవ్వఁడ వీ'వన మత్స్యవల్లభుఁడు [4] 'ఘనుఁడైన యాంజనేయుని

---

1. మైరావణ చరిత్రము 1-128
2. ఆనంద. సార 11 - 73
3. మైరావణ చరిత్రము 2-68
4 మైరావణ చరిత్రము 2-94

తన 'కుండ' నని సీతాన్వేషణమున సంద్రము దాటుచెడఁ బడిన స్వేద బిందువును మ్రింగిన తిమింగిలమునకుఁ బుట్టితి ననెను. పరాశరసంహిత యందు దీర్ఘదేహి యను మత్స్యాంగనగా కలదు. ఆనందరామాయణ మున నామె మొసలిగను, లంకాదహనానంతరము తోకను చల్లార్చుచూ పొగకమ్మిన నోటితో నుమ్మివేయ దాని నాస్వాదించుటచేఁ బుత్రుఁడు పుట్టినటుల మార్పు కలదు. తనయుని మాటపై హనుమంతుఁడు చూపిన నిజరూపమును

[1] ''బాలభాను ప్రభాపటలంబు కైవడి
        నుగ్రలోచనముల నొప్పు మిగుల
    ఘనతర నీలమేఘంబు చందంబునఁ
        జటుల విస్ఫుట తనుచ్ఛాయ దనరఁ
    జండ దిగ్వేదండ తుండంబు లట్టుల
        నురు భయంకర బాహుయుగ్మ మమర
    నిరుప మాయత లసద్వరుణ పాశముమాడ్కి
        వరుస నుద్దీపిత వాల మెసఁగ

    మృత్యుదేవత కత్తుల రీతి మెఱసి
    నిశిత ఘనదంష్ట్ర పంక్తులు నిటుకొనఁగ
    ధైర్య ధర్మాద్రి మారుత తనయుఁ డపుడు
    పెరిగె నక్షత్రగణములు పేర్లు గాగ

అని మాడయ వర్ణించి హనుమంతుని యుగ్రమూర్తి సాక్షాత్కారము గావించెను. ఇట్టిది మహద్రూపము కాగా కాలదండుని భార్య, నీలమే ఘుని తల్లి, మైరావణుని చెల్లెలు నగు దుర్దండి సోదరశిక్షిత యగుచు హనుమంతు నెఱిఁగి స్తుతించినదై ఆతనిని తులాబంధద్వారమును దాట వేయుచెడ హనుమంతుఁడు తింత్రిణీప్రమాణుఁడై అణిమాశక్తిఁజూపుటఁ జప్పియోగిపుంగవుఁ డగు నాతనియం దష్టసిద్ధుల నిరూపించెను.

తృతీయాశ్వాసమున విశేషముగ హనుమద్విజృంభణము వర్ణితము. దుర్దండిని దండింపఁజూచిన రాక్షసులను హనుమంతుఁడు చంపినరీతిని [2] 'వీర దానవ మత్త వేదండముల మీదఁ గంఠీరవము మాడ్కిఁ గవిసి

---

1. మైరావణ చరిత్రము 2 - 105        2. మైరావణ చరిత్రము 3 - 4

కవిసి' అని యొక సీసపద్యమున విపులముగ మాడయకవి వర్ణించెను. ఇట్లే 11, 27, 43, 59 పద్యములను సీసపద్యములనే యుద్ధవర్ణనముననే రచించెను. వీటియం దన్నిటఁ బాదాంత క్వార్థములఁ జెప్పుచు సమ శయ్యఁ జూపెను. యుద్ధవర్ణనల దక్షుఁ డనిపించెను. [1] 'మూడాశ్వాస ములందు హనుమంతుని నిజస్వరూప సందర్శనము గావించెను. మైరా వణు డెంతకుఁ జావకున్న దుర్దండి యేడు తుమ్మెదలయం దుండు వాని ప్రాణముల రీతిఁ జెప్ప వానిని హనుమంతుఁడు సంహరించెను. మైరావణ ప్రాణరహస్యము నిందు దుర్దండి చెప్పినట్లు పరాశరసంహితో కరీతినే కలదు. కాని ఆనందరామాయణమున అయిరావణ బలాత్కృత యగు నాగకన్యచెప్పినటుల కలదు. మైరావణ వధానంతరము నీలమేఘుని పట్టా భిషేకము మత్స్యవల్లభుని యౌవరాజ్యపట్టాభిషేకము జరిగెను. హనుమం తుఁడు రామలక్ష్మణులఁబెట్టియుంచిన మందసమును కపిసేనకడకుఁ జేర్చి యందఱి మెప్పు వడసెను ఇట్లగస్త్యుఁడు చెప్పఁగ పులకాంకిత గాత్రుఁ డగు రాముఁడు ఆనందబాష్పముల హనుమంతుని కౌఁగలించుకొని 'మారు తీ! నీ ఋణ మెట్లును తీరదు. నీతో నాకు తమ్ములు నల్వురు. నీ కేవరము కావలెనో కోరు" మన హనుమంతుఁడు 'మీచరిత ధర నిల్చునంతకాలము నన్నుండని' మ్మనెను. అట్లే వరమిడి యనర్ఘ హార మిడి రాముఁడాంజ నేయుని పలురీతులసంభావించెను. ఈరీతిగా మాడయ మైరావణచరిత్ర మును చక్కని ప్రబంధముగ నిబంధించి హనుమత్పాత్రను విశేషముగఁ బోషించెను.

## శతకంఠ రామాయణము

హనుమ ప్రధానమగు శతకంఠరామాయణమును పద్యకావ్యముగ రచించినవాఁడు వర్ధనకవి. ఈ యితివృత్తమునకు మూలము పరాశర సంహిత, ఆనందరామాయణరాజ్యకాండ, వసిష్ఠోత్తరరామాయణము, నద్భు తరామాయణములందు గలదు. క్రీ॥ శ॥ 1700 కాలపుఁ గావ్య మిది. ప్రాచీ నాంధ్రకవులలో నీ శతకంఠరామాయణమును 12వ శతాబ్దము నందే వేములవాడ భీమకవి రచించినట్లు కందుకూరివీరేశలింగముపంతులు కవుల చరిత్రయందుఁ దెల్పెను. అనంతరమున దీనిని రచించినవారిలో

1. మైరావణ చరిత్రము 1-128; 2-105; 3-58

ప్రపౌత్రుఁడు మర్దనకవి. లింగకవి, గంగకవి యనువారును శతకంఠ రామాయణమును రచించినట్లు; లింగకవి పోచనృపాలునకు, గంగకవి బోగనృపాలునకు నంకిత మిచ్చినట్లును కందుకూరివారు తెల్పిరి. కాని మర్దనకృతముగఁ దెలియు గావ్యమునను తృతీయాశ్వాసమునుండి పోచ నృపాలుని సంబోధనలు కలవు. కావ్యాంతగద్యఁ బట్టి యీతనితండ్రి ధర్మనార్యుఁడుగఁ దెలియును.

మర్దనకవి కృత మగు శతకంఠరామాయణమునకు సీతావిజయ మనునది నామాంతరము. కవి యాశ్వాసాంతగద్యయందు సీతావిజయం బను మహాప్రబంధ మనియే చెప్పుకొనెను. ఎడనెడ శబ్దదోషాదు లున్నను సరళమగు రచనము. హనుమత్కథకు పుష్పగిరితిమ్మనవలె ప్రాధాన్య మిచ్చినవాఁడు కాదు. విజయము సీతదే యైనను హనుమత్ప్రధా నేతి వృత్తములం దిది ముఖ్యమైనది. కాని మర్దనకవి హనుమత్ప్రాధాన్యత ను చెప్పెనే తప్ప పోషింపలేదు. కథయందును భేదము కలదు. సమీర కుమారవిజయమున శతకంఠుఁడు వసు వను పేరుగల సతికి కశ్యపప్రజా పతివలనఁ బుట్టినవాఁడు. కాగా మర్దనకవి శతకంఠరామాయణమున నశ్రి ముఁడను పులస్త్యపుత్రునివలన చిత్రగంధి యను గంధర్వకన్యయందుఁ బుట్టినవానినిగాఁ జెప్పెను. అందు శతకంఠుండు మాయాపురి నేలువాఁడు కాగా నిందలివాఁడు ప్రతాపలంకాధీశుఁడు. పురాణం ప్రభృతులు మర్దన కవినే యనుసరించిరి. హనుమంతుని నవావతారములలో శక్తిపూర్ణ మగు నవతారము పంచముఖాంజనేయావతారము. ఆ అవతారకారణమగుగాథయే శతకంఠరావణవధ. మర్దనకవి ప్రోక్తమగు హనుమత్కథా భాగము స్థూలముగా నిట్లున్నది.

ప్రథమాశ్వాసమున శతకంఠుదురాగతము లెఱిఁగిన రాముఁడు వాని నెట్లు జయించుటా యని చింతించుచుండ లక్ష్మణుఁడు సుగ్రీవ విభీషణా దుల తోడునుగూర్చి ధైర్యముఁజెప్పుచు 114వ పద్యమున స్మరించి 115, 116లలో హనుమచ్ఛక్తిని కీర్తించును. 141 లో రామునిచేఁ దలంపఁబడి వచ్చి విషయ మెఱిఁగి తన నిజరూపుఁ జూపనెంచి శివవాయువుల నుతించి చూపెను. పిదప లక్ష్మణునితోఁబాటు సుగ్రీవుఁ దెచ్చుటకుఁ బంపఁబడెను. ద్వితీయాశ్వాసమున హనుమంతుఁడే కిష్కింధానగరిఁజొచ్చి వానరులతోఁ

కుశల ప్రశ్నముల యనంతరము సుగ్రీవుని రాముకడకుఁ దెచ్చెను. అనంతర దినముననే యుద్ధ ప్రయాణము నిశ్చయింపఁబడెను. హనుమంతుఁడు వాలముఁ బెంచి కోటవలె నుంచి వారి నెల్లర సముద్రము దాటింప యత్న మొనర్చెను. తృతీయాశ్వాసమునఁ దనరూపము బెంచి యందఱి నెక్కించుకొని సముద్రము దాటి రామునిచేఁ బ్రశంసింపబడెను. శతకంఠ రావణుకడకు రాయబార మేగి రాముని వాక్యముఁ జెప్పి దుష్ట రాక్షసునకు నీతులు సెప్పెను. వాఁడహంకరించి హనుమంతు నుక్కడఁగింపఁజూడ విరాడ్రూపముఁ జూపి వానిని మోది వానరులఁ జేరెను. చతుర్థాశ్వాసమున యుద్ధ మారంభముకాగాఁ దగు శ్రద్ధ వహించుచు స్థూలకంఠుని శూలము విరిచెను. శతకంఠుని బాణ సహస్రముచే వివశుఁ డయ్యెను. పంచమాశ్వాసమున సీత యుద్ధ మొనర్చునెడ వాహనమై శాత్రవ బాణములందన తోఁకతోఁ బడఁబైచుచు సహకరించెను. యుద్ధ విజయానంతరము మరల నెల్లవారిని సముద్రము దాటించి రామునిచె సమ్మానింపబడిన వాఁడై గంధమాదన పర్వతమున కేగెను.

ఏడువందలకుఁ బైగాఁ బద్యములు గల ఈ ప్రబంధమున హనుమత్పరములుగాఁ జెప్పందగు పద్యములు వందకూడ లేవు

[1] "అట్టి జగజెట్టి యగు గాడ్పుపట్టి మనకు
నిట్టివేళలఁ గలుగంగ నేల వగవ
నతఁడు గడగిన శతకంఠుఁ డనఁగ నెంత
యొక్క వ్రేల్మిడి నెగమీటు నుర్వియెల్ల"

అని [2] "నీ మహిమంబుచేఁ జుమీ .... యదవదవాసిదైత్యుని శరావళిచే నణగించి మించుటల్" అనియు నాద్యంతములఁ బొగడి నంతగా నాతని పాత్రను బోషించుట కానరాదు. ఈ శతకంఠ రామాయణముపై వాల్మీకి రామాయణ ఛాయ కాననగును. మూల రామాయణమున రావణుని వలె నిందు శతకంఠరావణుని సంహారార్థము వానరసహకార ముండెను మూల రామాయణమున నంగదరాయబార మున్న నిందు హనుమంతుని రాయబారము కలదు. ఇది రామాయణమందలి హనుమంతుని స్వయందూత్యము

1. శతకంఠ రామాయణము-1-115
2. శతకంఠ రామాయణము-5-189

వలెనే జరిగెను రావణు నెదుటఁ దోఁకఁ జుట్టుకొని యున్నతంబుగఁ గూర్చున్నటుల జనవ్యవహారమున ప్రచారమందెను. ఆ విషయ మిందు [1] 'డాసి తదీయ సింహాసనంబునకుఁ బురోభాగంబునఁ దనవాలంబు దివి సోకఁ బెంచివేకం జుట్టి తదగ్రంబున నమ్మహాదానవేంద్రునికంటెఁ బొడవుగాఁ గూర్చుండిన' అని పుర్దనకవి వర్ణించెను. దశకంఠునకు వలెనే శతకంఠునకును నీతిని, భీతినిఁజెప్పెను.రావణునిచేఁ బ్రమాదముఁ బొందెను

యుద్ధమునకు బయల్వెడలిన యసురపక్షము దుశ్శకునములఁ బొందుట యిందునుఁ గలదు. రావణయుద్ధమునఁ గుంభకర్ణుని శూలము విఱచి హనుమంతుఁడు వానరసేన కత్యంత మానందము కల్గించుటకలదు. అది [2] 'తత్కుంభకర్ణస్యభుజప్రవిద్ధం-శూలంశితంకాంచన దామజుష్టమ్' అని; బభంజజానున్యారోప్య-ప్రహృష్టః ప్లవగర్షభః' అని చెప్పఁబడగా పుర్దనకవి హనుమంతునిచే నిటులనే స్థూలకంఠు శూలమును విఱిపించుచు

[3] "అప్పు డెడఁజొచ్చి హనుమంతుఁడా త్రిశూల
మెల్లసైనికు లలరంగ నేపు మెఱసి
పద్మజాండంబు పట పటఁ బగుల నార్చి
విపుల బలధుర్యుఁడై పట్టి విఱిచివైచె

ననెను. త్రిజటా స్వప్నవృత్తాంత మిటఁ జిత్రగంధి స్వప్నవృత్తాంతముగాఁ గన్పట్టును.

రెండురామాయణములందును రావణు ప్రాణరహస్యము చెప్పఁబడి చంపుట జరిగెను. మూలమున భాస్కరరామాయణమున విభీషణుఁడు [4] 'వీనినాభియందమృతముకుండలాకృతి మహత్త్వమునందగ నుంట జేసిమూర్ధములును చేతులుందెగియుఁ దక్షణమాత్రన పుట్టుచున్నవి' అనగా నిట నారదుఁడు

[5] "వీనినాభిని జుట్టురాఁబూనియులవి శల్యసంజీవకరణులు తుల్యముగను గలిగియున్నవి తద్వస్తుఘనతఁజేసి తలలుఁగరములుఁ దెగియును మొలవఁదొడగె' అనెను. విమలాంగిని బలాత్కార మొనర్చి యనుభ

1. శతకంఠ రామాయణము 3-47
2. వా. రా. యు. 67-64
3. శతకంఠ రామాయణము 3-167
4. భా. రా. యు. 2171
5. శతకంఠ రామాయణము 4-144

వించి కణ్వునిచే స్త్రీ మూలకంబునఁ జావుం బొందిన ఘట్టము రామాయణమందలి ధాన్యమాలివృత్తాంతమున కద్దము పట్టును. మూలరామాయణమందు ధాన్యమాలిని రావణుఁడు బలాత్కరించినట్లే యిందు విమలాంగిని శతకంఠరావణుఁడు బలాత్కరించెను. అందు శాండిల్యమహాముని [1] నిన్ను బల్మిమైఁ గామశరార్తిఁ గైకొనిన కష్టుఁడు కామినివంకనే చెడున్' అని శపింప నిందుఁ గణ్వమహాముని [2] 'ఇత్తెఱంగున మానభంగంబు గావించి ప్రాణంబులుం గొనియున్నవాఁడవు గాన నింతిచే నిట్లు నీతలలు తునియలై మరణంబు నొందఁగల' వని శపించెను. రామాయణమున రావణుఁడు శ్రీమన్నారాయణావతారమూర్తిగా శ్రీరాము నెఱిఁగి విరోధమున నాతని సాయుజ్యముఁబొందఁగోరిన ట్లే శతకంఠుఁడును సీతనుపరాశక్తిగా నెఱింగియు [3] 'ఇవ్విధంబున నాదిశక్తిరైన దీనిచేత మరణంబు గలుగుట మహాపుణ్యలోకంబు గల' దని యెదుర్కొనినట్లు చెప్పెను.

సీతాదేవి శతకంఠుపై మహాస్త్రంబుఁ బ్రయోగించి వాఁడు దానిచే దగ్ధుండు గావలె ననుచు నొట్టు బెట్టుట హనుమల్లాంగూలము దగ్ధము కాకుండుటకై యొట్టు పెట్టినరీతి ననుకరించి యున్నది.

[4] ''యద్యస్తి పతిశుశ్రూషా - యద్యస్తి చరితం తపః
యది వా త్వేకపత్నిత్వం - శీతో భవ హనూమతః''
అన్న వాల్మీకియొక్క సీత పలుకులను

[5] ''అవనిపై నే పతివ్రత నైతినేని
యరయ రాఘవుఁడు ధర్మాత్ముఁ డయ్యెనేని
వేదములు సత్య మగునేని వీఁడు నిమ్మ
హాస్త్రమున దగ్ధుఁడగుఁగాక యనుచు నేసె''

నన్న మర్దనకవియొక్క సీతపలుకులు తలపించుచున్నవి. ఇట్లు రాక్షసుల యుత్తరక్రియలు జరిపింప రాముఁడు విభీషణుఁ బురమాయించుట హనుమదాదులకు సమ్మానము మొదలుగా హనుమంతుఁడు గంధమాదన పేగు పర్యంతము మూలరామాయణానుసరణము సర్వాంగీణముగాఁ గాన

---

1. సమీర 3_253
2. శతకంఠ రామాయణము_4-150
3. శతకంఠ రామాయణము_4-152
4. వా. రా. సుం. 53 - 28
5. శతకంఠ రామాయణము 4_156

వచ్చును. పై వివేచనమున స్వల్పమగు శతకంఠరావణవధేతివృత్తము గొని తన ప్రతిభా పాటవములతో దానిని రామాయణ మను మూసలో దిద్ది తీర్చి శతకంఠరామాయణముగాఁ బ్రబంధరూపమున మర్దనకవి యందించినట్లు విశద మగును.

# సహస్రకంఠ రామాయణము

శ్రీరామవిజయ మను నామాంతరముగల సహస్రకంఠ రామాయణమును రామావఝ్ఝుల కొండయ్యశాస్త్రి రచించెను. ఈతఁడు రామభక్తుఁడగుట దీనిని రామాంకితము గావించెను. దీనికి మూలము పద్మపురాణాంతర్గతము. అద్భుతోత్తరరామాయణమునం దుత్తరభాగమునను ఈ సహస్రకంఠరావణవధ గలదు. సహస్రకంఠరామాయణమును ముద్దుల లక్ష్మీనారాయణ కవియుఁ బద్యకృతిగా నొనర్చెను.

> "దశకంధర శతకంధర
> దశశతవద నాఖ్య లలరు దనుజులు లోకా
> తిశయ భయంకర రూపులు
> విశదోన్నత బలులు నగుచు వెలసిరి పుడమిన్"
> "వారియం దాది రాక్షసద్వయ చరిత్ర,
> మతి విచిత్రకరంబు నై యమరునటులు
> చెప్పితివి మున్ను యోచించి శివ! తృతీయ
> కథను జెప్పినవాఁడవు కావు నీవు"

అని పార్వతి శివుని యడిగిన నా శివుఁడు సహస్రకంఠ రావణునకు రామునితో జరిగిన యుద్ధము, అందు హనుమత్సహాయకృత్యములు, సహస్రకంఠ రావణవధ మున్నగు విషయములు చెప్పినరీతిగ నీ కావ్యము నడిపెను. శతకంఠరామాయణమునఁ గల ప్రాధాన్యత హనుమంతున కిందుఁ గానరాదు.

# శ్రీ సీతారామాంజనేయ సంవాదము

శ్రీ సీతారామాంజనేయ సంవాద గ్రంథము తెనుఁగు సాహిత్య ప్రపంచమున నత్యంతము ప్రసిద్ధిఁబడసినది. ఇది కేవల వేదాంతగ్రంథముకాదు. ఇందు సాహిత్యశిల్పము కూడ అత్యద్భుతముగఁ బ్రదర్శింపఁ బడినది. దీనిని పరశురామపంతుల లింగమూర్తి రచించెను. ఈతనికే గురు

మూర్తి యనియుఁ బేరు. ఈతఁడు కావ్యాదిని ఇష్టదేవతా ప్రార్థనము నందే హనుమంతునిగూర్చి

1 "తనరఁగ గాయముచేత రామచరణ ద్వంద్వైక దాస్యంబు హె
చ్చిన భక్తిం దగు వాక్కుచే ననిశమున్ శ్రీరామనామ ప్రకీ
ర్తనముం జిత్తముచేత రామ పరతత్త్వధ్యానముం జేయు నా
హనుమంతున్ సముపాశ్రయింతు మదభీష్టార్థంబు సిద్ధింపగన్"

అని ప్రార్థించెను. యోగవిషయమై విరచితమైన శాస్త్రకావ్య మిది. ఈ విషయమును కవియే 2 'ముముక్షుజన హితంబును, సంసారసాగరోత్తారకంబును రాజయోగం బంతయు నొక్క ప్రబంధంబుగా రచియింప నిశ్చయించి' అని చెప్పుకొనెను. శాస్త్రము, అందునను తాత్త్వికమగు యోగశాస్త్రపర మయ్యు సర్వలక్షణలక్షిత పద్య గద్య రచన గల్గి యాంధ్రవాఙ్మయమున ప్రఖ్యాత ప్రబంధముగా విలసిల్లిన దిది. కవి యగు లింగమూర్తి ధ్యానమున నుండగా శ్రీరాముఁడు తోచి బ్రహ్మాండపురాణాంతర్గ తాధ్యాత్మరామాయణమునందు సంక్షిప్తరూపమున నున్న సీతారామాంజనేయ సంవాద మను నితిహాసము విస్తరించి కావ్య మొనర్చి తన కంకిత మిమ్మనుటచే రచించినట్లు చెప్పుకొనెను.

కావ్యము హిమవంతంబున నుమామహేశ్వరుల సంభాషణతో నారంభ మయ్యెను. రామనామ, సంక్షిప్తరామకథల వర్ణనము కలదు. రామ బహుమానితులై యందఱు నేఁగ హనుమంతుఁడు మాత్రము రాముని యథార్థస్వరూప మెఱుంగఁ గోరి ఫాలభాగంబున కేలు మోడ్చుకొని యుంట నెఱిఁగి రాముఁడు సీతతోఁ దన యథార్థస్వరూపము నెఱింగింపు మనుటతో నామె తారకయోగము చెప్పఁ దొడఁగెను. అది వినిన హనుమంతుఁడు

3 "రామచంద్రుఁడు తారకబ్రహ్మ మగుట
సత్య మగుఁ గాని యి మ్మహాసర్వమయుని
సులభముగఁ గాంచు పరమ సుసూత్ర మెద్ది
నా కెఱింగింపవమ్మ లోకైకజనని!

1. శ్రీ. రా. సం. 1 - 6
2. శ్రీ. రా. సం. 1-9
3. శ్రీ. రా. సం. 1-82

అని కోరుటతో నావిధి నామె చెప్పెను. ఇట నాసనములు ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన సమాధులు. యోగిలక్షణములన్నియుఁ జెప్పఁబడెను. యమ నియమాదుల యభ్యాసమున శీఘ్రముగ నాదబిందుకళా సాక్షాత్కార మగు నని చెప్పెను. దానిచే పరబ్రహ్మయందు లీన మగును. ఇట్లు తారకయోగము నుపదేశించినరీతి ప్రథమాశ్వాసమునఁ గలదు.

ద్వితీయాశ్వాసమున సాంఖ్యయోగాదులఁ జెప్పి త దనుభూతితో

[1] ''అట్టి తన్నుఁ గాంచి యానందమూర్తియై
చిత్రరూప మట్లు చేష్ట లుడిగి
తనువు మఱచి కొంతతడవు పూరకుండె నా
యాంజనేయుఁ డో హిమాద్రితనయ!

అని తన యథార్థస్వరూప మెఱిఁగి పరమానందమయుఁడైన హనుమంతుఁడు వర్ణింపఁబడెను. అట్టివానిని రాముఁడు గాఢాలింగన మొనర్చెను. ఈ ద్వితీయాశ్వాసమునఁ గవి 88, 89 లలో నేకాక్షర ద్వ్యక్షర కందముల రచించి కవనచిత్రముఁ జూపెను.

తృతీయాశ్వాసమున హనుమంతుఁడు శ్రీరాముని [2] 'శ్రీరామరామా! త్రిలోకాభిరామా! బ్రహ్మమాత్రుండవై యొప్పు నీ దివ్యతత్త్వంబు నీ సత్కృపా సంభృతాంచత్కటాక్షంబుచేతం గనుంగొంటి దేవా నమస్తే నమస్తే నమస్తే నమః' అని దండకమున స్తుతించును. ఈ స్తుతి యనుప్రాసాదికమునఁ గవితాసామర్థ్యముఁ బ్రకటించుచున్నది. పిదప 'రామ రాఘవ శ్రీరామ రామ ధామ' మకుటమున నీసదశకముచే స్తుతించెను. [4] 'ఇట్ల ఖండపాండిత్యంబుచేతఁ బెక్కుభంగుల వినుతించు హనుమంతుని' యనుటద్వారా తన యఖండపాండిత్యముఁ గపిపేరఁ గవి దీనియందు నిరూపించుకొనెను. అనంతరము రాముఁడు మారుతి కమనస్కయోగముఁ జెప్పగా నాతఁడు సమాధియందు మనస్సు కలదా లేదా యని ప్రశ్నించుచు రెండుపక్షముల దోషములు వివరించెను. ఇట్లు హనుమంతుఁడు పృచ్ఛకుఁడు, శ్రోతయునై యీ కావ్యముద్వారా జగత్తునకు సకల రాజయోగ తాత్త్విక విషయములు దెల్పినవాఁ డయ్యెను. శ్రీకృష్ణుఁడు పార్థున

1. శ్రీ. రా. సం. 2-168
2. శ్రీ. రా. సం. 3-3
3. శ్రీ. రా. సం. 3-27 నుండి 36
4. శ్రీ. రా. సం. 3-37

కుపదేశించిన భగవద్గీతలోని పదునెనిమిది యోగముల సారము నిందలి తారక, సాంఖ్య, అమనస్క యోగములు మూడింటనే పరిపూర్ణముగ నుపదేశింపఁబడుట విశేషము.

## లంకావిజయము

పిండిప్రోలు లక్ష్మణకవిచే రచింపఁబడిన ద్వ్యర్థికావ్య మిది. 1767వ సంవత్సరమున రచింపఁబడిన కావ్యము. లక్ష్మణకవి తలిదండ్రులు రాజమాంబా గోపాలార్యులు. ధర్మారా వను వ్యక్తివలన లంకభూమిని పోగొట్టుకొని ఆ ధర్మారావును భూమి నపహరించినవాఁనిని భూపుత్రి నపహరించిన రావణునిగాఁ జిత్రించి ద్వ్యర్థిగా వ్రాసినట్టి దిది. తన లౌకికేతివృత్తము నకై హనుమత్కథ వస్తువుగాఁ గొనెను తప్ప ఈతఁడు హనుమంతునియెడ లక్ష్యము కలవాఁడు కాని, రాముని యెడ లక్ష్యము కలవాఁడు కాని, వారి విజయమును వర్ణింప నెంచినవాఁడు కాని కాదు. ధర్మారావే దమ్మన్న. అతఁడే రావణుఁడు. కావున దీనికి ముందుగ రావణదమ్మీయ మనియే పేరు పెట్టెను. ద్రాక్షారామసమీపమున కుయ్యేరు గ్రామనివాసి ఈలక్ష్మణకవి.

లంకావిజయము రెండాశ్వాసముల కావ్యము. ప్రథమాశ్వాసమున 183 పద్యములు, ద్వితీయాశ్వాసమున 290 పద్యములును గలవు. ఇందు ద్వితీయాశ్వాసమున 22వ పద్యమున హనుమంతుఁడు ప్రవేశించును. యథావాల్మీకముగ లక్ష్మణునితోడనే భాషణము జరిపెను. ఒక్కొక్క పద్యమున మైనాక, సురస, సింహికల వృత్తాంతము చెప్పఁబడెను. [1] 'హరిప్రసాదలబ్ధ విద్యాధురంధరుఁ డనుట' సూర్యాదరాత్త విద్య కలవాఁ డని యనంతర పద్యమునఁ జెప్పుటవలన సూర్యశిష్యత్వము; [2] 'తిమ్మఁ డొకఁడు ధూర్జటి' అని విభీషణునిచే రావణునకుఁ జెప్పించుటచే శివావతారత్వముఁ జెప్పినవాఁ డయ్యెను. [3] 'భానుండు గురుఁడుగాఁ బరగె నెయ్యము న మున్నట్టి యాపావని యుగ్రదిశను' అనియుఁజెప్పెను. రావణదమ్మీయ మను నీ లంకావిజయము ముఖ్యముగ ధర్మారావు అన్యాయము వెలుగెత్తి చాటుటకు కావున నట్టి ధర్మారావును ప్రత్యక్షముగా నధిక్షేపించు నవకాశముగాఁ గొని రావణునితో హనుమంతుఁడు ముఖాముఖి

1. లంకావిజయము 2-69
2. లంకావిజయము 2-109
3. లంకావిజయము 2-229

భాషించిన పట్టమును విపులముగాఁ జెప్పెను. ద్వితీయాశ్వాసమున 77వ పద్యమునుండి 82వ పద్యమువఱకుఁ బదునారు పద్యములలో నా విషయముఁ జెప్పుచు సీత నపహరించుటలో దోషము, లంక నపహరించుటలో ధర్మారావుదోషముఁ బ్రకట మొనర్చునట్లు వివరించుచు నందుకుఁ బ్రతిఫల మనుభవింపక తప్పదని; కాన సీతను (లంకను) వీడుమని హితముఁ జెప్పెను. రచనచేయుటయందుఁ బ్రధానలక్ష్య మిదియే.

లంకాదహనము చెప్పఁబడెను. లక్ష్మణుని మృతసంజీవనిఁ దెచ్చి బ్రతికించుట కలదు. పుత్రకామేష్ట్యాది శ్రీరామపట్టాభిషేక పర్యంతము చెప్పుట నిది రామప్రధాన కావ్యము తప్ప హనుమత్ప్రధానము కా దని తెలియును. హనుమంతుని దెల్పుటకుఁ బూర్వాన్వయముతో నతఁడు, నాతఁడు నను సర్వనామములే యెక్కు డుపయోగింపఁబడగా హనుమత్పరముగా రెండవ అర్థమునకు అనుకూలముగా ద్వితీయాశ్వాసముననే మిత్రసంతతి వరమంత్రి, కేసరిపుత్రుఁడు (22) వాతతనయుండు (26) వనచారివరమంత్రి (27) కేసరితనయుఁడు (34) అంజనానందనుఁడు (41) పవనప్రియకుమారుఁడు (48) హరి (68, 103) హరిప్రసాదలబ్ధ విద్యాధురంధరుఁ డగు నా నిర్భీక వనచారి (69) పావని (70, 189) రామేడ్భృకుఁడు (72) వాణీరచనాపైపుణి (75) మరుత్కుమారుఁడు (76) హనుమంతుఁడు (93) వానరసమాజమణి (95) నిర్భీకవనచారి (86, 101) తిమ్మఁడొకఁడు ధూర్జటి (109) మరుజ్జాత (150) ప్రభంజనసంతతి (162) శ్వాసని (179, 180) భానుండు గురుఁడుగాఁ బరగిన పావని (229) అను ప్రయోగములు చేయఁబడెను. రామకథను తీసికొని రచించినను ద్వ్యర్థియయ్యుఁ దగినస్థానము లభింపనికారణము లౌకికవ్యవహారమును జోడించి ద్వేషపూర్వకమగు రచనఁజేయుటవలనఁగావచ్చును. ఇట్లు లంకావిజయమునఁ బ్రధానపాత్రవహించిన హనుమంతుని లక్ష్మణకవి తన ద్వ్యర్థికావ్యమున నిబంధించుకొనెను.

# శ్రీ సీతాన్వేషణము

'సుందరకాండ' ఇతివృత్తముగా విరచితమైన పద్యకావ్య మిది. దీని కర్త వాడేల వెంకట శేషగిరిరావు ఈతఁ డభినవ పోతన, కవికులాలంకార బిరుదాంకితుఁడు. వేంకటలక్ష్మమ్మ, వేంకటరామయ్యలు తల్లి

దండుఁలు. గ్రంథకర్త వంశక్రమ మను శీర్షికయందుఁ గవి తన విషయముల స్పష్ట మొనర్చెను. శ్రీకృష్ణాభ్యుదయ ప్రబంధాదిక కర్తగాఁ జెప్పుకొనెను. దైవదత్త జ్యోతిషవిద్యావిశారదునిగ గద్యలోఁ జెప్పుకొనెను. గ్రంథాంతమున

[1] ''కలలో దర్శన మొసఁగియు
సలలిత సద్గ్రంథరచన సాగించి యశః
కలితుం జేసిన మారుతిఁ
దలచెద తత్పాదరజము దాల్తు శిరమునన్''

అని చెప్పుటవలన నీ కవి హనుమత్ప్రేరితుఁడై ఈ కావ్యము రచించినవాఁడని, పుష్పగిరితిమ్మనవలె స్వప్నాంజనే యానుగ్రహ మందినవాఁడని తెలియుచున్నది.

కథావిధానమున సంక్షిప్తముగ రామజననాదిక కథ పలుబడిపద్యములలో నడచి యనంతర మన్వేషణకథ యారంభ మయ్యెను. ఆయత్నమునఁ బంపాతీరమున హనుమ త్ప్రవేశఘట్టము వర్ణింపఁబడెను.

[2] 'రామా! రమ్యగుణాభిరామ! నుత సుత్రామా! జగన్మోహన శ్యామా' యనుఁబద్యమున హనుమంతుని భక్తితోఁబాటు కవి యనుప్రాస పూర్ణ రచనాశక్తియు స్పష్ట మగుచున్నది. వస్తువునుబట్టి కావ్యము హనుమత్ప్రధానముగ నడచెను. మహేంద్రగిరినుండి వెడలునపుండే మారుతి కపితతితో 'సీత కీ యుంగర మిచ్చి యానవాలు గొనివత్తు' నని చెప్పుట యవాల్మీకము సముద్రము దాటు రీతి, ఆ సమయమున హనుమంతునకుఁ జెప్పిన యుపమలు మొదలగు విధాన మంతయు వాల్మీకి ననుసరించియే చెప్పఁబడెను. రామునకు సీతవార్తఁదెల్పుటలోఁ గ్రియా పదముతో నారంభించుటలో నెల్లరవలె నౌచిత్యము బాటించుటతోఁబాటు

[3] ''కంటింగంటిని జానకీజనని నా కన్నార లంకాపురిన్
వింటింవింటిని తన్మహాసతి వ్యథా వృత్తాంత మాద్యంతమున్
గొంటింగొంటి ప్రతిజ్ఞ దుష్టరిపులం గూలార్చి వేలార్చగన్
మంటింమంటిని యోర్మితో జనకజం మాతంగు లల్లార్చుచోన్''

1. శ్రీ సీతాన్వేషణము - పుట 109-1
2. శ్రీ సీతాన్వేషణము - పుట 12-2
3. శ్రీ సీతాన్వేషణము - పుట 104 6

అని ద్విరుక్తి యొనర్చుటద్వారా నిస్సందేహ మని స్పష్టము గావించుచు ననుప్రాసతో నొప్పి శ్రవణపేయము నొనర్చుటద్వారా హనుమద్వాక్యములు రాముని కర్ణముల కెట్లానందదాయకములై యలంకారముల వంటివో యట్లు శ్రోతృకర్ణములకు నలంకారములుఁ గావించెను.

ప్రధానఘట్టములు శీర్షికలుగా 550 గద్యపద్యముల విరచితమైన దీ కావ్యము. హనుమంతుఁడు కపితతితో వారిని వీడినది మొదలు మరల చేరువఱకు జరిగిన వృత్తాంత మంతయుఁ జెప్పెను. ఈ వృత్తాంతమున కవి [1] 'ముప్పది పొడుగుపాదములు గల్గిన సీసమాలికగాఁ జెప్పెను. ఇట్లు సుందరకాండకథ శ్రీ సీతాన్వేషణ మను పేర పద్యకావ్యముగా విరచిత మయ్యెను.

<u>శ్రీమధువనము</u> : సుందరకాండ నితివృత్తముగాఁ గొని వ్రాసిన ఖండకావ్య మిది. దీని కర్త దివాకర్ల వేంకటావధాని సుందరకాండ నిత్యపారాయణ చేయు ప్రేరణచే కావ్యము రచించినట్లు రచయితయే తన తొలి పలుకునఁ జెప్పుకొనుటఁ బట్టి వేంకటావధాని హనుమన్నిష్ఠుఁ డని తెలియును. మధువనమునకు సంబంధించిన సన్నివేశముకూడ నిం దుండుట చేతను ఆ పేరు సుందరముగా నుండుటచేతను కావ్యమున కాపేరు పెట్టినట్లు తెల్పుకొనెను. కాని ప్రసాదగుణభూయిష్ఠమై మధురతర మగు రచనతో నీ మధువననామము సార్థక మగుచున్నది. ఆదికవి భావములనే గ్రహించి సంగ్రహముగా సుందరకాండ నిట్లు దివాకర్ల ఆంధ్రకావ్యముగ మలచెను.

షట్కాండ పరిమిత రామాయణ మట్లిందు నారు విభాగములు కలవు. కావ్య మంతయు 262 పద్యములలో ముగియును, లంకానగరమునకై సముద్రము దాటుచు వెడలిన హనుమంతునిఁగూర్చి యాలోచించుచు నెదురుచూచుటతోఁ గావ్య మారంభ మగును ఇది యిట్లారంభించుటద్వారా సముద్రముపై అన్వేషణలు పునరుక్తములు కాకుండఁజేసెను. హనుమంతునిచేతనే యా వృత్తాంతముఁ జెప్పించెను. ఇట్టి యారంభ సన్నివేశమునే ఐదవ విభాగారంభమునను రామలక్ష్మణ సుగ్రీవాదు లెదురుచూచుచున్నట్లు చూపెను. ఇది దివాకర్ల చేసికొన్న సన్నివేశకల్ప

1. సీతాన్వేషణము పుట 97-8

నట తీరు [1] 'నల్పివేయఁడె సుధాంధశ్శత్రుత్రికూటంబు నొక్క నిమేషంబున దోమలంబలెనె" రావణప్రభృతి రక్షోవీరు లా హరిప్రముఖులముందర మశకములు కారె' [2] 'శతయోజనంబైన సాగరంబెల్ల నక్కపినాథునకుఁ బిల్లకాల్వ గాదె' అని జాంబవంతుఁడు హనుమంతునిఁ గూర్చి వానరులతో ననును. ఇది

"గోష్పదీకృత వారాశిం - మశకీకృత రాక్షసం
రామాయణమహామాలా రత్నం వందే ఽ నిలాత్మజమ్"

అను శ్లోకమును దృష్టియం దుంచుకొని పల్కిన తీరు. ఈ శ్లోకము సుందరకాండ పారాయణారంభమునఁ బఠింపవలసినది. కావుననే పారాయణవిధిగా నా శ్లోకభావము నిట్లు దివాకర్ల యనువదించెను.

[3] "వార్ధిమగ్నము పక్షవ ద్భూధ్రి మేదైన సుప్తీనమై వచ్చుచున్నదెమొ' యనుచు 'నాకృతి కాంతి వేగాతిశయము నూర్జితము తోఁపంగ' నని పల్కిన పద్యము ఉత్ప్రేక్షా క్రమాలంకారముల నొప్పుచు హనుమంతుని సముద్రలంఘనరీతినిఁ జూపుచున్నది.

[4] "శ్రీకంఠాంశ సముద్భవుం డతఁడె కా కెవ్వార లత్యాయతం
బీ కూపారము దాటి యా శరధరిత్రిన్ బీకరాకార రే
ఖా కోపావిల రాక్షసీ నిచయ రక్షా ఘోర కారాగృహ
వ్యాకీర్ణ స్థితి నున్న భూమిసుత నాశ్వాసింపఁగా నేగెడిన్"

అను పద్యమున హనుమంతుని రుద్రాంశ సంభూతత్వము తెల్పఁబడెను. ఇది హనుమంతుని శక్తిప్రకటన మొనర్చుచు కవి సుదీర్ఘ సమాస రచనా పటిమను తెలియఁజేయుచున్నది. ఇందు భీకరాకార రేఖా కోపావిల రాక్షసీనిచయ రక్షా ఘోర కారాగృహ వ్యాకీర్ణ స్థితి' యను దీర్ఘ సమాస మిందుఁ బ్రయోగింపఁబడెను.

మూలమున 'దృష్టా' సీతా యన్నటుల నిందు కంటిన్ రావణ పాలితం బయిన" యని యారంభించి హనుమంతుని వాఙ్నైపుణ్యముఁ బ్రదర్శించెను. అట్లే యంగదుని పొగడ్తలందు వీర్యమున్ జవయు స్వామిభక్తి ధృతి నేరుపులు హనుమద్గుణములుగ వివరింపఁబడెను. రావ

1. మధువనము 1 - 7
2. మధువనము 1 - 8
3. మధువనము 1 - 14
4 మధువనము 1 -17

బునిపైఁ గోపమువచ్చి వానిఁ దునుమంగ మేను పెంచితి ననగనే యంగ దుఁడు [1] 'హనుమా! యదికూడను చేసివచ్చితేఽ' యనుట సంభాషణా చమత్కృతిఁ దెల్పుచున్నది [2] 'విటపాళీ దళన ధ్వనుల్ ఖగ సముద్వేగార్త నిక్వాణముల్' అను పద్యమందలి ధ్వన్యనుకరణము హనుమంతుఁ డశోకవనము ధ్వంస మొనర్చిన రీతిని తలపించుచున్నది.

శ్రీ దివాకర్ల వానరుల మధువన విహారమున స్వభావోక్తిమయ రచన గావించెను. [3] 'గుణ రూప సుందరుఁడు గా నిందు హనుమంతుఁడు వర్ణింపఁబడెను. హనుమ ద్విజయమునకు మెచ్చి రాముఁడు కౌఁగలించు కొనెను. ఇట్లు దివాకర్ల వేంకటావధాని సుందరకాండను సంగ్రహించియు హనుమచ్ఛక్తియుక్తులను సూత్రప్రాయములగుఁ బదవాక్యంబుల యథాశక్తిగ నిరూపించెను.

## హరికులామోదము (ఆంజనేయప్రశస్తి)

ఆంజనేయప్రశస్తి అను నుపనామముకల హరికులామోదము హనుమంతుని చరిత్రను తెల్పు పద్యకావ్యము. చల్లా సూర్యకామేశ్వరరావు దీనికర్త. నరసాపురమున టైలరున్నత పాఠశాలయం దుపాధ్యాయ వృత్తి చేయు నీ కవి తాతనుగూర్చి భక్తిపరిపూర్ణ తాశుకవిత్వ ప్రవీణుఁడని చెప్పుటచే కవి పండితవంశము వాఁడని తెలియును. ఈ కవి యాధునికుఁడు. ఈతని తల్లి దుర్గ తండ్రి నారాయణుఁడు

తొమ్మిది ప్రకరణములలో పూఁడువందల పది పద్యములఁగూర్చిన దీ చిన్నకావ్యము. ప్రకరణ నామములు లేవు. కవికి కందపద్యముల మక్కువ యెక్కువ ఇంతటి కావ్యముననే 219 కందపద్యములే కలవు. [4] "ఇది శ్రీమ ద్ధనుమ కృపా పదమునఁ గైత యుబుకంగ వ్రాసిన కబ్బం బిది' యని స్వయముగఁ జెప్పుకొనుటవలన నీతఁడును హనుమ దనుగ్రహ లబ్ధ కవిత దీనిని చెప్పెను. హనుమ త్ప్రీత్యర్థము రామాంకితము గావించెను హనుమత్కవి సహజమైన చిత్రరచన యిందుఁగన్పట్టును. శ్రీకారారంభము, ఇష్టదేవతా స్తుతి, షష్ఠ్యంతములు, సుకవి స్తుతి కుకవి నింద వంటివి కల్గి కావ్యము చిన్నదయ్యు సంప్రదాయబద్ధమై

1. మధువనము 2-64
2. మధువనము 3-4
3. మధువనము 6-5
4. హరికులామోదము పుట VI

యున్నది. రచన, వర్ణనలు పూర్వకవుల యడుగుజాడలలో నడచినవి.

సర్వప్రథమముగా హనుమత్పదమగు
శ్రీరామ చరణ యుగళీ
నీరజ మధుకరున కాంజనేయునకు మహా
వీరునకుఁ గ్రూర రాక్షస
మారకునకు జోత లిడుదు మానసవీథిన్'

అను పద్యము రచింపఁబడెను. తొలుతఁ జేయు గణపతి ప్రార్థనమున నాకాశరూపి గణపతి యని, యాకాశభవుం డగు వాయువు కుమారుని హనుమంతుఁ డనియు చెప్పుటచే గణపతి మనుమనిగా హనుమంతునిఁ జెప్పుట విశేషము. హరికుల సూర్యవంశజుఁడగు రామున కామోద మని; హరికుల = వానరజాతి కామోద మని యిట్లు గ్రంథ నామకరణమునసే కవి సామర్థ్యము చూపెను.

ఈ కావ్యమున శ్రీరామున కగస్త్యుఁడు హనుమంతుని చరిత్ర చెప్పుటయా ఇతివృత్తము. కావున నిది యుత్తరరామాయణము నుండి స్వీకరించినది. రాముఁ డగస్త్యునితో

1 ''రావణ విక్రమభంగము
గావించిన వాలికంటె ఘనుఁ డగు నంచున్
భావింతు హనూమంతునిఁ
గోవిదవర చెప్పు డితని గురుచరితంబున్''

అని కోరుటవలన నా ముని యీ హనుమత్కథఁ జెప్పెను. ఇందుఁ గేసరి; యంజనల వృత్తాంతము, శివవీర్య సముద్భవుఁడై హనుమంతుఁడు వాయు వరమున జనించినరీతి, రామావతారము, కపిబాలకుఁడు సూర్యుని కబళింపఁబోయి వజ్రహతుఁడై హనుమంతుఁడగుట, బ్రహ్మేంద్రాదుల వర ప్రదానము, హనుమంతుని బాల్యచేష్టా విజృంభణము, మునిశాపము, సూర్యునికడ విద్యాభ్యాసము, సుగ్రీవసేవ, రామ ప్రథమసమాగమ వృత్తాంతము, లిందుగలవు కేసరి మునిలోక బాధకములు, శంఖ శబలక ములు నగు గజముల నణచి మునుల మెప్పు వడసెను. వారు వరముఁ గోరు మన

1 హరికులామోదము పుట 2-3

[1] ''మారుత రుద్ర సమాన సత్త్వమువాఁడు
నవ్యయాంచిత విగ్రహంబువాఁడు
కామరూపము నొందు కాయంబు గలవాఁడు
కామగమనమును గలుగువాఁడు
బుద్ధియుఁ దేజంబు నుద్ధృతం బగువాఁడు
నిద్ధతర గుణ ప్రసిద్ధివాఁడు
క్రూరశిక్షణఁ జేయఁ గోరుచుండెడివాఁడు
నచ్యుత భక్తుఁడై యలరువాఁడు
సాదు సంగమ మొనరింప జనెడివాఁడు
సాధు రక్షణ సేయంగ జాలువాఁడు
నైన తనయుండు జనియింప నాత్మఁ దలతుఁ
గరుణ నట్టివాఁడు గలుగ వరము నిందు''

అని కోరెను. ఇట్టి హనుమ ల్లక్షణములును కవి తనకావ్యమున నిరూపించెను. అగస్త్యోక్త మగు హనుమత్కథ వినిన రాముఁడు ఆదరమున హనుమంతుని పొగడి తనివారఁ గౌగిలించెను. హనుమంతునిచే నప్పుఁడు గావింపఁబడిన రామస్తుతి భక్తిరస పూర్ణమైనది. శతకమువలె నేక మగుటవలన ధారగా నడచినది. అంత్యానుప్రాసఁ నొప్పినది. ఇట్లే

[2] ''పతి యనుమతి సతి సునిశిత
మతిఁ జని సతత మతినిష్ఠ మనియెఁ దపమునన్
గతిగనని తరమును సదా
గతియు సదా గతి యటంచుఁ గలిత సుతేచ్ఛన్''

వంటివాని యందు వృత్త్యనుప్రాసము గన్పట్టును. ఈకవి ద్వ్యక్షర త్ర్యక్షర ప్రాస లెక్కువ వాడను. అవియు రెండు-రెండు పాదముల నడుపుచుండును.

[3] ''తనయోదయంబు కలుగమిఁ
దన యోజయు సెడిన ననిలుఁ దనుపు మనుచు నం
జనఁ నీపతి నిను బంపెన్
జననీ జనకులకు మీకు సత్సుతుఁ డబ్బున్

1. హరికులామోదము పుట 14-5
2. హరికులామోదము పుట 18-3
3. హరికులామోదము పుట 42-4

ఇట్లు 45-4;46-1;47-2;51-2;59-2;67-1-2; లందు నీరీతి గన్పట్టును.

[1] "అను నిను మాటల కా కపి
వెను వెనుకకు జనుచు రదము వేగంబునకున్
మును మును నీదు సమక్షము
నను నను జననిచ్చి బోధన నొసఁగు మనినన్"

వంటివానియందు లాటానుప్రాసము గన్పట్టును. ఇట్లు హరికులామోద మును కవి సూర్యకామేశ్వరరావు ఉత్తమకవిమార్గమున సహృదయా మోదముగా రచించెను.

# శ్రీ భగవాన్ పంచముఖి

'శ్రీ భగవాన్ పంచముఖి' కావ్యకర్త శ్రీ ద్వివేది సత్యనారాయణ సూరి శతకంఠరావణ వధ వృత్తాంతమే ఇతివృత్తముగా వెలువడిన కావ్య మిది. ఇది పరాశరసంహిత ననుసరించి వ్రాయబడినట్లు షష్ఠ్యం తానంత రమునఁ జెప్పిన 'భక్తశ్రేణి కభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా గ్రథించు పరాశరసంహితా సప్తమపట లాంతర్గత శతానన హనన రూపక మగు నీ చిఱుకబ్బమునకు' ను వాక్యములవలననే స్పష్ట మగుచున్నది. కాని శతాననుని రాజధానిని మాయాపురిగాఁ జెప్పుట ఆనందరామాయణమో లేదా సమీరకుమార విజయమునో యనుసరించియే.

ఇందు హనుమంతునకుఁ బ్రముఖపాత్ర యీయఁబడెను. హనుమ దవతారము లగుఁ దొమ్మిదింట [2] 'చతుర్థః పంచవక్త్రకః' అని చెప్పఁ బడిన నాల్గవ యవతారమునకుఁ గారణమైన గాథ యిదియే. కావుననే గ్రంథమునకు శ్రీ భగవాన్ పంచముఖి యని నామకరణ మొనర్ప బడెను. శ్రీకారము చుట్టిన పద్యము కాగానే

[3] "అరయ కపి హరి గరుడా
ఖ్యారాది వరాహ హయ కళామయ ముఖముల్
తీరిచిదిద్దిన దైవత
పారమ్యము పంచముఖ ప్రభావము వినుతున్"

---

1. హరికులామోదము పుట 68-4
2. ప. సం. 69-7
3. శ్రీ భగవాన్ పంచముఖి 1-2

అవియే పంచముఖములఁ దెల్పుచు నారంభించెను. మూడవ పద్యమును' ఐదాననము లెత్తి హనుమ కటాక్షింప' నని మొదలుపెట్టెను. ఈ గ్రంథ విభాగము ఆననములుగాఁ జేయబడి ప్రథమానన, ద్వితీయానన, తృతీయానన, తురీయానన, పంచమాననములుగాఁ జెప్పుట గ్రహింపఁదగినది. పంచముఖములకు బంచాననములుగాఁ జెప్పుటయు కాక హనుమంతునకుఁ బంచసంఖ్య యిష్టసంఖ్య [1] "హనుమంతునకు ఐదుసంఖ్య ఇష్టము కావున హనుమ ప్రీతికొఱకై పత్రపుష్ప, ఫల తాంబూలాదులను, అప్పములను పంచసంఖ్యలో సమర్పింప నగును.'

[2] 'ప్రదక్షిణ నమస్కారాన్ - సాష్టాంగాన్ పంచసంఖ్యయా దాస్యామి కపినాథాయ-గృహా ణాభీష్టదాయక అని చెప్పబడెను. ఆ నియమమును కృతికర్త పాటించుట గుర్తింపగలము. శ్రీరామునియెడ హనుమత్సేవకుఁ గారణము గార్ధభనిస్వనుని గాథ, శివకేశవుల వాదోపవాద శపథములు కాగా నిందు సూరిచే వేఱొకకారణము కల్పింపఁబడెను. అది త్రిపురాసుర సంహారమునాటి యుపకృతి కిది బదులు.

రామాయణమువలె యుద్ధానంతరము పుష్పకముపై [3] 'సాకేతముఁ జేరినట్లు చెప్పెను. మఱి హనుమ ద్వాలసేతు వెందుకో యర్థము కాదు [4] 'జానకియు నూర్మిళయు సువర్చలయు నిట్లు వీరపత్నులుగాఁగ సాధ్వీరవాన' ననుచు సీత, ఊర్మిళలతోఁబాటు సువర్చలను వీరపత్నిగా జెప్పుట విశేషము. సంహితోక్త మగు నా సువర్చలావిషయము. నిట్లు తెల్పినవాఁ డగుటయు కాక వారి ముప్వర గూర్చుచు వీరపత్నులుగాఁ జెప్పుట యపూర్వ కల్పనము. అంతియకాక ఆ పయిపద్యములందె రాముని మామగా రగు జనకుని తరపునుండి హమమంతుని మామగారగు సూర్యుని తరపునను బలము తో డయినట్లు చెప్పెను. ఇదియు బ్రత్యేకించి కవి కల్పించినది శ్వశురసంబంధ మగు సహకారమందు నీరీతి కవి యాధునికతఁ దెల్పెనుఁ అట్లే 'ఏకాదశానన విభాసుర దివ్యమూర్తి; ఊర్ధ్వుం డలలం ధరించు నో సప్తముఖీ!' వంటి సంబోధనలందు హనుమ న్నవా

---

1. శ్రీహనుమద్విషయ సర్వసం పుట 10
2. ప. సం. 52-48
3. శ్రీ భగవాన్ పంచముఖి 5-75
4. శ్రీ భగవాన్ పంచముఖి 2-12

వతారములకంటె భిన్నములగు రూపములు తెలుపఁబడెను. ఇట్టివి తణుకు సమీపస్థమై హనుమద్భక్తపురముగాఁ జెప్పఁబడ 'తీపఱ్ఱు' నందు సప్తముఖి ఏకాదశముఖీత్యాది మూర్తులు ప్రతిష్ఠితమై పూజలనందుచున్నవి తత్పరిసరవాసి యగు నీ కృతికర్త వానిభావమును బంచముఖమూర్తి యెడఁ జెప్పియుండవచ్చును. పూర్వరచితములై సందర్భము నాలోచించి ప్రవేశపెట్టబడిన శ్రీరామ సుప్రభాతము (1-25 నుండి) సామీరి ప్రార్థనము మానసబోధ (1-22-29 నుండి) ఆదిత్యైకాదశి (4-16 నుండి హనుమన్నుతి (4-20 నుండి) రామచంద్ర ప్రపత్తి (5-29 నుండి) దేవీ స్తుతి దండకము (5-4 నుండి) స్తోత్రము లన్నియు గ్రంథమును బెంచుటకు దప్ప గ్రంధావశ్యకత దృష్టితో నుంచిన వనిపించవు. మర్ధనకవి కేవలము రెండు పద్యములను సంస్కృతపూర్ణములుగాఁ జెప్ప నీ పై సూత్రము లన్నింటిని కవి సంస్కృతమునఁ జెప్పెను ఆయా స్తోత్రములకడనే వానిని పృథక్కరించుచు ఆ రచనల కార్యకారణములు చెప్పబడుట శయ్యాభంజక విషయము కేవల సంస్కృతరచనఁ గావించుటే కాక

[3] "అజరే హ్యజిరే రేజిరే భేజిరే
మందిరే మందిరే వందిరే సుందరీం
ప్రాహి మాం పాహి మాం భాహి యే దేహకే
దేహి తే గేహళీ సాహితీ మోహనీమ్"

వంటి శబ్దాలంకార శోభితములను చెప్పెను. కావ్యము వేదాంతార్థ భావనతో మొదలుకాగా గావ్యాంతము వేదాంత మహావాక్యములతో జరిగెను.

[4] "తత్త్వమసి" యంచు రాముఁడు తనను బిలువ
"తత్త్వమసి" యంచు హరుఁ డనె దాశరథిని
అవనిజయు 'అహం బ్రహ్మాస్మి యనఁగ'

నని యా మహావాక్యముల నధ్యాత్మభావమే కాక 'హరిహరాద్వైతమును గూడ సాధించెను. కావ్యభాగము పూర్తికాగానే కల కవివిషయమున 'అహమ్' ప్రత్యయ శీర్షికయుందుకు నీ వాక్యముల భావమే భావన చేయఁబడెను. ఈ యంశముకూడ

1. శ్రీ భగవాన్ పంచముఖి 2-22
2. శ్రీ భగవాన్ పంచముఖి 3-47
3. శ్రీ భగవాన్ పంచముఖి 5-57
4. శ్రీ భగవాన్ పంచముఖి 5-71

[1] "స్వప్నమున మున్ను నాకు సాక్షాత్కరించి
తత్త్వమ స్యాది వాక్యసంతతికి నర్థ
మెఱుక చేసిన గురుఁడ నేనే" యటంచు
నాన తిచ్చిన హనుమంతు నభినుతింతు"

నన్న పుష్పగిరి తిమ్మన పద్య మీ భావనముననే రచియించియుండు ననిపించును.

[2] "దార్ఢ్య మ్మగు దయ్యమై యలలతో నింగిన్ మిటారించు నా
యాదోనాథునిపైని సేతు వెటు లాహా! యిప్డు నిర్మింతు"

నని విచారించు రామునితో హనుమంతుఁడు 'నేనున్నా నని గుర్తు లేద టవెతం శ్రీరామచంద్రదప్రిభూ' అని వాలముచే సేతువు నిర్మించి సేననంతను ప్రయాణము గావించెను. కాని మిగిలిన గ్రంథములందువలెఁగాక

[3] "నిష్ప్రతిద్వంద్వ యుద్ధ సంతీర్ణహృదయుఁ
డగుచు శ్రీ పుష్పకమ్ముపై నధివసించె
సితతో రామభద్రుఁడు సేనఁ గూడి
మాతలం గూడి చేరె సాకేతపురము"

అని పుష్పకముపై తిరుగుప్రయాణమును చెప్పెను. పుష్పకమును వెడలునప్పుడెందుకు వినియోగించుకొనలేదో యర్థము కాదు.

# సేతుబంధ మహాకావ్యము

ప్రాకృతభాషయందు ప్రవరసేనుఁడు రచించిన యీ కావ్యమును అవధాని చంద్రశేఖరశర్మ ఆంధ్రీకరించెను. ఇది పదునైదు ఉచ్ఛ్వాసముల కావ్యము. యథానువాదముగా శ్లోకసంఖ్యకూడ నిచ్చుచుఁ గవి తన పద్యముల నిచ్చెను. ఇందలి ప్రథమోచ్ఛ్వాసముననే హనుమంతుఁడు శ్రీరామునకు శిరోరత్న మిడిన గాథ కలదు. మరల పదునాల్గవ యుచ్ఛ్వాసమున హనుమంతుఁడు ధూమ్రాక్షుని వధించిన ఘట్టము అయిదు పద్యములలోను, అకంపనుని వధించుట నొక్కపద్యమునఁ జెప్పెను. పదునైదవ యుచ్ఛ్వాసమున సంజీవిపర్వతముఁ దెచ్చి లక్ష్మణుని మూర్ఛదేర్చుట కలదు. ఇంతమాత్రపు హనుమత్కథ యీకావ్యమునఁ గన్పట్టును.

1. సమీర పీఠిక - 7
2. శ్రీ భగవాన్ పంచముఖి 2-13, 15
3. శ్రీ భగవాన్ పంచముఖి 5-77

# సుగ్రీవ పట్టాభిషేకము

ఐదాశ్వాసముల ఈ కావ్యమునకు కర్త అబ్బరాజు హనుమంతరావు. ఈయన గుంటూరుజిల్లా అయిలవరం పాఠశాల ప్రధానోపాధ్యాయులు. ఈ రచయిత గ్రంథాదిని హనుమంతునిగూర్చి

[1] "రాముండిచ్చిన యుంగరమ్ముఁ గొని సంద్రమ్ముట్టె లంఘించి సీ
తా ముగ్ధాంగనఁ గాంచి దాని నిడి దైత్యస్వామి ప్రోల నృసిం
హ్ధాముండై చరియించి భూతనయ వార్తన్ రాములోఁ బల్కి శ్రీ
రాము న్మోదపయోధిఁ దేల్చు హనుమన్ ప్రార్థింతు నశ్రాంతమున్"

అని ప్రార్థించెను. ఇందుఁ దృతీయాశ్వాసమున హనుమత్ప్రవేశము కలదు.

సుగ్రీవుని తండ్రియగు ఋక్షవిరజుని సభకు వాయువు బాలరుండగు హనుమంతుని గొనివచ్చెను. అట వాయువుచే హనుమజ్జనన వృత్తాంతము [2] 'తన ధైర్య కనకాద్రి దానవారుల కెల్ల కోర్కిమై పెట్టని కోట కాగ' నని మొదలుగఁ జెప్పఁబడెను. అంజన తపమొనర్చి వాయువరమునఁ బడసిన బాలాంజనేయుని [3] 'మెఱుపుతీవలకాంతి మించు సెమ్మోలు వాని బొందమ్మి నగు ముద్దుమోమువాని' నని కవి రమ్యముగ వర్ణించెను. బాలభానునిఁబట్టబోయి వజ్రహతుఁడై వరమందుట, సూర్యునికడ విద్యాభ్యాసము మున్నగు వృత్తాంతములు ఏబదిరెండు పద్యములలోఁ జెప్పఁబడెను. వాయువు హనుమంతుని ఋక్షవిరజునికడ దించి వెడలిపోయెను.

చతుర్థాశ్వాసమున సుగ్రీవాజ్ఞపై భిక్షుకవేషమున రామలక్ష్మణులకడ కేగి వారిని గొనివచ్చుట, పంచమాశ్వాసమున తారకు హితోపదేశమొనర్చుట మున్నగు విషయములు కలవు. ఇట్లు సుగ్రీవ పట్టాభిషిక పర్యంత హనుమత్కథ రామాయణోక్త రీతిలో నిందుఁ గలదు. అష్టాదశ వర్ణనాది ప్రబంధలక్షణములతో విరచితమైన యీ కావ్యమున నాశ్వాసాంతాదుల హనుమత్కవి సహజము లగు బంధకవిత్వ గర్భకవిత్వాదులు కలవు.

---

1 సుగ్రీవ పట్టాభిషేకము 1-3
2. సుగ్రీవ పట్టాభిషేకము 3-12
3. సుగ్రీవ పట్టాభిషేకము 3-18

# రాఘవ పావనీయము

కావూరి పూర్ణచంద్రరావు కృత మగు నొక పద్యకావ్య మిది. ఇందు 1. అవతారము 2. కళ్యాణము 3. వనవాసము 4. సందర్శనము 5. విజయము నను విభాగములతో 315 పద్యములలో రచింపఁబడిన రామాయణకథ కలదు. అవతారమునందు [1] 'హనుమత్ప్రార్థన' గావించెను.

[2] ''ఎచట రాముఁడుండు తా నచట నుండు
తాను లేకున్న రాఘవుఁడైన లేఁడు
వారి బంధంబు నిత్యానుబంధ మరయ
నదియ రాఘవ పావనీయం బటంద్రు''

అను చివఱిపద్యమున గ్రంథనామము నిరూపించెను. సందర్శన మను శీర్షిక హనుమజ్జన్మవృత్తాంతముతో నారంభ మయ్యెను. శివకేశవాభేదము నిరూపించుచు శివుఁడే తాను కేశవరూపుఁ డగు రాముని సహాయార్థము హనుమంతునిగా నవతరించితినని హనుమద్వృత్తాంతమును పార్వతికిఁ జెప్పెను. ఇట్టి ప్రాధాన్యతతోపాటు హనుమంతుఁడు హృదయము చీల్చి సీతారాములఁ జూపుటతోఁ బూర్తిచేసెను. హనుమద్రాములు అవిభాజ్యు లనుటకే యీ కావ్యమునకు రాఘవపావనీయ మని నామమిడెను.

## శ్రీ హనుమచ్చరిత్ర

ఈ కావ్యమును 'అభినవ జయదేవ' చల్లా పిచ్చయ్యశాస్త్రి రచించెను. కావ్యాదిని హనుమత్ప్రార్థనగ సుందరకాండ మూర్తి గుణ సుందర మందిర వర్తి'' యని యుత్పలమాల నొక్కదానిని చెప్పి కావ్యమంతయు నొకేయొక్క సీసమాలికలో నడిపించెను.

''మును విశ్వకర్మ తా నమఁగుఁగూతునిఁ జాయ
యను కన్నె నొసఁగె నహస్కరునకు''

నని హనుమచ్చరిత్రను సువర్చలోత్పత్తితో నారంభించి ముక్కోటివేల్పుల యంశములను నారాయణుఁడు ఈశ్వరునిలో చేర్చుట, సహజ వజ్రకవచ కుండలములతో నాంజనేయస్వామి జననము, హనుమంతుఁడు సూర్యుని పండుగా భక్షించుట, ఇంద్రాదులు పరీక్షించి మహిమకు మెచ్చి వరము

1 రాఘవ పావనీయము – 9
2 రాఘవపావనీయము – 315

లిచ్చుట, సూర్యసన్నిధి విద్యాభ్యాసము, సూర్యుఁడు సువర్చల నిచ్చి వివాహము చేయుట, శ్రీ పంచముఖ వీరాంజనేయోత్పత్తి, శ్రీరామ విహారము, హనుమంతుఁడు శ్రీరామునకు ఉత్సాహమొసగుట, గర్గుఁడు సీతాదేవికి పంచముఖహనుమంతబోధ యనువిషయములతోఁగావ్యమునునడిపి

"పంచముఖములతోడ రాత్రించరేశుఁ
డైన శతకంఠరావణు నణఁచి జగతి
జానకీరాములకు ప్రహర్షంబు గూర్చె
గేయ మెల్లెడ వీరాంజనేయ మహిమ"

అను గీతపద్యముతో నా చిన్నకావ్యమును పూర్తిచేసెను. ప్రసన్నశైలి యుక్తితో రచన యొప్పెను.

ప్రసన్నాంజనేయము : విద్వాన్ తిరువాయి రాఘవసూరి విరచిత మగు నీ కావ్యమున సుందరకాండ, యుద్ధకాండ గాథలు గలవు. ఆ రెండు కాండల హనుమత్కథతేటగీతులు, కందపద్యములతో మూఁడు ఉల్లాసములందు రచింపఁబడెను.

హనుమద్విజయము : దీనికే సంజీవరాయ విజయ మని నామాంతరము కర్త జనమంచి శేషాద్రిశర్మ. రామాయణ మందలి లక్ష్మణమూర్ఛ పర్యంత కథ సంగ్రహముగఁ జెప్పఁబడెను. అనంతర హనుమత్కథ విపులముగ విరచిత మయ్యెను.

శ్రీ సువర్చలా పరిణయము : పూడిపెద్ది లింగమూర్తిచే రచింపఁబడిన ఏడాశ్వాసముల ప్రబంధమున హనుమంతునకు సువర్చలకు జరిగిన వివాహము, దానికి పూర్వరంగ మగు చరిత్రయు వర్ణింపఁబడెను. ఉపోద్ఘాతమునసే యిది యపూర్వగ్రంథముగఁ జెప్పఁబడెను.

శ్రీ హనుమద్విలాసము : డా॥ మొక్కపాటి శ్రీరామశాస్త్రి కృత మైన ఈ పద్యకావ్యము తాత్పర్యసహితముగా 1987 జూన్ నుండి 1988 నవంబరు వఱకు హనుమత్సేవ మాసపత్రికయందు ధారావాహికముగా వెలువరింపఁబడెను. అవతారకాండయందు

'శ్రీమంతున్ మతిమంతు భాస్కర శుభాశీర్వాద లబ్ధ ప్రవి
ద్యామాత్రున్ గబళీకృతార్క హర వీర్యాత్తాంజనీపుత్రు సీ
తా మాతా ధవ భక్త భక్తసులభున్ దైతేయ సంమర్దకున్
రామాంకాంకిత వక్షు నే ననిశ మారాధించెదన్ మారుతిన్'

అని యీరుపద్యములతో హనుమత్ప్రార్థన గావింపఁబడెను. ఇందు అంజ నాకేసరుల వృత్తాంతము, శివపార్వతీ వనవిహారము వంటివి కలవు. గర్భ స్థుఁ డగు శిశువుయొక్క రామనామోచ్చాటము విశేషముగవర్ణింపఁబడెను. అట్లవతరించిన ఆంజనేయుని'

''అమిత బలంబు పాదముల నంకుశ భద్ర సరోజ రేఖలున్
సుమ సుకుమార దేహము విశుభ్ర విధాతృ సుశోభి తాననం
బమలిన ధీర్ఘ వాల మణిహార సకుండల పీతవస్త్రముల్
రమణ ధరించియే భువి విరాజిలెఁ బింగళనేత్ర యుక్తుఁడై ''

అని కవి మనోజ్ఞముగ వర్ణించెను.

ఇట్లు ఆంధ్ర కావ్యజాలమునందు ననేకరీతుల హనుమంతుఁడు సద్గుణ వంతునిగను, రామభక్తి పూర్ణుని గను సర్వశక్తి సమన్వితునిగను వర్ణితుఁడయ్యెను.



# లఘుకృతులు - హనుమంతుడు

కావ్యలక్షణముల విపుల విరచితములు కాక లఘువుగ విరచితము లగునవి లఘుకృతులు. అర్థమునుబట్టి దండక శతకాదులును ఇందుఁ జేరును కాని వానికంటె భిన్నములగు ముక్తకాదులే ప్రస్తుతము స్వీకరింపబడుచున్నవి. అప్పకవి వీని చాటుప్రబంధములుగాఁ బేర్కొనెను. వీని లక్షణముఁ జెప్పుచు

[1] "ఒనరు ముక్తక మన నొక్క పద్యము ద్వికం
బగు రెండు త్రికము మూఁడైనఁ బంచ
రత్నంబు లైదు వారణమాల యెనిమిది
నవరత్నములు పద్యనవక మైన"

అని ముక్తకము-1; ద్వికము-2, త్రికము-3, పంచరత్నములు-5; వారణమాల-8; నవరత్నములు-9; భాస్కరమాలిక-12; శశికళ-16, నక్షత్రపంక్తి-27, త్రింశత్తు-30, పంచాశత్తు-50, శతకము-100; అష్టసమధిక శతకము-108; సప్తశతి-700; పద్యములతో నేర్పడు నని శతకమును కూడ నీ కోవఁ జేర్చెను. [2] 'అనంతుఁడు వీనితో ద్వాత్రింశదాదులఁ జేర్చి చెప్పెను

రచనమునకును పఠనమునకును తేలికగు మార్గ మిది. లాఘవముఖ్యమగు నీ ప్రక్రియ సమ్మానము లెల్లెడ మిక్కిలి యుపకరింపబడుచున్నది. స్తుతినిమిత్తము లఘుకృతులను వినియోగించు వాడుకయున్న లఘుకృతము లగు స్తుతులును ఈ శీర్షికయందు స్వీకరింపఁబడుచున్నవి. ఆంధ్రవాఙ్మయమునఁ గానవచ్చు హనుమత్పరము లగు లఘుకృతు లిట నీయబడుచున్నవి.

1. ఆంజనేయ స్తోత్రాష్టకము - సీరము సుభద్రాంబ
2. ఆంజనేయ నవరత్నమాల-తంజావూరు సరస్వతీ పుస్తకభండారము
3 ఆంజనేయ స్తోత్రాష్టాదశకము - సీరము సుభద్రాంబ
4. ఆంజనేయ తారావళి - కంతేటి వీరయ్య
5. ఆంజనేయ తారావళి - దావచర్ల వీరరాఘవయ్య

---

1. అప్పకవీయము 1-134
2. ఛందోదర్పణము 3-62

6. ఆంజనేయ తారావళి - ముక్కామల జగన్నాథరావు
7. ఆంజనేయ నక్షత్రమాల - ఇంకొల్లు ఆంజనేయశర్మ - 1917
8. ఆంజనేయ ప్రసన్న రగడలు - జి. పాపయ్య 1919
9. ఆంజనేయ స్తబకము - కోపల్లి వెంకటరత్నము
10. ఆంజనేయ స్తవము - యస్. వెంకట సుబ్బారావు
11. గీతికావళి - తుర్లపాటి బాలగురునాథ్
12. పంచవింశతి పద్యమాలా - 'ధర్మపురవాస గౌతమీతట నివాస' కేసరి పుత్ర! హనుమంత! అని దర్మపురి భక్తాంజనేయస్వామి దేవాలయం వారు ప్రకటించినది.
13. పంచముఖ వీరహనుమ త్పంచవింశతి - కంభంమెట్టు శ్రీజనా చలపతిరావు
14. మారుతి స్తవరాజము శతావధానులురామకృష్ణసీతారామ సోదరకవులు
15. యోగాంజనేయ స్తవ తారావళి - కొల్లము సీతారామకవి
16. రామదూత స్తుతిమాల - శ్రీవాణీ గ్రంథమాల
17. వీరాంజనేయ స్తోత్రము - యం. వెంకటసుబ్బయ్య - 1919
18. వీరహనుమ త్తారావళి - వినుకొండ వెంకటనరసింహాచారి - 1902
19 శ్రీ పొద్దుటూరు వీరాంజనేయ నక్షత్రమాల - వేదాంతం భాస్కరాచార్యులు
20. శ్రీ ఆంజనేయ స్తోత్రము - విరాల రాజమౌళి శాస్త్రి
21. శ్రీ హనుమత్కల్యాణ స్తవము - 'అష్టావధాని' పల్లావంతుల వేంకటరామశర్మ
22. శ్రీ వీరాంజనేయ మంగళ సుప్రభాతము - జి ఏ. రామచంద్రశాస్త్రి
23 శ్రీ మారుతి తారావళి - బూరుగల గోపాలకృష్ణమూర్తి
24. శ్రీ హనుమదాది స్తోత్ర నవకమ్ - శ్రీశ్రీ నృసింహానందభారతీ మహాస్వామి
25. శ్రీమ దాంజనేయ స్తోత్ర నక్షత్రమాల -సూరేపల్లి రాధాకృష్ణశాస్త్రి
26. శ్రీ హనుమ గీతికా తారావళి - జొపట్ల వెంకట పార్థసారథి
27. శ్రీమ ద్వీరాంజనేయ నక్షత్రమాల - వారణాసి శివరామశాస్త్రి

28. శ్రీ యాంజనేయ తారావళి - కడెము వేంకట సుబ్బారావు
29. సీతానగ రాంజనేయ నక్షత్రమాల - జి. సూర్యనారాయణ
30. సీతానగ రాంజనేయ స్తోత్రము - పట్నాల సుబ్బారావు - 1910
31. హనుమ దాదిత్యమాల - పెల్లేరు శ్రీనివాస మహేశ్వర శర్మ
32. హనుమ ద్ద్వాదశమంజరి - కోటి వెలుగంటి దాసు - 1912
33. హనుమ త్పంచవింశతి - తిన్ననూరి గోపాలకవి - 1879
34 హనుమ త్పంచవింశతి - కృష్ణదాసు - 1883
35. హనుమ త్పంచవింశతి - ఎ. సూర్యనారాయణ - 1911
36. హనుమ త్తారావళి - జగన్నాయకులు
37. హనుమ న్నక్షత్రమాల - వేంకట పార్వతీశ్వరకవులు
38. హనుమంత దండకము - వీరమల్లు చంద్రశేఖరాచారి
39. హనుమ త్పంచచామరములు - చింతపల్లి అంజనేయులు
40. హనుమ ద్రామ దండకము - హనుమద్రాయకవి
41. హనుమ త్స్తవరాజము - పి. సూర్యనారాయణరావు - 1920
42. హనుమ త్పంచవింశతి - నామ వేంకటసుబ్బయ్య సెట్టి
43. హనుమ న్నుతి - డా॥ ఎ. జి. కృష్ణమూర్తి

ఇట్టి లఘుకృతు లెన్నియో లెక్కకు మిక్కిలిగా నాంధ్రమున విరచితములై యున్నవి.



# చాటువులు

చాటు వనఁగా ప్రియమైన వాక్య మని నిఘంటువు. అనగా స్తుతి వాక్య మనుట. కావ్యమున నంతర్భాగముగఁ జేయునది కాక సభాదిక మునను ప్రత్యేక సంఘటనములందును జేయు స్తుత్యాదిక మీ చాటువు లుగాఁ జెప్పవచ్చును. మిథ్యాప్రియవాక్యము, వట్టి ఇచ్చకము కూడ దీని కర్థములుగా సూర్యరాయాంధ్ర నిఘంటువు చెప్పుచున్నది. కావున నవి స్తుతిపరముగనే కాక కాలక్షేపమునకుఁ జెప్పునవి, కాకతాళీయముగఁ జెప్పఁబడు చాటువులుకూడ యీ ప్రక్రియకుఁ జెందును. ఇట్టివియు నని బద్ధ కావ్యములు. స్తుతి నిందా పరములై చమత్కార జనితములై విస్మ రింపరాని యీ సాహిత్యమును చాటువు లను పేరఁ బ్రత్యేకించి విజ్ఞు లొక ప్రక్రియగా నేర్పరచుట తగియున్నది. ఇవి పృథగ్యత్నకృతములు కాక ఝటితిస్ఫూర్తిఁ జెప్పునవి యగుట నివి లఘుకృతుల కంటెను ప్రత్యేక స్థానము నందుచున్నవి. నిందాస్తుతులు వ్యవహారముననే కాక కావ్యాదిని కూడ చేయఁబడును. కావ్యార్థ సూచనామాత్రవు సంబంధము కావ్యేతి వృత్తముతో వాని కున్నను నవి కావ్యముకంటెఁ బ్రత్యేకములు కావున వానినికూడ ఈ చాటువులందుఁ జెప్పుట జరిగినది. కాకున్న హనుమత్ప్ర ముఖ స్తుతులు కావ్యాదిని మాత్రము చెప్పఁబడినవి మఱి యే ప్రక్రి యను చేరఁజాలవు.

అట్లే కావ్యములం దెచ్చ టున్నను లక్షణగ్రంథములఁ బ్రత్యేకించి స్వీకరింపఁబడిన యుదాహృతులు నిం దీయఁబడును. ముందుగ కావ్యాది[1] స్తుతులీయఁ బడుచున్నవి.

1. రామాభ్యుదయము - అయ్యల రాజురామభద్రుఁడు

"లంకారిన్ జలరాశి లంఘన జవాలంకార జంఘున్ నిరా
తంక న్నిశ్చలు నిర్భయు న్నిపుణు సీతాశోక లుంటాక ని
శ్శంక ప్రాభవు రామచంద్ర చరణాబ్జాత ద్వయీ సర్వదా
కైంకర్యప్రియు నాంజనేయు నగదంకారప్రభుం గొల్చెదన్"

అని పీఠికయందుఁ బ్రార్థించెను.

---

1. ప్రతిగ్రంథాదినిఁ గలవియ కావునఁ బ్రత్యేకముగ సంఖ్య గూర్పఁ బడలేదు.

2. భాస్కర రామాయణమున

"గోష్పదీకృత వారాశి గుణసముద్రు
మశక సాద్ధీకృతాఖిల మానవాదు
రఘువర చరిత్ర స న్మాల్య రత్నభూతు
మారుతాత్మజు భజియింతు మహితభక్తి"

అని యిట్లు "దశరథనందన వల్మీకభవ పవననందనుల నుతియించి" యని కావ్యాదిని నా మువ్వురిని స్తుతించుటయు రామాయణమునకుఁ బరిపూర్ణ తగ భావించినట్లు తోచును. పై పద్యము ప్రశస్త మగు

'గోష్పదీకృత వారాశిం - మశకీకృత రాక్షసం
రామాయణ మహామాలా - రత్నం వందే ఽనిలాత్మజమ్'

అను శ్లోకమునకు ననువాదరూపము.

3. వాల్మీకి చరిత్రమున - రఘునాథనాయకుఁడు

'ఎక్కడ రామకీర్తన మొకించుకయే వినసైన వేడ్క దా
నక్కడ నిల్చి రంజిలి కృతాంజలియై ప్రమదాశ్రుపూరముల్
పిక్కటిలంగ మైఁబులకబృందము వాదుకొనంగఁ బాడుచున్
జొక్కుచు నాడు నయ్యనిలసూను ప్రభానత భాను గొల్చెనన్'

అను నిష్టదేవతాస్తుతియుఁ బ్రశస్త మగు

'యత్ర యత్ర రఘునాథ కీర్తనం
తత్ర తత్ర కృత మస్తకాంజలిమ్
బాష్పవారి పరిపూర్ణ లోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్'

అను హనుమత్ప్రార్థనమున కనువాదము.

4. అప్పకవీయ లక్ష్మణ గ్రంథాదిని అప్పకవి

పాయక కొల్తు రామ జనపాలుఁడు జానకిఁ జూడ్ఁబంపుచో
దోయధి గోష్పదంబు క్రియఁ దాఁటఁ జిహాలున దాఁటి లంక శ
ఖ్యాయుత లీలఁ బోయి దివి జారుల దోమలఁబోలెఁ బట్టి బా
హాయుత శక్తిఁ గొట్టి సతి నారసి త ద్విభుఁ గన్న మారుతిన్'

అని స్తుతించెను. ఇదియు భాస్కరుని వలె
'గోష్పదీకృత వారాశిం' శ్లోకమున కనువాద రూపమే. వీరు స్వతం

త్రముగ నిట్టి వెన్ని యేని వ్రాయగల్గియు నిట్లనువదించుట యా శ్లోకములు హనుమత్పరముగ నెంత ప్రధానములో స్పష్టపఱచును.

5 అలంకార చంద్రికా కర్త-నేలనూతల శివరామయ్య తన యిష్టదైవ ప్రార్థనమున

'హనుమంతు నరికృతాంతున్
ఘనతర కోవూరు నగర ఘటిత నిశాంతున్
మనన దమ శమన వంతున్
వినుతింతుం జేయు నన్ను విద్యావంతున్

అని యత్యంత్యాను ప్రాసతోఁ గొనియాడెను. ఈతఁడు తన తండ్రిఁదూర్చి యాంజనేయుఁ బ్రతిష్ఠించిన వానినిగాఁ జెప్పుకొనెను.

6. శ్రీరామ కథామృతము - తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి
అంజన గన్న నోముఫల మర్కఫలీ కరణోద్య తుండు మృ
త్యుంజయ వీర్యుఁ డస్త్ర కులి శోద్ధతి దేవవరాంచితుండు ధీ
రంజిత భానుసూనుఁ డిత రామపదుం డవనీసుతా విప
ద్భంజనుఁ డస్రపాంతకుఁడు పావని పావనమూర్తి ప్రోవుతన్'
అని యీ స్తుతియందే హనుమత్కథ నడిపెను.

7. శ్రీమ దాంధ్ర వాల్మీకి రామాయణమున - వాసుదాసు
'శ్రీ రఘురామ పాద సరసీరుహ యుగ్మము నాత్మ నిల్పి, కూ
పారము దాటి విఘ్నములఁ బాఱఁగ, దోలుచు, లంకఁజొచ్చి సీ
తా రమణీ మణిం గని ముదంబునుఁ గూర్చి రఘూత్త మాంఘ్రిసే
వారతి మీఱు పావని శివంకరుఁడై వెలయించు మత్కృతిన్'
అని యిందు సుందరకాండగాథను కొనియాడెను.

8. శ్రీమదాంధ్రనిర్వచ నాధ్యాత్మరామాయణమున-ఉప్పలనరసింహశర్మ
'లీలన్ వార్ధి నల్ప పల్వలముఁ బోలెన్ దాఁటి తేజంబుమైఁ
గాలన్ గ్రూరత రాక్షరాక్షస వధన్ గావించి, రక్షో విభూ
ద్యేలాహంకృతిఁ దూల్చి, రామ పదభక్తిన్ మీఱు సామీరిఁ 'దూ
పాళీ తూల సమీరునిన్ దలఁచెదన్ స్వాంతంబునం దెప్పుడున్'
అని తానును సుందరచరితనే కొనియాడెను.

9 శ్రీ సీతారామాంజనేయ సంవాదము - పరశురామపంతులలింగమూర్తి

'తనరం గాయముచేత రామచరణ ద్వంద్వైక దాస్యంబులె
చ్చిన భక్తిం దగు వాక్కుచే ననిశమున్ శ్రీరామ నామ ప్రకీ
ర్తనముం జిత్తముచేత రామ పరతత్త్వ ధ్యానముం జేయు శ్రీ
హనుమంతున్ మను నాశ్రయింతు మదభీష్టార్థంబు సిద్ధింపగన్'

10 పండిత పరిష్కృత రామదాస చరిత్రయందు

సురటి రాగము - ఆది తాళము

'ఆంజనేయుని గొలుడు । శ్రీమదాంజనేయుని గొలుడు ।। లంకలో సీతా
దేవి శంక మాన్పినట్టి సంజీవరాయని । లంకిణి బరిమార్చి రావణా
సురుని । లంక గాల్చిన యట్టి లాంగూలబలుని ।।ఆంజనేయు।।

1. నిండగు భాను మండలమ్ము ను।
చెండని పట్టిన పరమసాహసుని
మెండగు రావణు మూలబలంబుల
చెండిచేసి నట్టి భీమ పరాక్రముని ।।ఆంజనేయుని।।

2. దిట్టయై యక్షయకుమారుని
రెట్టలు పట్టి చీల్చిన బలుని
మట్టుబెట్టిన రావణాశలు
మట్టిచేసిన యాంజనీసుతుని ।।ఆంజనేయుని।।

ఇందు భానుమండలము పండుగఁగాక చెండుగఁ గన్పట్టినట్లు చెప్పుట విశేషము. అట్లే రావణసుతుఁడు అక్షయకుమారునిగాఁ జెప్పఁబడెను. అక్షుఁడు గానే ఆతని నామము ప్రసిద్ధము. ఇట్లే 'వాసుదాసు కీర్తనలు' గ్రంథమున వాసుదాసు గురుప్రార్థన కాగానే "దయ గనుమా మారుతి! దయా శాంతి"! అని హనుమత్పరముగఁ గీర్తనఁ జెప్పెను.

11. మహారాష్ట్ర ప్రసిద్ధ ఆనందరామాయణాంధ్రీకర్త - శ్రీరామశాస్త్రి

''తగు పసుయాన సీతకు రాముముద్రిక
నందించి మృతి గాక నాపె నెవఁడు
అవనిజవార్తఁ దా నందించి శ్రీరామ
చంద్రుని బ్రతికింపఁ జాలె నెవఁడు
సంజీవినిం దెచ్చి చావఁడ లక్ష్మణు

మూర్ఛఁ దెల్పించిన ముఖ్యుఁ డెవఁడు
వనవాసపుం దుది మునిజేర్ప రాముని
భరతుఁ బ్రోచిన ధైర్యనిరతుఁ డెవఁడు
సరస సంగీతవిద్యా ప్రశంస్యుఁ డెవఁడు
విమల వ్యాకరణ నవక వేత్త యెవఁడు
వేద వేదాంత విద్యా ప్రవీణు నట్టి
అతుల ధీమంతు హనుమంతు నాశ్రయింతు'

నని సీతా రామ లక్ష్మణులకుఁ బ్రాణ దాతగనే చెప్పెను. ప్రాణనందను నట్లు నుతించుట సముచితము.

12 తమిళప్రసిద్ధకంబరామాయణమనువదించిన పూతలపట్టు శ్రీరాములురెడ్డి

'ధరణిజాత హృదానంద దాత దైత్య
వంశ నూతన శమనుండు భక్తవరుఁడు
సౌంద్ర సుశ్లోకయుతుఁడు జితేంద్రియుండు
పావని యొసంగుఁగావుతఁ బట్టుదలను'

అని గ్రంథ రచనోద్యమమునఁ బట్టుదల నర్థించెను.

13 బాలాంజనేయమున - అచ్యుతుని వేంకటాచలపతిరావు

'సామర్థ్యం బెటు లున్నఁ దప్పటడుగుల్ సాఁగించుచున్ బిడ్డ పె
ప్పె మెమ్మెయని తొక్కుకూతలను జల్పింపన్ ముదం బెచ్చియెం
తో ముద్దుల్ గొను తండ్రిఁబోలి నెరసుల్ ద్రోయించి మీ సత్కధన్
శ్రీ మత్పంచముఖాంజనేయ! వరి పోషింపన్ దలం పూనిన
ట్లే మీ యచ్యుత వేంకటాచలపతిన్ వీక్షించి రక్షింపవే!

14 రాఘవ పావనీయమున — కావూరి పూర్ణ చంద్రరావు

'వరదుఁడు రామచంద్ర పద పంకజ గంధ హృదంతరుండు త
త్స్మర హరసన్నిభుండు హనుమంతుఁడు వాయుతనూభవుండు వా
నర వృత నాథకుం డసురనాధ చమూ ప్రసూ దావహర్త సా
గర పరిలంఘనాభుఁ డిడుఁగావుత నాకు కృపావలంబముల్'

15 శ్రీ హనుమచ్చరిత్ర - చల్లా పిచ్చయ్యశాస్త్రి

''సుందరకాండ మూర్తి గుణ సుందర మందిరవర్తి జానకీ
సుందరి కీర్తి భూభువన సుందర పావన మూర్తి నన్నుదా

సుందర బాల్యమందు సరసుం దరహాస మెసర్పఁ జేయు వా
క్పుందర సత్కవిత్వముఖసుందరుఁ జేసిన వేల్పుఁ గొల్చెదన్''

16. సుగ్రీవ పట్టాభిషేకము - అబ్బరాజు హనుమంతరావు
'రాముం డిచ్చిన యుంగరంబుఁగొని సంద్ర ప్పట్టి లంఘించి సీ
తా ముద్దాంగనఁ గాంచి దాని నిడి దైత్యస్వామి ప్రోల న్మహో
ద్దామండై చరియించి భూతనయ వార్తన్ రాముతోఁ బల్కి శ్రీ
రాము న్మోదపయోధిఁ దేల్చు హనుమన్ బ్రార్థింతు నశ్రాంతమున్'

17. హరికులామోదము - చల్లా సూర్యకామేశ్వరరావు
శ్రీరామ చరణయుగళీ
నీరజ మధుకరున కాంజనేయునకు మహా
వీరునకుఁ గ్రూర రాక్షస
మారకునకు జోత లిడుదు మానసవీథిన్'

18. లంకా దహనము - మతుకుమల్లి నరసింహ శాస్త్రి
శ్రీ జనకేశ పుత్రి గని చిత్తము రంజిలఁ బ్రీతి నామె కా
రాజిత కీర్తిశాలి రఘురాముని సేమము దెల్పి లంక ని
స్తేజముగా దహించి వడి సింధువు దాటిన వాయుసూతుఁడ
వ్యాజ కృపాకటాక్షమున నారయు నీ కృతి నెల్ల వేళలన్'

ఇట్టిచాటువులు ప్రార్థనలు,హనుమత్పరములు బహుళముగా గానవచ్చును.



# ఉదాహరణకావ్యములు—హనుమోదాహరణము

లఘుకృతులలో నుదాహరణకావ్యముకూడ చేరును. ఆయా విభక్తులతో సంబోధనతో కూడి యెనిమిది పద్యములు, రగడభేదములగు కళికలు నుత్కళికలతోఁ గూడ చెప్పునది యుదాహరణకావ్యము. విభక్తి తుదకు వచ్చునట్లు వృత్తము నొకదానిని చెప్పి పిదప నెనిమిది పాదముల కళికయు, నం దర్ధమగు నుత్కళికయు రచింపవలెను ఇట్లొక్క విభక్తికి మూఁడు పద్యముల చొప్పున నెనిమిది విభక్తులకు నిరువదినాల్గు పద్యములను చెప్పి అనంతర మొక సార్వవిభక్తికవృత్తమును, కృతికర్తయుఁ గృతిపతియొక్కయు పేర్లు కల పద్యముతో నిరువదియారు పద్యముల నీ యుదాహరణమును నిబంధింపవలెను. స్తుతిపరముగ నుండు నీ లఘుకృతి మధురకవితా భేదములఁ జేరును.

ఈ యుదాహరణలు విభక్తిప్రత్యయముల పరిణామాదులఁ దెల్పునవై భాషాశాస్త్రమునకును నుపకరించును. పరిమిత వ్యాప్తమైన యుదాహరణ సాహిత్యమునను హనుమత్సంబంధ మగు రచన కానవగును. క్రీ. శ. 1540 నాటి చిత్రకవి పెద్దన హనుమోదాహరణమును రచించెను. శుక్లయజుశ్శాఖీయుఁ డగు నీతని యింటిపేరు పాశ్యంచాల చిత్రకవితా ప్రావీణ్యతఁ 'జిత్రకవి' బిరుదునామ మంది యనంతర వంశమునకు దానినే గృహనామముగా నందించినవాఁ డైనాఁడు. [1] 'నుత వెలలూరి పురీ హనుమంతునకున్' అని, 'వెల్లలూరి హనుమన్మూర్తి' యనియు నుతించిన యాతఁడు కడపమండ లాంతర్గత వెలలూరు వాసుఁడై అచట వెంచేసియున్న హనుమంతు నుపాసించి యుండవలెను ఈతఁడు తన కావ్యముల నెల్ల హనుమదంకితము గావించిన ధన్యుఁడు.

కవితా మార్గమున ముందుగ నిష్టదైవ తాంకితముగ నొండు శతకముఁ జెప్పి యనంతరమ మహాగ్రంథముల రచనకుఁ బూనుకొను సంప్రదాయము కలదు. పెద్దనకూడ ఈ మార్గమున నడచినట్లు కానవగును.

[2] ''ము న్నొక శతకము మాకుం
జిన్నపుడె సమర్పణంబుఁ జేసితిఁ వింకనున్

1. లక్షణసార సంగ్రహము 1-17
2. లక్షణసార సంగ్రహము 1-9

సన్నుత లక్షణకృతి య
స్మన్నామాంకితము సేయుమా యిపు డనినన్''

అని లక్షణసారసంగ్రహమునఁ జెప్పుటఁబట్టి పై విషయమేకాక యాతఁడు బాలకవిగా కూడ గణన కెక్కినవాఁ డని తెలియును. శతకము హనుమ దంకితము. లక్షణగ్రంథము హనుమ దంకితము. కావున నితఁ డనన్య భక్తితో హనుమంతు నారాధించి యుండును. హనుమంతునియందలి యాత్మీయత ద్వితీయావిభక్తియందలి

''మానును రోగము ల్వెతలు మానును లేములు మాను మీకు నో
మానవులార! ఊరక భ్రమం గొన నేటికి నన్యదేవతా
ధీనులుగాక యెప్పుడు నతిస్థిరభక్తి దలిర్పఁ గొల్వుఁడీ
మౌనినుత ప్రసిద్ధ మతిమంతుని మా హనుమంతునిన్ మదిన్''

అని మా హనుమంతుఁ డనుచు నాత్మీయతఁ బ్రదర్శించుకొనినాఁడు. 'శ్రీ హనుమ న్మహాకపి వరేణ్యుఁ' డనుచుఁ దన యుదాహరణ ప్రబంధము రచించినాఁడు.

హనుమత్కవులం దెల్లెడఁ జిత్రకవిత కన్పించుట యొక విశేషము. 'శ్రీ హనుమత్ప్రసాద లబ్ధ కవితా సార సారస్వతాలంకార" అని గద్య వ్రాసుకొని తనను హనుమత్కవిగాఁ బ్రకటించుకొన్న మూర్తికవి బంధ, చిత్ర కవిత్వాదులు లక్షణగ్రంథమునఁ జూపుటలో దక్షత బ్రదర్శించుకొన గలిగినాఁడు. వసుచరిత్రయందలి చమత్కారములుచెప్పవలసి నపనిలేదు.

హనుమంతుఁడు చిత్రగతుఁడు కావున నాతని యనుగ్రహము కవితారూపమునను చిత్ర విచిత్రముగా నుండుట సహజము కావచ్చును. పెద్దన తన యుదాహరణమున హనుమంతునిలో పగడముల జిగిఁ దెగడు మొగము, ప్రసిద్ధమతి, మందర పర్వత సమత్వము వర్ణించెను. వాల్మీకి మగు రామాయణాంతర్గత గాథ నంతను, అవాల్మీకమైన కాలనేమివధ, రావణునికడఁ దోకఁ జుట్టుకొని కూర్చున్న వృత్తాంతము మున్నగునవి యుఁజెప్పెను.

ఇట్లు ఉదాహరణ వాఙ్మయమున హనుమత్కథ వర్ణింపఁబడెను. ఈ ఉదాహరణము పెద్దనచేఁ దన లక్షణసార సంగ్రహమున కుదాహరణ ముగ నీయఁబడెను. హనుమోదాహరణ నామమునఁ బేర్కొనఁబడు దీనిని హనుమదుదాహరణ మని సాధురూపమున గ్రహింప దగు నని దార స్వామిశర్మ యభిప్రాయము.

# సందేశకావ్యములు — హనుమంతుఁడు

వాఙ్మయమునందు సందేశకావ్యము లన్నియు నొక ప్రత్యేక మగు కోవకు చెందినవిగా వింగడింప బడుచున్నవి. విమర్శింప బడు చున్నవి. ఈ సందేశ కావ్యములకు కారణభూతుఁడు హనుమంతుడు. ఇదే విషయమునుమల్లాది సూర్యనారాయణశాస్త్రి[1] 'సందేశకావ్యములకుఁదొలుత దారిచూపినది వాల్మీకిరామాయణములోని హనుమత్సందేశము' అని స్పష్ట పఱచెను. ఈ హనుమత్సందేశము ననుసరించి నడచిన తొలి కావ్యము కాళిదాసు మేఘసందేశము. ఈ విషయమునే 'సీతాం ప్రతి రామస్య హనుమత్సందేశం మనసి నిధాయ మేఘసందేశం కవిః కృతవా నిత్యాహుః'[2] అని మల్లినాధసూరి తన సంజీవనీ సమాఖ్య వ్యాఖ్య యందుఁ దెల్పెను. కాగా సంస్కృత వాఙ్మయమున డెబ్బదివఱకు సందేశ దూత కావ్యములు వెలసినవి.

ఆంధ్ర వాఙ్మయ మందలి సందేశకావ్యములు నా బాటనే నడచిన వగుటవలన దీనికిని కారణభూతమైనది హనుమత్సందేశ మనుట యుధార్థము. ఆంధ్ర సందేశ కావ్యముల స్వతంత్రములు, ముఖ్యములు నగు 1) ఆంధ్ర మేఘ ప్రతి సందేశము 2) చకోర సందేశము. 3) సమీర సందేశము 4) శశిదూతం 5) కీర సందేశము 6) పవన సందేశము 7) శుక సందేశము 8) గబ్బిలము 9) తెనుఁగు సందేశము 10) మేఘ దూతం 11) వృషభరాజ సందేశము 12) అనిల సందేశము 13) ఇన సందేశము 14) తుమ్మెద సందేశము వంటి వానిపై హనుమత్సందేశ ప్రభావమున్నది. కొంద రీవిషయమును స్పష్టము గావించిన రీతియుఁ గనవ్పట్టును. విశ్వనాథ శశిదూతమున

[3] ''ఒక నిషధేశ్వరేంద్రునకు నొక్క మరాళ మతల్లికం బడిన్
ఒక రఘువంశ దేవునకు నొక్క ప్లవంగమ వీరునిం బడిన్
ఒక గిరివాసి యక్షునకు నొక్క పయోధర సాధువుంబడిన్
సుకములు కల్గె నిన్నుఁ బడి నూ సుఖ మందఁగ నేను కోరెదన్

అని హనుమంతుని ప్రస్తావించగా- కాళిదాస భావమును గ్రహిం

1. సంస్కృత వాఙ్మయ చరిత్ర-ద్వితీయ సంపుటము-పుట 350
2. మేఘ సందేశం. 1-1 వ్యాఖ్య
3. శశిదూతము-62

చిన పుట్టపర్తి నారాయణాచార్యులు మేఘదూతమున
"హనుమంతుఁడొక్కనాఁ డార్ద్ర హృదయుఁడు దూత
నీ వొకఁడ వీ నేఁడు వెనరుగల్గిన దూత"
అని హనుమద్విషయ ప్రస్తావన మొనర్చెను. ప్రత్యేక సందేశ కావ్యములయందే కాక యన్య కావ్యములందును సందేశ - దూత్య వ్యవహారము వచ్చినప్పు డెల్ల హనుమంతుఁడు జ్ఞప్తికివచ్చు నన నిట్టి వానిపై హనుమంతుని ప్రభావము స్పష్టము కాగలదు. శ్రీనాథుఁడు తన శృంగార నైషధమున

1 "అది పరోపకార పరులై చరియించిన యట్టి యాంజనే
యాదులఁ బోల నైతి నిపు డక్కట! దైవత కార్యసిద్ధి వి
చ్ఛేదము నొందె నేమి యని చెప్పుదు నింక నమర్త్య పంక్తికు
న్మాదుల సంఘటింపఁగ సమర్థులె యెందును రాయబారముల్"

అని నలునిచే హనుమంతుని రాయబారమును ప్రశంసింపఁజేసెను. భట్టు రామరాజభూషణుఁడు వసుచరిత్రయందు మంజువాణిద్వారా గిరికాసందేశము వసురాజునకుఁ బంపుట సూచించుచు వన వర్ణనముననే

2 "అనిల కుమారకుండు మరు దధ్వ నిరోధి పలాశమండలీ
ఘన వన రాశిలో పుడమి కానుపు పద్మిని చిక్కి స్రుక్కగా
నినకర ముద్ర చూపి వెలయించి తదంబుజరాగ పాళి గై
కొనుచుఁ బ్రవాళ తేజమునఁ గూరిచెఁ గంటె పలాశ వీధులన్"

అని హనుమత్సందేశ వృత్తాంతమును ప్రస్తావించెను. ఈ పద్యము వసుచరిత్ర యందు గ్రంథగ్రంధి యనఁ దగినది. హనుమత్ప్రసాదలబ్ధ కవిత్వవిశారదుఁ డగుటఁ దన కావ్యమునఁ బ్రస్తావవశమున హనుమంతున కింతటి ప్రాధాన్యత నిచ్చి వర్ణించెను. మల్లాది సూర్యనారాయణ శాస్త్రి తమ వ్యాసరత్నావళియందుఁ హనుమత్సందేశము'' అను నొక గేయము రచించిరి. అది

3 "పైఁడి లే డెందైనఁ గలదా? పాప మట్టులు పండె నప్పుఁడు
తన్ను నంపితిఁ దగని మాటని తమ్ము నంపితి నాఁటి మాటలు
మరచి పొమ్మని చెప్పుమా రఘునాయకున్ తో తరలిరమ్మని చెప్పుమా"
అని యారంభమైన హనుమంతునిద్వారా సీతచే రామునకుఁ బంపబడినది

---

1. శృంగార నైషధం-4-95
2. వసు చరిత్ర-?-133
3. వ్యాసరత్నావళి - పుట. 262

# శతకవాఙ్మయము - హనుమంతుఁడు

శతక మను శబ్దమే నూఱు పద్యములు కలది యను నర్థమును స్పష్ట పఱచును. లాక్షణికులచే లఘుకృతులందుఁ జేర్పఁబడిన ఈ శతకము నూఱు పద్యములతోఁ గాక నూటయెనిమిది పద్యములతో నెక్కువగాఁ గానవచ్చుచున్నది అష్ట సమధిక శతకము, అష్టోత్తర శతకము అని ప్రత్యేక నామము లున్నను 108 పద్యములు కలది శతకముగనే పిలువఁబడుచున్నది. సంఖ్యలలో తొమ్మిది(9) పూర్ణ సంఖ్య కావున 1 + 8 = 9అని 108గా శతకములుపూర్తిచేయుట సంప్రదాయమైనది. వేయిన్నూటపదార్లు అష్టోత్తరశత నామములు, నక్షత్రమాలలు ప్రముఖముగా వినియోగించుటలో నుద్దేశ్యమీ పరిపూర్ణతయే. కవులు తమ కవిత్వారంభ దశలోఁ దమ యిష్టదైవముపై నొకశతకము రచించుట కన్పట్టును. శతకము సంస్కృత ప్రాకృతముల నారంభమైన దైనను మకుట, ఛందోనియమాదుల నాంధ్రమునందు విశిష్టతను సంతరించుకొన్నది. భగవత్ స్తోత్రపరములు. నీతి బోధకములుగా నివి యెక్కుడు రచింపఁబడుచు జన సామాన్య వ్యవహారోపయోగులై విశేష ప్రచార మంది యున్నవి. హనుమత్సంబంధములగు శతకముల నెక్కుడు భక్తి ప్రబోధకములే యున్నను నీతియు నందందుఁ జోటు చేసికొన్నది. ఆదర్శపూర్ణ వ్యక్తిత్వము కల హనుమంతుఁడు దైవతముగా భక్తికే కాక ఆదర్శముగ నీతికిని ఆలంబన మగుచున్నాఁడు. అట్టి హనుమత్పరములగు శతకముల పట్టిక యిం దీయఁబడుచున్నది.

| గ్రంథము | గ్రంథకర్త | ముద్రణకాలము |
|---|---|---|
| 1 అభినవాంజనేయ శతకము | . హనుమంతరావు | |
| 2 అష్టోత్తర హనుమత్ శతకము | పాటిబండ్ల వీరయ్యదాసు | |
| 3 ఆంజనేయ శతకము | మండపాక పార్వతీశ్వరశాస్త్రి | |
| 4 ఆంజనేయ శతకము | పరితుల వేదమూర్తి | |
| 5 ఆంజనేయ శతకము | అయ్యలరాజు నారాయణకవి | |
| 6 ఆంజనేయ శతకము | వంగివరపు నృసింహాచారి | 1935 |
| 7 ఆంజనేయ శతకము | ఆకెళ్ళ అప్పయ్యకవి | 1915 |
| 8 ఆంజనేయ శతకము | మద్దికేర లక్ష్మణదాసు | 1891 |
| 9 ఆంజనేయ శతకము | యస్. నారాయణప్ప | |

10 ఘటికాచల అంజనేయ శతకము - రావూరి దొరస్వామి శర్మ 1912
11 ప్రసన్నాంజనేయ శతకము - చేజర్ల రామయ్య
12 జ్ఞానాంజనేయ శతకము - పరితాళ హనుమయ్య 1954
13 ప్రసన్నాంజనేయ శతకము - చిత్తూరు నారసింహదాసు
14 ప్రసన్నాంజనేయ శతకము - శ్రీనివాస దీక్షితులు
15. పావని శతకము - తూములూరి శ్రీదక్షిణామూర్తిశాస్త్రి
16. పవనపుత్ర శతకము - వేదాంతం భాస్కరమూర్తి
17 ప్రసన్నాంజనేయ శతకము - వేమనయోగి శిష్యునిగా చెప్పుకొన్న ఒక కవి 1953
18. మారుతి శతకము - మోచర్ల రామకృష్ణకవి 1931
19. మారుతి శతకము - కొటికలపూడి కోదండరామకవి
20. మారుతి శతకము - గోపీనాథము వేంకటకవి
21. మరున్నందన శతకము - పట్టాభిరామకవి
22. మారుతి శతకము - పరుచూరి రంగాచార్యులు 1970
23. మారుతి శతకము - జలగం సుబ్రహ్మణ్యనాయుడు 1940
24. రామాయణ సంగ్రహము - మచ్చ వేంకటకవి
25. వీరాంజనేయ శతకము - గుండోబాకవి 1903
26. వీరాంజనేయ శతకము. - పలుకూరు వెంకటరమణయ్య
27. వాతాత్మజ శతకము - కంభంమెట్టు శోభనాచలపతిరావు 1917
28. వాయునందన శతకము - కొవ్వూరి వెంకటరాజేశ్వరరావు 1923
29. వాయునందన శతకము - ఆలూరు శివరామశర్మ 1984
30. వాయుపుత్ర శతకము - శిష్టు కృష్ణమూర్తి 1914
31. శ్రీఆంజనేయ శతకము - కోటయామాత్యుడు
32. శ్రీభక్తహనుమంత శతకము - జి. వీరనాగా వారిభాగవతార్
33. శ్రీశుభితిశైల హనుమచ్ఛతకము-నందగిరి వెంకటప్పారావు 1910
34. శ్రీహనుమచ్ఛతకము - అన్నదానం చిదంబరశాస్త్రి 1969
35. శ్రీఆంజనేయ శతకము - ప్రత్తిపాటి శ్రీరామమూర్తి 1983
36. శ్రీఆంజనేయ శతకము - వాడ్రేవు సూర్యప్రకాశరావు
37 శ్రీపంచముఖ వీరాంజనేయాష్టోత్తర శతశ్లోక స్తవమాల - ద్వివేదుల రామశాస్త్రి 1964

38. శ్రీమారుతి శతకము - అట్లూరు కుటుంబరామశర్మ 1976
39. సంజీవరాయ శతకము - కాకర్ల సుబ్బకవి
40. సీతారామ హనుమ చ్ఛతకము - 'అభినవజయదేవ'
చల్లా పిచ్చయ్యశాస్త్రి 1928
41. సంజీవపు రాంజనేయ శతకము - సీతారామామాత్య
42. హనుమ చ్ఛతకము - ఎఱ్ఱమిల్లి సూర్యప్రకాశకవి
43. హనుమ చ్ఛతకము - చిత్రకవి పెద్దన
44. హనుమ చ్ఛతకము - భారతుల వీరరాఘవశాస్త్రి
45. హనుమ చ్ఛతకము - పోతరాజు విశ్వనాథకవి
46. హనుమ చ్ఛతకము - నారపరాజు లక్ష్మీకాంతం 1957
47. హనుమ చ్ఛతకము - పాటిబండ్ల వీరయ్యదాసు
48. హనుమ చ్ఛతకము - కనగాల మృత్యుంజయాచారి
49. హనుమ చ్ఛతకము - ఏ. వెంకటకృష్ణారావు
50. హనుమ న్నుతి - పచర్లపాటి వాసుదేవశాస్త్రి
51. హనుమంత శతకము - వి. వి. కృష్ణారావు 1889
52. హనుమ చ్ఛతకము - పసిడిపాటి కోటేశ్వరశర్మ 1914
53. హనుమ చ్ఛతకము - మునగపాటి చినహనుమయ్య 1921
54. హనుమ చ్ఛతకము - ముప్పాళ్ళ జానకిరామశాస్త్రి
55. హనుమ చ్ఛతకము - దీక్షితుల పాపాశాస్త్రి
56. హనుమత్కథా శతకము - నాదెళ్ళ పురుషోత్తమకవి
57. హనుమ త్ప్రభావ శతకము - కృష్టిపాటి బాలసుబ్బయ్య 1912
58. శ్రీ పొలిమేరాంజనేయాష్టోత్తర శతకము -
అన్నదానం చిదంబరశాస్త్రి 1981

మున్నగునవి ప్రచురమైన హనుమత్పరములగు శతకములు. వీని యందు హనుమచ్చరిత, వర్ణనము, హనుమత్ప్రార్థనము, నీతి వంటి విషయములు వర్ణితములు.



# దండకములు—హనుమంతుఁడు

ప్రవాహరూప మగు భక్త్యావేశమును ప్రకటించుటకు చక్కని సాధన మగు వృత్త విశేషము దండకము. దీనికి [1] "సకారంబుతో సంగతంబై నహంబాదినొందెన్ దకారాదిగా నైన,లో నెల్ల చోటన్ దకారంబులం బెల్లు చెందన్ గకారావసానంబు నై దండ కాకార'' మగు నని యనంతుఁడు చెప్పిన లక్షణము. స.న.హ లపై వలయునన్ని తగణములు పైచి తుదకు గురువు నుంచుట, మొదటి నుండియు తుది వఱకు తగణములు, తుదకు గురువు నుంచుట, నన లపై రగణము లుంచుట (సంస్కృతమున ప్రచురము) వంటి విధానములతో దండక భేదములు కలవు భక్తి ప్రకటనముననే దండకములు ముఖ్యముగఁ గన్పట్టును. ఇట్టివి ఆ యా కవులుఁ దమ తమ గ్రంథముల సందర్భ వశమున రచించిరి. అంతియ కాక ప్రత్యేకముగ స్తుతిగా దండకములు రచించిన వారనేకులు కలరు. సర్వ దేవతలపై నిట్టి దండకములు కలవు. దండక రచనలో శ్రీకారముతో నారంభించి నమోంతము గావించుట తెనుఁగు వారి సంప్రదాయము. ఈ దండకము లందు హనుమంతునకు ప్రముఖ స్థానము కలదు. భయకంపితు లగువారు హనుమద్దండకము పఠించుట తెనుగునాటఁ గానవచ్చును. కావ్యముల సందర్భవశమునఁ జెప్పఁబడిన దండకములలో నన్యకృత హనుమద్దండకములే కాక హనుమత్కృత రామదండకము లును గానవచ్చును

భగవత్స్తుతికి సముచితములై మధుర కవితా శాఖకుఁ జెందిన వగు దండకములలో హనుమత్పరము లగునవి ఇం దీయఁబడుచున్నవి.

1 ఆంజనేయ దండకము - వాసుదేవకవి
2 ఆంజనేయ దండకము - ముడుంబి వెంకటేశకవి
3 ఆంనేయ దండకము - [2] నరసింహకవి
4 ఆంజనేయ స్తవాక్షరి - తమ్మన వేంకటేశ్వరరావు
5 ఆంజనేయ దండకము - బేతపూడి భగవంతరావు
6 ఆంజనేయ దండకము - గంటె సుబ్రహ్మణ్య నరసింహం

---

1. ఛందో దర్పణము-2-135
2 ప్రశస్తమై 'శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం' అని భక్తులచేఁ గీర్తింపఁబడున దిదియే.

7 ఆంజనేయ సూర్య కృష్ణ దండకములు - వి. వెంకటరామదాసు
8 ఆంజనేయ స్వామివారి దండకము - వి. వెంకటరామదాసు
9 ఆంజనేయదండకము - కె. దొడ్డకృష్ణాచార్య 1920
10 ఆంజనేయ దండకము - టి. సీతారామకవి 1920
11 ఆంజనేయ దండకము - సుబ్బకవి 1918
12 ఆంజనేయ దండకము - కొత్తపల్లి సుందరరామయ్య 1917
13 ఆంజనేయ దండము -
14 ఆంజనేయ దండకము
15 నూతన ఆంజనేయ దండకము - జి. జగన్నాధము 1899
16 ప్రసన్నాంజనేయ దండకము - గంజి నాగయ్య
17 శ్రీ హనుమద్దండకము - గాథావఝుల సీతారామయ్య 1864
18 శ్రీ హనుమ త్సుందర దండకము - పుల్లాపంతుల వేంకటరామశర్మ
19 శ్రీ హనుమత్సుందర దండకము (సంస్కృతము) -
పుల్లా పంతుల వెంకట రామశర్మ 1948
20 ఆంజనేయ దండకము (*R.* 795)[1]
21 హనుమ ద్దండకములు (*D.* 2038,2040)
22 హనుమ ద్దండకము - శిష్టు కృష్ణమూర్తి
23 హనుమ ద్దండకము - ఆంధ్ర సాహిత్య పరిషత్తు నెం. 176
24 హనుమంతుని స్తుతి-కేసరి ఆనందరావు 1910
25 హనుమద్దండకము - జి హనుమంత శాస్త్రి 1909
26 హనుద్దండకము - 1910

ఇంకను 1917 లో వెలువడిన మరియొకటి, 1918లో మరి రెండు ప్రచురిత మైనవి [2] కర్తల పేర్లు తెలియరావు.

ఇంతియు కాక మాడయకృత మైరావణ చరిత్రమునందు 3-182 న హనుమద్దండకము కలదు. వాసుదాస కృత మగు నాంధ్రవాల్మీకి రామాయణమున సుందర 1306లో హనుమంతుఁడు తన గమనాగమన కార్య సాధనలఁ జెప్పునెడ దండకము రచింపబడెను. సమీర కుమార విజయము 4-145లో హనుమత్కృత రామదండక మొండు కలదు ఇట్లాంధ్ర వాఙ్మయమున హనుమత్పర మగు దండకము లొప్పుచున్నవి.

---

1. రా ప్రా. రా. పుట-256, 257   2. ఆంధ్ర వాఙ్మయ సూచిక-పుట 12

# హరికథావాఙ్మయము - హనుమత్కథ

పురాణేతివృత్తములకు స్థానము కల ప్రత్యేక సారస్వత ప్రక్రియ హరికథ. ఇతివృత్తమును జనరంజకముగా సామాన్యజనుల కందించు ప్రక్రియ ఇది. పరనమున నీయని యానందము ప్రయోగదశలో హరికదకుల ద్వారా ఈయగలదు కావుననే యవి యెంతగా సహృదయాహ్లాదకారులైనను వాఙ్మయమునఁ దగు స్థానము నందలేక పోయినవి. అయినను క్రమపరిణామమున నవియు వాఙ్మయమునఁ జోటు చేసుకొనుచున్నవి. సంగీతముతో నవినాభావ సంబంధము కల అభినయగ్రాహ్యము కూడ నగు సాహిత్యము కావున నిది కేవల సాహిత్యప్రక్రియలవలె శ్రవ్యతను సంతరించుకొనఁ జాలదు. కథకుని సద్యః కల్పిత చమత్కారముల తోడను రంజనఁ గల్గి యుండుటవలన దృశ్యకావ్యములపాటి యాదరము కూడ వాఙ్మయదశలో పొందజాలదు. కాని విశిష్ట ప్రచారము కలదియు దేశీయము నగు నీ ప్రక్రియయు నన్య సారస్వత ప్రక్రియలవలె నుపేక్షింపరాని దనుట యథార్థము.

దేశీయ ప్రక్రియ యగు యక్షగానమే హరికథలకు మూలము. ఆంధ్రదేశమునందు 15వ శతాబ్ది చివరనుండి ఆరంభమై 16వ శతాబ్దము పూర్ణమగునాటికల హరికథా ప్రక్రియ చక్కగ వ్యాప్తి నొందినది. అంతకుముందు సాధారణముగా పామరజనులు యక్షగానముల వంటి గేయ నాటకములను మాత్రమే ఆడుకొను చుండెడివారు. కాని రాను రాను అందుసూపాత్రలధికములై ప్రదర్శనముల నిచ్చు సందర్భమున గొంతక్లిష్టత కల్గుట వలన వాని ప్రచారము కొంచెము తగ్గినది. దీనికిఁ దోడుగా మన ఆంధ్ర దేశమునకు మహారాష్ట్రప్రభుత్వపు రాకతోఁ బాటు వారి యభిరుచులు గూడ బ్రాకసాగినవియనుచు యక్షగానములు మూలముగను మహారాష్ట్ర హరికథా విధాన మాధారము గను హరికథా వాఙ్మయము రూపు దాల్చినట్లు 1925లో మద్రాసు ఆర్. వెంకటేశ్వర అండ్ కంపెనీ వారిచే ముద్రింపఁబడిన పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి పరిష్కృత సింగరిదాస కృత[1] 'రామదాస చరిత్ర విమర్శన' మను శీర్షికద్వారా తెలియుచున్నది.

ఈ హరికథలు శివాజీప్రభువు కాలమున సమర్థరామదాసస్వామి

1. ఆంధ్ర హరికథా వాఙ్మయము పుట - 4

వలన ప్రచారమునకు వచ్చినవి. స్వామి తన దాసబోధలో హరికధకునకు ఉత్తమగతి యత్నప్రయత్నముగ లభించు ననెను. అట్లు సమర్థునిచేఁగాని యాడబడి ప్రచార మందిన యీ ప్రక్రియ యాంధ్ర యక్షగానము లతోఁ జేరి యాంధ్ర హరికథగా మారినది. తెలుఁగున మొదటి హరికథ క్రీ.శ. 1760 లో మునిపల్లె సుబ్రహ్మణ్యకవి విరచిత అధ్యాత్మరామాయణ మని దాలాంత్రపు రజనీకాంతరావు, ఆర్. వి. యస్. సుందరం గారలు తెల్పిరి.

'ఆస్తిక్యమును, ధర్మాధర్మములను సర్వజనమనోరంజకముగ నృత్య గీత వాద్యములతో నుపన్యసించుట హరికధ యనబడు'నని ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ సంచిక 1964-65 ప్రచురితమునందు ఆదిభట్ల నారాయణదాసు గారు వివరించిరి. కాని రాజకీయ నాయకులపై స్వాతంత్ర్యసమర యోధులపైఁ గూడ హరికధ లారంభ మైనవి. ఇట హరికధ యనుచో హరిశబ్దము సామాన్యవాచకముగ భగవత్పరముగఁ గొనఁదగినది. శివ సంబంధ కధలు, నన్యదేవతాకములు ననేకములు ఈ పేరులో నిముడు చున్నవి. 17వ శతాబ్దినాటి తిరుక్కడయూరి కృష్ణదాస విరచిత రామ దాసుగారి 'రామదాసు' హరికధ గాని; 1652 నాటి వరదరామదాసుగారి 'రామదాసు' హరికధగాని 1720-1790 నాటఁ ప్రచార మందిన గోకులపాటి కూర్మన్నగారి మృత్యుంజయ విలాసము కాని మొదటి హరికధ కావచ్చు నని 'ఆంధ్రహరికథావాఙ్మయ' కర్తల అభిప్రాయము.

ఇట్టి హరికథా వాఙ్మయమునందును హనుమత్కథ చోటుచేసు కొన్నది. హనుమంతునితోడి హరికధలసంబంధము సూక్ష్మపరిశీలనమున ప్రత్యేకముగఁ దోచును. 'హరికధ' యను శబ్దము హనుమత్పరమగు కధలకును పూర్తిగా సరిపోవును. హరిశబ్దము వానరశ్రేష్ఠునిఁ గూడఁ దెలుపఁజాలినదిగా నిఘంటువులవలనఁ దెలియగలము. హరికధలకురూపు నిచ్చి, ప్రచారమునిచ్చి నేటివఱకు నిలచుటలో ముఖ్యకారకుఁడు సమర్థ రామదాసు. సమర్థరామదాసు హనుమదవతారమేయనువారి మతమున హరికధలకు హనుమంతునితోడి సంబంధ మెంతటిదో గ్రహింపగలము.

[1] "కృతే తు మారుతాఖ్యశ్చ - త్రేతాయాం పవనాత్మజః
ద్వాపరే భీష్మసంజ్ఞశ్చ - రామదాసః కలౌ యుగే"

1. ఆంధ్ర హరికథా వాఙ్మయము. పుట - 101

అను భవిష్యత్పురాణ శ్లోకము సమర్ధానుయాయులగు మహారాష్ట్రులకు ప్రమాణము. తాళములం జిందులిడుచుం దన్మయుండై రామకీర్తన మొనర్చు హనుమద్రూపము హరిదాసరూపమే. తొలి హరికథగాం జెప్పంబడు నధ్యాత్మరామాయణమునందే హనుమంతునకు స్థానము కలదు. ఇట్లు రామాయణపరములగు హరికథలన్నిట స్థానమందుటే కాక కేవల హనుమత్పరమగు గథలు నైతము కల్గి హనుమత్కథ హరికథా సారస్వతమున నుచితస్థానము నందెను! రామాయణము ద్వారా హనుమత్కథను కల్గియున్న హరికథలు.

| కద | కర్త | కాలం |
|---|---|---|
| 1. మోక్షగుండ రామాయణము | తాళ్ళూరి నారాయణకవి | 1900 |
| 2. యథార్థరామాయణము | శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు | 1915 |
| 3. రామాయణము | అయ్యగారి వీరభద్రరావు | 1924 |
| 4. సంగ్రహ రామాయణము | బి. బాలాజీదాసు | 1927 |
| 5. సంగీతానంద రామాయణము | కోసూరి భోగలింగదాసు | 1935 |
| 6. రామాయణము | రామపుత్రి (సుబ్బమ్మ)<br>[1] హనుమంతుడు దర్శనమిచ్చి రామాయణము వ్రాయ నీమెకు ననుజ్ఞ నిడెను. | 1937 |
| 7. శ్రీమన్నరహరి రామాయణము | మైనంపాటి నరసింగరావు | 1933 |
| 8. శ్రీరామ లీలాయనము | పొతూరి మధుసూదనరావు | 1973 |
| 9. రామాయణము | తిరుమల్లాన్ చక్రవర్తుల సంపత్కుమార జగన్నాథ తిరువెంగళాచార్యులు | 1970 |
| 10 రామాయణము | బొమ్మరాజు సీతారామయ్య | 1907 |
| 11 శంకర రామాయణము | కస్తూరి శివశంకరకవి | 1909 |
| 12. లక్ష్మణ మూర్ఛా విమోచనము | అవుల సుబ్బయ్యదాసు | |

మున్నగునవి ప్రచారమున నున్నవి. రామాయణ హరికథా గానమునందు దాసులచే హనుమత్కథ విశేషముగం బోషింపంబడుచుండుట గమనింతుము. అద్భుత పరాక్రముండు హనుమంతుండు. అట్టివాని వీరోచిత కృత్యములు సహృదయానందకరములు. అంతియ కాక భక్తికి,

1. ఆంధ్ర హరికథా వాఙ్మయము పుట - 167

ర_క్తికి, శ_క్తికి, ఉ_క్తికి, యు_క్తికి అన్నిటికిఁజాలిన హనుమంతుని దాసు లత్యంతము నుత్సాహముగా వర్ణించి చెప్పుట, శ్రోతలు నినుమడించిన యుత్సాహమున వినుటయుగాన నగును. హాస్యరస పోషకములగు వానర చేష్టలను వారి కధనమునకుఁదోడ్పడుచు నాబాలగోపాలమున కానందము కల్గించుచుండును. హరిదాసు లెల్లరు హనుమత్సముద్రోల్లంఘనమున గుభిల్లని దుమికి గజ్జల మ్రోతలు శ్రోతల కర్ణపుటముల నింపువారే. లంకాదహనము వారి హాస్యప్రసంగమున కెక్కుడుగ నుపయోగించు కొందురు. రామాయణకధయందిట్లు ప్రత్యేక భాగముల హనుమంతుఁడు కన్పడ హనుమత్ప్రధానము లగుఁగధలలో మిక్కిలి చోటుచేసికొని కాన వచ్చును. వానియందు హనుమంతుఁడే నాయకుఁడై విరాజిల్లును.

## హనుమత్ప్రధానము లగు హరికథలు

| కధ | కర్త | కాలము |
|---|---|---|
| 1. భీమార్జున గర్వభంగము | కొమ్మూరి బాలబ్రహ్మానంద దాసు | 1935 |
| 2. శ్రీరామాంజనేయము | మైనంపాటి నరసింగరావు | 1938 |
| 3. భీమార్జున గర్వభంగము | ,, ,, | ,, |
| 4. గరుడ గర్వభంగము | ,, ,, | ,, |
| 5. హనుమజ్జననము | ,, ,, | ,, |
| 6. భీమార్జున గర్వభంగము | పెంటపాటి సర్వేశ్వరరావు భాగవతార్ | 1940 |
| 7. మారుతి చిటికెలు; సుందరకాండ | పరిమి సుబ్రహ్మణ్య భాగవతార్ | 1941 |
| 8. సువర్చలా కళ్యాణము | పెదపాటి కృష్ణమూర్తి బాలభాగవతార్ | 1950 |
| 9. మైరావణ | తెల్లాకుల వెంకటేశ్వరగుప్త భాగవతార్ | 1959 |
| ,, | ఆవటపల్లి రామకృష్ణయ్య | 1910 |
| 10. హనుమత్కల్యాణము | పాతూరి మధుసూదనరావు | 1973 |
| 11. హనుమద్రాయబారము | వాడరేవు సీతారామాంజనేయ భాగవతార్ | 1976 |
| 12. మారుతి పరిణయము | ములుకుట్ల సత్యనారాయణశాస్త్రి | 1967 |
| 13. హనుమద్విజయము | మద్దిపాటి రాఘవశర్మ | 1910 |

14. బాలాంజనేయము - అచ్యుతుని వేంకటాచలపతిరావు 1969
15. రామాంజనేయ యుద్ధం — కె. శివరామరెడ్డి 1970
16. శ్రీరామలింగేశ్వర మహిమ - రావి హరిచౌదరి భాగవతార్ 1973
17. వీరాంజనేయ విజయము - కె. కోటమరాజు

వీనిలో వాల్మీకములగు నితివృత్తములకంటె నవాల్మీకములు యెక్కుడు. హరికథలందు జనరంజకత ప్రధాన మగుటచే విశేషకథలఁ గొని రచించుట, గానము చేయుటలు కన్పట్టును. సర్వవిదిత మగు మూలరామాయణ గాథను మించి యపూర్వ శ్రుతము లగు నీ గాథలు శ్రోతల నాకర్షించుటయందు నానందింపఁజేయుటయందును సమర్థవంతములు. పై వానిలోని వేంకటాచలపతిరావు కృత మగు బాలాంజనేయమునకు సువర్చలాంజనేయ కళ్యాణ మను నామము. తాళపత్రములు, వ్రాతప్రతులందున్న శ్రీపరాశరసంహిత నాధారముగా గొని యీ కథ వ్రాయుచున్నట్లు తొలిపలుకులందుఁ దత్కర్తయే చెప్పుకొనెను. ఇట్లు ఆంధ్రవాఙ్మయమందలి హరికథా సాహిత్యమున హనుమత్కథ చోటుచేసికొని ప్రచారమందినది.



# సంకీర్తన సాహిత్యము - హనుమత్కథ

## అన్నమాచార్య కీర్తనలు - హనుమంతుఁడు

సుప్రసిద్ధ వాగ్గేయకారుఁ డన్నమయ్య. తాళ్ళపాక ఈతని ఇంటి పేరు. కడపజిల్లా రాజంపేట తాలూకా తాళ్ళపాక గ్రామ నివాసియైన ఈతఁడు 1408 నుండి 1503 వఱకు జీవించెను. తొలుత నందవరీక నియోగి యగు నితఁడు పంచసంస్కారము లంది వైష్ణవుఁ డయ్యెను. పదకవితా పితామహుఁడుగాఁ బేరెన్నికఁ గన్నవాఁడు. దేశ మెల్లఁ దిరుగుచు రోజు కొక కీర్తనగా 32000 కీర్తనలు వ్రాసెను. వానియందు హనుమత్పరము లనేకములు గలవు. కీర్తనలందుఁ గానవగు భక్తినిబట్టి, హనుమంతుని చరిత్ర చిత్రణముఁబట్టి చూడ నన్నమయ్య హనుమంతుని యందుఁ బ్రత్యేకమైన భక్తిశ్రద్ధలు కలవాఁ డని తోచును.

వాల్మీకి రామాయణాంతర్గత హనుమచ్చరిత్రమునే కాక సంహితాదులఁ గానవచ్చు హనుమద్గాథ నంతను తన కీర్తనలందుఁ జెప్పెను. అనేక రాగములందు హనుమంతునిఁ గీర్తించెను. తాను కీర్తించు హనుమంతుని స్థలనిర్దేశము గూడ గావించెను. విశేషించి కలశాపుర హనుమంతునిఁ గీర్తించెను. ఈ స్థలవిషయమున డా॥ సర్వోత్తమన్‌గారి యభిప్రాయ మిట్లున్నది.

[1] 'అనంతపురం జిల్లా గుంతకల్లు సమీపమందలి నెట్టిగంటి వీరాంజనేయుని కసాపురముగ అంటున్నారు. రాళ్ళపల్లివారు హంపిలో మాల్యవంతానికి ఎదురుగా ఉన్న కొండలోని దేవుఁడే కలశాపురం ఆంజనేయు డని భావించారు. శ్రీనాథుఁడు కళసాపురప్రాంత కదళీవనాంతర ద్రాక్షాలతా ఫలస్తబకములను అని ఆప్రాంతాన్నే వర్ణించాఁ'డని భావించారు. మతంగాద్రి బళ్ళారి హాస్పేట తాలూకాలోనిది. మంగాంబుధి బహుశః మంగాపురమే కావచ్చును.

అన్నమయ్య హనుమత్కీర్తనలందు వేంకటేశ్వరు సన్నిధిని విశేషించి తెలియఁజేయుట కానవచ్చును. శ్రీ వేంకటేశ కరుణాసమేత శాతకుంభ వర్ణ కలశాపుర నివాసి ఇత్యాదిగా రామభక్తునిఁహొర్చి ఇట్లుచెప్పుట వేంకటేశ్వర-రామచంద్రులు విష్ణ్వంశ సంజాతు లగుట నబేహాధ్యవసాయ

1. అన్నమయ్య హనుమత్సంకీర్తనలు పుట - 2

ముగ దెలియంగవలెను. శ్రీవేంకటేశ్వరున కనన్యభక్తుఁడగు నన్నమయ్యకు విష్ణ్వంశ యన వేంకటాచలపతియే. ఆంధ్రవాఙ్మయమున వాగ్గేయకారులుగా ప్రసిద్ధినందిన వారిలో హనుమత్పరమగు నిన్ని విశేషములతో నిన్ని కీర్తనలు రచించినవాఁ డన్నమయ్యయే. ఆ యా రాగములలోఁ గొన్ని కొన్ని హనుమత్కీర్తనలు గావించెను.

హనుమత్సంబంధము లగు అన్నమయ్య కీర్తనలందు

రామక్రియ రాగమున :

'అఖిల లోకైక వంద్య హనుమంతుఁడా' - 9-233
'మగఁటిమి గల హనుమంతరాయ' - 7-16
'పంతగాఁడు మిక్కిలి బంటతనమునను - 9-214
'మొక్కరయ్య అన్నిటికి మూల మితఁడు' - 8-148

సాళంగ నాటరాగమున :

'అదివో నీ ప్రతాపము హనుమంతా' | 9-211
'శరణు శరణు వేదశాస్త్ర నిపుణ నీకు' |
'అవధారు దేవ హరికులరామ' - 8-144
'మొక్కరో మొక్కరో వాఁడె ముందర నిలుచున్నాఁడు - 9-12
'ఎక్కడా ఎదురులేక యీరేడు లోకములందు' - 10-85
'హరికి లంకిణీ హంత కంతర మిట్టున్నది' - 10-145
'అన్నిటా నీ పెంపు వింత హనుమంత నీ' - 2-249

సాళంగ రాగమున

'ఈతని దెంత ప్రతాపము ఈతని దెంత వుదుటు' - 11-1-198
'పెరిగినాఁడు చూడరో పెద్ద హనుమంతుఁడు' - 3¹-1-233

నాట రాగమున

'కొలిచిన వారికిఁ గొమ్మనివరము లిచ్చీ' - 8-232
'సరి లే రితనికిని సాహస విక్రముఁ డీతఁడు' - 11-1-204
'అందరిలోనా నెక్కుడు హనుమంతుఁడు' - 2-207
'ఎక్కుడు బ్రహ్మపట్టాన కిదె కాచు కున్నవాఁడు' - 10-158

శంకరాభరణ రాగమున

'మతంగ పర్వత మూడ మాల్యవంతము నీడ - 2-223

'అతఁడా యితఁడు పెద్ద హనుమంతుఁడు' - 10-141
'శరణు కపీశ్వర శరణం బనిలజ' - 9-132

శ్రీ రాగమున
'ఓ పవనాత్మజ ఓ ఘనుఁడ' - 11-121

ముఖారి రాగమున
'నెర బిరు దిన్నిటాను నీ బంటు' - 11-2-67

దేశాక్షి రాగమున
'సీతాశోక విఘాతక ఓ పాతాళ లంకాపతి విభాళా' - 1-366

సామంత రాగమున
'చెల్లె నీ చేతలు నీకే చేరి మేడెగుడిదిన్న - 11-1-11
'మంగాంబుధి హనుమంతుని శరణము - 1-11-14
మాయపు దనుజుల మదపై రి కపి - 5-182
'కలశాపురము కాడ కందువ సేసుకొని' - 11-1-172

మాళవి రాగమున
'అందరికి నెక్కుడైన హనుమంతుఁడు' - 10-155
'కలశాపురముకాడఁ గాచు కున్నాఁడు' - 2-216
అరు దీ కపీంద్రుని యధికప్రతాపము' - 11-1-175

మాళవిగౌళ రాగమున
'ఎంతని పొగడవచ్చు నితని సేవించరో' - 11-1-211
'అవధారు చిత్తగించు హనుమంతుఁడు వీఁడె

భౌళి రాగమున
'అదె చూడరయ్యా పెద్ద హనుమంతుని - 11-1-214
'ఎంతని పొగడవచ్చు నితని ప్రతాపము' - 2-230
'వీడిగో నిలుచున్నాఁడు విజయనగరములోన' - 9-230

గౌళ రాగమున
'నేల మిన్ను నొక్కటైన నీ బంటు వొక్క' - 1 89

పాడి రాగమున
'ఒక్కఁడే యేకాంగ వీరుఁడుర్వికి దైవ మైనాఁడు' - 11-1-167
'కలశాపురము కాడ గంధపు మాకుల నీడ' - 9-232

భౌళిరామక్రియ రాగమున
'వీఁడివో కలశాపుర వీరహనుమంతుఁడు' - 11-1-230

లలిత రాగమున
'బిరుదుబంటితండ పెద్ద హనుమంతుఁడు' - 11-1-191

ప్రతాపనాట రాగమున
ఏమని నుతించవచ్చు నితని రూపము' - ?-116

వరాళి రాగమున
'పదియారు వన్నెల బంగారు కాంతులతోడ' - 10-167

గుండక్రియ రాగమున
'ఘనుఁ డాతఁడా యితఁడు కలశాపురముకాఁడ' - 9-13

ఇట్లా యా రాగములయందు నన్నమయ్య కీర్తనల రచించి హనుమంతు నారాధించినట్లు తెలియుచున్నది. అందు గుండగానక్రియ కొక ప్రత్యేక చరిత్ర కలదు.

భక్తితత్త్వమున హనుమంతునిఁబేర్కొనుట సహజము. రామభక్తిని లోకమునఁ జాట నాతని రూపున వచ్చిన శివుఁడే కావున నా విషయము జగద్విదితము. అంతేకాక సంగీతమున హనుమంతుఁడు మేటి యయి నట్లుఁ దెలియుచున్నది. తుంబుర నారదులు తమలో నెవరు గొప్పయను విషయమునఁ దగవుపడి వారి వివాదముఁ దీర్చ సంగీతమున సమర్థు నెన్నగలవాఁడు హనుమంతుఁడే యని యాతనికడకు వచ్చి 'తమలో శ్రేష్ఠు'నెన్న మన హనుమంతుఁడు గుండక్రియగాన మొనర్చి తనకడ నున్న చిరుతలు తన గానముచే కరఁగిన శిలయందదిమి మిన్నకుండి 'గానముచే వానినిఁదీసినవాఁడు మీలో శ్రేష్ఠుఁ'డనగా నిర్వురుశక్తికొలది గాన మొనర్చి శిలలు కరుగునంతటి గానమాధురిఁ జూపలేక ఇర్వురు హనుమంతునే సంగీతమున నధికునిగా మెచ్చుకొనినట్లు, ఆరీతి హనుమంతుఁడు నారద తుంబుర గర్వభంగమొనర్చినట్లు 31వ పటలమున శ్రీపరాశరసంహితయందుఁ జెప్పఁబడినది. కావున నట్టి సంగీతజ్ఞునిఁ దన సంగీతముద్వారా సేవించి తరించిన అన్నమయ్య హనుమంతునిద్వారా గానము చేయబడిన గుండక్రియగానముచేఁ గూడఁ గీర్తించెను. అన్నమయ్య కీర్తనలద్వారా హనుమంతునిఁ బొగడుటయే కాక తన

కీర్తనలయందు వాల్మీకమును నవాల్మీక మయిన హనుమత్కాద నంతను జెప్పెను. అరీతిగ సమగ్ర హనుమత్కథను సూత్రప్రాయముగ వ్రాసిన వాఁ డన్నమయ్య. మఱి యేరి రచనయందు నింతటి చరిత్ర సూచితము గాదు. వాల్మీకముఁగు నంశముల గాంచిన కిష్కింధాకాండ గాథను 11-1-163 'ఆంజనేయ అనిలజ' - అను కీర్తనతో 'నీ మూలమునఁ గాదె సుగ్రీవుఁడు రాముని఼ఁ గొలిచె' నని రామసుగ్రీవ మైత్రినిఁ జెప్పెను. సుందరకాండ గాథను 9-132 'అంపిన యప్పుడె అంబుధిదాటితి' 11-1-230 చలపట్టి జంగ చాఁచి జలధి దాఁటినవాఁడు-దీమసాన లంక సాధించి ఉంగరముఁ దెచ్చె నని యుంగర మిచ్చుట;

11-1-204 'ఉదధి లంఘించినాఁడు వుబ్బున మైనాకముచే
పొదలి నట్టనడుమఁ బూజ నున్నాఁడు' - అని మైనాకగాథ,

11-1-172 'నిండు నిధానపులంక నిముషాన నీరుసేసె' నని లంకాదహనము;

2-216 మాయాబిలము చొచ్చి మగుడి యంబుధిలోని
చాయాగ్రహముఁ జంపి చయ్యన దాటి
అలెుడ లంకిణిఁ గొట్టి యంతలో జానకిఁ గని'
యని సురస, సింహిక, లంకిణిల గాథ

2-207 వివరించి సీతకు విశ్వరూపము చూపుతా అని సీతదర్శనము;
సీతను వెదకి వచ్చి చెప్పిన యాతం డితఁడా
అక్షయమర్దనుఁ డితఁడా' - అని లంకఁబోరు సూచించెను.
యుద్ధకాండ గాథను

11-1-148 అలుకతో రావణుని యుద టణచె నతఁడు
తలచి మైరావణుని దండించె నితఁడు - అని రామగాథ;

11-1-188 లంక సాధకుఁడు లక్ష్మణ ప్రబోధకుఁడు-అని లక్ష్మణ సంహార్చ;
మగటిమి మించగ మందులకొండకు నిగడి కో యనుచు నీబంటు

9-232 సంజీవికొండ దెచ్చి సౌమిత్రి బ్రతికించితి.
అని సంజీవిపర్వతము తెచ్చుట;

1-69 చంగున జలధి దాటి జంబుమాలి నిలమీద
కుంగఁదొక్కి పదములఁగుమ్మెగా నీబంటు-అనిజంబుమాలివధ;

9-13 పెడ చేత లోవేత బెరసి కొందరిఁ గొట్టె

అడరి దానవుల హనుమంతుఁడు
బెడిదంపుఁ బెనుదోఁక బిరబిరఁ దిప్పి మొత్తె
అడఁగ మాల్యవంతు హనుమంతుఁడు
దొకాల మోఁకాలఁ దాటించెఁ గొందరి
పైకొని భుజములఁ బడ దాకె
అరుపుల నురుపుల నందరిఁ బాఁగఁ దోలె

ననుచు మాల్యవదాదుల వధను. హనుమంతుని యుద్ధవిధానమును మనోహరముగఁ గన్నులముం దుంచెను. ఇట్లు యుద్ధకాండ గాథను వాల్మీకముగాఁ జెప్పుటయ కాక అవాల్మీకము లగు ననేక గాథలఁ దన కీర్తనలందు నన్నమయ్య పేర్కొనెను.

అవాల్మీకము లగు నంశములతో నన్నమాచార్యులు హనుమద్గాథ నంతను దెలియఁజేసెను.

10–29 లో 'మరిగి రుద్రుఁడై హనుమంతుఁడా యను
11–1–167 'అంది రుద్రవీర్యము దాసై హరుఁడైన'
అని యవతారమునకుఁ గారణ మగు అజైకపాద రుద్రాంశ సూచించి
11–1–148 లో అంజనీతనయుఁడా యనిలజుఁడు
10 85 లో పుట్టుఁ గౌపీనము మహాద్భుత యజ్ఞోపవీతము
గుట్టు చూపని కనక కుండలములు
2–207 లో కనకకుండలాలతో కౌపీనముతోడ
10–167 లో అట్టి వాయువునకును అంజనాదేవికిని పుట్టినాఁడు కలశాపుర హనుమంతుఁడు' అని జననమును గీర్తించెను.
9–132 పుట్టిననాఁడే భువనములెరఁగఁగ పట్టితి సూర్యునిఁ బండనుచు'
9–233 కఁజాప్తఫలహాప ఘన హనుమంతుఁడు
1–11– 49 బాలార్క బింబము ఫల మని పట్టిన
11–1–37 'ఓ రవిగ్రహణ'
ఇత్యాదికముచే సూర్యుని మ్రింగిన చరిత్ర దెల్పెను.
9–230 వదలక దేవతల వర మందినాఁడు
1–11–149 తూలని బ్రహ్మాదులచే వరములువొలిఁజేకొనిన ఓ హనుమంతా'
యని బ్రహ్మాదులచే వరములఁగొనినరీతిఁ దెల్పుచు

11-1-230 ఇప్పుడు ప్రాణముతోనే యిల దేవుడైనవాఁడు
11-1-172 ఇహమున రాముని బంటై యిప్పుడూ నున్నవాఁడు
2-232 చిరంజీవి యాతఁడా జితేంద్రియుఁ డితఁడా'
అని హనుమంతుని చిరంజీవత్వముఁ జొగిడెను.

11-1-175 'తుద సూర్యమండలముతోడ మోము దిప్పుకొంటూ
పెదవులెత్తి చదివెఁ బెద్ద హనుమంతుఁడు'
10-158 'తూరుపుఁ బడమరాను దొడ్డగా జంగ చాఁచి
సారెకు నర్కునివద్దఁ జదివీ వాఁడె'
11-1-193 'చదివె రవితో సర్వశాస్త్రములు'
11-1-230 'మొగి సూర్యునిచే శాస్త్రములు చదివినవాఁడు'
ఇత్యాదులచే నాతని విద్యాభ్యాసముఁ బ్రస్తుతించెను. అన్నమాచార్య కీర్తనలఁ బట్టి చూడ నీ నాటికిని లభింపని పరాశర సంహితాదుల నా నాఁటాతఁడు చూడఁగల్గె నని స్పష్టమగును. అట్టి మరుగున నున్న గాధ లెన్నిటినో యాతఁడు తన కీర్తనలందు సూచించెను. అతఁ డందించిన గాధలఁ బట్టి హనుమంతునియెడఁ బ్రత్యేకశ్రద్ధతోఁ గృషి జేసి యుండు ననియుఁ దోఁచును. ఉదాహృతికిఁ బై కీర్తన లన్నియు ననగాఁ బుట్టకఁ, సూర్యునిఁ గబళించుట, చిరంజీవిత్వము;
11-1-164 వంటి కీర్తనలచే నిరూపిత మగు సర్వదేవాత్మకత వంటి విష యము లన్నియుఁ బరాశర మైత్రేయ సంవాదరూప మయి ఈనాటికిఁ జాల గ్రంధము వెలుగుఁ జూడక వ్రాతప్రతులలో మగ్గుచున్న శ్రీ పరా శరసంహితయందు 5, 6 పటలములందుఁ గన్పట్టును.

'ప్రాణవాయు సంబంధి పరమాత్ముఁడు అట్టె' - 10-145 వంటి వానిచే సూచిత మగుఁ బరమాత్మ ధ్యానము ఇరువదియేనిమిదవ పటల మునఁ గాననగును.
'గుండు గరఁగఁగఁ బాడె కోరి గాతఁడు' - 11-1-148 అను తుంబుర నారద గర్వభంగ ఘట్టము ముప్పదియొకటవ పటలమునఁగనవచ్చును.

'పాతాళములోపలి మైరావణు నాతలఁ జంపిన' - 1-11-149
'పాతాళలంకా పతి విభాళా" - 1-386 వంటి కీర్తనల గాధ సంహితలో 44, 45, 46, 47 పటలములందు వ్యాప్తమై యున్నది.

'దారుణపు వినతా తనయాదులు గారవింప నిటు గలిగితిగా' - 11-1-31 అనునది సంహిత నలుబదియెనిమిదవ పటలములోని గరుడ గర్వభంగ వృత్తాంతము సూచించును.

'అలర నన్నిటయుఁజేసి అజునిపట్టానకు నిలుచున్నాఁడదివో సిబంటు' 1-69
'ముందట నేలే పట్టమునకు బ్రహ్మయినాఁడు' - 11-1-167
'పంకజసంభవు పట్టము గట్టను' - 5-182
'గట్టిగ బ్రహ్మపట్టానకుఁ గాచుకొన్నాఁడు - 11-1-158
'పని పూని ఇటమీఁది బ్రహ్మపట్టమునకు'
'ఎక్కుడు బ్రహ్మపట్టాన కిదె కాచుకున్నాఁడు'- 10-158
వంటి వానిచేఁ దెలియఁదగు భవిష్యద్బ్రహ్మ కథనము పరాశరసంహితలో నేబదినాల్గవ పటలమునఁ గలదు.

'తేరిమీఁద నీ రూపుఁ దెచ్చి పెట్టి యర్జునుఁడు' - 11-1-183 అనునది పదునారవపటల విజయచరిత విషయము.

'సోదెకు భీముఁడు పురుషామృగముఁ దెచ్చుచోట'
'నీ రోమములు దావా నిఖిలకారణము' - 11-1-163 అనునది పురుషమృగాహరణోపాయ కథనమునకు సంబంధించిన యేబదియొకటవ పటలమునఁ జెప్పఁబడినది.

'తలఁచరో జనులు ఈతని పుణ్యనామములు సులభముననే సర్వశుభములు గలుగు;హనుమంతుఁడు, వాయుజుఁ, డంజనాతనయుఁడు,వనధి లంఘన శీల శ్రైభవుడు' - 11-1-188 అను కీర్తనము 'హనుమా నంజనాసూనుర్వాయుపుత్రో మహాబలః'అని మొదలుగా గల స్కాందపురాణ రేవాఖండమందలి 83వ అధ్యాయమునఁగల ద్వాదశనామ స్తోత్రమున కనువాదమై యునిపించును. ఈనాటికిని ప్రయాణాది శుభకార్యము లన్నిట నా ద్వాదశనామములు పఠించుచు నేగు నాచారము గలదు. వాని విశిష్టత గుర్తించి యనుసరించినవాఁ డగుట నొకకీర్తన వానికై లిఖించెను. 'భంజించెఁ గాలనేమిని పంతమున నితఁడా - 2-223 అను కీర్తన మందలి కాలనేమి వృత్తాంతము అధ్యాత్మరామాయణమందుఁ గానగును. ఈ వృత్తాంతమును ఆంధ్రరామాయణకర్తలు భాస్కర, రంగనాథాదులుఁ జెప్పిరి.

శ్రీ పొదవారు స్వీకరించిరి. జానపదవాఙ్మయ మంతట నీ గాద విశేష ప్రచార మందినది 'తమితోడ దాసులను తప్పక కాచే నని; అమర నభయ మిచ్చిన హనుమంతుఁడా' 7-16 అను నీ వాక్యము రామరహస్యోపనిషత్తులో 'ఇహికే సమనుప్రాప్తే మాం స్మరే ద్రామసేవకమ్' అని యభయ మిచ్చిన హనుమంతుని వాగ్దానమును గుర్తుచేయును.

హనుమద్భక్తి తత్పరుఁడై ఆ స్వామినిగూర్చి అన్నమయ్యచేసిన వర్ణనలు కూడ యెన్నియో కలవు. 'ఎరబిరు దిన్నిటాను నీబంటు-వొరసె గగన మదివో నీ బంటు" - 11-2-67 అని సంజీవ పర్వతోద్ధరణమున, 'చెల్లె నీచేతలు నీకె చేరి మేడెగుడిదిన్న నల్లదె కంటిమి నిన్ను హనుమంతరాయ' - 11-1-118 అని సముద్రలంఘనమున హనుమంతుఁడు చూపిన విరాడ్రూపమును అన్నమయ్య తన కీర్తనయందుఁ జక్కఁగ వర్ణించెను.

"పెడచేతలోచేత బెరసికొందరిఁగొట్టి
అడరి దానవుల హనుమంతుఁడు
బెడిదంపుఁ బెనుదోఁక బిరబిర దిప్పెమొత్తె" 9-13

నని యిట్టివానియందు యుద్ధవర్ణన మొనర్చెను.

అన్నమయ్య కీర్తించిన హనుమంతులు మువ్వురు

1. కలశాపుర హనుమంతుఁడు
2. మతంగాద్రి హనుమంతుఁడు
3. మంగాంబుధి హనుమంతుఁడు

అందుఁ గలశాపుర హనుమద్రూపమిట్లు వర్ణితము.

"పిడికిటఁబట్టినవి పెద్ద పండుల గొలలు
అడరి యెత్తినది మహావాలము' - 11-1-211

"పెనచి పండ్లగొల పిడికిలించుకున్నాఁడు
ధ్రువమండలము మోఁక దోఁక యెత్తుకున్నవాఁడు
నవదైన పెనుజంగ చాఁచుకున్నాఁడు' - 11-1-131

"ఎడమచేతఁ బట్టె నిదివో పండ్లగొల
కుడిచేత రాకాసిగుంపులఁ గొట్టె
తొడిఁబడ నూరువులతోఁ దూరుపుమొగ మైనాఁడు" - 10-167

అనురీతిగా మొదటిస్వామిని వర్ణించెను. పంగఁజాచి తోకఁ పై కెత్తి పండ్ల గెల బట్టి యున్న రూపమాతనిది. రెండవ మతంగాద్రి స్వామిని గూర్చి

"మతంగపర్వత మూడ మాల్యవంతము నీడ
అతిశయిల్లిన పెద్ద హనుమంతుఁడు" - 2-223
'పిక్కటిల్లి సంతోసాన పెద్ద హనుమంతుఁడు' - 10-158
"అతఁడా యీతఁడు పెద్ద హనుమంతుఁడు" - 10-141
"అల్లదివో మించె పెద్ద హనుమంతుఁడు" - 11-1-206
"బెడిదపు మహిమల పెద్ద హనుమంతుఁడు" - 11-1-175

ఇట్లు మతంగాద్రి హనుమంతునిగూర్చి వర్ణించిన చోటే పెద్దహనుమంతుఁడని చెప్పును.

'మంగాంబుధి హనుమంతుని శరణము' - 1-11-'49
"అల శ్రీ వేంకటపతి యండనె మంగాంబుధి" - 11-1-163
'బలిమి శ్రీ వేంకటేశు బంటై మంగాంబుధి" - 11-1-167

ఇత్యాదులచే మంగాంబుధి యాంజనేయు నభివర్ణించెను. కలశాపురమువలె మంగాంబుధికూడ స్థలవిషయమున వివాదగ్రస్తముగ నున్నది. మంగాపురమునందలి, అందును శ్రీనివాస మంగాపురము కాక అలివేలు మంగాపురమునందలి హనుమంతునే యీతఁడు కీర్తించినట్లు తెలియును. మతంగాద్రి కిష్కింధప్రదేశ మందలిది. స్థలౌచిత్యముఁ బాటించుటనే విజయనగర, మతంగాద్రి ప్రదేశముల హనుమద్వర్ణనము నాతఁడు విద్యాభ్యాస మొనర్చిన విధానమును వర్ణించెను. ఇట్లు హనుమద్భక్తి ప్రత్యేకముగ, విశేషముగఁ గల్గినందుననే కేవల హనుమత్పరము లగుఁ గీర్తనల నెన్నిటినో రచించెను. హనుమంతుఁడు నాతని కిష్టదైవ మయియుండుట నిక్కము. ఆ స్వామి రచన రాకున్నను అటనట నన్నమయ్య యితర రచనలందును హనుమంతుఁడు తొంగి చూచుచునే యుండును. 'కల దిదివో సుఖము కలిగినను గర్వము నిలుపక మానునా' అను 104 6-22 కీర్తన కేవల మాధ్యాత్మికవిషయ మందించునదియ. అందు మొదటి చరణమే 'పరగ నింద్రజిత్తుఁడు హనుమంతుని బ్రహ్మాస్త్రంబునఁ గట్ట; అరయ నందుపై మోకులు గట్టిన నల బ్రహ్మాస్త్రము వదలె' నని చెప్పెను. ప్రవృత్తిమార్గమున హరి నాశ్రయించిన పిదప

మరల విశ్వాసహీనుఁడై కర్మమార్గ మవలంబించుట తగదు. వ్యర్థము. అదెట్లన నా విషయమున హనుమంతుని వృత్తమునె యర్థాంతరన్యాసాలంకారముగాఁ జెప్పెను. అట్లు అన్నమాచార్యుల కవిత్వమందు హనుమంతుఁడు ప్రత్యేక స్థాన మంది యీ వాగ్గేయకారునిచేఁ గీర్తింపఁబడెను.

## త్యాగరాజ కీర్తనలు - హనుమంతుఁడు

ఆంధ్రవాఙ్మయమున వాగ్గేయకారులలో ప్రత్యేక స్థానము నందినవాఁడు త్యాగరాజు. ఈతఁ డనన్య రామభక్తుఁడు. సర్వజిత్ నామ సంవత్సర వైశాఖ శుద్ధ షష్ఠి సోమవారం జనించిన త్యాగయ్య సంకీర్తనము ద్వారా తరించి ఆ మార్గములో కలకాలము భక్తులు, గాయకులు తరించుటకు మార్గము చూపెను. 1763 ఈతని కాలము. అంతటి రామభక్తుఁడయ్యు 'యత్ర యత్ర రఘునాద కీర్తనం' అన్న హనుమంతునిపై నొండు రెండు మాత్రమే పూర్తి కీర్తనలుగ రచించినవి కావచ్చును. రామకీర్తనలందు మాత్రము హనుమంతుని స్మరించుట బహుధా కానవచ్చును. హనుమంతుని చనువు, సాన్నిహిత్యము కోరువాఁడు కాన

"మనసు దెలిసి కలిసి హనుమంతుఁ డుండగా
చనువు మాట లాడ చుండె సార్వభౌముఁడు'

అని ఖరహరప్రియ రాగము త్రిశ్రలఘు తాళమున ననును. ఇందు సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమంతుల మాత్రము దెల్పుచు హనుమంతుని పట్టాభిరాము ముఖ్యునిగ భావించెను అందుననే కుంతలవరాళి రాగము దేశాది తాళమున

''చెంతనే సదా యుంచుకోవయ్యా
మంతు కెక్కు శ్రీమంతుఁ డౌ హనూ
మంతు రీతిగా శ్రీకాంత!''

అని ప్రార్థించెను. కేవల హనుమత్పరముగా సురటిరాగమున దేశాది తాళముననే

'గీతార్థము సంగీతానందము
'నీ తావునఁ జూడరా ఓ మనసా ॥గీతా॥
సీతాపతి చరణాబ్జము లిడుకొన్న
వాతాత్మజునకు బాగ తెలుసురా ॥గీతా॥

అనిన కీర్తనలోఁ దత్త్వశాస్త్రము, సంగీతశాస్త్రములయొక్క పరమార్థ

పాహి రామదూత జగ - త్ప్రాణ కుమార మాం ॥పా॥
వాహినీశ తరణ దశ - వదన సూను తను హరణ ॥పా॥
ఘోరా సుర వారాంనిధి - కుంభతనయ కృతకార్య
పారిజాత తరునివాస - పవనతుల్య వేగ ॥పా॥
పాద విజిత దుష్టగ్రహ - పతిత లోకపావన
వేదశాస్త్ర నిపుణ వర్య - విమలచిత్త సతతం మాం ॥పా॥
తరుణారుణ వదనాబ్జ - తపనకోటి సంకాశ
కర ధృత రఘువర సుచరణ - కలి మలాభ్ర గంధవహ ॥పా॥
కరుణారస పరిపూర్ణ - కాంచనాద్రి సమదేహ
పరమ భాగవత వరేణ్య - వరత్యాగరాజ నుత ॥పా॥

ఇది పూర్ణ సంస్కృత కీర్తనము. ఇందు హనుమత్పర మగు ముఖ్య శ్లోకమును

శ్లో॥ ఆంజనేయ మతి పాటలాననం -కీ॥ తరుణాబ్జవదనాబ్జ
కాంచనాద్రి కమనీయ విగ్రహం - కాంచనాద్రి సమ దేహ
పారిజాత తరు మూల వాసినం - పారిజాత తరు నివాస
భావయామి పవమాన నందనం - జగత్ప్రాణ కుమార

అని కీర్తించినట్లు తెలియును త్యాగరాజు తిరుపతినుండి తన పర్యటనలో ఘటికాచల క్షేత్రమునకు వచ్చి యోగాంజనేయస్వామిని దర్శించి అట నీ కీర్తన మాలపించెను. ఈకీర్తనయందు వాయుకుమారత, అక్షహననము, సముద్రతరణము, శ్రీరామ పాదసంసేవనములు మాత్రముచెప్పిన త్యాగరాజు హనుమత్కథాసూచనఁ గావించుచు 'అంతకారి నీ చెంతఁజేరి హనుమంతుఁడై కొలువలేదా ॥ఎం॥ అని హరికాంబోజి రాగమున దేశి తాళమునఁ గీర్తించెను. ఇందు రుద్రాంశ సంభూతత్వ విషయము సూచితము. తోడి రాగమున నాది తాళమునఁ జెప్పిన

''చేసిన దెల్ల మరచితివో ఓ రామ రామ!
సీతాభామ మాటలు తెల్పు
భీమాంజనేయు బ్రహ్మ ।చేసినదెల్ల।

కీర్తనమున భీమసోదరత్వము, భవిష్యద్బ్రహ్మత్వము నాశబ్దములతో సూచించినవాఁ డయ్యెను.

త్యాగరాజు తన కీర్తనములం దెల్లెడల హనుమంతుని పవననంద నునిగనే చెప్పుట కానవచ్చును వాతాత్మజాది శబ్దపద ములున్నను ఆ యర్థమునే ఎక్కుడు గ్రహించెను.

పవనజ శబ్దమునకు :

"దుష్కర్మలను కొండ లెగయ రామ
నిష్కల్మషపవనజుఁడుండ సదయ"

అని ధన్యాసి రాగము చాపు తాళమునఁ బల్కుటలో సంజీవ పర్వతోత్పా టన కౌశలము సూచితము. శంకరాభరణమున ఖండలఘుపు తాళమున "సీతా కల్యాణ వైభోగమే పవనజ స్తుతి పాత్ర పావన చరిత్ర" అనుచు పెండ్లినాటికి లేని హనుమంతుని పెండ్లిపాటలోఁ గీర్తించుటలో సీతారామ శబ్దములతోనే హనుమ చ్ఛబ్ద మవినాభావ సంబంధము కలదని సూచించు టకే. 'హుసేని రాగము త్రిశ్రలఘు తాళమున "సర్వలోక దయానిధే సార్వభౌమ దాశరథే" కీర్తనయందు పవనకుమారుఁడు బంటైన వాఁడవు నీ వనును. బిలహరి రాగము దేశాది తాళమున 'కనుగొంటిని శ్రీరాముని నేడు పవమానసుతుఁడు పాదములఁబట్టు నేడు కనుగొంటి' ననును. ఈ కీర్త న కావేరియందు త్యాగయ్యకు శ్రీరామ పంచాయతనము లభించిన శుభ వేళ చెప్పినది. "భవనుత నా హృదయమున రమింపుము బడలిక దీఱ పవనసుత ప్రియ తనకై తిరిగిన బడలిక దీఱ నని కొనియాడెను.

'వాతాత్మజ' శబ్దమునకు : శ్రీరాముఁడు హనుమంతునకు సులభసాధ్యుఁ డను నిశ్చయమున త్యాగరాజు పల్కుచుండును. 'శ్రీరామరక్ష' యందు రక్షాతిలకముఁ బెట్టుటఁ గూర్చి 'రక్షఁబెట్టరె దొరకు రక్షఁబెట్టరే' యనుచు భైరవి రాగమున నాది తాళమున 'వాతాత్మజునకు చెయి వశమైన దొరకు రక్షఁబెట్టరె' యని పాడును. హుసేని రాగమున నాది తాళమున 'భజ రామం సతతం మానస' ॥భజ॥ 'వాతాత్మజ సులభం వరసీతా వల్లభం' అనును. భైరవి రూపకమున 'ఉపచారముచేసే వా రున్నా రని మరచితివో" యనుచుఁ దొలుత 'వాకిటనే పడిలంబుగ వాతాత్మజుఁడున్నా డని" అని 'నే నవసరము లే దనుకొన్నావా? యని ప్రార్థించును. నిందా స్తుతిఁ జేయుచు యదుకులకాంభోజి రాగమునవాది తాళమున త్యాగరాజు

''ఏ తావున నేర్చితివో - రామ! ఎందు కింత గాసి సీతా లక్ష్మణ భరత రిపుఘ్న వాతాత్మజాదులతో నాడే నాటక ॥ఏ తావున॥

నని రాముని దొక నాటకమని యందు హనుమంతుని పాత్రనుకూడ చూపెను. ఎచ్చటయినను రామునితో సీతను, సోదరులను, హనుమంతుని గూర్చి పల్కుట కాననగును. శ్రీరాముని సేవింప నేర్చినవాఁడు హనుమంతుఁడే యను నిశ్చయము కలవాఁడు త్యాగరాజు. కేదారగౌళ రాగము చాపు తాళమున 'కరుణాజలధీ దాశరదీ''యని యారంభించి 'త్యాగరాజ వినుత ఘృణాసాగర సమీరతనయ సేవిత' లని పొగడెను. ఇందు సమీర తనయ యని చారుకేశి రాగము దేశాది తాళమున

''చదువు లెన్ని దెలిసి శంకరాంశుఁడై
సదయుఁ డాశుగ సంభవుఁడు మ్రొక్క
కదలు తమ్ముని బల్కఁజేసితివి
గాకను త్యాగరా జేపాటిమాట''

అనుము. ఆశుగసంభవ శబ్దము ప్రయోగించిన యిట హనుమంతుని జ్ఞానినా మగ్రగణ్యత, రుద్రాంశ సంభూతత్వము, దయార్ద్రతచెప్పుటయు గాక కిష్కింధాకాండయందు హనుమద్రామ ప్రథమ సమావేశమున రాముఁడు తానుగా మాటాడక లక్ష్మణునిచే మాటాడించిన విషయమును చెప్పుచు నంతటి హనుమంతునితోనే మాటాడని వాఁడ వని రాము నను టలో హనుమంతుని విశిష్టతఁ బ్రకటించెను విశేషపరివార మందిన 'సీతమ్మ మాయమ్మ శ్రీరాముఁడు మా దు తండ్రి' యను లలిత రాగ రూపకతాళమున 'వాతాత్మజ సౌమిత్రి వైనతేయ రిపు నుర్దన తాత భరతాదులు సోదరులు మాకు ఓమనసా''యని పరివారమును చెప్పుకొనెను. రామబాణముకన్న రామభక్తియే మిన్న యని హనుమంతుఁడు నిరూపించెను. అప్పటి రామభక్తియొక్క గొప్పతనమును పంతువరాళి రాగము రూపక తాళమున నిట్లు చెప్పెను.

'అప్ప రామభక్తి యెంతో గొప్పరా మా ॥అప్ప॥
కపి వారధి దాటునా కలికి రోటికి గట్టునా॥
అపరాధి త్యాగరాజు కానందము చాటునా మా -॥అప్ప॥
శ్రీ రాగము నాది తాళమున

త్యాగరాజు తన కీర్తనముసం దెల్లెడల హనుమంతుని పవనసంద నునిగనే చెప్పుట కానవచ్చును వాతాత్మజాది శబ్దపద ముఖ్యను ఆ యర్థమునే ఎక్కుడు గ్రహించెను.

పవనజ శబ్దమునకు :

"దుష్కర్మలను కొండ లెగయ రామా
నిష్కల్మషపవనజుండుండ సదయ"

అని ధన్యాసి రాగము చాపు తాళమునఁ బల్కుటలో సంజీవ పర్వతోత్పాటన కౌశలము సూచితము. శంకరాభరణమున ఖండలఘుపు తాళమున "సీతా కల్యాణ వైభోగమే పవనజ స్తుతి పాత్ర పావన చరిత్ర" అనుచు జెండ్లినాటికి లేని హనుమంతుని పెండ్లిపాటలోఁ గీర్తించుటలో సీతారామ శబ్దములతోనే హనుమచ్ఛబ్దమవినాభావ సంబంధము కలదని సూచించుటకే. 'హుసేని రాగము త్రిశ్రలఘు తాళమున "సర్వలోక దయానిదే సార్వభౌమ దాశరథే" కీర్తనయందు పవనకుమారుఁడు బంటైన వాఁడవు నీ వనును. బిలహరి రాగము దేశాది తాళమున 'కనుగొంటిని శ్రీరాముని నేడు పవమానసుతుఁడు పాదములఁబట్టి నేడు కనుగొంటి' ననును. ఈ కీర్తన కావేరియందు త్యాగయ్యకు శ్రీరామ పంచాయతనము లభించిన శుభ వేళ చెప్పినది. "భవనుత నా హృదయమున రమింపుము బడలిక దీఱ పవనసుత ప్రియ తనకై తిరిగిన బడలిక దీఱ నని కొనియాడెను.

'వాతాత్మజ' శబ్దమునకు : శ్రీరాముఁడు హనుమంతునకు సులభసాధ్యుఁడను నిశ్చయమున త్యాగరాజు వల్కుచుండును. 'శ్రీరామరక్ష' యందు రక్షాతిలకముఁ బెట్టుటఁ గూర్చి 'రక్షఁబెట్టరె దొరకు రక్షఁబెట్టరే' యనుచు భైరవి రాగమున నాది తాళమున 'వాతాత్మజునకు చెయి పసమైన దొరకు రక్షఁబెట్టరె' యని పాడును. హుసేని రాగమున నాది తాళమున 'భజ రామం సతతం మానస' ॥భజ॥ 'వాతాత్మజ సులభం వరసీతా వల్లభం' అనును. భైరవి రూపకమున 'ఉపచారముచేసే వా రున్నా రని మరచితివో" యనుచుఁ దొలుత 'వాకిటనే పదిలంబుగ వాతాత్మజుఁడున్నాడని" అని 'నే నవసరము లే దనుకొన్నావా? యని ప్రార్థించును. నిందాస్తుతిఁ జేయుచు యదుకులకాంభోజి రాగమున నాది తాళమున త్యాగరాజు

''ఏ తావున నేర్చితివో - రామ! ఎందు కింత గాసి సీతా లక్ష్మణ భరత
రిపుఘ్న వాతాత్మజాదులతో నాడే నాటక ॥ఏ తావున॥

నని రాముని దొక నాటకమని యందు హనుమంతుని పాత్రనుకూడ చూపెను. ఎచ్చటయినను రామునితో సీతను, సోదరులను, హనుమంతుని గూర్చి పల్కుట కాననగును. శ్రీరాముని సేవింప నేర్చినవాఁడు హనుమంతుఁడే యను నిశ్చయము కలవాఁడు త్యాగరాజు. కేదారగౌళ రాగము చాపు తాళమున 'కరుణాజలధీ దాశరదీ"యని యారంభించి 'త్యాగరాజ వినుత ఘృణాసాగర సమీరతనయ సేవిత' లని పొగిడెను. ఇందు సమీర తనయ యని చారుకేశి రాగము దేశాది తాళమున

''చదువు లెన్ని దెలిసి శంకరాంశుఁడై
సదయుఁ డాశుగ సంభవుఁడు మ్రొక్క
కదలు తమ్ముని బల్కఁజేసితివి
గాకను త్యాగరా జేపాటిమాట''

అనును. ఆశుగసంభవ శబ్దము ప్రయోగించిన యెడ హనుమంతుని జ్ఞానినా మగ్రగణ్యత, రుద్రాంశ సంభూతత్వము, దయార్ద్రతచెప్పుటయె కాక కిష్కింధాకాండయందు హనుమద్రామ ప్రదమ సమావేశమున రాముఁడు తానుగా మాటాడక లక్ష్మణునిచే మాటాడించిన విషయమును చెప్పుచు నంతటి హనుమంతునితోనే మాటాడని వాఁడ వని రాము ననుటలో హనుమంతుని విశిష్టతఁ బ్రకటించెను విశేషప్రచారముందిన 'సీతమ్మ మాయమ్మ శ్రీరాముఁడు మా దు తం డి' యను లలిత రాగ రూపకతాళమున 'వాతాత్మజ సౌమిత్రి వైనతేయ రిపు మర్దన తాత భరతాదులు సోదరులు మాకు ఓమనసా"యని పరివారమును చెప్పుకొనెను. రామబాణముకన్న రామభక్తియే మిన్న యని హనుమంతుఁడు నిరూపించెను. అప్పటి రామభక్తియొక్క గొప్పతనమును పంతువరాళి రాగము రూపక తాళమున నిట్లు చెప్పెను.

'అప్ప రామభక్తి యెంతో గొప్పరా మా ॥అప్ప॥
కపి వారధి దాటునా కలికి రోటికి గట్టునా!
అపరాధి త్యాగరాజు కానందము చాటునా మా -॥అప్ప॥
శ్రీ రాగము నాది తాళమున

'ఎందరో మహానుభావులు' కీర్తనను వినని తెనుఁగువాఁ డుండఁడు. ఆ కీర్తనయందు సంగీతశాస్త్ర ప్రవర్తకులు మహావిద్వాంసులు నగువారిని దెల్పుచు

"పరమ భాగవత మౌనివర శశి విభాకర
సనక సనందన దిగీశ సుర కింపురుష కనకకశిపు
సుత నారద తుంబురు పవనసూను బాలచంద్రధర"

అని హనుమంతుని సంగీతకళా కోవిదునిగఁ గీర్తించెను. అదే రీతిగ మాయామాళవగౌళ రాగము దేశాది తాళమున

'విదులకు మ్రొక్కెద సంగీతకో ॥విదుల॥
కమలా గౌరీ వాగీశ్వరీ విధి – గరుడధ్వజ శివ నారదులు;
అమరేశభరత కాశ్యపచండీ – శాంజనేయ గుహ గజముఖాలు;
సమృకండుజ కుంభజ తుంబరు వర – సోమేశ్వర సార్ఙదేవ నందీ;
ప్రముఖులకు త్యాగరాజ వంద్యులకు – బ్రహ్మానంద సుధాంబుధి మర్మ ॥విదుల॥

నని హనుమంతుని సంగీతకోవిదునిగఁ గీర్తించెను. ఏ దైవకార్యమున కయిన, హరికథాదుల కయిన చిట్టచివఱకు హారతి నిడుచుఁ బాడు నేకైక కీర్తన బహు ప్రశస్తమగు త్యాగరాజు కీర్తన

"నీ నామ రూపములకు నిత్య జయమంగళం
పవమాన సుతుఁడు పట్టు పాదారవిందములకు
నీ నామ రూపములకు నిత్య జయమంగళం"

అనునది సౌరాష్ట్రరాగమున నాదితాళమున గానముచేయబడినది అపలీ కీర్తన 'పవమానసుతుఁడు పట్టు'ననియే ఆరంభించుట సహజము. ఇట్లు త్యాగరాజు రామపదములతోఁ బాటు హనుమత్పదములఁ బట్టి ఆంధ్ర వాఙ్మయమునకు వెనలేని సంగీత సాహిత్య సేవ చేసెను.

## రామదాసు కీర్తనలు – హనుమంతుడు

రామదాసుగా ప్రసిద్ధినందిన కంచర్ల గోపన్న ప్రముఖ వాగ్గేయ కారులలో నొకండు. ఈతడు భద్రాద్రి రామునకు పరమ భక్తుడు. ఆలయ నిర్మాత. బాల్య మాదిగా రామభక్తితోఁబాటు రచనా సామర్థ్య మందిన వాఁడు. ఈతఁడు 17వ శతాబ్దివాడు. అంతా రామమయం ఈ జగమం

తా రామమయం'' అని సమస్తమును రామమయముగ భావించిన రామదాసు కీర్తనలను వినని యాంధ్రుఁడుండఁడు. 'సీతమ్మకుచేయిస్తి చింతాకు పతకము' వంటి కీర్తనల వినని భక్తుఁడుండఁడు. గోపరాజు దాశరధీ శతకము కవితా మార్గమటనను ప్రశంసితము. ఇంతటి రామభక్తుఁడై రామదాసుగా విఖ్యాతుఁడైన గోపన్న అట్టి రామభక్త హనుమంతునకు కూడ తన పదజాలమున ఎక్కుడు చోటీయక తన కవితనుకూడ అంతా రామమయముగఁ జేసెను. రామ కీర్తనలందే ఆంజనేయ నామ సముచ్చారణము కాననగును. బాల్యముననే రచించిన ఆనందభైరవి రాగమున నేకతాళమునఁగల 'ఆశ పుట్టె శ్రీరామునితో ఆహా! నే పుట్టనైతి రఘురామునితో నే పుట్టనైతి' నను కీర్తనలో 'ఆంజనేయాంగద ముఖ్యాదుల వారలతో గూడి వెదుకుదు గద!' అని సీతాన్వేషణ విషయముఁ జెప్పను.

''బ్రహ్మాదులు హరి ప్రస్తుతింపగా
తల్లి మారుతి దండ వేయగా
నా తల్లి యప్పుడు నాకు వేయునుగద
కష్టపడితి నని కరుణించుచును''

అని హనుమంతుని కృత కృత్యతఁ బరోక్షముగ నుతింగును.

వరాళి రాగము రూపక తాళమున.

''ఎంతో మహానుభావుఁడవు
ఎంతో చక్కని దేవుఁడవు
వింతను జేసితి వీ లోకమందున'' అనుచు
తొలివేల్పు జాంబవంతుని చేసినావు (బ్రహ్మ)
తొలి వేల్పు పవనజుగాఁ జేసినావు (శివ)
నారాయణా! నీవు నరుఁడ వైనావు (విష్ణు)

అను కీర్తనయందు హనుమంతుని శివస్వరూపత సూచించెను. మధ్యమావతి అట తాళమున ''బిడియ మేల నిక మోక్ష మిచ్చి నీ వడుగు దాటి పోరా' అను కీర్తనయందు ''అరుదు మీర లని వెగురువేయ నే హనుమంతుఁడ గాను '' అనుటలో రామదాసు శ్రీ హనుమంతుని యవ్యాజము, అమాయకము నగు భక్తినిఁ బ్రకటించెను.

సౌరాష్ట్ర రాగము : చాపుతాళమునఁ బల్కు కీర్తన 'రామచంద్ర నన్నేల రక్షింపవో నేనెఱుగ' ననుచు మొదలిడి బలిమితో హనుమంతుని వలె పా

టు పడనేర'' నని కీర్తించును. ఇట్లే శతుర్వింశతి నామ ప్రతిపాదక వా
ర్తికలో శ్రీరామ పరముగాఁ జెప్పుచు ''శబరియుపదేశ పంపాతట హనుమ
త్సుగ్రీవ సంభాషితం"అని యందే ''దత్తముద్రికాగ్రగత స్వామ గ్రాంజనే
య వినయ వచన రచనాంబుధి లంఘనోల్లంఘిత లంకిణ ప్రాణోల్లంఘ
న జనకజా దర్శ నాక్ష కుమార మారణ లంకాపురీ దహన తత్ప్రతిష్ఠిత
సుఖ ప్రసంగ ధృష్టద్యుమ్నం''

అని హనుమచ్చరిత్ర నొక్క వాక్యమునఁ జెప్పెను. ఇట్లు రామ
దాసు సందర్భవశమున హనుమంతుని జెప్పుట తప్ప హనుమత్పరముగ
రచనలఁ జేయలేదు.

## వాసుదాసకీర్తనలు - హనుమంతుడు

శ్రీ వాసు దాస స్వామిగా ప్రఖ్యాతులైన వావిలికొలనుసుబ్బారావు
గారికి ఇష్టుఁడగు హనుమంతుఁడు ఒంటిమిట్టసంజీవరాయుడు. ఆయనపై
వాసుదాసుగారు కొన్ని కీర్తనలు రచించిరి. భక్తులయందు విశేష
ప్రచారమందిన యవి

[1] 1. హిందూ స్థాని రాగము - ఆది తాళము సందలి

దయఁ గనుమా మారుతీ——మారుతీ
దయఁగనుమా మారుతీ!
వయముగ నిను మది ననయము గొలుతును ॥దయ॥ అనునది:

[2] 2. స్వామి యొంటిమిట్ట-సంజీవరాయా!
ప్రేమముతో మమ్ము -వీక్షింపుమయ్యా॥స్వామి॥
నీపాద సేవకు నిలిచితిమయ్యా
పాపములను బాపి-పాలింపవయ్యా ॥స్వామి॥ యనునది;

కాంబోజరాగము-ఆదితాళమందలి

[3] 4. సంజీవరాయ నీ కంజలి మోడ్చెద-కుంజనాపర నందనా
అంజిక దీర మా-సెంజలిఁబాపుము-కొంజికసతచందనా ॥సం॥

అను కీర్తనయును అట్లే ప్రసిద్ధమగు మంగళహారతి

[4] 4, రామచంద్రదాసాయ భూమి జార్తినాశాయ
కామ రోషవర్జితాయ-స్వామిమంగళం ॥రామ॥

---

1. వాసుదాసకీర్తనలు పుట 11
2. వాసుదాసకీర్తనలు పుట 11
3. వాసుదాసకీర్తనలు పుట 12
4. వాసుదాసకీర్తనలు పుట 68

వాసుదాస హృదయకమల-వాసాయ పంచవదన
భాసాయ కీశలోక-వాలమంగళం ॥రామ॥ అనునది.

వాసుదాసు భక్తికార్యక్రమముల నిర్వహణకేర్పాటు చేసిన సంస్థ శ్రీ కోదండరాము ధర్మసేవక సమాజము దాని కధ్యక్షుఁడీ ఒంటిమెట్ట సంజీవ రాయుఁడు అదే విషయమును పంతువరాళి రాగమున నాది తాళమున రచించిన 'అదిగో ఒంటిమెట్ట-కోవెల-ఇదిగో కనుఁ గొనుడీ!' అనుకీర్తన యందు 'మహిరామసేవా సమాజాధ్యక్షుఁడు రహిగను సంజీవరాయుం డుండెడి ॥దదిగో॥ అని తెలియజేసిరి. అట్లే సింహేంద్రమధ్యరాగం ఆట తాళమున

[2] "శ్రీ రామ మత ధర్మముల్ చెప్పెద వినుడీ" యనుచు "శ్రీ సీతా హనుమాను - పూరుషాకారులు దాస జనుల కెల్లను; దాసజనుఁస్థితి దాశరధికి దెల్పి వాసిగఁ బ్రోవంగఁబలుకుచుందురు ప్రేమ ॥శ్రీరామ॥ అని శ్రీరామునిఁ జేరుటకు హనుమదనుగ్రహావశ్యకతఁబల్కిరి. శంకరాభ రణమం దేకతాళమున [3] "జనని జానకమ్మ జనకుఁడురాముడు'' కీర్తన 'చనవారుచుట్టము సంజీవరాయుంఁడు మనకేమి తక్కువ సఖులారా!' అ నును. శ్రీహనుమంతునిపై వాసుదాసు లాలిపాట రచించిరి. శ్రీరాగమున ఏకతాళమున విరచితమైన

[4] లాలి శ్రీ హనుమంత-లాలిగుణవంత
లాలి యశోవంత-లాలి ధీమంతా' యనుకీర్తన యందు
''వాసుదాసుని నేకశిలకు రప్పించి
కౌసలేసునికార్యములను దీక్షించి" యని యందురు.

మద్రాసులో నుద్యోగమున నున్న వీరిని స్వప్న సాక్షాత్కారము ద్వారా ఒంటి మెట్టకు పిలిపించుకొనెను.ఆకారణమున నా సంజీవరాయఁడి ష్టుఁ డయ్యెను.వానినే తమ సమాజాధ్యక్షునిగాజేసికొని భక్తికార్యక్రమము ల నిర్వహించిరి. వీరి ప్రచురణలును ఆసమాజముపేరనే ప్రకటింప బడుట గుర్తింపగలము. నీలంరాజు ఆదినారాయణదాసు-శ్రీ వీరాంజనేయ సంకీ ర్తనలు అనుపేర

---

1. వాసుదాస కీర్తనలు పుట 16
2. వాసుదాస కీర్తనలు పుట 14
3. వాసుదాస కీర్తనలు పుట 105
4. వాసుదాస కీర్తనలు పుట 6

1. నాటరాగం-జంపెతాళమున-జయజయ హనుమంత
2 దర్బారురాగం-ఆటతాళమున-వీరాంజనేయ నిను వేమారు గొలిచె
3. కళ్యాణిరాగం చాపుతాళమున-సీతప్రాణదాతవని ప్రఖ్యాతి కెంటివి
4. మధ్యమావతి-ఆటతాళమున-జయమంగళం నిత్యశుభమంగళం
అను కీర్తనలను రచించెను.

# ఇతర కీర్తనలు - హనుమంతుండు

హనుమత్సేవ పత్రికద్వారా వెలువడిన హనుమత్పరమగు గేయములు, కీర్తనలు ఎన్నో కలవు. అవి భక్తిప్రధానములై హనుమచ్ఛక్తియు కృపానుగ్రహములను చాటును. అట్టి రచనలు క్రింద ఈయబడుచున్నవి. వానిలో

కొలచిన గౌరీశంకరమ్‌గారి రచనలు :

| | | |
|---|---|---|
| 1. | జయ హనుమంతుడు - అంజనీసుతుడు | జూన్ 1984 |
| 2. | అమిత బలమునకు సరిలేనివాడు | జూన్ 1984 |
| 3. | కడలేని అబ్ధిని చిన్న మడుగువలె | జులై 1984 |
| 4. | మనసువోలె - వేగముగలవాని | జూలై 1984 |
| 5. | సర్వానిష్ట - నివారణశీలుడు | ఆగష్టు 1984 |
| 6. | ఓ హనుమంతా - జయ హనుమంతా | ఆగష్టు 1984 |
| 7. | నీవే దిక్కగ - నమ్మినభక్తుడ | ఆగష్టు 1974 |
| 8. | నిరతము నినునే తలచుచుంటిని | నవంబరు 1984 |
| 9. | రాక్షసజాతికి - అతడు పిడుగు | నవంబరు 1984 |
| 10. | శ్రీవర! అఖిలవేద స్వరూపా | ఫిబ్రవరి 1985 |
| 11. | ఒక హస్తముతో అభయము నిచ్చును | మార్చి 1985 |
| 12. | ఏతీరుగ నను ఆదరింతువో ఓ హనుమంతా! తెలియనుగ | మే 1985 |
| 13. | వానర నరసింహ - గరుడ వరాహ అశ్వముఖములు - కలిగినవాడు | జూలై 1985 |

అరుణప్రియగారి రచనలు :

1. జయ జయ మహాదేవ సత్యశౌర్య ధౌరేయా ఏప్రియల్ 1985
2. అతిశయ విజేతా - అద్భుత తేజ స్వముపేతా జనవరి 1985

3. జయ జయహో వీరాంజనేయా విక్రమోజ్జ్వల వీరచరితా మే 1985
4. అరుణారుణ ప్రభాకలిత కరుణాలయ సురుచిరమూర్తి మే 1986
5 విద్యున్మాలికా నిభాననమ్ పంచముఖాత్మకమ్ మార్చి 1985

కొండూరు సూర్యనారాయణభట్‌గారి రచనలు :

1. వనజసన్నిభ వక్త్ర సత్వావకాక్షు-పటుతర
ఘనగాత్రు కనకవర్ణు మార్చి 1984
2. వాంచిత ఫలప్రదాతః యోపవనతనయ ఆర్తజన
పరిరక్షణా ఏప్రియల్ 1984

అమరవాది చందలూరి మహాలక్ష్మీవత్సల్ గారి రచనలు :

1. హనుమా కరుణించుమా ఏప్రియల్ 1985
2. హనుమత్సేవ చేతము రారండి ఏప్రియల్ 1988

సి. హెచ్. సావిత్రి బాలక్రిష్ణ గారి రచన :

1. మరవనీకుమా ఓ రామా నీ నామ మెపుడు ఆగష్టు 1985

శ్రీమతి టి. వి. రత్నావళిగారి రచన :

1. ప్రేమతోనే హనుమంతుని పిలువానంపె రామస్వామి జనవరి 1986

కె. సూర్యనారాయణగారి రచన :

1. హారతి పట్టెద హనుమ నిముస ముండు మే 1984

డా॥ పులిపాక వేంకటసుబ్బారావుగారి రచన :

1. అంజనిసుత మము కాపాడుమయ్యా జూన్ 1983

వ్యాంసాని రాజశేఖరం

వాయునందనుని వేడరా ముక్తిమార్గమును చూడరా సెప్టెంబరు 1982

పాలకోడేటి సూర్యనరసింహారావు

రామ హనుమన్ - శ్రీరామ హనుమన్
వైశాఖ మాసాన - కృష్ణ పక్షమున మే 1982

ఋూదెల సత్యనారాయణమూర్తిగారి రచనలు

1. శరణు శరణన్న వారల కరుణతోడ ఫిబ్రవరి 1986
2. పరమపావన!సుచరిత్ర వాయుపుత్ర డిశంబరు 1985
3. శ్రీరఘూద్వపుసేవ కీ జీవితమును అక్టోబరు 1985

— × —

# దేశి సారస్వతమున - హనుమత్కథ

దేశి సారస్వతమున బహుళ ప్రచార మందినవి స్త్రీలపాటలు. తెలుగునాట రామభక్తి త్యాగరాజ రామదాసాదులచే బహుళప్రచార మందక పూర్వమే స్త్రీల పాటల రూపమున రామకథద్వారా హనుమత్కథయు నెన్నో రీతుల వ్యాపించినది. ఒకరినుండి మరియొకరుగా పాటలు కాలాంతరములకు నిలచినవి తప్ప రచయితలు లేదా రచయిత్రులు మాత్రము తెలియరారు. స్త్రీల రామాయణపు పాటలను పేర వీనిని సేకరించి ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రకటించెను. అట్టి స్త్రీల పాటలందు హనుమద్విషయము లనేకములు కన్పట్టును. [1] 'సంక్షేపరామాయణ' మను గేయమున రామాయణగత హనుమత్కథ సంక్షిప్తముగ గలదు. 'సీతాదేవి ఆనవాళ్ళు' అను గేయము కలదు.

[2] "శ్రీకాంత రూపమ్ము మాకు ఎరిగించి
అతివ మెచ్చేటట్టు ఆనవా లిమ్ము"

అను హనుమంతుని ప్రశ్న ఆధారముగా ఈ గేయ మంతయు రామునిచే హనుమంతునకు జెప్పబడెను. ఇందు

"ఎప్పుడూ శ్రీరామ యని దలచు చుండు;
మన సీత జానయ్య - మత్స్యవల్లభుడా!"

అని రాముడు మత్స్యవల్లభునిగా హనుమంతుని సంబోధించెను. మత్స్యవల్లభుడు హనుమంతుని పుత్రుడుగా మైరావణచరిత్ర చెప్పుచున్నది. సముద్రలంఘనమున బడిన హనుమంతుని స్వేదబిందువువలన చేప ఆ పుత్రుని కనె నని యా ఐతిహ్యము. అట్టి చేపకు బతి యను నూహతో హనుమంతునే మత్స్యవల్లభునిగ బ్రయోగించినట్లు భావింపవలయును. రామాయణమున హనుమంతునకు సీత పూర్వవృత్తాంతముల గుర్తుచేయ జెప్పును. స్త్రీలు తోటి స్త్రీచే నిట్టి శృంగారవిషయములు చెప్పించుటయందభిమానపడి కాకాసుర వృత్తాంతము కూడ రామునిచేతనే చెప్పించిరి. 'సీతచెఱ' యను గీతమున దీనికి తగినటులే సీతచే [3] 'ఏమోయి హనుమంతవస్తివి-మాకుఏమిఆనవాళ్ళుతెస్తివి' అనియడిగించును. అందే 'ఇట్టి

1. స్త్రీల రామాయణపు పాటలు - పుట 1
2. స్త్రీల రామాయణపు పాటలు - పుట 124
3. స్త్రీల రామాయణపు పాటలు - పుట 132

అడవులలోకి హనుమంతా-మీరు-ఎట్లు వస్తిరయ్య హనుమంతా అని' సగౌరవముగ సీత యాశ్చర్యము వ్యక్తపఱచును.

[1] 'సీత ముద్రికలు' అను గీతమున 'వే మారుతాత్మజు డబ్ధినీ కాలవవలె దాటి' అని చెప్పెను. ఇందు హనుమంతుఁడు శింశుపావృక్షమున దాగి సీతకడ రామనామాంకిత ముద్రికఁ బడవైచును. ఆమె దానితో 'వినవె ముద్రిక! నాటి వింతలు'అనుచు తన పతితోడి క్రీడావిహారము లన్నియు జెప్పి 'ఉంగ్రమా! మారు పలుక వేమి' యనగా 'శుభము కలిగెనమ్మా' శోక మిం కేలనమ్మ; నీ పతికి హితుడనమ్మా - బంటునై యుందునమ్మా యనుచు హనుమంతుఁడు ప్రవేశించి భాషించును. 'సుందరకాండము' అను గేయమును శాపగోపాలుఁడు రచించెను.

ఇట్టిగేయముల గానవచ్చునది'లంకాయాగ'మనునదొక్కటి.ఇందు హనుమంతుని బలమును గుర్తించి రావణుఁడు [2] "వనచరుఁడు నీ వంటి బంటు నాకుంటేను నొక్కడే బంటు చాలు; మారురాజ్యా మనక మావద్ద కొన్నాళ్ళుకొలిచి నిలిచే యుండుమా' యనుట విశేషభావనము. రాజ్యమున సగభాగ మిత్తు నని ప్రలోభపెట్టును కూడ. ఈ కల్పన మంతయు హనుమంతుని విశేషశక్తి, గుణములఁ బరిణమించును. ఇందే హనుమంతుని తోకకు నిప్పువెట్ట నెన్ని వస్త్రములు తెచ్చినను చాలలేదు. చివఱకుఁ 'సీతచీరా యని రావణుఁడు దలచితే చిపుకునా తోక ముడిచె'యని చెప్పుట చమత్కారయుతమై సీతామతల్లియందలి మారుతిభక్తిని చాటుచున్నది. అంగదుఁడు తన రాయబారమున హనుమంతుని గూర్చి 'నీ లంకకాల్చి నా హనుమన్న మాబావ"అని రావణునితో ననుట; 'వచ్చె మీ మేనల్లుడు' అని సుగ్రీవునితో ననిపించుటల చుట్టరికముల వ్యవహారము స్త్రీల పాటలకే చెల్లును. విశేషానుభూతిఁ గల్గించును.

ఇందు హనుమద్విజయ మగు కాలనేమి వృత్తాంతముకూడ చెప్పఁబడెను. సంజీవి పర్వతనుఁ గొనివచ్చు హనుమంతుని సూర్యునిగ భ్రమించి రాముఁ డస్త్రము ప్రయోగింప నుంకించుటయుఁ జెప్పఁబడెను. [3] 'సీత అగ్నిప్రవేశ'మను గేయమున సీత నగలను హనుమంతుఁడు

---

1. స్త్రీల రామాయణపు పాటలు - పుట 134
2. స్త్రీల రామాయణపు పాటలు - పుట 152
3. స్త్రీల రామాయణపు పాటలు - పుట 167

తెచ్చి యిచ్చినట్లు కలదు. మూలమున సుగ్రీవుఁడు తెచ్చి యిచ్చెను. సీత అగ్నిప్రవేశము చేయబోవుచు 'వాయుపుత్రా! నీవు వడిగాను పోయి అగ్ని గావింపుమీ అతిశీఘ్రముగను" అని చెప్పుట కలదు. మూలమున దీనిని లక్ష్మణుఁ డేర్పరచెను. ఇట్టి ప్రాధాన్యతలు కనవచ్చును. రాముని రాకను గుహభరతులతోఁబాటు శబరికిగూడ హనుమంతుఁడు చెప్పును.

[1] 'సేతుమాహాత్మ్య' మను పాటయందు హనుమంతుఁ డేడుగడియల లోపల లింగంబుఁదెచ్చితిని. నన్ను వృథ చేయుట న్యాయంబుగాదనుట వలన రాముఁడు 'హనుమంతుఁడు దెచ్చిన లింగము నర్చింపక రామ లింగము జూడ నర్హంబు గా'దని, తీర్థఫలము లేదని వర మిచ్చెను.

[2] 'గుహభరతుల అగ్నిప్రవేశ' మను గేయమున సీత గుర్తుచేసి గుహుని విషయముగూడ హనుమంతునకుఁ జెప్పించును. [3] 'శ్రీరామ పట్టాభిషేక' మను గేయమున హనుమ త్సన్మానము వర్ణింపఁబడెను. అనర్ఘ

హారమును రాముడిచ్చిన దానిని సీత
"నా యాత్మబంధుండ జీవరక్షకుడా
మాయన్న హనుమంత రమ్మనుచు బిలచి" యీయ
"సంజీవపర్వతం బెత్తిన హస్తములా
సుమిత్ర పచ్చలాకడియాలు పెట్టె
బంగారు అందెలు బెట్టె కౌసల్య'

అని యిట్లు గారవించుట చెప్పఁబడెను. [4] 'సీతసురటి' యందు పైతము శ్రీరాముఁడు హనుమంతుని సాహసకృత్యములు పొగడి సర్వమునకు నీవె కారకుడ వని షడ్రసోపేతమగు భోజనము దనతో బెట్టించ రాము భుక్త శేషము గొంపోయి అవి సెచెట్టుపై పెట్టుకొని ద్వాదశికి ఒకపూర్ణ కొమ్మపై నుంచెను. రాముఁడు పిలువ రామచిలుకవలె చేతిపై వ్రాలి ధరణిపై దించి హనుమంతునకు ముత్యాలహారము రాముఁడు వైచెను.

[5] "లక్ష్మణ దేవరలన' వ్రాక వింతపాట. లక్ష్మణుని పన్నకు కార

---

1. స్త్రీల రామాయణపు పాటలు – పుట 177
2. స్త్రీల రామాయణపు పాటలు – పుట 187
3. స్త్రీల రామాయణపు పాటలు – పుట 200
4. స్త్రీల రామాయణపు పాటలు – పుట 11
5. స్త్రీల రామాయణపు పాటలు – పుట 225

మెవరికివారు తమ లోపము నెంచిరియే యనుచు భావించుకొనిరి. హనుమం తుండు 'పెద్దవాడి నెంతయిన పేరులకు పెద్ద; పడుచువానిచేత పట్టుబడితి ననుచు నవ్వె'నని భావించెను. [1] 'ఏ పుణ్యపురుషుడో దీనిని వ్రాయ వై శాఖపురవాసి కలగర్ల వెంకటరామయ్య పూడిపెద్ది కులాబ్ధి పూర్ణసోముని చక్కగా నీ పదము సమకూర్చెం డని వ్రాసెనట. [2] 'లంకాసారధి గేయ మున లంకలో రావణునెదుట ఘనవాలముగద్దెగాం జుట్టి కూర్చుండినటుల జెప్పంబడెను. ఇట్లు రామాయణ మూలమున లేక జనశ్రుతింగల యనేకాం శము లీ పాటలయందుం జోటు చేసికొనెను. వీనియందు సర్వత్ర పూర్తి గం దెనుంగుదన ముట్టిపడుచు నాత్మీయతం గూర్చునవై ఆయాపాత్రలం దాదాత్మ్యతం జేకూర్చును. పతివ్రతా శిరోమణియగు సీతయందు సాను భూతి సహజము. అర్ద్రహృదయులగు స్త్రీలకు సీతపాత్రయందాత్మీయత అధికము. అట్టి సీతకు సంరక్షకుండగుట స్త్రీలోకమంతకు సీతకువలె హను మంతునియెడం బ్రేమాతిశయము అధికములు. స్త్రీలపాట లన్నిట హనుమ త్పాత్రయం దా ప్రేమాతిశయ గౌరవములు కన్పట్టును.

ఇట్లు ఆంధ్రవాఙ్మయమునకుం బ్రాచీనసంపద యనందగు స్త్రీల పాటలందు హనుమత్పాత్ర ప్రత్యేకస్థానము నందియున్నది. ఇట్టివాని యందు బద్దిరెడ్డి కోటేశ్వరరావు కృతమైన లక్ష్మణమూర్ఛ పదము; యమ్. సూర్యనారాయణశాస్త్రి మరియు పసగాడ సన్యాసి రచించిన శతకంఠ రామాయణములు; కంభంమెట్టు శోభనాచలపతిరావు హనుమద్ధ్వజన కీర్తనలు; దంటు వీరరాఘవయ్య రచించిన హనుమద్విజయము అను గేయములు ముద్రితములైనట్లుగా ఆంధ్రవాఙ్మయసూచిక వలన తెలియుచున్నది.



1. తెలుంగు జానపదగేయ సాహిత్యము - పుట 101
2. స్త్రీల రామాయణపు పాటలు - పుట 361

# ఆంధ్రనాటకములు - హనుమంతుడు

## శ్రీ రామాంజనేయ యుద్ధం

ఆంధ్రదేశమున రంగస్థల నాటకముల యందుఁ బ్రఖ్యాతమైన నాల్గిదింట రామాంజనేయ యుద్ధ మొకటి. ఈ ప్రసిద్ధ రామాంజనేయ యుద్ధ నాటక కర్త తాండ్ర వేంకట సుబ్రహ్మణ్యం. ఈతఁడు నరసింహ శాస్త్రి కోటమాంబల పుత్రుఁడు. వేంకటేశ్వర భక్తుండు. ఇది కల్పితేతి వృత్తమని కవియే కావ్యాదినిఅంజలియందుఁ జెప్పుకొన్న[1] 'కథ అంతా ఒక అభూత కల్పనయేనా లేక ఒకానొక కవి చమత్కారమే చరిత్రగా చలామణి అవుతున్నదా అనే జిజ్ఞాస నా కింత వఱకూ వదలలే'' దనుట వలన దెలియుచున్నది. కానీ[2] దీనిని బ్రహ్మాండపురాణాంతర్గతముగ చిదంబరకవి తెల్పెను. పాత్రలు పౌరాణికములు సుప్రసిద్ధములును.నాట, కముగా బహుళ ప్రచారమందినను యుద్ధసమయమందలి నిందలు ఆ సుప్రసిద్ధ పాత్రలకుఁ గొంత న్యూనభావముఁగల్పించునవై యున్నవి.

ఇందు పదిరంగములుకలవు. ప్రథమార్థమున హనుమ త్ప్రవేశమే లేదు. ఆరవ రంగమున హనుమంతుఁడు ప్రవేశించును. నాటకారంభము కలహ భోజనుండగు నారదుని ప్రవేశముతో నొనర్చుట యుద్ధనాటకమునకు తగియున్నది. ఆరవరంగమున రామేశ్వరక్షేత్రమున నుషఃకాలమున ధ్యాన నిమగ్నుఁడైన అంజనేయుడు ప్రవేశించును. ఆసందర్భమున హనుమంతుండొనర్చిన ప్రార్థనగా

[3] ''ఖండన భీముఁ డార్తజన బాంధవుఁ డుజ్వల బాణ తూణ కో
దండ కళా ప్రచండ భుజ తాండవ కీర్తికి రామమూర్తికిన్''

అను పద్యము స్వీకరింపఁబడెను. ఇది కంచర్ల గోపన్న విరచితదాశరథీ శతకమందలి పద్యము. అందలి ''దాశరథీ! కరుణాపయోనిధీ!'' యను మకుటస్థానమున నాటకకర్త ''సదా విశదంబుగ విశ్వవీధులన్'' అని మార్పు చేసెను. భక్తిబోధకముగను ''దండ దడాండడాండ నినదంబులజాండము నిండ'' నని

1. శ్రీ. రా. యుద్ధం - అంజలిపేరా 2
2. శ్రీరామాంజనేయము - విజ్ఞాపనము
3. శ్రీ రా. యుద్ధము పుట 26

ము క్తాయింపగ నుండుటవలన స్వీకరించి యుండవచ్చును. అరవ రంగమున సుగ్రీవాదులతోఁ గూడియున్న ఆంజనేయుని యయాతి శరణువేడుట, హనుమంతుఁ డభయమిచ్చి రామునితోడి వైర మెఱిఁగి పెక్కుభంగుల విచారించుట, జాంబవదాదు లాలోచించి అంగదుని రాము నికడకు రాయబార మంపుటతోఁ బూర్తి యగును. ఇందు యయాతి వలన రామునితోడి యుద్ధ మేర్పడనున్న ట్లెఱిఁగిన ఘట్టమున నద్భుత రసము, అనంతరము హనుమంతుఁడు

నిన్ను స్మరింపక నీరంబె గ్రోలని
వాఁడనే నిన్నెదురాడు టెట్లు
సంజీవి తెచ్చి నిన్ సాకితి సౌమిత్రి!
గదఖూని నీతోడ కలహ మెట్లు
భరత శత్రుఘ్నులే పాపం బెఱుంగరే
పోరాట మెట్లునిషా్కరణముగ
సీతా మహాసాధ్వి! నా తండ్రి నెదిరించి
పాపినై మొగ మెట్లు చూపగలను

అర్క చంద్రాదులార! మహాత్ములార!
బ్రహ్మ రుద్రాదులార! దిక్పాలులార!
సత్యవాక్పాలనార్థమై స్వామితోడ
సమర మెంచితి నా గ్రహచార మేమొ"

యని మూర్ఛిల్లుటలోఁ గరుణరసము చక్కగ పోషింపఁబడెను. రంగాది హనుమత్సంకీర్తనము భక్తిరసపూర్ణము. వానరుల బాధామయస్థితి గమ నించి వారి మాటల విని వెడలిపోనున్న యయాతితో హనుమంతుఁడు [2] 'ఆగుము. ఆడినమాట తప్పు అధః పతనము రాలే దే హనుమంతునకు అది రామాంజనేయ యుద్ధమే అగుగాక; ఆత్మనాశనమే యగుగాక; సత్య ప్రమాణమును విస్మరింపఁ డీ ఆంజనేయుఁడు.' అనుటలో పావని సత్యవాక్పరిపాలనము, శరణాగత రక్షణము, దృఢ దీక్షయు వ్యక్త మగుచున్నవి. అప్పుడు పల్కిన

1. శ్రీ. రా. యుద్ధం – పుట 29
2. శ్రీ రా. యుద్ధం – పుట 32

1 ''కులగిరు లెల్ల దద్దరిలి కుంభిని గూలిన ఆదిశేషుఁడే
కలబడి నాల్కలన్ పొగల గ్రక్కిన, సంద్రము లెల్ల పొంగినన్
ప్రళయము నావురించినను భాస్కరుఁడే యపరాబ్ధిఁబుట్టినన్
చలనము లేదు నే సలిపినట్టి ప్రతిజ్ఞకు ప్రాణబాంధవా!''

యనుటలో సత్య దయా వీరముల స్థాయి యగు నుత్సాహము చక్కగఁ బోషింపఁబడెను. ఏడవ రంగము నారద ప్రవేశముతోను, ఎనిమిదవ రంగము అంగద రాయబారముతోను పూర్తికాగా తొమ్మిదవ దగు యుద్ధ రంగమున లక్ష్మణ భరత శత్రుఘ్నుల బాణములకు సుగ్రీవాంగద జాంబవంతులు పడిపోదురు. అనంతర మాంజనేయుఁడు ప్రవేశించి పడిపోయినవారిని చూచి విలపించి దేహత్యాగమునకు సిద్ధమై పురల శపధమును తలచి యుద్ధసన్నద్ధుఁ డగును. ఆంజనేయుని ముష్టిఘాతమున లక్ష్మణ భరత శత్రుఘ్నులఁబడవేయు ఘట్టమున హనుమంతుని యందు యుద్ధవీరము పోషింపఁబడెను. పదవ రంగము రామాంజనేయు లెదుర్కొన్న రంగము.

2 ''శ్రీరామ నామ! రఘువంశ పయోధి సోమ!
కామాది షడ్రిపు విరామ! వికుంఠధామ!
కందర్ప కోటి సమ సుందర దివ్యమూర్తే!
శ్రీరామచంద్ర చరణౌ శరణం ప్రపద్యే''

యని హనుమంతుఁడు రామునకు నమస్కరించుచుఁ బ్రవేశించును. ఈ శ్లోక మీ నాటకము కారణముగా మిగుల ప్రఖ్యాతి నందెను. ఈ ఘట్టమున హనుమంతుని భక్తి నంతను రాముఁడు కపటముగఁ దలఁచును. 'రఘురాముని భక్తుఁడ నగు నేనే సత్యపదము దప్పితినని లోకము గ్రహించును కాన యయాతిని వీడ' నను మారుతి మాటకు రాముఁడు
3 ''మారుతీ! ఇది నీ యుక్తివాదముగాని భక్తిమార్గము గాదు. ఈ పాటి న్యాయాన్యాయములు మేమెఱుంగనివి కావు.

''ధర్మము ధర్మమం చిటు వితండ వితర్కము లాడె దేల, ఆ
మర్మము నేనెరుంగు దణుమాత్రము సందియమేల? నిన్నుదు

---

1. శ్రీ. రా. యుద్ధం - పుట 32
2 శ్రీ. రా. యుద్ధం - పుట 52
3. శ్రీ. రా. యుద్ధం - పుట 56

ష్కర్మల పొలుజేయుదు ? కాన త్యజింపు యయాతి వానిదౌ
కర్మను మార్చ్పగా తగిన కర్తవు నీవొకొ మారుతాత్మజా!''

యనును. ఈ పద్యము తెనుఁగునాట ప్రతిపల్లె జనుఁడు కూనిరాగములు దీయుచు పాడునంతటి ప్రచారమందినది.

అట్లు మాటలు పెరిగి రాముఁడు 'అందులకే వనచరులు అతితెలివి గల మూర్ఖులు. నీ యొక్కని మాట యేమి? జాతిలక్షణమే యది'యనగా హనుమంతుఁడు వ్యంగ్యముగఁ జెప్పిన

[1] ''సీతమ్మ జాడ మీ చెవి వేయ మైతిమా
నాటితో రామాయణంబు సున్న
సేతుబంధన మాకు చేతగా దంటిమా
యుద్ధంబు లంక నబద్ధ మగును
మైరావణుని ప్రాణమర్మంబు దెలుపమా
రావణుం డుండాక రాజ్య మేలు
నిశిరాత్రివేళ సంజీవి తే మైతిమా
సౌమిత్రి స్వర్గాన సభలు దీర్చు

ఆలుబిడ్డలె మాకు ప్రాణాల టంచు
అపుడు కిష్కింధ వీడి రా మైతి మేని
కదన విజయంపు మాట యుగాలు దాటు
యింత జేసియు మిమ్ము రవ్వంతయైన
ప్రతిఫలం బెంచకుంట మూర్ఖత్వ మయ్యె
జాతిలక్షణ మెరుగరే కోతి నగుట
ప్రాత చుట్టంబు నే గాదె రామచంద్ర!''

అను పద్యము హాస్యరస స్ఫోరకము. పై శ్లోక పద్యములతోబా టిదియు గ్రామఫోను రికార్డులద్వారా వాడవాడల ప్రచార మందినది. తిరుపతి వేంకటకవుల ఉద్యోగవిజయ పద్యములతోబాటు ప్రతిపల్లె జనుడు రాగాలాపన చేయుచుఁ బాడుకొనునట్టివి. సాష్టాంగపడిన తనను తన్నినను హనుమంతుఁడు రామపాదముల నొత్తుచు 'ఏ పాదపద్మ మాశించి మౌనీశ్వరుల్ సతత నిష్ఠా గరిష్ఠాత్ములైరి' యనుచుఁ బ్రస్తుతించును. అందు

1. శ్రీ. రా. యుద్ధం - పుట 58

హనుమద్భక్తి పారవశ్యము, కవిరచనా దక్షతయుఁ బ్రకటమగుచున్నవి. రాముఁడు విరాట్స్వరూపముఁ జూపి యప్పటికైన యయాతిని వీడుమని సత్యవాక్పాలనకు నిలచిన హనుమంతునిపై దివ్యాస్త్రముపైచి పురార్చితు జేసి యయాతిపైకి సన్నద్ధుఁడగునంతలో మరల హనుమంతుఁడు రెచి నిలువ నింతలో యుద్ధ మాపుఁ డనుచు నారద విశ్వామిత్రులు వచ్చి యుద్ధమును చాలింపఁజేయుదురు. శ్రీరాముఁడు 'స్వస్తి ప్రజాభ్యః' శ్లోకముతో భరతవాక్యము పల్కెను. ఇట్లు, రసభరిత మగు రచనతో హనుమంతుని భక్తితత్పరత, శరణాగత రక్షణ, సత్యవాక్పాలనల నిరూపించుచు నీ నాటకము విఖ్యాతమై యున్నది.

శ్రీరామాంజనేయము : శతావధాని, పద్మపురాణాంధ్రీకర్త యగు పిశుపాటి చిదంబరకవి ప్రణీత మీ నాటకము. ఘటికాశత ప్రగండ కవనధురంధుఁ డగు నీతని తలిదండ్రులు కనకాంబా సీతారాములు. దీనికి మూలముగా

[1] "నారదస్తు తత స్సర్వం ప్రోవచ ధరణీభృతే
రామోద్యోగం కౌశికేన చోదితం చ శపైః శ్శపైః"
ఉక్త్వా దైన్య సమావిష్టం - రుదంతం చ ముహుర్ముహుః
కృపాళుం శ్చోదయామాస హనూమ ద్దర్శనాయ వై
హనూమానుతోపి రామస్య సంగ్రామోఽభూ ద్భయంకరః।"
అనునది యందీయఁబడిన బ్రహ్మాండపురాణ విషయము.

నాందీ ప్రస్తావనాది సర్వనాటక లక్షణ లక్షితమైన ఈ నాటకమున నేఁ డంకములు కలవు. హనుమ త్ప్రస్తావన తృతీయాంకమున వచ్చినను ఈ నాటకమున చతుర్థాంకమున హనుమంతుఁడు ప్రవేశించును. అంగదునితో హనుమంతుఁడు చెప్పిన

[2] "జ్ఞానము లేని భక్తియు రసంబునకున్ వెలియైన కైతయున్
దానములేని సంపదయు ధైర్యములేని బలంబు మానమున్
ప్రాణముఁజూచికొంచు నెడఁబాసెడి మైత్రియు నాడితప్పగాఁ
బూను రసజ్ఞయున్ యశము నందని జన్మము వ్యర్థముల్ సుమీ"
యను సుభాషితము హనుమంతుని నిర్ణయాచరణముల కద్దముపట్టుచు

1. శ్రీ రామాంజనేయము - విజ్ఞాపనము
2. శ్రీ రామాంజనేయము - పుట 45

సూచ్యార్థ సూచనమై బహుళార్థ సాధక మగుచున్నది. యుద్ధ పర్యవసాయి యగు నీ నాటకమున ప్రధానరసము వీరము. శరణాగత రక్షణ కారణ మగు నీ వీరము దయావీర ప్రాధాన్యతఁ దెల్పుచు యుద్ధవీరము నానుషంగిక మొనర్చుచున్నది.

[1] "పొరలెడుఁగాక మీఁదికి సముద్రము లన్నియు దండుతోడ సం
గర మొనరింప నా ప్రళయకాలుఁడు వచ్చెడుఁగాక భూ నభో౦
తరములు గ్రుంగుగాక యిక దప్పక యిప్పుడె తారకా నిశా
కర రవి వహ్ని సాక్షికముగా నిను రక్షణ సేతు నెచ్చెలీ!"

అను హనుమంతుని యుత్సాహము నాదయావీరమునందే పరిణమించును. రామునియెడ భక్తి, వైరములమధ్య నలిగిన హనుమంతుని కరుణాపూర్ణ మగు పాత్రచిత్రణము హృదయ స్పర్శిగాఁ జేయఁబడెను. రచనము, సంభాషములందు శ్రీరామాంజనేయయుద్ధమువలెగాక ఔచిత్యము పాటింపఁ బడెను. ఆంజనేయుని

"కళకళ లాడుచుండగ జగంబున నెందునఁ బాడిపంటలున్
గలిగి సమస్త భాగ్యములు కాపురముం బొనరించుగాక! ని
చ్చలు రఘురామచంద్ర పద సారసభక్తి లభించుగాక! ని
ర్మల కవితామృత మ్మనుపమానగతిఁ బ్రవహించుఁ గావుతన్"

అను భరతవాక్యముతో నాటకము ముగిసెను. స్టేజి నాటకముగా తాండ్ర వారి నాటకమువలె విఖ్యాతము గాకున్నను రచనాసామర్థ్యమున నీ నాటకము కవి పండితాదరపాత్ర మైనది. ఇందు హనుమంతుని యనన్యమగు రామభక్తి రామబాణ సమశక్తిగా నిరూపిత మయ్యెను.

యమాంజనేయ యుద్ధము : ద్వాపరయుగ సంబంధమగు నితివృత్త మిది. యయాతిరక్షణకై యుద్ధరంగమున రామున కెదురు నిల్వవలసి వచ్చినరీతిగా అర్జునరక్షణకై యిందు యమునితో యుద్ధ మొనర్చిన గాథ చెప్పఁబడెను. దీని కర్త ప్రత్తిగొడుపు రాఘవరావు. ఈ నాటకము భగవాన్‌దాస్ హిందీ రచన కనునాదము. ఇది యూరు రంగముల నాటకము. ధర్మజుని యశ్వమేధ యాగాశ్వము కృష్ణార్జునులు వెంటరాగా చంపావతీ నగర ప్రాంతముఁ జేరెను. ఆ నగరము నధీశుఁడు భూరికీర్తి.

1. శ్రీ రామాంజనేయము – పుట 46

అతని యల్లుఁడగు యమధర్మరాజా యశ్వమును పట్టగా నర్జునునితో యుద్ధము జరిగి కపిధ్వజము నేలఁగూలెను. పూర్వ మర్జున రక్షణకు మాట యిచ్చియున్న కతన హనుమంతుఁడు యమునిచే దలఁబడెను. యముని ప్రాణాపాయస్థితికిఁ దెచ్చి గర్వభంగము గావించి ధర్మరాజేఁ గని యాడఁబడి శ్రీరామ సందర్శన మందిన హనుమత్కథ యిందలి యితివృత్తము.

మొదటి రంగమున, రెండవరంగమునను హనుమ ప్రస్తావన మాత్రము కలదు. యమునితోడి సంభాషణమున నారదుఁడు హనుమంతుని పొగడి యమునకుఁ బౌరుషము కల్గించి వారిరువురిమధ్య యుద్ధ మేర్పడుటకు బీజము వైచెను. మూడవ రంగమున హనుమంతుఁడు ప్రవేశించెను. ప్రవేశించుచు రాముఁ గీర్తించుటలో హనుమంతుని రామభక్తి ప్రకటితము. నారదుఁడు ప్రవేశించి

[1] "స్వస్తి దురంత రాక్షస నిషంగ భుజాబల భాగ్యశాలికిన్
స్వస్తి సమస్త యోగిజన సన్నుత దివ్య మహత్వ శీలికిన్
స్వస్తి దిగంత కీర్తి ధనవంతునకున్ రఘురామ దూతకున్
స్వస్తి స్వయంప్రకాశునకు సద్గుణమూర్తికి వాయుసూతికిన్"

అని స్వస్తి పల్కిన పద్యమున హనుమచ్ఛక్తియుక్తులు ప్రకటితములు. రామాంజనేయ యుద్ధమున రామభక్తి - శరణాగత రక్షక సత్యవాక్పాలనముల మధ్య హనుమంతుఁడు సందిగ్ధస్థితి నంద నిందు గురుభక్తికి అభయవాక్య పాలనముల మధ్య సందిగ్ధ స్థితి నందెను. యమార్జునుల మధ్యఁ యేర్పడిన యుద్ధస్థితిచెప్పి యర్జునునకిచ్చిన యభయవాక్యమును గుర్తుచేయుటవలన హనుమంతుఁడు గురుద్రోహము చేయవలసి వచ్చి నందుకు మిక్కిలి విచారించెను. యముఁడు సూర్యసుతుఁడు సూర్యుఁడు హనుమంతుని గురు వగుటవలన గురుపుత్రునితోఁ యుద్ధ మేర్పడుటకు దుఃఖించుటలో గురుభక్తి ప్రకటితము. రెండవ రంగముననే కృష్ణరాయబార వైఫల్యము చెప్పఁబడెను.

నాల్గవ రంగపు యుద్ధరంగమున హనుమంతుఁడు ప్రవేశింపక ఐదవ రంగపు యుద్ధరంగమున హనుమంతుఁడు ప్రవేశించును. హను

1 యమాంజనేయ యుద్ధము - పుట 29

మంతుని యుద్ధమునకుఁ బ్రేరేపించుచుఁ గృష్ణుఁడు పల్కు[1] 'ఘన సముద్రము పిల్లకాల్వగా భావించి తోక ఝాడింపుచు దూకినావు' అను పద్యమున హనుమత్సాహసకృత్యము లన్నియు వర్ణింపఁబడెను. యుద్ధమునకు సిద్ధమైన హనుమంతునియందు

' బండనమున నీ పాపము
పండి కపిధ్వజము నిట్లు పడ గూల్చితివా?
దండధరా! నన్నెర్చెడి
గుండె గల్గునేని రమ్ము ద్రొవ్వఁగ గింతున్''

అను పద్యము జెప్పించిన కవి యుత్సాహము నిరూపించెను. గదా యుద్ధమున యమునిఁ బడవైచి గొంతు నులిమి గ్రుద్దుచుండెను. ఆరవ రంగమున హనుమంతుఁడు రాముని నుతించుచు బ్రవేశింప యముని భార్య యగు సుమాలినీదేవి

''లంకిణీ ప్రాణనాశాయ రాక్షసాంత
కాయ! శ్రీరామ దూతాయ! కర్మదీక్షి
తాయ! పాతక హరణాయ; ధర్మదూష్య
హంతకాయ! నమోఽస్తు వీరాంజనేయ!''

అని ప్రార్థించుచుఁ బతిభిక్ష వేడెను. శ్రీకృష్ణుఁడును శ్రీరామునిగా దర్శన మిచ్చెను. సుమాలిని రామునికూడ పతిభిక్ష వేడెను. రాముఁడు పిలువగా యముఁడు స్వస్థుఁడై వచ్చెను. నారదుఁడు ఆంజనేయుని ప్రసన్నునిఁ జేసికొమ్మని యమునితోఁ జెప్పుటవలన యముఁ డాంజనేయునకు నమస్కారమిడి రక్షింప వేడెను. హనుమంతుఁడు యమున కభయ మొసఁగెను. ఇట్లు యమాంజనేయయుద్ధమున హనుమంతుఁడు జయశీలగ నందఱచేఁ గొనియాడఁబడెను.

<u>ఆశ్చర్యచూడామణి</u> : వాఙ్మయమున నద్భుతరస ప్రాధాన్యత ప్రతిపాదించు నాటక మాశ్చర్య చూడామణి. దీనిని సంస్కృతమున శక్తిభద్రుఁడు రచించెను. ఇందుఁ బ్రతియంకమున నద్భుతము ప్రకటమగును. దీనియం దేడంకములు గలవు. దీని నాంధ్రీకరించినవారు శ్రీ కుప్పా ఆంజనేయశాస్త్రి మచిలీపట్నవాసి హిందూకళాశాల పండితులు. ఈ నాటకమునకు పీఠిక కర్త విశ్వనాథ సత్యనారాయణ.

---

1. యమాంజనేయ యుద్ధం - పుట 49

అంగుళీయకము దెచ్చి చూడామణిని సీతనుంచి రాముని కడకుఁ గొంపోవు ప్రధానఘట్టమును నిర్వహించిన హనుమంతుఁ డిందు షష్ఠాంకమునసే ప్రవేశించును. [1] 'భుజగసీమంతినీ భోగమందిర పథస్థ ఱంఝా మైనాక పర్వతము దాటి లంక కేఁ జేరినాఁడ నిశ్శంకవృత్తి' యనుచుఁ దనరీతిఁ దెల్పుకొనుచుఁ బ్రేక్షకులకుఁ బరిచయము చేసికొనుచుండుటయుం చుట నాటకోచితముగ సముచితముగ నున్నది సంపాతి మాటలను జ్ఞప్తికిఁ దెచ్చుకొని శింశుపావృక్షముకల క్రీడావనమునన్వేషించుచు సీతను హనుమంతుఁడు చేరును. చంద్రుని సంబోధించుచు విలపించు సీతాలాపముల వలన నామెను గుర్తించి యరుంధతీసంబోధనతోడి యాలాప మాధారముగాఁ బ్రవేశించుటలో హనుమత్ప్రవేశము రమ్యముగ జరిగెను. అది సీత కద్భుత జనకము. [2] 'మనోహరవచన సృష్టికర్త యీతఁడెవఁడో' యని యాశ్చర్యపడుటలో హనుమంతుని వాక్చాతుర్యము నిరూపితము. సీతకు హనుమంతుఁడు రామవృత్తాంతమంతయుఁ దెల్పెను. సీతాన్వేషణకై వానరుల నంపునెడ [3] 'అంత సమస్త వానర వీరు లున్నను ప్రప్రథమమున దర్శించిన విశ్వాసమున నేకాంతమునఁ బిలిచి నాకు నిచ్చియుఁ జెప్పియుఁ బంపె ననుటలో నంగుళీయక మిచ్చుటలోఁ గారణము సముచితముగ సమర్థింపఁబడెను. [4] 'నీ పితృపాదులు విశ్వమున కెల్లఁ ద్రాణము. నీవుమాత్రము నాకుఁ బ్రాణమైతి' వని సీతచే మారుతి ప్రశంసింపఁబడెను. షష్ఠాంకముననే చూడామణిని సీతవలనఁ గొని హనుమంతుఁడు బయల్వెడలు ప్రధానఘట్టము చెప్పఁబడెను.

ఇదే నాటకమును శ్రీ ఊటుకూరు ఆంజనేయశర్మయు ననువదించెను. బిసెంటు దివ్యజ్ఞాన కళాశాల -మదనపల్లె యందధ్యాపకులు వీరు. ఇందు హనుమత్ప్రవేశము [5] 'కరమంటూర్మికవెల్ల, రాఘవు పృషత్కంబట్లు, మైనాక భూధరముం దాఁటితి లంకాపురిఁ జేరుకొంటి!, అను పద్యముతో జరిగెను. ఆశ్చర్యచూడామణియందు సప్తమాంకమునను రెండు వాక్యములు హనుమంతుఁడు పల్కెను. సీతకు దండన విధింపు మనుచు

1. ఆశ్చర్యచూడామణి - పుట 87
2. ఆశ్చర్యచూడామణి - పుట 89
3. ఆశ్చర్యచూడామణి - పుట 95
4. ఆశ్చర్యచూడామణి - పుట 98
5. ఆశ్చర్యచూడామణి - పుట 61

రాముని కుఁ జెప్పు నచ్చటి హనుమ దభిప్రాయము వాల్మీకియొక్క హను మంతుని యభిప్రాయమునకు భిన్నముగ నున్నది. ఈ రీతిగా నీ నాటకమున హనుమంతుని పాత్ర ముఖ్యముగ షష్ఠాంకమున గోచరించును.

మైరావణ : మైరావణ నాటక కర్త అయ్యగారి విశ్వేశ్వరరావు. పదునైదు రంగములు గల యీ నాటకమున మూడవ రంగమున హనుమంతుఁడు ప్రవేశించును. ఈ నాటకమునందలి యితివృత్తము హనుమత్ప్రధాన మైనను నిందు ప్రాధాన్యత మిక్కిలిగఁ గన్పట్టును. రావణుని దుస్థితికి పాపము దలచు సుగ్రీవునితో మాటలాడుచు [1] 'కర్మసిద్ధాంత స్థాపన మొన ర్పుట, విభీషణుఁడు హనుమంతునితో [2] 'నిజముగా నీవు కోతివి కావు రామచంద్రునిబాలిట ఆశా జ్యోతి' వనుటలు హనుమంతుని వ్యక్తిత్వము బెంచుచున్నవి. పాతాళలంకయందుఁ బ్రవేశించిన హనుమంతుని చూచి మాయారూపుఁ డగు రాక్షసునిగ శంకించిన ట్లీ నాటకమునఁజెప్పఁబడెను దాని నెఱిఁగిన నారదుఁడు

[3] ''చేరఁగరాని లంక కిటు చేరి శ్రమంబుల నొందినట్టి యీ
మారుతి కష్ట మెంచుటకు మాటలు చాలవు వాఙ్మయంబులో
కిరితి గొన్న సేవకుని 'కిం' 'చ' 'తు' లాలన చేయకుండుటల్
కూరిమికాదు! మారుతికి కొండలుబెండులు గావె చూడఁగన్''

అనుట, లక్ష్మణుఁడు అంజనేయుని మన్నింపఁ గోరుటలు హనుమంతుని మహోన్నతస్థాయికి చేర్చుచున్నవి. హనుమత్సహాయమున రాముని చేరగోరిన యామె మతంగి పేరు గల మైరావణు భార్యగా నిందుఁ జెప్పఁబడెను.

హనుమాన్ పాతాళవిజయము అను మైరావణ : ఈ నాటక కర్తలు కవి మిత్రులు నాగశ్రీ దరిశి వీరరాఘవస్వామిగారలు. ఇది ఐదంకములలోఁ బంద్రెండు రంగములుగా రచింపఁబడెను. రెండవ రంగమునఁ బ్రవేశించు హనుమంతుఁడు నాటకాంతమువఱకు నుండును. ఇందు అహిరావణ మైరావణు లిర్వురు ప్రతినాయకులు కలరు. ఆనంద రామాయణమున ని ట్లిర్వురు చెప్పఁబడిరి. హనుమత్సహాయమున రాముని చేరఁగోరిన

1. మైరావణ – పుట 17
2. మైరావణ – పుట 19
3. మైరావణ – పుట 62

అంగుళీయకము దెచ్చి చూడామణిని సీతనుంచి రామునికడకు గొంపోవు ప్రధానఘట్టమును నిర్వహించిన హనుమంతుఁ డిందు షష్ఠాంకముననే ప్రవేశించును. [1] 'భుజగసీమంతినీ భోగమందిర వస్థి బంధుర మైనాక పర్వతము దాటి లంక కేఁ జేరినాఁడ నిశ్శంకవృత్తి' యనుచుఁ దనరీతిఁ దెల్పుకొనుచుఁ బ్రేక్షకులకుఁ బరిచయము చేసికొనురీతిఁ బ్రవేశించుట నాటకోచితముగ సముచితముగ నున్నది. సంపాతి మాటలను జ్ఞప్తికిఁ దెచ్చుకొని శింశుపావృక్షముకల క్రీడావనమున న్వేషించుచు హనుమంతుఁడు చేరును. చంద్రుని సంబోధించుచు విలపించు సీతాలాపముల వలన నామెను గుర్తించి యరుంధతీసంబోధనతోడి యాలాప మాధారముగాఁ బ్రవేశించుటలో హనుమత్ప్రవేశము రమ్యముగ జరిగెను. అది సీత కద్భుత జనకము. [2] 'మనోహరవచన సృష్టికర్త యీతఁడెవఁడో' యని యాశ్చర్యపడుటలో హనుమంతుని వాక్ప్రావీణ్యము నిరూపితము. సీతకు హనుమంతుఁడు రామవృత్తాంతమంతయుఁ జెప్పెను. సీతాన్వేషణకై వానరుల నంపునెడ [3] 'అంత సమస్త వానర వీరుల నున్నను బ్రత్యేకముగ మున దర్శించిన విశ్వాసముచే నేకాంతమునఁ బిలిచి నాకు నిచ్చియుఁ జెప్పియుఁ బంపె ననుటలో నంగుళీయక మిచ్చుటలోఁ గారణము సముచితముగ సమర్థింపఁబడెను. [4] 'నీ పితృపాదులు విశ్వసించిన వెల్లఁ బ్రాణము. నీవుమాత్రము నాకుఁ బ్రాణసమైతి' వని సీతచే మారుతి ప్రశంసింపఁబడెను. షష్ఠాంకముననే చూడామణిని సీతవలనఁ గొని హనుమంతుఁడు బయల్వెడలు ప్రధానఘట్టము చెప్పఁబడెను.

ఇదే నాటకమును శ్రీ ఊటుకూరు ఆంజనేయశర్మయు ననువదించెను. బిసెంటు దివ్యజ్ఞాన కళాశాల-మదనపల్లెయం దధ్యాపకులు వీరు. ఇందు హనుమత్ప్రవేశము [5] 'కరముం దూర్ణికవెల్లి, రాఘవు పృషత్కంబట్లు, మైనాక భూధరముం దాఁటితి లంకాపురిఁ జేరుకొంటి!, అను పద్యముతో జరిగెను. ఆశ్చర్యచూడామణియందు సప్తమాంకమునను రెండు వాక్యములు హనుమంతుఁడు పల్కెను. సీతకు దండన విధింపు మనుచు

1. ఆశ్చర్యచూడామణి - పుట 87
2. ఆశ్చర్యచూడామణి - పుట 89
3. ఆశ్చర్యచూడామణి - పుట 95
4. ఆశ్చర్యచూడామణి - పుట 98
5. ఆశ్చర్యచూడామణి - పుట 81

రామునకుఁ జెప్పనచ్చటి హనుమదభిప్రాయము వాల్మీకియొక్క హనుమంతుని యభిప్రాయమునకు భిన్నముగ నున్నది. ఈ రీతిగా నీ నాటకమున హనుమంతుని పాత్ర ముఖ్యముగ షష్ఠాంకమున గోచరించును.

మైరావణ : మైరావణ నాటక కర్త అయ్యగారి విశ్వేశ్వరరావు. పదునైదు రంగములు గల యీ నాటకమున మూడవ రంగమున హనుమంతుఁడు ప్రవేశించును. ఈ నాటకమునందలి యితివృత్తము హనుమత్ప్రధానమైనను నిందా ప్రాధాన్యత మిక్కిలిగఁ గన్పట్టును. రావణుని దుస్థితికి పాపము పలుకు సుగ్రీవునితో మాటలాడుచు [1] 'కర్మసిద్ధాంత స్థాపన మొనర్చుటలు, విభీషణుఁడు హనుమంతునితో [2] 'నిజముగా నీవు కోతివి కావు రామచంద్రుని పాలిటి ఆశా జ్యోతి' వనుటలు హనుమంతుని వ్యక్తిత్వము పెంచుచున్నవి. పాతాళలంకయందుఁ బ్రవేశించిన హనుమంతుని చూచి మాయారూపుఁ డగు రాక్షసునిగ శంకించినట్లు నాటకమునఁ జెప్పఁబడెను దాని నెఱిఁగిన నారదుఁడు

[3] ''చేరఁగరాని లంక కిటు చేరి శ్రమంబుల నొందినట్టి యీ
మారుతి నిష్ట మెంచుటకు మాటలు చాలవు వాఙ్మయంబులో
కీరితి గొన్న సేవకుని 'కిం' 'చ' 'తు' లాలన చేయకుండుటల్
దూరిమి కాదు! మారుతికి కొండలు బెండులు గావె చూడఁగన్''

అనుట, లక్ష్మణుఁడు ఆంజనేయుని మన్నింపఁ గోరుటలు హనుమంతుని మహోన్నతస్థాయికి చేర్చుచున్నవి. హనుమత్సహాయమున రాముని చేరగోరిన యామె మతంగి పేరు గల మైరావణు భార్యగా నిందుఁ జెప్పఁబడెను.

హనుమాన్ పాతాళవిజయము అను మైరావణ : ఈ నాటక కర్తలు కవిమిత్రులు నాగశ్రీ దరిశి వీరారాఘవస్వామిగారలు. ఇది ఐదంకములలోఁ బంధ్రెండు రంగములుగా రచింపఁబడెను. రెండవ రంగమునఁ బ్రవేశించు హనుమంతుఁడు నాటకాంతమువఱకు నుండును. ఇందు అహిరావణ మైరావణు లిద్దరు ప్రతినాయకులు కలరు. ఆనంద రామాయణమున నిట్లిద్దరు చెప్పఁబడిరి. హనుమత్సహాయమున రాముని చేరఁగోరిన

1. మైరావణ - పుట 17
2. మైరావణ - పుట 19
3. మైరావణ - పుట 62

యామె మైరావణుఁడు చెఱఁబట్టిన చంద్రసేన యనుగంధర్వకన్యగాఁ జెప్పఁబడెను. [1] 'అల విశ్వకర్మచే యజ్ఞోపవీతాది కౌపీన ధారిఁగాంచ లేదె' యనుచు నంగదుఁడు పొగడినట్లు హనుమంతుఁడు సర్వసమర్థునిగా నిందుఁజిత్రింపఁబడెను.

[2] ''తారలు రాలుగాక; వసుధా తల మంతయు గ్రుంగుగాక; గా
వారిధు లింకుగాక; కులపర్వతముల్ మఱి వ్రీల్చుగాక; దై
త్యారి సురారిహ ప్రముఖు లందఱు సంగర మాడుగాక నే
వీరుఁడనేని రామునృపతీపతులన్ గొనిరాకఁబోదునే?''

వంటి పద్యములు హనుమంతునియందు వీరోచిత మగు నుత్సాహము ప్రకటము గావింపఁబడెను. హనుమ త్పుత్రుఁ డగు మత్స్యవల్లభునే పాతాళ లంకా రాజ్యమున కధిపతిని గావించిన ట్లిందుఁ గలదు. ఈ రీతిగాఁ బేరు నందే కల హనుమత్ప్రాధాన్యత నాటకమున నిరూపిత మయ్యెను

<u>శబరి</u> : శబరి నాటక కర్త చింతా దీక్షితులు. హనుమత్పాత్ర యిందు విలక్షణత కలదు. 1. ఉపదేశము 2. సాధన 3. పరిప్రశ్న 4. నిరీక్షణ 5. సిద్ధి యను నైదురంగములు గల యీ నాటకమున రెండవ రంగము నఁ బ్రవేశించిన హనుమంతుఁడు నాటకాంతమువఱకు నుండుటయే కాక ప్రముఖపాత్రగ కూడ నుండెను. ఇందు హనుమంతుఁడు ఇర్రి యను నొక సవరకన్యతో నాడుకొనుచుఁ బ్రవేశించును. ఆ కన్య నాడు మనుచు బాడు మనుచు బలవంతము పెట్టుచుండును. పావురాల ద్వారా శబరి తెలిసికొను రామవార్తలను హనుమంతుఁడు తెలిసికొనుచు నిర్రికిరాముని విశిష్టత, నామమునుఁజెప్పును. రాముని రాకకు నిరీక్షించుచు వనస్థితుల నను కూల మొనర్చును. రామలక్ష్మణులు ఫలము లాస్వాదించుచుండ, కోకిల చిలుకలు, ఇర్రి పాటలు పాడుచుండ హనుమంతుఁడు శంఖమూదును. శబరి రామునకు నమస్కరించుచు నంతరిక్షమునఁ జనుట హనుమంతుఁడు ఇర్రికిఁ జెప్పును. రామలక్ష్మణులను ఋష్యమూకమునకుఁ గొంపోవలె నని ఇర్రితోఁ జెప్పి హనుమంతుఁడు వెడలిపోవును. నాటక నామము 'శబరి' యైనను శబరిని మించి యిందు హనుమత్పాత్ర వ్యాపించి విల

1. హనుమాన్ పాతాళవిజయము - పుట 69
2. హనుమాన్ పాతాళవిజయము - పుట 69

క్షుంత సంతరించుకొనుట గానవచ్చును.

వీరాంజనేయము : వీరాంజనేయము నాటకకర్త పండిత పాముర్తి సూర్య ప్రకాశశర్మ. ఇది ఆరంకముల నాటకము. ఇందు నాందిగా

"శ్రీనాథుం డినవంశ జాతుం డయి స్వః శ్రేయః ప్రదుండై యనం
తా నాథుం డగు రాఘవేశు సుతుఁడై తా ధాత్రి జన్మింపగా
నానా దైత్య విమర్దనంబునకు జన్మంబందు వీరాంజనే
యానూనాహ్వయుఁ డేకపాదుఁడు మిమున్ హర్షంబుతోఁ బ్రోచెడున్.

గోకర్ణక్షేత్ర సమీప మున్యాశ్రమమున హోమద్రవ్యము పాడుచేయు కోఁతిని తరుముఁ డనుచుఁ గాత్యాయనుఁడు ప్రవేశించుటతో నాటక మారంభ మగును. తనను కొట్టఁజూచు మునిబాలుర గ్రుద్దుచు హనుమంతుఁడు ప్రవేశించును. భరింపఁజాలక శపించుటకు ఉదకముఁ గొనునంతలో గర్గుఁడు 'మున్ముం దీతనిచే దేవకార్యము జరుగవలెఁగాన శపింపవల' దన శక్తి తెలియకుండునట్లు శపించెను. అందున భయమంది హనుమంతుఁడు వెడలుటతోఁ బ్రథమాంకము పూర్తికాగా ద్వితీయాంకమున చిత్రరథ విశ్వావసు సంభాషణావశమున హనుమజ్జననము తెలియు; తృతీయాంకమున రామసుగ్రీవ సఖ్యము గూర్చుట కలదు. చతుర్థాంకమున లంకాదహనపర్యంత కథ కలదు. పంచమాంకమున యుద్ధవిజయము. మహోదరుఁడట పెండ్లికి పెండ్లికుమారుఁడెట్టివాఁడో యీరామరావణ యుద్ధమునకాంజనేయుఁడట్టివాఁడని హనుమత్ ప్రాధాన్యత వివరించెను. అహిమహి రావణుల నుండి రామలక్ష్మణులను హనుమంతుఁడు రక్షించెను. షష్ఠాంకమున శతకంఠరావణవధ వృత్తాంతము కలదు. హార బహూకరణము కాగా కాత్యాయన శాపవిమోచనము గావింపుఁడని రాముఁడు వశిష్ఠుని ప్రార్థింప విమోచనము గావింపఁబడెను. రాముఁడు 'మునీంద్రా! ఈ యాంజనేయు నాశ్రయించువారల కైహికాముష్మిక కార్యంబులన్నియు నిర్విఘ్నముగా నెరవేఱునట్టు లనుగ్రహింపుఁడన వసిష్ఠుఁడు తథాస్తు అనెను. ఆంజనేయుఁడు రామభజన చేయుచుండ నందఱు భజనను కలుప తెర వాలును. ఇట్లు హనుమత్కథ గూ నాటకమున సంపూర్ణముగ నిబంధింపఁబడెను.

రామ రావణ సంగ్రామము : ఐదంకముల యీ నాటకమును పసుమర్తి

యజ్ఞనారాయణశాస్త్రి రచించెను. యుద్ధకాండ విషయ మిందుఁ గలదు. పట్టాభిషేక సమయమున హనుమంతుని కౌగలించుకొని ప్రశంసించుటను కవి హృదయంగమముగ నడపెను. వీరిదే సీతాన్వేషణ మనునాటకము కూడ కలదు.

మారుతి మైరావణ సంగ్రామము : మైరావణ వధేతివృత్తమే యిందుఁ జెప్పఁబడెను. దీని కర్త గుంటూరు బ్రహ్మయ్య. ఇందు పైదంకములు గలవు. అంకము లన్నిట హనుమత్ప్రాధాన్యత కానవచ్చును. ఈ కవియే మారుతి విజయము కూడ రచించెను.

లంకా దహనము : దీని కర్త వేంకటనారాయణ. ఇది ఐదంకముల నాటకము. జానకీ వియోగ దుఃఖముతో నాటక కథ ఆరంభము చేయఁబడెను"

"సర్వ వ్యాపకుఁడై ప్రభంజన పిత స్వాంగోద్భవుం డౌచు దు
ర్గర్వ చ్ఛేదన దక్ష వీక్షణ సదాగ త్యద్భుత శ్రీడుఁడై
యుర్వీజాత భయాపహార నిపుణోద్యోగ ప్రవీణుండు పై
గుర్వర్థ ప్రతిపాదకుం డయిన రక్షో హంతకుం డోమఁతన్"

అని యిందు నాందియే హనుమత్పరముగఁ జెప్పఁబడి రామాయణాంతర్గత ప్రసిద్ధ లంకాదహనము కథగా నీ నాటకము రచింపఁబడెను.

శ్రీరామోద్యోగము : దీని కర్త ద్రోణంరాజు సీతారామారావు. ఇది ఐదంకముల నాటకము. మూడవ యంకమున సుగ్రీవమంత్రిగా హనుమంతుఁడు ప్రవేశించును. రామాయణ మితివృత్తమైనను హనుమంతునకు సముచితస్థాన మీయఁబడినది. ఇందు నాంది

"హనుమంతుఁ గుణవంతు నేలుచును నుద్య ద్భూరి కారుణ్యతన్
దిననాథాత్మజుఁ బ్రోవగాఁ దలచి యర్థిన్ వాలినిం గూల్చి యా
తనికిన్ బట్టము గట్టినట్టి విలస ద్దాక్షిణ్యభాషుండు శ్రీ
మనువంశాంబుధి పూర్ణచంద్రుఁడు మిముమ్ బాలించి రక్షించుతున్"

అని రచింపఁబడెను.

లంకా దహనము : లంకా దహన నాటకమున పైదంకములు కలవు. దీని కర్త కాశీనాథుని వీరమల్లయ్యారాధ్యుఁడు. రాముని సీతావియోగ దుఃఖముతో నాటకారంభము జరిగెను. హనుమంతుని పలిపలుకులతోనే నాటకము ముగియును. చివరకు హనుమంతుఁడు

''లంకను జొచ్చినాఁడ పదిలమ్ముగ సీతను జూచినాఁడ ని
శ్శంకముగా సమూలము విశాలవనమ్ముఁ బెకల్చినాఁడ సా
తంక మొకింత లేక ప్రభు దానవసైన్యముఁ గూల్చినాఁడ సా
లంకృత మందిరమ్ము లనలమ్మున దగ్ధము చేసినాఁడ నే
నింక నొనర్పఁగాఁ దగిన దేదియు లేదు పురంబు సేరెదన్''

అనును. ఇందలి ఐదు పాదములందు నాటకముయొక్క అయి దంకముల హనుమద్గాథఁ దెలియఁజెప్పుట విశేషము.

లంకా దహనము : దీని కర్త మతుకుమల్లి నరసింహశాస్త్రి. ఇదియు నై దంకముల నాటకము. నాటకాది నిష్టదేవతా ప్రార్థనముననే

''శ్రీ జనకేశ పుత్త్రిఁ గని చిత్తము రంజిలఁ బ్రీతి నామె కా
రాజిత కీర్తిశాలి రఘురాముని సేమముఁ దెల్పి లంక ని
స్తేజముగా దహించి వడి సింధువు దాటిన వాయుసూతుఁ డ
వ్యాజ కృపా కటాక్షమున నారయు నీ కృతి నెల్ల వేళలన్'

అని హనుమంతుని నుడివెను. బంగరు లేడిని వెంబడించు రాముని ప్రవేశముతో నాటకారంభము జరిగెను. ద్వితీయాంకమున సుగ్రీవునితో హనుమంతుఁడు ప్రవేశించును. రామాయణ కిష్కింధాకాండ కథ యిందు నడచును. తృతీయాంకమున

''నేను శ్రీరామ సేవనా నిరతి రామ
కార్య పరతంత్ర మతి నయి క్రాలువాఁడ
నేని మన్మాత యా సీత నెమకుకొఱకుఁ
గంధి నవలీల దాటుదుఁగాక నిపుడె''

యనుచు సముద్రము దాటును. చతుర్థాంకమున లంకలోఁ బ్రవేశించును. ఇందు మైనాక, సురస, సింహికాదుల వృత్తాంతములు లేవు. నాటకానుచితము అని చెప్పకపోవచ్చును. రచయిత యిందు సంభాషణలకై పద్యములే కాక రాగములతో కీర్తనలను కూడ రచించెను.

ఉదా -: లంక - పదరకు చెదరకు నిలు ప్లవగా
హనుమ - కారులు ! పేలకు కాలునిఁ జేర్చెద.

పంచమాంకమున అక్షాదులతో యుద్ధము కలదు. హనుమంతుఁడే యిందు

''భూమి సస్యసమృద్ధి గాంచుత భూమినాథుల నెల్లెడన్
ప్రేమ నేలవలెం బ్రజావళిరీతి నెల్లఁ బ్రజావళిన్

క్షామ డామరము ల్నశించుత క్ష్మాసుతం బలె మానినుల్
భూమి నొప్పుచు నుండుగావుతఁ బ్రోచు నీశ్వరుఁ డెల్లెడన్
అని భరతవాక్యము పల్కెను.

లంకా దహనము : ద్రోణంరాజు సీతారామారావు విరచితము నొక్క 'లంకాదహన' మను నాటకము కలదు. పైవలెనె నడచిన యీ నాటకాంతమున

"లంకం జొచ్చితి రాము పంపునను నాహ్లాదంబుగా సీత నా
తంకం బేమియు లేక చూచి వన విధ్వంసంబు గావించి ని
శ్శంకన్ దైత్యులఁ గూల్చి యీపురమునున్ చండాగ్ని పాల్సేసినా
నింకన్ రామునికిన్ వచించుట కునై నే నేగెదన్ వేగమే"
అని నిష్క్రమించును. ఇదియు నైదంకముల నాటకము.

సంపూర్ణాంజనేయము : సంపూర్ణాంజనేయము నాటకము భక్తిరస ప్రధాన నాటకము. దీని కర్త కొడాలి సత్యనారాయణరావు. ఇందు నాందియందు

"శ్రీరామున్ భజియించి ధన్యుఁడయి కీర్తిన్ గాంచి పాపంబులన్
బాఱన్ద్రోలుచు నెల్ల కోరికల దీర్పన్ జాలు ధీశాలియై
శూరుండై చిరకాల జీవి యయి యే శుద్ధాత్ముఁ డింపొందె నా
ధీరుం డా హనుమంతుఁ డీ ప్రజల కర్థిన్ గూర్చుతన్ భద్రముల్"
అని హనుమంతుఁడు కీర్తింపఁబడెను. ఐదంకము లిందుఁ గలవు. ఇంద్ర వజ్రమునఁ గొట్టఁబడి పడిన హనుమంతుని యొడిలోఁ గొని బాధ, కోపము వ్యాపించియున్న వాయుదేవుఁడు ప్రవేశించుటతో నారంభమై హనుమత్కథ యంతయు నిందు నడచును.

మారుతి సేవ : మారుతి సేవ నాటకరచయిత ముక్కామల పున్నయ్య. ఇది అయిదంకముల నాటకము. సీతాహరణ మాదిగా సీతా వార్త హనుమంతుఁడు తెచ్చువఱకు నీ నాటకకథ నడచును. ఆంజనేయుఁడు లంకిణి, అక్షయకుమార, రావణాదులతో భాషించినరీతి పాటలుగా వ్రాయఁబడెను. దీనికి భరతవాక్య మాంజనేయుఁడే పల్కును. నాటకాంతమున రాముఁడు 'ఆంజనేయా! నీ ఋణం బెట్లు దీర్పగలను? నీ వాంఛితం బెరిగింపుమనగా హనుమంతుఁడు

"ఎల్ల వారలు నీ భువి నుల్లమందుఁ
గపటబుద్ధులు విడనాడి కలుష మడచు
మీదు నామంబు నిత్యము మోదమలర
గాన మొనరింప వర మిందు కమలనయన!"

అని కోర రాముఁడు 'తథాస్తు' అనుటతో మంగళము చెప్పఁబడెను.

అన్వేషణ : ఆగస్టు '84 నుండి సెప్టెంబరు, 86 వఱకును 'హనుమత్సేవ' మాసపత్రికయందు వెలువరింపఁబడిన నాటక మిది. దీని కర్త కె. సూర్య నారాయణ. సుందరకాండయందు సీతా భాషణమువఱకుఁ గల యీయితి వృత్తమును పదిరంగములలో రచించెను. మొదటి రంగమున సముద్రోల్లంఘనమున కపులెల్లరు దమ తమ శక్తులఁ బ్రకటించుట; హనుమద్విశ్వరూప ప్రదర్శనము,సింహికాదుల వృత్తాంతము తెరలోఁజెప్పబడుట కలదు. రెండవ రంగమున లంకిణీ, శంఖిణిల భాషణ. మూడవ రంగమున లంకిణీ శాపవిమోచనము; ఐదారు రంగముల రాక్షసస్త్రీ, రావణ భాషణములు; ఏడవ రంగమున రావణు దర్బారున హనుమంతుని భాషణ. ఎనిమిదవ రంగమునఁ దోక నంటింప మారుతి లంకాదహనము గావించుట; తొమ్మిదవ రంగమున నా హనుమద్వృత్తాంతమును సరమ సీతకు చెప్పుట కాగా పదవరంగమున గిష్కింధానగరమున తెరలో హనుమంతుని రాక వార్త చెప్పఁబడగా తెర పడును. ఇట్లు సీతాన్వేషణాపర మగు సుందరకాండకథ రమ్యముగ నాటకరీతిఁ జిత్రీకరింపఁబడెను.

పాపిట బొట్టు : కె.సూర్యనారాయణకృతమగు నీనాటకము 'హనుమత్సేవ' మాసపత్రికయందు 1988 జూలై నుండి 1989 ఫిబ్రవరి వఱకు ధారావాహికముగ వెలువరింపఁబడెను. ఈ నాటికకు మూలము 'హనుమద్విషయ సర్వస్వము' అను గ్రంథములోని సిందూరము-తైలాభిషేకము-మంగళవార విశిష్టత అను నంశములుగా కవి నాటకాదిని తొలిమాటలు చెప్పు కొనెను. మంగళాచరణముగా

"దాశరథి బంటు, దాసుండు దానవారి
అతులిత బలధాముండు రుద్రాంశభవుడు
మంగళకరుండు కరుణాంతరంగమూర్తి
రక్ష యొసగాక ధరణి యెల్లరకు హనుమ"

అనునది ఆరంభపద్య మిందుఁ జెప్పఁబడెను. రాజాంతఃపుర [illegible] భాగమున హనుమ కూర్చొనియుండి ప్రవేశము. ఆకలితో మందిరమున ప్రవేశించి సీతను 'అమ్మా'తినుట కేదయినా పెట్టు 'మని'ఆకలిగా నున్న దన-'నీకు ఆకలియగుట విచిత్రమే. ఇది ఏదో పరీక్ష కాదుకదా యనుచు స్నానానంతరము అన్నము పెట్టెదననును. ఈలోగా దాసి మదనికతో హనుమంతుని భాషణము కలదు.

సీత భోజనమిడుచుండ పాపిటబొట్టు పరిశీలించి 'అది ఎందుకు ధరించినా'వన 'భర్తకుపూర్ణాయురారోగ్యాల'కనును. అట్లే హనుమంతుఁడు సింధూరము ఒడలనిండ పులుముకొని వచ్చి సభనంత ఆశ్చర్యపడుచుండ, యథార్థమెరిగి హనుమంతుని భక్తి తత్పరతనెల్లరు మెచ్చుట యిందలి గాథ. చాలకొద్ది యితివృత్తమును స్వీకరించి చక్కని నాటికగ డి.సి. సూర్యనారాయణ తీర్చిదిద్దెను.

హనుమత్ప్రస్తావన కల నాటకములుగానివి కనవ్పట్టును.

రావణవధ : చివుకుల సత్యనారాయణశాస్త్రి ఆరంకములలో రచించిన నాటకము. రావణసభతో నారంభమై యిందు యుద్ధకాండ విషయము ప్రదర్శింపఁబడెను.

శ్రీరామవిజయం : వేంకటరమణరాయ ప్రణీతమైన ఈ నాటకమున నేడంకములు కలవు. మాయలేడి వృత్తాంతముతో నారంభమై యుద్ధానంతరము అయోధ్య చేరువఱకుఁ గల కథ యిందుఁ జిత్రింపఁబడెను.

విజయరాఘవము : మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రి ఈ నాటకకర్త. ఇందైదంకములు కలవు. హనుమంతుని రాకకై రాముఁడు నిరీక్షించుచు ఖిన్నుఁడై ప్రవేశించును. హనుమంతుఁడు సీతావార్తఁగొనివచ్చిన దాది యుద్ధకాండ గాథయంతయు నిందుఁగలదు. ఇంకను

సుందరకాండ – నిగమాంత సిద్ధాంతి
మైరావణ చరిత్రనాటకము – యు. వెంకటసుబ్బయ్య
మారుతిమైరావణ సంగ్రామము – గూడూరు కోటేశ్వరరావు
మారుతివిజయము అను లంకాదహనము – గూడూరు కోటేశ్వరరావు
మారుతి విజయము – కోపల్లి వెంకటరత్నకవి
లంకా దహనము – అవసరాల శేషగిరిరావు

లక్ష్మణమూర్ఛ - సోమరాజు రామానుజరావు
గరుడ గర్వభంగము - ద్రోణంరాజు సీతారామారావు
రామ దూత - మల్లాది అచ్యుతరామశాస్త్రి
సీతా విజయము - పసుపులేటి వెంకన్న
హనుమ దభ్యుదయము - దేవినేని సూరయ్య
హనుమద్రామ సంగ్రామము - ద్రోణంరాజు సీతారామారావు
మైరావణ నాటకము - కోకూది సుబ్బయ్య
రామాయణ లక్ష్మణ మూర్ఛ నాటకము - బి. రామానుజాచార్య
శతకంఠ రామాయణము - ద్రోణంరాజు సీతారామారావు
లంకా పతనము - గోపాలకృష్ణారావు
జెండాపై కపిరాజు - (ఏకాంకిక) కె. సూర్యనారాయణ

వంటివి కలవు. ఇట్లు ఆంధ్ర నాటక సాహిత్య రంగమున హనుమంతుడు సముచితస్థానము నంది యుండెను.



# వచనవాఙ్మయము - హనుమత్కథ

## హనుమదాచార్యోపదేశము

ఇది వావిలికొలను సుబ్బరాయ విరచితము. ఈ రచనము శ్రీ కోదండరామ సేవక ధర్మసమాజ సభ్యుల నుద్దేశించి నడచును. తన యీ వచనకావ్య నాయకునిగూర్చి కవి 'అయన మఱియెవ్వఁడో కాఁడు. మన సమాజాధ్యక్షుఁడే. సంజీవరాయుఁడే' యనును. దీనివలన పై సమాజాధ్యక్షుఁ డొంటిమెట్ట సంజీవరాయ హనుమంతుఁ డని తెలియును.

హనుమంతుని తండ్రియగు వాయుఁదేవుఁడు దిక్పాలకుల నొకఁడగు వాయవ్యమూలకుఅధికారి కాఁడని, సర్వవ్యాపియై జగత్ప్రాణమై జీవభూతమై యుండు సూత్రాత్మయు, 'ఓం తద్వాయుః సహోవాచ వాయుర్వై' ఇత్యాది వేదవాక్య వాచ్యుఁడని చెప్పఁబడెను. మార్గశిరమున శుద్ధ చతుర్దశినాఁడు హనుమంతుని జనన మని యిందుఁ గలదు. కాని వైశాఖ బహుళ దశమిగా హనుమజ్జననము గూర్చి పరాశరుఁడు చెప్పెను. దానినే సర్వులు స్వీకరించిరి. హనుమంతుని జీవితవిశేషము లన్నియు క్రమముగ నిందుఁ జెప్పఁబడెను. హనుమంతుఁ డగుటకుఁ గారణమైన కథ కలదు. సూర్యునికడ విద్యాభ్యాస మొనర్చిన రీతి

[1] ''పుట్టు మలనుండి గ్రుంకుడు
గట్టు దనుక సూర్యుతోడఁ గడు వడిఁ జనుచున్
బట్టుగ వ్యాకరణంబును
గట్టిగ వల్లించె''

నని యగస్త్యుఁడు శ్రీరామునకుఁ జెప్పినవిషయ మిం దీయఁబడెను.
[2] 'నిషిద్ధకాలముల భార్యాసంగమము చేయకుండిన బ్రహ్మచర్యనిష్ఠుడే యగు. ఇట్లు నైష్ఠిక బ్రహ్మచర్యవ్రత మూని హనుమంతుఁడు తల్లిదండ్రుల యాజ్ఞచొప్పున సుగ్రీవునొద్ద మంత్రియై యుండె'నని హనుమంతుని గృహస్థునిగాను, సుగ్రీవమంత్రిగను వాసుదాసు తెల్పెను.

హనుమంతుని యాచార్యత్వము విశిష్టాద్వైతు లంగీకరించి రనెను.

1. హనుమదాచార్యోపదేశము - పుట 14
2. హనుమదాచార్యోపదేశము - పుట 22

స్త్రీ ప్రీతులు నంగీకరించిన రీతి యిట్లు వివరించెను. 1 'వటిత్వా తద్వాప షేధాయి దర్శతమ్ దేవస్య భర్గః' అను ఋక్మంత్రమున మధ్వాచార్యుల వ్యాఖ్య ననుసరించి శ్రీశచంద్ర విద్యారణ్యులవా రాంగ్లమున నిట్లు వ్రాసిరి.

Note · The first function of vayu or christ is that of Hanumat or wisdom It is the angle that brings the message of hope to the desponding soul as Hanuman carried the words of Rāmā to Sita

The word 'Han' denotes wisdom, therefore, Hanuman means he who possess wisdom the word 'mati' also means he who possesses wisdom.

ఇట్లు హనుమంతునియందాచార్యత్వము చెప్పఁబడెను. హనుమంతుఁడీ యాచార్యకృత్యము ముమ్మారు గావించెను.

1. రామ సుగ్రీవుల కైక్యము
   సీతారాముల కైక్యము
3. రామభరతుల కైక్యము.

ఈ యాచార్యకృత్యము నెరపిన రీతి యిందుఁ గలదు. హనుమంతునివలన నభీష్టములు నెరవేరు రీతి, దుష్టశిక్షణ చేయుటలో కాలనేమివధ యిందుఁ జెప్పఁబడెను. సమాజ సభ్యుల సంబోధించుచు నుపన్యసించిన రీతిగ నడచిన దీ గ్రంథము. గ్రంథాంతమున హనుమంతుఁడు సంపాదించిన యోగ్యతాపత్రికలుఁ జెప్పుచు వారు ారు మెచ్చినరీతి నిట్లు చెప్పెను.

2 ''వానరలోక నాయక! భవత్కృత మన్య దురాసదంబు నీ యొనరించిన కార్యముం జలుప నొయ్యనఁ బొమ్ము శుభంబు గల్గు నె వ్వానికి ధైర్యమున్ మతియు వారక దాక్ష్యము దృష్టి నీవలెన్ జానుగఁ గల్గు వానికి నసాధ్యము లేదది యెట్టి కార్యమేన్''

ఇది దేవతల వాక్యము. ఈవె సూర్యుండవు నీవె సమర్థుండ వీవె ప్రాజ్ఞుఁడవు కపీంద్ర చంద్ర సామాన్య వానరుగా మది నమ్మంగఁ జాల' ఇది సీతాదేవి వాక్యము.

---

1. హనుమదాచార్యోపదేశము - పుట 25
2. హనుమదాచార్యోపదేశము - పుటలు 28, 29

"నాకుఁ గఁట్టి సర్వము ధనంబు నొసంగనెఁ గాన యీదు వ్యా
ద్వ్యాప్తకులతా విధంబు, ధనవంతుఁడఁ గా నిఁక మాఱు మేలు నే
నే కరణిం ఘటింపఁగల నియ్యెడఁ గావున నాదు కౌఁగిలిన్
గై కొనవయ్య దాని ప్రతిగా మహితాత్మక మారుతాత్మజా!"

ఇది శ్రీరామ వాక్యము.

"అతిలక్షణ సంపన్నం
బతి మాధుర్య గుణ భూషణాంచితమును స
మ్మత మష్టాంగయుతం బగు
మతి యొప్పఁగ నీవ నేర్తు మాటాడంగన్"

"అనిలునకున్ సుతుండవు మహాత్మపరం బగు ధార్మికుఁడవ్ నీ
ఘన బల శౌర్య సత్త్వ శ్రుత కాంతి పరాక్రమ ధీరతా క్షమా
వినయ ధృతి ప్రశస్తగుణ విశ్రుత దాక్ష్యగుణాదు లెల్ల నో
యనఘ త్వదాశ్రయంబున మహారుచి సంపదఁ దాల్చి వెల్గెడిన్"

ఇవి సీతాదేవి వాక్యములు.

"శౌర్యము నయసాధనమును
ధైర్యంబు పరాక్రమంబు దాక్ష్యము బలమున్
స్థైర్యము ప్రాజ్ఞత మహిమయు
నార్యగుణాన నెలవుకొనియె హనుమంతు నెడన్"

ఇది రామవాక్యము.

"స్థైర్య ధైర్య పరాక్రమ క్రమ సాహసంబుల శౌర్యగాం
భీర్య బుద్ధులఁ జాతురీ నయ వీర్య యుక్తుల సూక్తి మా
ధుర్య కార్యధురీణతా జనతుష్టి కారణచర్యలన్
మార్యశిష్యున కీ ప్రభంజనసూతికిన్ సము లుందురే"

ఇది యగస్త్యమహర్షి వాక్యము. ఇట్లు హనుమంతుని విశిష్టత స్పష్టము గావింపఁబడెను. హనుమంతునియెడ వాసుదాసు నభిమానమున కీ వచన కావ్య మద్దము పట్టుచున్నది.

# ఆర్యచరిత్ర రత్నావళి
## హనుమంతుని చరిత్రము

బాలురు సైతము గ్రహింప గల్గునట్లు వావిలికొలను సుబ్బారావుగారు ఆర్యచరిత్ర రత్నావళి పేర కొందఱు మహనీయుల చరిత్రలు రచించిరి. వానిలో హనుమంతుని చరిత్ర యొకటి. నాతికఠిన శిష్ట వచనరచనమున నిది నడచును. అటనట పద్యములును గలవు. వివాదాంశము లున్న తావున తండ్రి తనయుల సంభాషణము, అమ్మణ్ణి తండ్రి సంభాషణముల ద్వారా వివరణ మీయఁబడెను. ఎడనెడఁ జిత్రములుఁ గలవు. వాల్మీకి రామాయణాంతర్గత హనుమత్కథతోఁ బాటు అవాల్మీకము లగు కాలనేమి వృత్తాంతము, మైరావణ చరిత్ర, భీమ గర్వభంగము వంటివి యు నిం దున్నవి.

సూర్యుని కబళింపఁబోయిన ఘట్టమున హనుమంతునకు సకల శాస్త్రముల విద్య నొసగుదు నని వర మిడుట, తల్లి యాజ్ఞపై సూర్యుని కడ విద్యాభ్యాస మొనర్చుట, సుగ్రీవునికడ మంత్రిపదవి నడపుట యూ కావ్యమునఁ గలవు. "నీ వెవ్వరి దర్శించిన నవ్యాజమై పరిపూర్ణమై భక్తి యుదయించి కడుపులోని ప్రేవులు కరిగిన ట్లైపోవునో యాయునకు నీవు దాస్యము చేయు' మని యంజన చెప్పి పంప రామునికడ నా యనుభూతి నంది యాతని సేవలో నున్న చరిత్ర యంతయు నిందుఁ జెప్పఁబడెను.

ఇట్టి వచనరచనయందు హనుమంతుని వాల్మీకావాల్మీకాంశముల చరిత్ర సంక్షిప్తముగను, సులభబోధకముగను నడచెను.

మైరావణ చరిత్రము : హనుమత్పాతాళవిజయ మగు మైరావణ చరిత్ర యితివృత్తము ఆంధ్రవాఙ్మయమునఁ బలువురచేఁ బలురీతుల విరచిత మయ్యెను. విపులముగా దీనిని మైరావణ చరిత్ర మను పేర వచనమున పురాణం పిచ్చయ్య రచించెను. ఈ కావ్యమున నాయకుఁడు హనుమంతుఁడే. సమీరకుమార విజయమునందుఁ బరాశర సంహితయందువలె సూచీముఖుఁడు గలఁడు. రెండవవాఁడు సంహితయందు మూషికముఖుఁడు, సమీరకుమార విజయమున ఘటకుఁడు కాగా నిందుదీర్ఘదంతుఁడు కలఁడు.

పిచ్చయ్య గ్రంథమును విస్తరించుటలోఁ గొన్ని కల్పనల నొన ర్చెను. ఇందు ముందుగ హనుమంతుఁడు విభీషణు ననుమానించును. అంతకు చివరకుఁ బశ్చాత్తప్తుఁ డగును. పరాశర సంహితయందలి కథను గ్రహించి విపుల మొనర్చినట్లు సూక్ష్మాంశపరిశీలనమునఁ దెలియును. [1] 'తయో రుపరి చిక్షేప సిద్ధౌషధ వనస్పతీన్' అని సంహితయందుఁ జెప్ప బడిన దానిని పుచ్చపొడి చల్లినట్లుచెప్పి యా పొడి ప్రభావమున కెంతో ప్రాత కల్పించెను. [2] 'తత్రైక పద్మసినాళ విధి రస్తర పద్ధతిః' ఇత్యాది వాక్యము లాధారముగా 61వ పుటయందుఁగమలనాళముఁ గూర్చి తత్ప్ర వేశమునుగూర్చి విశేషముగఁ జెప్పెను. హనుమంతుని కుమారుఁడు మత్స్యవల్లభునిగానె చెప్పఁబడెను. దుర్దండి యను మైరావణుని సోదరి పేరు దోర్దండిగా వచనకావ్యమునఁ గలదు.

విభీషణునిచేఁ జెప్పఁబడిన తామరపూవు అన్యులు స్పృశించిన ముడుచుకొని లోపలకుఁ బోవునది. అట్లు పోయినఁ బ్రవేశమార్గము కలు గదు. కాని హనుమంతుఁ డొక్కమాటుగఁ బూవును కొరికివైచును సంహి యందువలె దుర్దండికాక యిందు ముందుగ మత్స్యవల్లభుఁడు చెప్పఁ బడెను. హనుమంతుని స్వేదమువలన బుట్టినట్లే సంహిత, వచనకావ్య ముల నున్నను తల్లియగు మత్స్యము దీర్ఘదేహి యనియు, మతంగ మహాముని శాప మందిన గంధర్వకన్య యనియుఁ బిచ్చయ్యకావ్యమున లేదు. అనామకమత్స్యముగనే చెప్పఁబడెను. [3] 'అభేద్యమగు పాతాళ లంక మాత్రము విశేషముగా వర్ణింపఁబడెను. కమలనాళమునఁ బోగా దుర్గమారణ్యము, అది దాటగా మూడు యోజనముల నిప్పుల యగడ్త, మూడు యోజనముల సలసల కాగు నీళ్ళయగడ్త, సప్త ప్రాకారముల పాతాళలంకా పట్టణము, అవియు రాళ్ళు, ఇనుము, సీసము, ఉక్కు, రాగి, వెండి, బంగారములతో నిర్మింపఁబడి ప్రతియొక్కటి రాక్షసకోటు లచే రక్షింపఁబడుచు నుండుట చెప్పఁబడెను. ఇట్లు చెప్పుట వీని నధిగ మించిన హనుమంతునియొక్క శౌర్య ధైర్యములయందు పరిణమించుట యుద్దేశ్యము. మత్స్యవల్లభుఁడు నమ్మకున్న నిటగూడ సముద్రలం

1. ప సం 44-75
2. ప. సం. 45-40
3. మైరావణ చరిత్రము పుట 32

ఘనసహాయము బృహద్రూపముఁ జూపుట కలదు. ఇది సంహితయందు హనుమంతుఁడు మత్స్యవల్లభుని శక్తికాశ్చర్య మందెను తప్ప వెలవ లేదు. కాని పిచ్చయ్య 'పుత్రాదిచ్ఛేత్పరాజయమ్' అన్న రీతిగా మత్స్య వల్లభునివలన హనుమంతుఁడు శక్తిహీనుఁడయినట్లు చెప్పెను.

ద్వారప్రదేశమున త్రాసు సంహితయందువలె నిందును కలదు. కాని తులాభంగ మగు పెడ పెద్ద శబ్ద మగుట వచనకావ్యమునఁ జెప్పఁబడలేదు. పరుడు వచ్చిననట్లు శబ్ద మగురీతి యాధునికమగు Alaram Sistam అలారం విధానమును పోలి యున్నది. పిచ్చయ్య మైరావణుని మాయలఁ బెంచి మాయామైందద్వివిదులు, రామలక్ష్మణబలి వంటి వానిని కల్పించెను. భద్రకాళి హనుమంతునకు సహకార మొనర్చిన రీతి వచన కావ్యమున నెక్కడు చెప్పఁబడెను. మైరావణ ప్రాణరహస్యమును సంహితయందు దుర్దండి చెప్పనిందు భద్రకాళియే చెప్పెను. అందు మైరావణు నెడమపాదమునఁ ద్రొక్కియుంచి కుడిపాదమును ప్రసరింపఁజేసి తుమ్మెదలఁ జంప నిందుఁ దోఁకఁజుట్టి మైరావణుఁ గొంపోయి తుమ్మెదల దీసికొని వచ్చి చంపి మైరావణునిపైఁ బడవైచి హనుమంతుఁడు నాల్గు సముద్రముల స్నానము చేసి వచ్చి వాని కళేబరమును చూచెను. అంతట వాని ప్రాణోత్క్రమణము జరిగెను. ఈ విషయమే నల్గొండప్రాంతీయ మగు కిష్టయ్య గేయమున సేతుస్నాన మాచరించి వచ్చినటులఁ జెప్పఁబడెను. దుర్దండి కుమారుఁడు నీలమేఘునకు పాతాళలంకాధిపత్య మిచ్చి మత్స్యవల్లభు నాతని మంత్రిగా నుంచి మూర్ఛఁదేరని రామలక్ష్మణులఁ బ్రాతఃకాలములోపల సుగ్రీవాదులకడకుఁ గొంపోయెను. చివరకు రావణ సంహార,రామపట్టాభిషేకములు, హనుమత్ప్రశంసలును చెప్పఁబడెను. శిష్ట రచనతో కావ్యము నడిపిన పిచ్చయ్య వర్ణనాదులయందు, నద్భుతరస పోషణమున, యుద్ధవర్ణనల మిక్కలి శ్రద్ధఁ జూపి కథాకథనముగా కాక వచనకావ్యముగా తనగ్రంథమును నిల్పెను.

**మారుతి విజయము లేక హనుమంతుఁడు :** ఇది వేదం సుందరరాజశర్మ విరచితమైన వచనకావ్యము. పూర్తిగ గ్రాంథికభాషలో విరచితమైన మూటయేబది పుటల గ్రంథ మిది. వాల్మీకి రామాయణముతోఁబాటుగ నితర పురాణేతిహాసముల నుండియుఁ జిత్తరంజకము అగు కథలఁ జేర్చి కూర్చి

నట్లు కవియే స్వయముగఁ జెప్పికొనెను. బాలుర కత్యంతము నెటిప థకమనియు భక్తిప్రద మనియు భాషాభివృద్ధికరమనియుఁ దలంచి రచించినట్లు విజ్ఞప్తియందుఁ దెల్పుకొనెను. సుందరరాజశర్మ సింహపురి వాస్తవ్యులు. హిందూ థియలాజికల్ హైస్కూలునం దాంధ్రపండితులు. పట్టాభిషేకపర్యంత రామాయణాంతర్గత హనుమత్కథ 111 పుటలలో నడచెను. ఇందు కాలనేమి, మత్స్యవల్లభ, మైరావణ, రామలింగేశ్వరప్రతిష్ఠాది వృత్తాంతములును చెప్పఁబడెను. అనంతరము శతకంఠుని వృత్తాంతము, పంచముఖాంజనేయావతారములు కలవు. అగ్నిపెట్టురక్ష, వనచర్య, వంటివి; గరుడ, సత్యా, తుంబురు, నారద, అర్జున, భీమ గర్వభంగములు చెప్పఁబడెను భీమాంజనేయ వృత్తాంతములు, సౌగంధికాకుసుమ పురుషమృగముల గాథలు రెండును చెప్పఁబడెను ఇట్టి వచనకావ్య మంత్రభాగము దప్పించిన సమీరకుమారవిజయ కావ్యమునకుఁ వచన రూప మనిపించును. గ్రాంథికరచన, పదప్రయోగసామర్థ్యముల నిది తెనుఁగునఁగల కొద్దిమాత్రపు నుత్తమ వచనకావ్యములలోఁ బరిగణింపఁ దగినది.

సహస్రకంఠ రామాయణము : పురాణం పిచ్చయ్యకవి కృతమగు సహస్రకంఠ రామాయణమున హనుమంతునకు నధికప్రాధాన్యత యీయఁబడెను. అది వచనకావ్యము. అం దీగాథ ఈరీతిగఁగలదు. శ్రీరాముఁడు రాజసూయయాగ మొనర్ప చింతించి యాగాశ్వమును వీడగా దానిని సహస్రకంఠుఁడు అపహరించును. సుముహూర్తములోపల దానిని తెచ్చుట యసాధ్య మని యెంచిన రాముఁడు పరిహారముఁ దెలియఁగోరి యగస్త్యాదులఁ బిలిపింప నగస్త్యుఁడు విజయము తథ్య మని ముహూర్తము దాటక యాగము పరిసమాప్త మగునని దివ్యదృష్టితోఁ జూచి ధైర్యము చెప్పెను. సహస్రవదనుఁ డెట్టివాఁ డనఁ దెల్పుచు వానిని కశ్యపునకు దితి యందుఁ బుట్టినవాఁ డని చెప్పెను. కాని యద్భుతోత్తర రామాయణమున విశ్రవసునివలనఁ గైకసికిఁబుట్టిన యిర్వురు సహస్రకంఠరావణ, దశకంఠరావణు లని చెప్పఁబడెను. పుష్కరద్వీపము నాశ్రయించి యుండుట రెండిట సమానము. ఇందుఁ జిత్రవతి యనుఁ బురము నిర్మించి యందుఁ గశ్యపుం డుంచినట్లు చెప్పఁబడెను.

వాఁడు బ్రహ్మగూర్చి తప మొనర్చి ముల్లోకములు దనకు వెఱగందున ట్లువరమందెనుఅయ్యు నారాయణునిచే మాత్రము మరణముకలదని చెప్పఁబడెను. కొంతకాలము దుర్మార్గప్రవృత్తుఁడై విరక్తిఁజెంది వైకుంఠముఁజన నారాయణుగూర్చి తప మొనర్చి ప్రత్యక్షముకాగా నారాయణుని తానెల్లప్పుడు వహింపఁగోరెను కాలాంతరమున శేషుఁడవై యిట్టి వరఫలమందఁగల వనుచు నీలోగా యీవృత్తాంతము విస్మరించి యుండునటులఁ బల్కెను. అంతవాఁడు విజృంభించి రాముని యాగాశ్వ మపహరించెను. కావున యుద్ధము కావించి విజయమందు మనెను. శ్రీరాముఁడు 'హనుమా యాగాశ్వమును నీవ తేఁగలవు కానీ నాచే వాఁడుచచ్చుట విధినిర్ణయము. కాన యుద్ధసన్నద్ధుల మగుటకై సుగ్రీవ విభీషణుల ససైన్యముగ రమ్మను' మనగా నాంజనేయుఁడారీతి నొనర్చెను.యుద్ధమునకు బయలుదేరిరి. సముద్రమును సమీపించి సేనను దాటించు టెట్లా యని రాముఁడు ఖిన్నుఁడు కాగా నా కారణము గుర్తింపక నెల్లరు గలసి హనుమంతు నా విషయ మెఱుగ నిర్ణయించిరి. హనుమంతుఁ డా కారణ మెఱిగి తానే చేర్చఁగలనని నిర్భయముగా నుండు మనెను. ముందుగా రాయబారమంద నిర్ణయించుకొని యెల్లవారు నందుకు హనుమఁతునే తగినవానినిగా ఏకగ్రీవముగా నిర్ణయించిరి.

హనుమంతుఁడు పెద్దగా దేహముఁబెంచి సముద్రము దాటుచుండ దేవతలు సురస నంపిన నాటివలె నేటి సాధకశక్తిని పరీక్షింపవలెనని దేవదత్తుఁడను వానినిఁబురికొల్పిరి.వాఁడు మాయరాక్షసుఁడై మహాకాయుఁడై అడ్డగింప కార్యమొనర్చుకొనివచ్చి వాని కోగిరముగాఁ గాగలనని సామమునఁ జెప్పెను. వాఁడు విశ్వసింపక నిందకుఁ బూనుకొనగా హనుమంతుఁడు విజృంభించెను. వాఁడు పలురూపము లంద వాయువుకూడ హనుమంతునకుఁ దోడుకాగా హనుమంతు నెదిరింపఁజాలక నిజరూప మంది కారణమును వివరించెను.

హనుమంతుఁడు చిత్రవర్ణ శుకమై చిత్రవతీనగరముఁజేరెను. ఈలోపల వ్యర్థముగా రాక్షసయుద్ధముతో సమయభంగ మగునని య ట్లొనర్చి సహస్రకంఠుని కొలువుకూటమి నొక కంబముపై నిలచెను. వాఁడు దాని రూపునకు నచ్చెరువది 'దానిఁబట్టి తె' మ్మనునంతలో వాని సింహాసనము

పైననే వ్రాలెను. వాఁడు దానిని పట్టఁబోగా చిన్న కోఁతియై ఎగిరెను. వాఁ డీ మాయ ననుమానించి గదతోఁ గొట్టఁబోవునంతలోఁ బెద్ద కోఁతిమందగా రక్కసిమూక అంతయు విస్మయమంది భయమున మూర్ఛ నందెను. హనుమంతుఁడు వాలమును కుండలీకృత మొనర్చి దానిపై కూర్చుండెను. తేరిన సహస్రకంఠుఁడు. 'నీవెవ్వఁడవో చెప్పుము. లేకున్న యీగదతో చంపెద' ననగా మారుతి తాను శ్రీరాముని బంటు ననుచు రాముని పొగిడి రావణాదులయెడఁ దమ సాహసంబుల జ్ఞప్తి చేసెను. రాముఁడు చెప్పుచున్న మాటలను చెప్పెను. మఖాశ్వము నిచ్చి క్షేమముగానుండు మనెను. వాని దుర్నీతిని, రాముని సుగుణములను చెప్పట వినజాలక 'నిన్నిప్పుడే చంపెద' ననుచు వాఁడు కత్తితో వేయునంతలో హనుమంతుఁడెగిరి వాని శిరస్సులపై దూఁకిన వాఁడు నిల్వఁజాలక సింహాసనము నుండి క్రిందపడెను. ఒక్క పిడికిటిపోటున వానిని మూర్ఛిల్లఁజేసి తనపైకివచ్చిన రక్కసిమూకలఁదునిమి ఎగిరివచ్చి రామునిచెంతవ్రాలెను. జరిగిన దంతయు రామునకుఁజెప్ప 'వాఁడు దండోపాయసాధ్యుఁ'డనెను.

సేనను సముద్రమావలకుఁ జేర్చు భారము హనుమపై నుంచఁబడగా నాతఁడు మహాకాయుఁడై వింటిబద్దవలె వంగి చేతుల నావల పెట్టి వంతెనవలె నుండి సర్వసేనలను వెడలుమనెను. అచటఁజేరి విక్రమించిన శ్రీరాముని ననుజసహితముగా నామాయావి గొంపోఁగా హనుమంతుఁడే వారిని వెదకి గుర్తించెను. ఆకాశవాణి పలుకుల ననుసరించి వారి మూర్ఛ తొలఁగువఱకు రెండు జాములు వేచియుండి రామాదులఁ గొని వచ్చెను. యుద్ధమున శ్రీరామునితోఁ బాటు పశ్చిమద్వారమును ముట్టడించెను. ఆ యుద్ధమునఁ గుంభదంభులతో దంభుని సంహరించెను. యుద్ధ విజయానంతరము మరల సేన నంతను హనుమంతుఁడు సముద్రము దాటించెను. అశ్వమేధయాగము పూర్తికాగా నెల్లరు వెడలిపోయిరి కాని హనుమంతుఁ డటనే యుండెను. చివరకు రాముఁడు సరయూనదిం జేరి వైకుంఠ మేఁగ హనుమంతుఁడు గంధమాదన పర్వతమునకు వెడలెను. ఇట్లు పురాణం పిచ్చయ్య సహస్రకంఠరామాయణము వచనకావ్యమున హనుమత్కథ నడపెను.

<u>సహస్రకంఠరామాయణము</u> : దీనికి మూలము అద్భుతరామాయణము. అందలి యుత్తరభాగమున నీ సహస్రకంఠ రావణవధ కలదు. జనమంచి

వెంకటసుబ్రహ్మణ్యశర్మచే నీ యద్భుతోత్తర రామాయణ మాంధ్రీకరింపఁబడి వచనముగా రచింపఁబడెను. అందలి ఇది యార్షమును, వాల్మీకీయంబును, ఆదికావ్యంబును నగు శ్రీరామాయణము నందు అద్భుతోత్తర కాండమున'' అని యుండుటచే నిది వాల్మీకికృతముగాఁదెలియుచున్నది. శతకోటి ప్రవిస్తర రామాయణాంతర్భాగముగా నిది చెప్పఁబడెను. ఇందు గొన్ని యద్భుతాంశముల గమనింపఁగలము. ప్రథమ సమావేశమున హనుమంతునకు శ్రీరాముఁడు నిజస్వరూపమున చతుర్బాహువుల శంఖ చక్ర గదా పాణియై దర్శన మిచ్చినట్లుఁగలదు. ఇటు హనుమంతునకు రాముఁడు ఆత్మవిద్య నుపదేశించెను. ఉపనిష్కృతను, భక్తియోగమునుఁ తన దివ్యశక్తిని గూర్చి చెప్పెను. గీతాచార్యు డర్జునకు వలె హనుమంతుఁడు రామున కుపదేశించెను ఇట్లు మూల పూర్వ రామాయణ గాథ చెప్పఁబడిన యనంతరము రామునికడ కగస్త్యాదుల చెప్పఁబడెను. వారికి సీత తన బాల్యమున విప్రుడు చెప్పిన సహస్రకంఠ వృత్తాంతముఁ దెల్పెను. శ్రీరాముఁడు వానిఁ జంపనెంచి హనుమదాదులతోఁ బుష్పకముపై బయలుదేరి వెడలెను. రాముఁడు మూర్ఛ నంద సీత విజృంభించి శక్తిరూపము దాల్చి వానితో యుద్ధ మొనర్చి సహస్ర కంఠుని సంహరించినట్లు చెప్పఁబడెను. ఇందు హనుమత్ప్రశస్తి యేమియు లేదు.

**శ్రీరామదూత చరితము** :- దీని కర్త - అనుముకొండ తులసీరావు. ఇది బందరు తాలూకా చిట్టిపాలెం గ్రామాన వెంచేసియున్న శ్రీ వీరాంజనేయ స్వామి పాదపద్మములకు అంకితము చేయబడినది. ఇందు ఆంజనేయ స్వామి జన్మవృత్తాంతం ఆరంబించి శ్రీరామాజ్ఞతో గంధమాదన పర్వతము మీదకు తపోనిమిత్తము వెడలువరకు గలదు ప్రథమమున ప్రార్థనతో ఆరంభమగును. రాగము - కేదార

''హనుమాన్ ! అంజనీపుత్ర ! పవనతనయ ! మహాబల !
శ్రీరామదూత ! పార్థుని సఖుఁడ ! మెరయు కన్నుల

వాడ వింత విక్రముఁడ అని ద్వాదశ నామావళిని తెల్పెను. రాగనిర్దేశముతో గేయాలు వ్రాసి అనుసంధానమునకు వచనము విని యోగించెను. రాగము - యమన్ కళ్యాణి 'అంజనేయుని చరితము పాడెద; ఆజన్మాంతము ధన్యత గాంచెద' అని కుంజరునకు పుంజికస్థల

అంజనగాఁబుట్టుట మొదలు రామపట్టాభిషేక పర్యంత రామకథ నడిపి, ద్వాపరయుగ భీమ గర్వభంగము, అర్జున గర్వభంగము, గరుడ సత్యా - గర్వభంగముల నడిపి గ్రంథాంతాన - సింధుభైరవి రాగం - తీన్ తాళము "మంగళహారతి గొనుమయ్యా మము కాపాడుము ఓ హనుమయ్య" అని మంగళ గానమును చేసెను.

శ్రీ హనుమత్కథా తరంగిణి :- శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశర్మ గారు కర్త. హనుమత్సంబంధమగు చరిత్ర నంతను రామాయణ పరాశరసంహితా, పురాణాదుల నుండి స్వీకరించి కల్పితవర్ణనాధికముగ రచించిన వచన కావ్య మిది. కవికల్పనాశక్తితోఁ బ్రత్యేకత సంతరించుకొన్న దీ కావ్యము. వీరే సుందరకాండ గాథను హనుమద్విజయ మను పేర వచన రచన గావించిరి.

హనుమచ్చరితం - స్వామి కృష్ణదాస్‌జీ కర్తృకము. ఇది రామాయణాంతర హనుమచ్చరిత్రయే ప్రధానముగా కలది. తుదిని భారతాంతర్గత భీమగర్వభంగ వృత్తాంతము కలదు.

మహావీర హనుమాన్ - శ్రీ శ్రీ శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిజీ మహరాజ్ గారి హిందీమూలమునకు శ్రీ పురాణపండ రామమూర్తి గారి అనువాదము. రామాయణ భారత కథా భాగములు మాత్ర మిందు గలవు.

హనుమజ్జయన్తి - బొమ్మరాజు వెంకటసుబ్బయ్య - రామాయణాంతర్గత హనుమత్కథను సవిమర్శముగఁ జెప్పిన రచనము. ప్రశ్నోత్తర విధితోఁ జెప్పు నంశముల మురళి, తంత్రి సంభాషణ చూపఁబడెను. వీరే సుందరకాండ విషయమును 'శ్రీహనుమత్సముద్రోల్లంఘనము' పేర రెండు భాగములుగ వచన రచనము గావించిరి.

సుందరకాండ మెందుకు సుందరమైనది - దీని కర్త శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశర్మ. సుందరకాండయందలి విశేషాంశము లన్నింటినిఁ బ్రతిపాదించు రచన మిది. సుందరకాండ పారాయణ విధి, ఫలములు నిలదీయబడెను.

వేదాలలో హనుమంతుఁడు - కర్త అన్నదానం చిదంబర శాస్త్రి ఆయా వేదముల గల హనుమదంశముతో బాటు హనుమత్తాపనీయోపనిషత్తు నిందీయఁబడెను.

శ్రీ ఆంజనేయ చరితము - సి. హెచ్. శ్రీరామమూర్తి రచించిన 32 పేజీల చిన్న పొత్తము. ఇందు రామాయణమందలి హనుమత్కథతోబాటు భారతమందలి భీమగర్వభంగ వృత్తాంతము కూడ కలదు. ఇంకను వాఙ్మయమున ననేక సంకలన గ్రంథములు కన్పట్టుచున్నవి.

సంకలనములు - హనుమత్పరమగు సాహిత్యమున నిది యొక ప్రత్యేక విభాగము. శ్రీ పరాశర సంహితాధారమున ఆంధ్రమున నిట్టి అనేక గ్రంథములు వెలువడినవి. ఇవి యన్నియు హనుమత్పరమగుం గొంత విషయము కొన్ని హనుమత్పరమగు స్తోత్ర ధ్యాన శ్లోకములు, పూజా విధానాదులు కలవి. అవి ఈ క్రింద నీయఁబడుచున్నవి.

1. శ్రీ సుందర హనుమ ద్వైభవము - శ్రీ శిష్టా చంద్రమౌళిశాస్త్రి వీరి హనుమద్విలాసము, హనుమద్వ్రతజయంతి వంటి గ్రంథములును గలవు.
2. శ్రీహనుమ దుపాసన - మహామండలేశ్వర్, శ్రీరామశరణ్ - శ్రీ కుందుర్తి వెంకటనరసయ్య పాకయాజిగారు వీరిదే హనుమన్నిష్ఠ యను గ్రంథము నీకోవకు జెందినది.
3 శ్రీ హనుమ న్మహావిద్యా ప్రకాశిక - శ్రీ లంకా వెంకటేశ్వరశాస్త్రి - (హనుమద్దాసు)
4. శ్రీ హనుమ ల్లీలాతరంగిణి - శ్రీ కుంటముక్కల రామారావుగారు
5. శ్రీ హనుమ చ్చరితామృతము - శ్రీ అవ్వారి గోపాలకృష్ణమూర్తిశాస్త్రి
6. శ్రీ హనుమచ్చరిత్ర - డా. బుడ్డిగ ఆదినారాయణమూర్తి
7. శ్రీ సుందర హనుమ తత్త్వము - శ్రీ చింతలపాటి వీరభద్రరావు
8. శ్రీ సుందర మారుతి వైభవ చరిత్ర - శ్రీ వరిగొండ లక్ష్మీనరసింహం
9 శ్రీ సుందర హనుమ త్కథాసుధ - శ్రీ శనగల వెంకటప్పయ్యశాస్త్రి
10. శ్రీ హనుమద్విషయ సర్వస్వము - అన్నదానం చిదంబర శాస్త్రి
11. హనుమత్సేవ - శ్రీ మారుతి శరణి చయనం శ్రీనివాసరావు
12. హనుమదర్చన - శ్రీ యమ్. సత్యనారాయణ సిద్ధాంతి
13. శ్రీభక్తాంజనేయ వైభవము - శ్రీ యమ్. శ్యామసుందరశాస్త్రి
14. శ్రీమదాంజనేయ చరిత్ర సంగ్రహము - శ్రీ చిన్మయరామదాసు

ఈ గ్రంథములు భక్తకోటి యందు విశేష ప్రచారము నొంది యున్నవి. ఇంకను వచన వాఙ్మయమున

ఆంజనేయ ఖడ్గము - K. భైరవికవి
ఆంజనేయ జనన చరిత్రము - M. సుబ్బయ్య
కాలనేమి - శిరోభూషణం వెంకటరంగాచార్యులు
మైరావణ చరిత్రము - రామరాజు
మైరావణుడు - మంత్రిప్రగడ భుజంగరావు
శతకంఠరామాయణము- కస్తూరి శివశంకరకవి; నేలటూరి సుబ్బరామశాస్త్రి
సంజీవరాయ చరిత్రము - టి సూర్యనారాయణ
సంజీవి - K జోగారావు
సహస్రకంఠ రామాయణము - ఎన్. వెంకటసుబ్బశాస్త్రి
సీతారామాంజనేయ సంవాదము - జి. సూర్యనారాయణ
సుందరకాండ - గట్టుపల్లి శేషాచార్యులు
హనుమంతుడు - గొర్తి సూర్యనారాయణశాస్త్రి
హనుమంతుని జీవితము - బోగరాజు నారాయణమూర్తి
అంజనేయ చరిత్రము - కొప్పరపు వెంకటరమణయ్య
ఆంజనేయ చరిత్రము - బేతపూడి భగవంతరావు
మారుతి చరిత్ర - వై. వెంకటకృష్ణశాస్త్రి - అను కావ్యములు హనుమత్పరములు కలవు.

## పత్రికా సాహిత్యము - హనుమంతుడు

పత్రికారంగమునందును హనుమంతునకు స్థానము కలదు ఆంధ్రమున వెలసిన హనుమత్సంబంధమగు పత్రికలును ప్రస్తుత వ్యాసమునకు పరిశీలనార్హములు. హనుమత్పరమగు పత్రికలందు 'మారుతికళ' యను నాధ్యాత్మిక మాసపత్రిక యొక్కటి. ఈ పత్రిక బావట్ల యందలి శ్రీ మారుతి ప్రణవాశ్రమము-బాపట్ల నుండి వెలువడినది. 1940లో నారంభింపబడి 1950 వఱకు పదేండ్లు అవిచ్ఛిన్నముగా నడచినది. అనంతరము ఆయా సందర్భముల వెలువరింపబడుచున్నది. తమకు లభ్యమైన శ్రీ పరాశర సంహిత చాలకాల మిందు ధారావాహికముగ వెలువడెను. పై పత్రిక వ్యవస్థాపకులు శ్రీ కంభంమెట్టు మధుసూధనరావు.

'హనుమత్సేవ' యను నాధ్యాత్మిక పత్రిక 1975 నుండి నేటివఱకు నవిచ్ఛిన్నముగ వెలువడునట్టిది. ఇది విజయవాడ శ్రీ హనుమత్సేవా సమితివారిచే వెలువరింపబడు నాధ్యాత్మిక మాసపత్రిక. దీనియందు హనుమత్పరములగు నెన్నో విషయములు కవితలు వెలువడుచుండును. దీని వ్యవస్థాపకులు శ్రీ యస్. యస్. లక్ష్మణరావు.

మరో హనుమత్పత్రిక 'సుందరప్రభ.' ఇది శ్రీ హనుమదాచార్య పీఠం, చండ్రపాడు నుండి వెలువడినది. ఇది 1965 ఉగాదినాడారంభింపబడినది. రెండుసంచికలు మాత్రము వెలువడెను. దీని వ్యవస్థాపకులు శ్రీ చంద్రహాటి కొండ్రాజు.

'హనుమద్వాణి' యను పత్రిక నెల్లూరునుండి వెలువడునది కలదు. కాని అది వ్యక్తినామమున సారస్వతప్రయోజనార్థ మారంభింపబడినదే కాని హనుమల్లక్ష్యమున నెలకొల్పబడినది కాదు. దీని వ్యవస్థాపకులు శ్రీ ఎ వి నరసింహం.

అంగలకుదురు నుండి వెలువడు భక్తి సంజీవని శ్రీ కోదండరామ సేవక ధర్మసమాజము తరపున వెలువరింపబడునది. ఆ సమాజాధ్యక్షుండు శ్రీ హనుమంతుండగుట విశేషము. వాసుదాసున కారాధ్యుడు సంజీవరాయుడు. ఆతని అధ్యక్షతన నీ పత్రిక భక్తిసంజీవనిగా 1928లో నారంభింపబడి వెలువడుచున్నది. దీని స్థాపకులు శ్రీ వాసుదాసస్వామి.

'హనుమత్ప్రభ' అను త్రైమాసికపత్రిక హనుమంతునిగూర్చిన విశేషకృషికై స్థాపింపబడినట్టిది. దీని ప్రకాశకులు శ్రీ N V. రమణారావు - హైదరాబాదు; సంపాదకులు శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి.

## హనుమన్నిష్ఠాగరిష్ఠాంధ్రకవులు

కవి తన భావమున కనుకూలమగు వస్తువు స్వీకరించి కవిత్వముం జెప్పును. తాత్కాలిక కావ్యప్రయోజనము తప్ప ఆ వస్తువుతో నా కవికి శాశ్వతసంబంధ మేమియు నుండదు. కాని తమ- యిష్టదైవముపై కవిత్వము వ్రాయువారే కాక వస్తువు పేరు స్వీకరించినను యిష్టదైవమును స్మరింపుచు నిత్యసంబంధముతోం గొందఱుందురు. అట్టి కవులలో హనుమంతునియందు దిష్టముకల కవు లనేకురు కలరు. అట్లు హనుమదిష్టులు హనుమన్నిష్ఠులు నగుంగవుల పరిశీలనము ప్రస్తుత పరిశోధనకుం బరిపూర్ణత చేకూర్చునది.

అట్టివారిలోం బొలుతం బేర్కొనందగినవాండు భట్టుమూర్తి. ఆతండు ''హనుమత్ప్రసాదలబ్ధ కవితాసార సారస్వతాలంకారు'' ఇత్యాదిగా నరసభూపాలీయమున; 'ఇది శ్రీరామచంద్ర చరణారవిందవందనపవన నందన ప్రసాద సమాసాదిత'' అని వసుచరిత్రము లందుం గావ్యాంత గద్యలు రచించి తన హనుమద్భక్తితత్పరత వెలుగెత్తి చాటెను. భట్టుమూర్తి, రామరాజభూషణులిద్దరు నొక్కరా కారా యను వివాదమున్నది. వారి

ర్వు రొక్కరనుటకు నా రెండు కావ్యములఁ గల హనుమత్పరమగు పద్యములే ప్రబలతార్కాణము. హరిశ్చంద్రనలోపాఖ్యాన మందలి [1]''వనజ లంఘన కృపావర్థితో బయ కవితా కళారత్న రత్నాకరుండు'' అను నదియు దానినే నిరూపించుచున్నది. అట్లే [2]''నను శ్రీరామ పదారవింద భజనానందున్ జగత్ప్రాణనందను" నను పద్యము కూడ నాతని హనుమ న్నిష్ఠకు నిదర్శనము. అందుననే వాశిలి వెంకటనరసింహాపుట్టు మూర్తిని [3]అచ్చమయిన ఆంజనేయోపాసకుఁడుగాఁ జెప్పెను. సం. త కళాకోవిదుఁడగు హనుమంతుని భక్తుఁడై సంగీతకళా రహస్యనిధి యయ్యెను. అంతియకాక 'రామాయణ మహామాలారత్నమని' కీర్తించ బడిన హనుమంతునకుఁ దన కావ్యమునను మధ్యమణిస్థానమిడి సమ్మా నించుట విశేషము [4]'అనిలకుమారకుండు' అను పద్యము వసుచరిత్రను గ్రంథగ్రంథి యనఁదగిన ముఖ్యస్థానమున నున్నది.

ఇట్టి హనుమన్నిష్ఠ కారణముగఁదప్పక భట్టుమూర్తి రామరాజభూష ణులొక్కరేయని తెలియును. అందుననే వఝ్ఝలచిన సీతారామశాస్త్రిగారును [5]'రెండు గ్రంథములఁ జేసిన వారాంజనేయ ప్రసాదలబ్ధ కవిత్వ వైభవుల మని వ్రాసుకొనుటచే నిర్వురొక్కరే యని స్పష్టమొనర్చిరి. లక్ష్మణసార సంగ్రహకర్త చిత్రకవి పెద్దన హనుమద్భక్తుడు. ఆ లక్ష్మణ గ్రంథముననే హనుమోదాహరణమును రచించెను. ఈతఁడు హనుమ చ్ఛతక రచయితకూడ,

సమీరకుమార విజయ కర్త పుష్పగిరి తిమ్మన ఎంతటి హనుమ న్నిష్ఠుఁ డనుదాని కాతని సమీరకుమారవిజయమే సాక్షి. హనుమంతుఁడే స్వప్నమున "తత్త్వమ స్యాది వాక్యముల కర్థబోధ చేసిన గురుం''డని చెప్పుకొనుచు నంతటి కావ్యము నాతఁడు వ్రాసెను. ఇట్లే చిత్రకవి యనంతకవి ''శ్రీ హనుమ ద్వర శ్రీలబ్ధ సుకవిత్వ చతురుండ''నని చెప్పుకొనినవాఁడు. ఈతఁడు ఇందుమతీపరిణయ ప్రబంధ కర్త హరి శ్చంద్రనలోపాఖ్యానకర్త. 1620 కాలమువాఁడు. ఆధునికయుగమున ననేకులు హనుమద్భక్తకవులు కన్పట్టుదురు. హనుమత్పరములగు శత

---

1. హరిశ్చంద్రనలోపాఖ్యానము 1-46
2. వసుచరిత్ర 1-16
3. భూషణకిరణావళి - పుట 121
4. వసుచరిత్ర 3-139
5. వసుచరిత్ర విమర్శనము పుట 5-2
6. తెలుగు సాహిత్యము - రామకథ

కోషులు, సంకలన గ్రంధములు వ్రాసినవా రెల్లరు హనుమంతునియందుఁ ప్రత్యేక శ్రద్ధాభక్తులు కల్గిన కవులే

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ హనుమంతునియందుఁ ప్రత్యేక నిష్ఠ కల్గియున్న కవి. విశేషించి హనుమ దుపాసకులు. వీరి యనుష్ఠానమంత్రము ఆపదుద్ధారక వీరాద్రూప పంచవక్త్రాంజనేయము. రామాయణ కల్పవృక్షమున సాక్షాత్కరింపఁజేసిన పంచముఖాంజనేయ స్వామి యీ యుపాస్యమూర్తియే. వారి రామాయణ కల్పవృక్షమున కిష్కింధకాండ పూర్తి అయి సుందరకాండ రచన జరుగుచున్న కాలమున 1952లోఁ బుట్టిన కుమారునకు పావని యని నామకరణ మొనర్చుటయు వీరి హనుమన్నిష్ఠకుఁ తార్కాణము. వీరు మరణించుటకుఁ బూర్వము మూడు నెలలు దీక్షగా హనుమంత మొనర్చి ఏరోజు తా మెంత యను ష్ఠించినదియు డైరీయందు వ్రాసిరి. వీరి నివాసము విజయవాడయందలి మారుతీనగర్. సమీప మాచవరదాసాంజనేయుఁడు వీరి మ్రొక్కు లంది నవాఁడు. రామాయణ కల్పవృక్షమునందే కాక ఇతర రచనలందును ఏదో నందర్భమున విశ్వనాథ హనుమత్ప్రసక్తి తెచ్చుట కాననగును. 'విష్ణు శర్మ ఇంగ్లీషు చదువు చివరలో ''నా కీ ఉద్యోగం ఎందు కయిం దేమిటి? కలలో నయితే నేమి? మాచవరం ఆంజనేయస్వామికి వంద కొబ్బరి కాయలు కొట్టాను'' అనును. కలలో కొట్టినా ఆ ఆంజనేయుఁ డంత యను గ్రహించు నని విశ్వనాథవారి విశ్వాసము. అనార్కలి నాటకమున నాందిగా ''శైవాంశంబని'' మొదలగు పద్యమున హనుమంతుఁడే నుతింపఁబడెను. అందు 'నన్నావేశించిన' యనుటలో 'దేవో భూత్వా దేవం యజేత యన్నట్లు అనుష్ఠాతగా తాను హనుమదాదిష్టు లగుట ప్రకటించును ఇట్లు విశ్వనాథ సత్యనారాయణ ప్రత్యేక హనుమన్నిష్ఠులుగఁ దెలియును.

'మధువనము' కర్త దివాకర్ల వేంకటావధాని. తాను నిత్యము సుందరకాండ పారాయణము చేయుచుండు నని, ఆప్రభావమే తత్కావ్య రచనకు దోహదకారి యైన దనియుఁ గావ్యాదినిఁ జెప్పుకొనెను.

'అభినవజయదేవ' చల్లా పిచ్చయ్యశాస్త్రియు హనుమన్నిష్ఠులు. వీరు తమకు సత్కవిత్వము ప్రసాదించిన హనుమంతునకే తమ తొలి వందనము లిడుచు శ్రీహనుమ చ్చరిత్ర గ్రంధమును వ్రాసిరి. వీరే సీతారామ హనుమచ్ఛతకము కూడ రచించిరి.

‘తెలుగు సాహిత్యము – రామకథ’ కర్తయగు రాళ్ళపల్లి ... శాస్త్రి
శర్మయు హనుమద్భక్తుఁడై యుండెడు. ఆ హనుమ మంగళాశాసనము

‘తెనుగు సాహిత్య రామకథను రచింపఁ
దలపుఁ గూర్చి కృతార్థుని సలిపినట్టి
రామభక్తి కృత స్వాంతుఁ బ్రబల శాంతు
అలఘు మతిమంతు హనుమంతు నభినుతింతు’

నని కొనియాడుటయే కాక వెంటనే ‘పలికెడిది రామకథయట పలికించెడి వాఁడు రామభద్రుండట’ యనును. పుష్పగిరి తిమ్మనఁ గూర్చి వ్రాయు నెడ [1] ‘ఈ రచయితకు, నాకు హనుమద్భక్తి యపరిమితము’ అని స్పష్టముగఁ జెప్పుకొనెను. తాను ఘటికాచల లాంజనేయ భక్తునిగా ఘటికాచలాంజనేయ శతకమును రచించెను.

‘స్తోత్రమంజరి’ కర్త చిటారి ఆంజనేయులు హనుమద్భక్తుఁడు. ఆ గ్రంథాదిని

‘‘విమల చిటారివ్వయంబున విశ్వయార్య
కనకమాంబల సుతుఁడనై ఘనత గాంచి
యాంజనేయుని కృప విద్య లభ్యసించి
యాంజనేయాహ్వయమునఁ జెన్నొందినాఁడ’’ నని స్వయముగఁ

జెప్పుకొనెను.

‘సీతాన్వేషణము’ (సుందరకాండము) కర్తయగు వాడేల వెంకట శేషగిరిరావు హనుమద్భక్త కవి.

కలలో దర్శన మొసగియు
సలలిత సద్గ్రంథ రచన సాగించి యశః
కలితుం జేసిన మారుతి
తలచెద తత్పాదరజము దాల్తు శిరమునన్’’

అని చెప్పుకొనుటవలన నీ కవియుఁ బుష్పగిరి తిమ్మనవలె స్వప్నాంబనే యానుగ్రహము కలవాడని తెలియును.

[2] ‘‘ఇది శ్రీమద్ధనుమ కృపా
పదముదఁ గైత యుబుకంగ వ్రాసిన కబ్బంబిది’’

అని వ్రాసిన హరికులామోదము కర్త చల్లా సూర్యకామేశ్వరరావు హనుమద్భక్తిచేఁ గైత నందినవాడు. ఇట్లు హనుమదనుగ్రహపాత్రులాంధ్రవాఙ్మయమున నెందరో కానవత్తురు.

---

1. తెలుగు సాహిత్యము – రామకథ – పుట – 199
2. హరికులామోదము – పుట VI

ఆంధ్ర వాఙ్మయము - హనుమత్కథ

# తురీయ సోపానము

# సంస్కృత వాఙ్మయమున - హనుమంతుడు

సంస్కృత రామాయణములందు రామాయణము - వాల్మీకము, తత్త్వసంగ్రహ రామాయణము, వాసిష్ఠ రామాయణము, వసిష్ఠోత్తర రామాయణము, అధ్యాత్మ రామాయణము, అద్భుత రామాయణము, ఆనంద రామాయణము వంటి ఎన్నియో యుండి హనుమత్కథ ననేక రీతులఁ జాటుచున్నవి. అట్లే కావ్యములు రామాయణపరములై హనుమ త్ప్రశస్తి లేదా ప్రసక్తి కలవి: రఘువంశము - కాళిదాసు; రావణ వధ - భట్టి; జానకీ హరణము - కుమారదాసు; చంపూ రామాయణము - బోజ రాజు; ప్రసన్న రామాయణము - దేవయార్యుఁడు (ఆంధ్రుఁడితఁడు); రామాభ్యుదయము - సాళువ నరసింహరాజు; రామోల్లాసము - మాధవ విద్యారణ్యులు; రఘునాథ చరితము - వామన భట్టబాణుఁడు; రామాయణ మంజరి - క్షేమేంద్రుఁడు; ఉదాత్తరాఘవము - శాకల్యమల్లుఁడు; రామాయణము - మధురవాణి; రామచరిత - రఘునాథుఁడు; రామచరిత - అభినందనుఁడు; అభినవ రామాభ్యుదయము - అభిరామ కామాక్షి; రామకథ - రాజచూడామణి దీక్షితుఁడు; రామచరిత - విష్వక్సేనుఁడు; కళ్యాణ రామాయణము - శేషకవి; భద్రాద్రి రామాయణము - వీరరాఘవుఁడు; రామచంద్రోదయము - వేంకటేశ పండితుఁడు వంటివి చంపూ, పద్య కావ్యములు కాగా వాసుదేవుని రామకథ, వరదదేశిక రామాయణము గద్యకావ్యములు.

అనేకార్థక కావ్యములలోని రామకథయందును హనుమత్ప్రసక్తి యుండును అట్టివి - కవిరాజు - రాఘవ పాండవీయము; హరదత్త సూరి - రాఘవ నైషధీయము; సోమేశ్వరకవి - రాఘవ యాదవీయము చిదంబరకవి - రాఘవ యాదవ పాండవీయము; అనంతార్యుని - రాఘవ యాదవ పాండవీయములు; చెరుకూరి వెంకటేశ్వర పండితుని చిత్ర బంధ రామాయణము, శిష్టు కృష్ణమూర్తి - కంకణబంధ రామాయణములు చిత్ర కావ్యములు. ఈ రచయిత లిర్వురు నాంధ్రులు.

అట్లే సంస్కృత నాటకములు :- అభిషేక నాటకం: భాసనాటకము మహావీర చరితము - భవభూతి; ఆశ్చర్యచూడామణి - శక్తిభద్రుడు;

అనర్ఘ రాఘవము - మురారి; ప్రసన్న రాఘవము - జయదేవుడు; అద్భుత రామాయణము - మహాదేవకవి; ఉదాత్త రాఘవము - మాయురాజు వంటి వానియందును హనుమద్దర్శన మగును. హనుమంతుఁడే కర్తగాఁ జెప్పఁబడు హనుమన్నాటకము పదునొకండవ శతాబ్దమున వెలసెను ఇవి రామకథద్వారా హనుమద్విషయము కల గ్రంథములు కాగా కేవల హనుమత్పరమగు సాహిత్యము కూడ సంస్కృతమున చాల కలదు

సంహితలలో శ్రీపరాశర సంహిత పూర్తిగ హనుమత్పరమైనది. అట్లే సుదర్శన సంహిత; పురాణాంతర్గతము లగు ఉమాసంహిత: అగస్త్య సంహితలు; అట్లే శౌనక సంహితయు హనుమద్విషయమున మంత్ర తంత్ర కథాత్మకములై యున్నవి.

ఇట్టి గ్రంథము లాధారముగా గొని లభించినవి, స్వీయములును అగు స్తోత్ర, కవచ, దండకాదు లనేకము కలవు. ఆదిశంకరాచార్య కృతమగు హనుమత్పంచరత్న స్తోత్రము ప్రసిద్ధము. ఇంకను శ్రీ హనుమత్కాలాగ్ని స్తోత్రము; శ్రీ హనుమన్మాలామంత్రస్తోత్రము; శ్రీ హనుల్లాంగూలాస్త్రశత్రుంజయస్తోత్రము; శ్రీ హనుమత్ స్తోత్రము; శ్రీ హనుమద్వడబానలస్తోత్రము; శ్రీ హనుమత్పంజరస్తోత్రము; శ్రీ హనుమదేకముఖ కవచస్తోత్రము; శ్రీ హనుమదాపదుద్ధారకస్తోత్రము; శ్రీ హనుమదఘోర స్తోత్రము; శ్రీ పంచముఖహనుమత్ స్తోత్రము; శ్రీ హనుమత్కవచము; శ్రీ హనుమత్కృత రామసర్వస్వ స్తోత్రము, వంటి వెన్నియో సంస్కృత స్తోత్రములు లోకమునఁ గలవు

హనుమదుపాసన; పైశాచభాష్యమ్ - (శ్రీమద్భగవద్గీత); శ్రీసుహాశంభు శ్రీహనుమాన్ - (శుకసంహితా చతుర్థపాదం); శ్రీ హనుమద్గ్రహమ్ (అథర్వవేదోక్తము); శ్రీ పంచముఖి హనుమత్కవచం (శ్రీహనుమత్సంహితోక్తం); శ్రీ హనుమత్సహస్రనామస్తోత్రం; శ్రీహనుమత్పంచాంగం; స్తోత్రకుసుమాంజలి - (శ్రీవైష్ణవాచార్య); శ్రీ హనుమదష్టకం (శ్రీభరత దాసాచార్య); శ్రీహనుమ ద్దర్శనవిధానం (శ్రీయుగలవిహారి హరిశరణ) శ్రీ హనుమన్నిత్యత్వకథనం (శ్రీమద్వాల్మీకీయ సంహితా): శ్రీ హనుమత్ప్రతిష్ఠావిధిః (వాయునందన మిశ్ర); శ్రీ హనుమన్మంత్రోద్ధారః (ఆనందవన); శ్రీ మారుతిస్తవః (శ్రీ రాఘవానందాచార్యః); శ్రీ హనుమజ్జన్మ

త్పవ నిరూపణం (శ్రీరామానందాచార్య); శ్రీ హనుమజ్జన్మస్తుతిః (శ్రీ రామకుమారదాసః) శ్రీ హనుమత్పూజావిధిః (శ్రీగోపాలానందస్వామి); శ్రీ హనుమదశ్రీహస్యం (శివదత్తమిశ్రి); శ్రీహనుమత్స్తవః (శ్రీహనుమదాచార్యః) వంటివి కానవచ్చుచున్నవి. ఇట్లు సంస్కృతవాఙ్మయమున హనుమత్కథ పరివ్యాప్తమై యున్నది.

హిందీసాహిత్యము :- హిందీసాహిత్యమున రామాయణకర్తగనే కాక హనుమత్పరమగుఁ గవిగాఁ గూడఁ జెప్పఁదగినవాడు తులసీదాసు. శ్రీరామచరితమానస్ నందు రామాయణగాథతో హనుమత్కథను మనోహరముగ వర్ణించెను. తులసీదాస కల్పనలును కొన్ని గలవు. సీతాన్వేషణలో లంకయందుఁ తులసీవనముఁ గనిన హనుమంతుఁ డచ్చెరువంది యటకేగగా విభీషణుఁడు కానవచ్చుట, వారుభయులు మాటాడుకొనుట వంటి విందు కుదాహరణములు. శ్రీరామచరితమానస్‌ను మించి విశేషప్రచారమందినది తులసీదాస కృతమగు హనుమాన్‌చాలీసా. అట్లే హనుమాన్ బాహుక్, బజరంగబాణ్ వంటి కేవల హనుమద్రచనల నొనర్చిన హనుమత్కవిగా హిందీసాహిత్యమున తులసీదాసు నెన్నవచ్చును. అందుకు దాహృతులగు నెన్నియో సంఘటన లాతని జీవితమునఁ గానవచ్చును. కాశీలోని ప్రసిద్ధ సంకటమోచన హనుమంతుని ప్రతిష్ఠించినవాఁడు తులసీదాసే. మరో ప్రసిద్ధకవి సూరదాసుకూడ హనుమత్పాత్ర చిత్రణమును మనోజ్ఞముగ నొనర్చెను. సూరసాగర కావ్యమున నది స్పష్టమొనర్చెను. ఆధునిక కావ్యమగు 'రామ-రాజ్య' కావ్యమునను బలదేవ ప్రసాద్‌మిశ్ర హనుమంతుని రమ్యముగఁ జిత్రించెను. హిందీసాహిత్యమునను హనుమత్పరమగు రచన లనేకము లొనర్పఁబడెను. అవి

హనుమన్నాటక - శ్రీ హృదయరామ్‌జీ
శ్రీ హనుమాన్ నాటక్ - శ్రీరామస్వరూప్‌జీశర్మా
శ్రీవరవిలాస్ - శ్రీరామాజీ చతురదాస్
హనుమాన్ నాటక్ - శ్రీ జుగల కిశోర్‌జీ
బజరంగ్ బతీసీ - శ్రీ జానకీప్రసాద్ రసిక విహారి
రుద్రావతార హనుమాన్ - శ్రీరామచంద్రజీ మాలవీయ
శ్రీ మహావీర పురాణ్ - శ్రీనందకిశోర్‌దాస్‌జీ

శ్రీహనుమద్విలాస్ - రామఅంబేసహాయ్
హనుమాన్ ఉపాసనా - శ్రీరామకృష్ణ రసిక్
బజరంగవిజయ రామాయణ్ - రామప్యారేనందన్
మహావీరహనుమాన్‌జీ - రూపనారాయణ్ పాండేయ
మహావీరహనుమాన్ - శ్రీజగదీశ్ బిసూ
మహావీరహనుమాన్ - హనుమాన్‌శతక్ - శ్రీప్రభుదత్త్ జీబ్రహ్మచారి
హనుమత్‌శతక్ - శ్రీలక్ష్మణ ప్రసాద్ రామాయణి
హనుమన్త శతక్ - అభిరామ్ కవి
హనుమాన్‌జీకీజీవనీ - వ్రజరత్న దాస్‌జీ
భక్తరాజ్ హనుమాన్ - శ్రీశాన్తనువిహారీ ద్వివేదీ
హనుమాన్ - శ్రీసత్యనారాయణ్ జీ
హనుమాన్‌జీ కా జీవనచరిత్ - సుఖరామ్ దాస్‌జీ చౌహాన్
హనుమాన్‌చరిత్ర - శ్రీగణేశదత్త్ జీశర్మా
హనుమాన్ - శ్యామ్‌లాల్‌హీరాలాల్
శ్రీరామచరితమానస్ మే హనుమాన్‌జీ - శ్రీజానకీరామ్ జీ జనక్
శ్రీహనుమచ్చరిత్రమ్ - శ్రీత్రివేణీప్రసాద్‌జీ శర్మా
సర్వశోకనివారక్ శ్రీహనుమత్ప్రార్థనా - శ్రీసియారామశరణ్ జీ
శ్రీహనుమద్వినోద్ - శ్రీచంద్రశేఖర్‌జీ పాండేయ్
శ్రీహనుమజ్జన్మోత్సవ్ - శ్రీగంగాసహాయ్‌జీ ప్రేమీ
శ్రీహనుమజ్జన్మ బధాఈ - శ్రీమైథిలీచరణ్‌జీ వేదాంతాచార్య
శ్రీహనుమద్యశతరింగిణీ - శ్రీరసరంగమణిజీ
శ్రీహనుమాన్‌జీ కే జంజీరా తథాయన్త్ర-మన్త్ర - అవధకిశోర్ దాస్‌జీ
క్యాహనుమాన్‌జీ వానర్ థే? - జె.పి. చౌధరీ
హనుమత్-దూత్ - శ్రీసత్యానందజీశాస్త్రీ
హనుమాన్‌సారికా - శ్రీబలదేవదాస్‌జీ
మారుతిస్తోత్ర - శ్రీముక్తానందజీస్వామి
శ్రీ కష్టభంజన హనుమాన్‌జీ కా స్తోత్ర్ - సిద్ధానంద్‌జీస్వామి
పవనంజయ - ఓంకారనాథ్‌జీ 'దినకర్'
అంజనేయ - ఠాకుర్ సుదర్శనసింహజీ

జయహనుమాన్ - శ్యామ్‌నారాయణ్‌జీ
పవనసూన్ - శ్రీవాసుదేవనారాయణ్ సిన్హా

ఇట్లు హిందీసాహిత్యమున ప్రధానపాత్రగా కాక సామాన్యపాత్రగా హనుమంతుని చిత్రించిన కావ్యములు స్తోత్రాదికము లెక్కకు మిక్కిలిగా కలవు.

<u>మరాఠీసాహిత్యము</u> :- సమర్థరామదాసస్వామివలన విశేష హనుమత్ప్రచారము జరిగిన ప్రాంతము మహారాష్ట్రప్రాంతము. సాహిత్యసేవను మించి యా ప్రాంతమున విగ్రహప్రతిష్ఠాపనము, ఆరాధనము ప్రచురమయ్యెను. రామాయణముద్వారా హనుమచ్చరిత్ర తెలియదగు ముఖ్య గ్రంథములు: నరహరిబోనార్ కవి - రసాళరామాయణము; సమర్థరామదాసస్వామి - సుందర, యుద్ధకాండలు; మహారాష్ట్ర కవిసార్వభౌమ మోరోపంత్ - మంత్రరామాయణ, పద్మరామాయణ, దామరామాయణములు; హంసరాజు - రామాయణము అభంగములుగా, వేదాంతపరముగ రచించెను. ఇట్లు రామాయణముద్వారా కాక కేవల హనుమత్పరములగు గ్రంథములు మరాఠీయందును చాల కలవు. అవి

మాసామారుతి - డి.యన్. శిఖరే
మారుతీ చా ఓటా అథవాడాకా ఉపాసకాచే
స్వగత ఉద్గార్ - బాలక్రిష్ణభా ఊజోషీ
మారుతిభ్రమ నిరసన్ - భాస్కరవినాయక కానిట్‌కర్
మారుతీ చీ కథా - మోరేశ్వర్
మారుతి ఉపాసనా, మారుతి స్తోత్రే - శ్రీరామదాస్
శ్రీమారుతీ ఉపాసనా - కేశవబికాజీ ఢవలే
శ్రీమారుతీ చా ఘుసుకార్ - వాసుదేవపురుషోత్తమ సాఠే
బజరంగబలీ కే జ[illegible] - శంకర్ మోరాండో
సుందరకాండాంతర్గత శ్రీ మారుతీమహాత్మ్య - శ్రీధరజీ స్వామి
అకరాహనుమంతాశీ హితగుజ్ అథవా - దేవతా విజ్ఞానాచా బుద్ధివాద్
సదాశివకృష్ణ ఫకడే
శ్రీహనుమచ్చరిత్ - కాలచంద్రజీనదత్త శాస్త్రీ ఉపాధ్యాయా
మారుతి చరిత్ర - కృష్ణాజీ ఆబాజీ గురూజీ

శ్రీహనుమన్త లీలామృత కుసుమ్ - కృష్ణజీ వామన తలవలకర్
ఆంజనేయ్ - దేవధర్
పవనవిజయ్ మల్హార్ దాస్
శ్రీమారుత్ చరిత్రరహస్య - పి వి. దాస్లే
హనుమన్నాటక్ - ఇందుప్రకాశ్
శతముఖరావణకదా - హనుమన్తనాటక్ - అనాథభావబినాఫ్
వంటివి ప్రసిద్ధములై యున్నవి.

గుజరాతీసాహిత్యము :- ఈ సాహిత్యమున హనుమత్పరములుగా

శ్రీహనుమాన్‌చరిత్ర - బలదేవ్‌రామ్ కృష్ణరాంజీ భట్ట
భక్త వీర హనుమాన్ - జగుభాఈ మోహనలాల్ రావళ్
బజరంగీ హనుమాన్ (నాటకం) - జేర్‌లాల్ చౌధరి
హనుమాన్ గరుడ్ సంవాద్ - దయారామ్
మారుతి భజనావళి - ధీరజ్‌లాల్ సేఠ్
జయబజరంగ్ - నటవర్‌లాల్ విభవాల్
హనుమాన్ - విభీషణ్ - నానాభాఈభట్ట
హనుమత్ స్తవ్ - ముక్తానందజీ
హనుమాన్ చరిత్ర - కాశీసుత శేర్‌జీ
హనుమాన్‌జీ నాఛన్ద - బీస్‌దాస్
సీతాహనుమాన్ - ప్రసంగ్
పై నాల్గుగ్రంథములు హస్తలిఖితరూపముననే యున్నవి.
హనుమాన్ ఉపాసనా - రామశంకర్‌జీ జోషీ
హనుమాన్ యశ్‌గీతా - హరిహరపుస్తకాలయ ప్రకాశితము
హనుమద్‌బాబూసంవాద్ - ఉపదేశాత్మకం - సస్తాసాహిత్యమండల్ ప్రకాశితము
హనుమాన్‌జీ కా కీర్తన్ - శ్రీ బ్రహ్మానందజీ స్వామీ
వీరహనుమాన్ - జీవరామ్ జోషీ
రామ హనుమాన్ యుద్ధ్ (నాటకం) నృసింహప్రసాద్ నారాయణభట్ట
మున్నగునవి కానవచ్చుచున్నవి.

వంగభాషాసాహిత్యము :- వంగసాహిత్యమున కృత్తివాసఓఝూ విరచిత రామాయణము ప్రసిద్ధము. అద్భుతాచార్య (నిత్యానంద). అద్భుత రామాయణము శతకంఠ రామాయణముగఁ జెప్పఁబడును. అట్లే చంద్రావతి - రామాయణగీత; రామశంకరదత్తు రామాయణము (అధ్యాత్మము) నకును వివరణము; శంకరకవిచంద్ర - విష్ణుపురిరామాయణము; జయప్రసాదరామ ప్రసాదులు (పితాపుత్రులు) - రామాయణము; గిరీశచంద్రఘోష్ - రావణ వధ (నాటకము); మైకేల్ మధుసూదనదత్ - మేఘనాధ్వధ; తరంగిణీదాసీ - సుగ్రీవ మిలన్(నాటకం); జోతిరింద్రనాధఠాకురు - మహావీరచరిత (నాటకం); వంటిరామాయణకథాకావ్యముల హనుమచ్చరిత్రము కాన వచ్చును.

వంగరచయితలలో సుప్రసిద్ధులగు మహామహోపాధ్యాయ శ్రీ రఘునందన భట్టాచార్య తన 'కృత్యతత్త్వ' నిబంధనమున హనుమ ద్విషయమందించెను. మహామహోపాధ్యాయ శ్రీకృష్ణానంద ఆగమ వాగీశుల ప్రసిద్ధ తాంత్రికగ్రంథ మగు 'తంత్రసారము'న తృతీయపరిచ్ఛేదములో హనుమదుపాసనావిధి కలదు. అతి గుహ్యములగు సాధన లందుఁ గలవు. అట్లే ఆ సాధనద్వారా రాత్రి నాల్గవజామునస్వామి దర్శన మిడు విధానమును, ఇతర ప్రయోజనము లందు విధానమును చెప్పఁబడెను. ఇంకనూ హనుమత్పరమగు సాహిత్యము.

రామాయణేహనుమాన్ చరిత్ర్ - శ్రీ చంద్రనాధ్ చటోపాధ్యాయా

సర్వజ్ఞాన మంజరీ - నందకుమారదత్త

హనుమన్మహానాటక్ - అనువాదములు :- 1 చంద్రకుమార్జీ భట్టాచార్య
2. కాళీకృష్ణ బహదుర్
3. మధుసూదన మిశ్ర
4. రామగీత్ భట్టాచార్య

వంటివారి అనువాదములే కాక ఈ నాటకమునకు వంగభాషలో టీకలును 1 చంద్రశేఖరవిద్యాలంకార్; 2 కాశీపదతర్కాచర్య, మున్నగువారివి కలవు. హనుమానేర్ స్వప్న ఇత్యాది - రాజశేఖరబసు రచించెను. ఇట్లు వంగీయ హనుమత్సాహిత్యము కానవచ్చుచున్నది.

ఓఢ్రసాహిత్యము :- ఒరియా భాషయందలి సరళాదాసు - లంకరామాయణము; బలరామదాసు - రామాయణము; పకీరుమోహన సేనాపతి -

రామాయణము : అనిమస్యు, వినకుళ్ జంటకవులు భజన నాటకములుగా రచిం చిన రామకథలయందు నాయా సట్టములు హనుమత్కథ చెప్పబడెను. ఈ భాషయందుఁ గేవల హనుమద్రచనలు -

హనుఅర్జున్‌కలి - శ్రీకృష్ణదాస్‌జీ
హనుమాన్ చాలీసా - శ్రీరామచంద్ర
మహానాటక్ - శ్రీమధుసూదనజీ మిశ్ర
హనుమన్నాటక్ అనువాదం - శ్రీగోసినాథ్‌కర్
సచిత్రమహానాటక్ - అజయ్‌కుమార్ ఘోష్ సంపాదకత్వమున కలదు.
హనుమాన్ చరిత్ర గ్రంథము ఉత్కల ప్రెస్, కలకత్తాయందు ముద్రితమై కలదు. ఇట్లు ఓఢ్రసాహిత్యమున హనుమత్కథ ప్రసిద్ధము.

పంజాబీ సాహిత్యము :- ఈ భాషయందు 'రామలీల' నాటకము ప్రసిద్ధము. అందు హనుమత్కథ కలదు. ఇంకను హనుమత్పరముగా

హనుమాన్‌నాటక్ (పౌరాణిక నాట్యకథ) శ్రీదేవనాథ్‌జీ
హనుమన్నాటక్ (అనువాదము) హృదయరామ్‌మల్లా
హనుమాన్‌నాటక్ (పంజాబీటీకా) శ్రీరామదాసబాధవా
హనుమాన్‌జ్యోతిష్ - బాబాజోధసింహ్ గ్రంథములు వ్రాసబడినవి.

కాశ్మీరిసాహిత్యము :- ప్రకాశరాముఁడని ప్రసిద్ధి నందిన దివాకర ప్రకాశభట్టు విరచితమగు రామావతారచరితయందు హనుమత్కథ రమ్యముగాఁ జిత్రింపఁబడెను.

రాజస్థానీ సాహిత్యము :- ఈ ప్రాంతమున మండలాకారముగ నేర్పడి భక్తులు హనుమద్గీతము లనేకము పాడుచుందురు. ఇట సామాన్యముగా ప్రతిబావికడ హనుమన్మందిర ముండును. నీరు తోడువారందఱు

"జయ హణమాన బలాకారీ బాల్ వంద్యాలా పాణీ
పాణీల్యా పతాలకా - జీపై తేలా బాలకా"

అని పాడుచుందురు. "ఓ బలవంతుఁడవగు హనుమంతుఁడా! నా త్రాడు వెంట్రుకవలె బలహీనమైనది. కాని దీనితో నీవు పాతాళంలోని నీటిని పైకి తెచ్చి యిమ్ము. ఎందుకన నీ పిల్లలమగు మేము ఆనీటితోనే జీవింపవలెను. ఇట్లు వారికి హనుమంతునితోడ నిత్యసంబంధము కలదు.

తమిళ సాహిత్యము :- తమిళ కవిచక్రవర్తి బిరుదాంకితుఁడగు కంబన్ 'రామావతారం' కంబరామాయణముగఁ బ్రఖ్యాతము. అందు హనుమత్కథను చక్కగఁ జిత్రించెను. స్వయంవరాత్పూర్వమే సీతారాముల పరస్పర వీక్షణానురాగములు సంభవించుటఁ గూర్చి హనుమంతునకే రాముఁడే అంగుళీయక మిడు సందర్భమునఁ జెప్పినట్లు వాల్మీకాంశముఁ జెప్పెను. కంబన్ మహాకవి కావ్యాదినే హనుమంతునిగూర్చి విశేషముగఁ బ్రార్థించెను. అది

''అఞ్జిలే ఒన్రు పెట్రాన్ అఞ్జిలే ఒన్రైత్తావి
అఞ్జిలే ఒన్రు ఆరాగ్ ఆరియరక్కాగ ఏగి
అఞ్జిలే ఒన్రు పెట్ర్ అణంగు కణ్డు అయలార ఊరిల్
అఞ్జిలే ఒన్రైవైత్తాన్ అవన్ ఎమ్మై అలిత్తుకాప్పాన్''

ఐదింట నొకదాని పుత్రుఁడు ఐదింట నొకదానిని దాటి ఐదింట నొక మార్గములో ఆర్యులకొఱకై ఏగి ఐదింట నొకదాని కూతురును చూచి విజనుల క్షేత్రములో ఐదింట నొకదానిని అంటించిన యతఁడు మనలను రక్షించుగాక!

ఇందెవ్వరిపేరును లేదు కాని యిది హనుమత్ప్రార్థనము. 'ఐదు' అనునది పంచభూతములకు గుర్తు. వానిలో నొకదాని (వాయు) పుత్రుఁడు (హనుమంతుడు) ఒకదానిని (సముద్రము) దాటి ఒకమార్గము (ఆకాశమార్గము)నఁ జని. ఒకదాని (పృథివి) కూతురుఁ (సీత) జూచి ఒకదానిని (అగ్నిని) అంటించెను. భావము నెంతో మనోజ్ఞముగఁ జిత్రించెను ఇంకను హనుమత్పరముగ

హనుమనై అనుభవిత్త ఆజవారకల మకప్పునాట్టాజావారమ్ - గోపాల కృష్ణనాయుడ్లు

శ్రీ హనుమత్ప్రాభవమ్ - బాలసుబ్రహ్మణ్యఅయ్యర్

లక్ష్మియావీరనహనుమాన్ - యన్.యస్ రాజన్

మున్నగు గ్రంథములు కానవచ్చుచున్నవి.

కన్నడ సాహిత్యము :- కన్నడరామాయణములగు పొన్నకవి - భువనైక రామాభ్యుదయము; నాగచంద్రుఁడు - రామచంద్రచరిత పురాణం (జైనరామాయణం); కుమారవాల్మీకి - తొరవెరామాయణము, మైరావణన్

కొళగ; కనకదాసు - రామధ్యానచరిత; దేవచంద్రకవి - రామకథావతారము; నందళికె లక్ష్మీనారాయణప్ప - అద్భుతరామాయణము; [illegible] వానియందు హనుమత్కథ వర్ణితము. నాగచంద్రుని జైనరామాయణమున హనూమంతుడు రావణుని మేనల్లునిగ జెప్పబడెను. హనుమంతుడు రావణకృత్యములవలన రోసి విభీషణునితోడాయు రామునకు [illegible]యయ్యెను. విమాన మెక్కి సముద్రను దాటినట్లు, తన విద్యాబలముచే లంకను దహించినట్లు నిందు వర్ణింపబడెను.

ఇంకను కన్నడమున 'హనుమద్విలాసము' అను కావ్యమును తిప్పనార్యుడు, బేటేరామ్‌జీదీక్షితకవియు వేర్వేరుగ రచించిరి. పురందరదాసు ఇరువది హనుమత్కీర్తనలు రచించెను. ఇతడు

''హనుమన మతవే హరిమ మతవో
హరిమ మతవే హనమన మతవో''

అని వైష్ణవ మతాన్ని హనుమన్మతముగ గీర్తించెను. విజయనగరాధిపతి శ్రీకృష్ణదేవరాయలు గురువగు వ్యాసరాయలు దేశమంత పర్యటించుచు ఏడువందల ముప్పదిరెండు ఆంజనేయవిగ్రహముల బ్రతిష్ఠించెను. వ్యాసరాయలు హనుమంతునిపై సుందరగేయమును రచించెను. ''జాణనె నహుదో గురుముఖ్య ప్రాణనీ నహుదో'' అను నీ గేయము ప్రసిద్ధము. ఆధునిక మహాకవియగు 'కువెంపు' తన రామాయణ దర్శనము నహనుమత్సముద్రోల్లంఘన ఘట్టము నొక మహాయోగముగ జెప్పెను. ప్రముఖ కన్నడ రచయిత D B గుండప్ప తన 'వాలిగొందునవికె' గ్రంథమున హనుమంతుని భారతీయులకు నాదర్శగురువుగ జెప్పెను. ఇట్లు కన్నడ సాహిత్యమున హనుమత్కథ గాననగును.

మళయాళ సాహిత్యము :- రామకథాకావ్యములగు రామపణిక్కర్ కణ్ణశరామాయణం; ఎళుత్తచ్ఛన్ - అధ్యాత్మరామాయణం; పునం నంబూద్రి - రామాయణచంపువు; కొట్టరకారతంబురాన్ - రామనాట్టం (అట్ట కధ)లద్వారా హనుమత్కథ వర్ణింపబడుటయు కాక

కళ్యాణ-సౌగన్ధికమ్ - యస్. పరమేశ్వరయ్యర్
కళ్యాణ-సౌగన్ధికమ్ తి స్యాతిరప్పాట్టు - కావ్యము
కళ్యాణ-సౌగన్ధికమ్ పట్టముకిరతవమ్ - కావ్యము

కన్నడ-సౌగన్ధికము - కుచనవామ్వెయ్యర్
హనుమానుడు విభీషణుడు - రామమెననపుతజత్తా
వంటి గ్రంథముల ద్వారా హనుమత్కథ వర్ణింపఁబడెను.
ప్రాకృతభాషలోని కథాసరిత్సాగరమున రామకథ కలదు.

**ఆంగ్లభాషా సాహిత్యము** :- ఆంగ్లవ్యాఖ్యారామాయణము లనేకములుకాక

1. Hanuman and Jotayu — Nuldasoja
2. An and horship of the daring Hanumant in Orissa - Sri Sarat Chandraji Mitra
3. Hanumat Mahanatak, a dramatic history of king Ram Kali Krishnaji Bahadur
4. The fright of Hanuman - C. N. Mehata

మున్నగు రచనలు ఆంగ్లభాషయందు హనుమత్కథను చాటుచున్నవి. ఇట్లు హనుమత్కథ ఆంధ్రేతరమగు దేశవిదేశభాషలందెల్లఁ బ్రచలితమై కానవచ్చుచున్నది.

**భారతీయేతరభాషల హనుమత్కథ** :- భారతీయ భాషలలోనే కాక మలయా, జాపనీస్, చీనా, టిబెటన్ భాషాకుటుంబమునకుఁ జెందిన తాయ్ భాషలో రామకియన్ (రామాయణము) కలదు. అందు హనుమత్కథ కలదు.

రష్యన్‌భాషలోనికిఁగూడ రామాయణ మనువదింపఁబడెను. ఇండోనీషియాలో రామకథ బహుళవ్యాప్తి నందినది. అటనే రామాయణను జరిగినదని వారి యభిప్రాయము. ఆ కథకు భారతీయకథతో సామ్యభేదములు కలవు. వీరి రామాయణమున సీతాన్వేషణకై బయలుదేరుటకు హనుమంతుఁడు, నంగదుఁడు నిర్వురు సిద్ధముకాగా వారినడుమ వివాద మేర్పడెను తుదకు నంగదుఁడు హనుమంతుని గొప్పదనము నంగీకరింప నతఁడు Alengaka - అలెంగక - లంకచేరి వెదకి వెదకి పరిచారికల సంభాషణలద్వారా సీత గల ప్రదేశ మెఱిఁగెను. లంకాదహనము గావించెను.

**ఉర్దూభాషా సాహిత్యము** :- మహమ్మదీయులలో హనుమద్భక్తు లనేకులు కలరు. ఉర్దూభాషయందు శ్రీమన్ హనుమన్‌జీకా ముకమ్మల్ జీవన చరిత్ర అను గ్రంథము సుఖరామ్‌దాస్‌జీ రాకూర్ రచించెను.

**ఉద్యమనిర్వహణలో హనుమంతుఁడు** :- భారతదేశమున ధర్మయుద్ధములు, ఉద్యమములందు హనుమంతుని ఆదర్శమెంతగనో స్వీకరించుట

కానవచ్చును. కురుక్షేత్ర సంగ్రామమున ''జెండాపై కపిరాజు'' అని తిరుపతివేంకటకవు లన్నటుల హనుమత్పతాక విజయుని విజయకారణము కాగా హిందూ సామ్రాజ్య స్థాపనోద్యమమున సమర్థరామదాసు హనుమంతునే ఆరాధ్యునిగా స్వీకరించి కృతకృత్యుం డగుట స్పష్టము.

భారత స్వాతంత్ర్యోద్యమమున గాంధీమహాత్ముడు తన పర్యటనలలో యువకులముందు హనుమంతు నాదర్శముగా నుంచి హనుమంతుని కేవలం శరీరబలముకొఱకే ఆరాధించుదుము. అట్టి శరీరబలమున కైనచో రావణునిమూర్తిని ప్రతిష్ఠింపవచ్చు. అట్లుగాక మారుతిని స్వీకరించుటలో శరీరబలముతో బాటు ఆత్మబలమును కూడ దృష్టియందుంచుకొనియే'యని యుద్బోధించువాడు.

స్వాతంత్ర్యోద్యమ చరిత్రయందు స్వర్ణాక్షరములలో లిఖింపబడిన యాంధ్రచరిత్ర మెంతయో కలదు. అందు నాంధ్రరత్న శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ఉద్యమకృషికి నాదర్శము హనుమంతుడు. హనుమంతుని యందలి నిస్వార్థసేవ నాదర్శముగఁగొని శాంతియుతముగ నుద్యమము నడుప 'రామదండును' స్థాపించెను. 'అందలి సభ్యులందఱు ఆంజనేయచిత్రముకల పతాకను ధరింపవలెను. రామదండు సభ్యులు చెంగావి ధోవతి, చెంగావిచొక్కా, తలపాగా, కుంకుమతిలకము, రుద్రాక్షతావళము, అంగవస్త్రము, తామ్రపాత్ర. దండము, తాళపుచిరతలు, ఒకపచ్చని రెమ్మయు, హనుమత్పతాకను ధరింపవలెను. ది. 30-3-1921న విజయవాడలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు మహాసభలు మహాత్మాగాంధీ, చిత్తరంజన్‌దాస్ ప్రభృతుల నేతృత్వమున జరిగెను. లక్షలాది ప్రజలు పాల్గొన్న ఆ సభలలో మొదటిరోజు సంక్షోభ మేర్పడెను. మరుసటి దినమునకు వేయిమందితో రామదండు ప్రత్యేకముగ రైలులో వచ్చినది. నాటినుండి రామదండు సేవానిర్వహణలో క్రమశిక్షణాయుతముగా ఉద్యమసభలు నిర్వహింపఁబడుటతో నెల్లూరు రామదండును ప్రశంసించిరి. ఆ సంవత్సరమే కారాగారశిక్ష పడి జైలుకేగు రామదండు నాయకులు ''పదవే భద్రాద్రికి పాపిష్ఠిఘటమా'' యని పాడుకొనుచు వెడలిరి.

---

1. చీరాలచరిత్ర - పుట 3

# భిన్న సంప్రదాయముల హనుమత్కథ

“ఎందరో మహానుభావు” లని త్యాగరాజస్వాముల మహనీయు లెందరో మహాత్ములందు మార్గదర్శనము చేసినవారు కలరు. వారు చూపిన మార్గములు నేడు భిన్న భిన్న సంప్రదాయములుగా ప్రసిద్ధములై వారి వారి అనుయాయులచే ననుసరింపబడుచున్నవి. ఇట్టి సంప్రదాయము లన్నియును హనుమంతుని ఆదర్శముగాను, ఆరాధ్యునిగాను స్వీకరించుట కనబడును. ఆయా ప్రాంతీయు లాంధ్రదేశమునకు వచ్చుటద్వారాను, ఆంధ్రు లాయా ప్రదేశముల కేగుటవలనను అట్టి మార్గములు, సంప్రదాయములు కొన్ని కొన్ని కొందఱు కొందఱకుగా నాంధ్రులకును అనుసరణీయములై కానవచ్చుచున్నవి. అట్టి భిన్న సంప్రదాయములందలి హనుమత్కథనుగూడ పరిశీలించుట ప్రకృతవిషయ పూర్ణత కావశ్యకము.

<u>మధ్వసంప్రదాయము</u> :- ఆంధ్రమునకు, హనుమంతునకు మిక్కిలి దగ్గఱి సంప్రదాయ మిది. వీరు ద్వైత మతానుయాయులు. ద్వైతమత స్థాపకులు మధ్వాచార్యులు. ఈ సంప్రదాయమువారికి హనుమంతుఁడు ముఖ్యదైవము. మధ్వాచార్యులవారు హనుమదవతారమని చెప్పుదురు. వీరి కార్యక్షేత్రము కర్ణాటకదేశమైనను వీరు ఆంధ్రదేశమునకు సంబంధించినవారే. [1]వీరి యింటిపేరు ‘నడుమింటి’వారు. సంస్కృతీకరించి దానిని ‘మధ్యగేహ’ యనుచు మధ్వాచార్యుని పూర్వులను మధ్యగేహులని పిలుచువారు. మధ్వాచార్యుని పూర్వాశ్రమ మాత వేదమతి. ఆమెకు శ్రీహరి ప్రత్యక్షమై వాయుదేవు ననుగ్రహమున సంతానము కల్గునని చెప్పెను. వాసుదేవుఁ డను నామధేయమునఁ బెరిగిన యాతఁడే మధ్వాచార్యుఁడయ్యెను. చిన్ననాటినుండి యాతనిని హనుమద్రూపునిగ భావన చేయువారు. అట్టి శక్తియుక్తు లందుకు కారణములు. ఈ సంప్రదాయము వారికి హనుమంతుఁడందుననే యిష్టదైవ మయ్యెను.

“ప్రథమో హనుమాన్ నామ - ద్వితీయో భీమ ఏవచ
పూర్ణప్రజ్ఞ స్తృతీయస్తు - భగవత్కార్యసాధకః”

అని త్రేత ద్వాపర కలియుగముల హనుమద్భీమ మాధ్వులు వాయ్వంశగల యేకాత్ములని వీరి భావనము. అనంతకోటి బ్రహ్మాండనాయకుఁడగు విష్ణువున కనన్యభక్తుఁడైన వాయుదేవుఁడు

1. జగద్గురు మధ్వాచార్య - పుట 4

శ్రీ రామావతారమును - హనుమంతునిగా
శ్రీకృష్ణావతారమును - భీమునిగా
వేదవ్యాసావతారమును - మధ్వాచార్యునిగా

సేవించి ధర్మరక్షణ గావించెను. 'బాహ్వో బలాత్ జ్ఞానబలాచ్చ [illegible] ధర్మః' అను వీరి మతము బుద్ధిబలము, బాహుబలము [illegible] గల హనుమంతు నారాధ్యునిగ స్వీకరించెను ఈ సంప్రదాయమందు గాన నగు హనుమచ్ఛబ్దార్థమే సర్వత్ర గ్రాహ్యముగ చేతురు. ఆ రామ భక్తుని నామము లన్నిట హనుమచ్ఛబ్దమే ప్రశస్తముగ గానవచ్చు చున్నది. వజ్రాయుధమున గొట్టబడుట మాత్రమే దాని యర్థమైన నంతటి విశిష్టత భావింపజాలము. మధ్వాచార్యులు తమ ఐతరేయభాష్య మున "హనుశ్శబ్దో జ్ఞానవాచీచ - హనుమానితి శబ్దితః" అని వివరించిరి. ఈ రీతిగా నీ సాంప్రదాయమున సీతకుడు బుద్ధిమతాం వరిష్ఠునిగా విశిష్ట భావన నందెను. అంతియకాక మధ్వసంప్రదాయి యగు శ్రీనారాయణ పండితాచార్యులు రచించిన 'సమధ్వవిజయము' అను గ్రంథమున

"యే యే గుణా నామ జగత్ప్రసిద్ధాః
యం తేషు చ వినిర్దిశన్తి
సాక్షా న్మహాభాగవత ప్రవాహం
శ్రీమంత మేనం హనుమంత మాహుః"

అని హనుమంతునకు చక్కని వివరణము కలదు. ఇంతటి విపులార్థమును దృష్టియందుంచుకొనియే వాల్మీక్యాదులు హనుమచ్ఛబ్దమున కంతటి ప్రాధాన్యత నిచ్చియుందురు. వీరును హనుమంతుని "చిరంజీవిగ" గ్రహింతురని

"అసా విదానీంచ నిషేవమాణో
రామం పతిం కిం పురుషే కిలాస్తే"

అను 'సమధ్వవిజయ' వాక్యము తెల్పుచున్నది. మాధ్వులు విద్యా ధనాదు లన్నింటికై హనుమంతుని ప్రార్థింతురు. అందుకు మధ్వాచార్య వాక్యమే ప్రమాణము.

"విద్యా వాపి ధనం వాపి - రాజ్యం వా శత్రునిగ్రహం
తత్క్షణా దేవ చాప్నోతి-సత్యం సత్యం సునిశ్చితమ్॥" (తంత్రసారము)

ఆంధ్రదేశమునందు కడప మండలమున మంత్రాలయమను [illegible] కలదు. అందు రాఘవేంద్రస్వామి బృందావనము, తదారాధ్యులగు పంచముఖ హనుమత్ప్రతిమయు ఆరాధ్యములు. ఇది మధ్వసంప్రదాయులకు ప్రధానక్షేత్రము. మధ్వాచార్యుని హనుమదవ తారముగా [illegible]

''భవిష్యన్తి కలౌ ఘోరే జీవా హరిబహిర్ముఖాః
రామాజ్ఞా హనుమాం శ్చైవ మధ్వాచార్యః ప్రభాకరః
శంకర శ్శంకరః సాక్షాద్ వ్యాసో నారాయణ స్స్వయం
శేషో రామానుజో రామో రామదత్తో భవిష్యతి''

అను సదాశివసంహితా వాక్యము స్పష్టము చేయుచున్నది. ఇట్టి హను మత్సంప్రదాయ స్థాపకులగు మధ్వాచార్యులవారు నడిమింటి తెలుగువా రగుట విశేషము.

వైఖానస సంప్రదాయము :- ఈ సంప్రదాయమునఁ బ్రామాణిక గ్రంథమును, బ్రహ్మకుఁ బుత్రుఁడు, శిష్యుఁడును అగు మరీచిచే రచింపఁబడిన ''విమానార్చనాకల్ప''మను గ్రంథమున హనుమద్దర్శనముఁ గూర్చి యిట్లు కలదు. ''(రామస్య) దక్షిణే పురతోఽఞ్జనేయః శ్వేత వస్త్రధరః, కపిరూపః సర్వాభరణ భూషితో ద్విభుజో దక్షిణహస్తే నాస్యం పిధాయ వామహస్తేన వస్త్రం పిధా యావనత గాత్రః స్థితో వార్తా విజ్ఞా పనపరో మృగవాహనో దండధ్వజో మహానాథః శ్రావణేమాసి శ్రవణ జాతః కలాద్వ్యక్షర బీజో హనుమాన్ - కపిరాజం హనుమంతశబ్దరాశిం మహామతిం.... ఇత్యాదికముచే హనుమంతుని వర్ణము నలుపని, వస్త్రము తెలుపని యిట్లు స్వరూపము తెలియుచున్నది''

ఇందు శ్రావణమాసము శ్రవణనక్షత్ర మనుటచే శ్రావణ పౌర్ణమి నాఁడు జనన మని తెలియును. కాని వాల్మీకమున ఆశ్వీనమాసము, స్వాతినక్షత్రము అని యుండుటఁబట్టి వాల్మీకికృత రామాయణసంబంధి కల్పమునకు పూర్వకల్ప విషయమును వైఖానస సంప్రదాయము గ్రహించె నని తెలియును. ప్రాచీనకాలముగా ఈ వైఖానసాగమమున హనుమదుపాసన కలదు. హనుమ దర్శనోత్సవవిధి యను గ్రంథమును బట్టి వీరి యర్చన, ఉత్సవవిధి, బ్రహ్మోత్సవాదులుఁ దెలియును.

**రామదాస సంప్రదాయము** :- ధర్మముతో పాటు దేశమును కూడ సముద్ధరించుటలో ముందు నిలిచినది సంప్రదాయము. అట్టి రాష్ట్రగురు స్థాన మలంకరించినవాడు సమర్థరామదాసు. వీరి గురుపరంపర

"ఆదినారాయణం విష్ణుం - బ్రహ్మాణంచ వసిష్ఠకం
శ్రీరామం మారుతిం వందే - రామదాసం జగద్గురుమ్"

అని నుతింపబడును. వీరి గురుపరంపరలో హనుమంతుడు కలడు. 2 ఏండ్ల ప్రాయముననే హనుమంతుడు సమర్థునకు రామనామ గురుమంత్రము చెప్పి సాక్షాత్కారము చేయించినట్లు చరిత్ర తెలుపుచున్నది. నాసికకడ సమర్థుడు 13కోట్ల జప మొనర్చుచు ప్రవచనము చేయుచుండ స్వయముగ హనుమంతుడుకూడ వాయసరూపమున వచ్చి వినువాడట. అటనే రామదాసు హనుమద్రూపము నొకదానిని స్థాపించెను. హిందూధర్మ, హిందూసమాజముల దుస్థితి చూచి అతడు హనుమదుపాసనీయను సంజీవని మహాతంత్రమిడి దానిద్వారా హిందువులలో ఆత్మవిశ్వాసము నింపెను.

ఆ ప్రేరణతో ధర్మసంరక్షణార్థము కొన్ని వేల స్థలములలో శక్తి ప్రతీకయగు హనుమంతుని భవ్యమూర్తులను స్థాపించెను. వానిలో పాదములతో రాక్షసులను మర్దించు రూపములను నిల్పి ధైర్యము నిరూపించెను. కాశీ హనుమాన్‌ఘాట్, ఢిల్లీ, సింహళములలోనే కాక మహారాష్ట్రలో విశేష ప్రచారము జరిగెను. హనుమంతుడు లేని గ్రామము లేదను రీతిగా అంతటను సమర్థుని శిష్యుల విగ్రహప్రతిష్ఠలు వెలుగొందెను. అందు ప్రత్యేకము పదునొకండు మందిరము లత్యంత ప్రాధాన్యత నందినవి. వీనిలో ప్రతాపమారుతి, దాసమారుతి యెక్కుడు. సమర్థుడు తన 'మనోబోధ'లో 87వ శ్లోకము, దాసబోధలోని 16వ దశకము, కిష్కింధ, సుందర, యుద్ధకాండల రామాయణములందు హనుమంతుని గొప్పగ వర్ణించుటయె కాక పై పదునొకండు మందిరముల మూర్తులపై స్తోత్రములు వ్రాసెను. కొన్ని అభంగములు, నాల్గు ఆరతులు, రామదాస కృతములు నేటికిని విశేష ప్రచారమున నున్నవి.

ఈ సంప్రదాయమువారు నిత్యకార్యమున దాసబోధ పఠించిన పిదప హనుమత్పరములగు నారు శ్లోకములు పఠింతురు. అందు హనుమం

తుఁడే తను కులపురుషునిగను, ముఖ్యదేవతగను చెప్పుకొందురు. హనుమ దుపాసనె తమ నియమముగఁ జెప్పుదురు.

గౌడీయ వైష్ణవ సంప్రదాయము :- ఈ సంప్రదాయమున దాస్యభక్తి యందు హనుమంతుఁ డాదర్శముగఁ బూజితుఁడు. ఈ మతప్రవర్తకుఁ డగు చైతన్యమహాప్రభు ప్రధానపరికరుఁడగు మురారిగుప్తను హనుమద వతారముగఁ జెప్పుదురు. 16వ శతాబ్దినాటి కవికర్ణపూరుఁడు తన గౌర గణోద్దేశ దీపికా గ్రంధమున "మురారిగుప్తో హనుమా - నంగదః శ్రీ పురందరః'' అని చెప్పెను. వారి వైష్ణవవందనయందు

"వందిబో మురారిగుప్త భక్తి శక్తి మన్త
పూర్వ అవతార్ యార్ - నామ్ హనూమన్త"

అని కలదు మురారిగుప్తకు తరచు హనుమదావేశ మేర్పడుచుండెడి దట. ఒక్కమారు చైతన్యుని యాదేశముపై వారిని, గౌరాంగుని చంకలోని కెత్తుకొని పోయి వారి ప్రాంగణమున దించెను. ప్రసిద్ధ గౌడీయవైష్ణవా చార్యుఁడు రూపగోస్వామి కృతమగు పద్యావళియందు ''భక్తానాం మాహాత్మ్యం'' అను ప్రకరణమున ''శ్రీవిష్ణోః శ్రవణే పరీక్షి దభవత్.... ....కపిపతి ర్దాస్యే'' అని దాస్యభక్తునిగ హనుమంతుఁడు చెప్పఁబడెను. జీవగోస్వామియుఁ దన భాగవత 'క్రమసందర్భటీక' యందు నట్లే చెప్పెను. అందలి హనుమత్కృత రామచంద్రస్తుతి (5-9-1-8) కి గంభీర వ్యాఖ్య చేయఁబడెను. శాండిల్యుని భక్తిసూత్రము 44 లోని 10 విశేష లక్షణముల నేడవదగు 'తదర్ధప్రాణస్థాన'మునకు వ్యాఖ్యాకారుఁ డగు స్వప్నేశ్వరుఁడు హనుమంతు నుదాహరణముగ నిరూపించెను. ఇట్లీ సంప్రదాయమున హనుమంతుఁడు దాస్యభక్తి కాదర్శము.

నాధసిద్ధ సంప్రదాయము :- ఈ సంప్రదాయమున హనుమజ్జననగాధ విశేషముగఁ జెప్పఁబడెను. అంజన, కేసరియు ఘోర తప మాచరించు చుండ శివుఁడు ప్రత్యక్షమై ''అంజనా! రేపటి యుదయమను సూర్యనారా యణున కభిముఖముగ నంజలిఘటించి యుండుము. అం దేదిపడిన దానిని స్వీకరింపుము. దానిచే మహాతేజస్వి యగు బుత్రుఁ డుదయించు'' ననెను. ఆమె యట్లే చేసెను. ఇంతలో దశరధుని పుత్రకామేష్టియం దగ్నిహోత్రునిచే నీయఁబడిన హవిస్సులో గైకేయి కిడిన భాగము నొక

గ్రద్ధ తన్నుకొనివచ్చి యంజన యంజలిం బడవైచెను. అందుచే హను-మంతుం డుదయించెను. ఇట్టి విశేషగాధ ఆనందరామాయణమునందు గాన వచ్చును.

<u>వల్లభ సంప్రదాయము</u> :- శ్రీపురుషోత్తమునివలననే ఆరంభమైన ఈము ఖ్య సంప్రదాయమున "కింపురుషాణాం హనుమాన్- విద్యాధరాణాం సుదర్శనః" (భగ, 11-16-19) అని భగవద్గీతయందలి శ్రీకృష్ణభగవానుని వాక్యము. "కింపురుషే వర్షే పరమభాగవతో హనుమాన్" (భాగ 5-19) అను భాగవతమందలి వ్యాసభగవానుని వాక్యముల ననుసరించి హనుమంతుడు నారాధ్యుం డయ్యెను. ఈ సంప్రదాయమున నాద్యాచార్యుండు వల్లభమహాప్రభువుయొక్క భారతభ్రమణమునం జిత్రకూటముపై రామాయణపారాయణ మొనర్చుచో హనుమంతుండును గద్గద హృదయుండై వినుచుండువాడట. వల్లభాచార్యుండు తమ జన్మదినమున మార్కండేయు పూజనారంభించి చిరంజీవిగ హనుమంతునికూడా నారాధించువాడు.

"అంజనీగర్భ సంభూతః - కపీంద్ర సచివోత్తమః
రామప్రియః నమస్తుభ్యం - హనుమాన్! రక్ష సర్వదా"

అనునది వీరి ప్రధాన హనుమద్ధ్యానము. శ్రీ వల్లభాచార్యుల అంతిమ కేంద్రం కాశ్మీరులోని హనుమాన్ఘాట్ నందలి హనుమత్సన్నిధానమే. వారు తమ పుత్రద్వయమున కంతిమసందేశ మిడుట, మౌనసన్న్యాస ధారణము, భౌతికదేహ త్యాగము నటనే యొనర్చిరి. వల్లభాచార్యులనీ తత్సంప్రదాయులును అవకాశము కల్గినపుడెల్ల హనుమంతు నర్చింతురు. వల్లభసుతుండు గోసాయి విఠలనాథుండు అష్టఛాపకవులచే విరచింపజేసిన కీర్తనలలో హనుమంతునకు నుచితస్థానము కలదు. ఆ కీర్తనలు నేటికిని ప్రచారమునందున్నవి. తిలకాయతు లనబడు నీ సంప్రదాయ గురువులు హనుమదారాధన మొనర్చుటయేకాక వారి వారి స్థానములలో హనుమత్ప్రతిష్ఠలం జేసిరి. వీరి యమునదిన జయపెరాష యందు హనుమత్స్మరణయుం గలదు. శ్రీకృష్ణునే తప్ప యన్యుల భజింపరను నీ సంప్రదాయమునం గూడ హనుమంతునకు సముచితస్థానము కలదు.

<u>రామానంద సంప్రదాయము</u> :- ఈ సంప్రదాయమున హనుమంతునకు విశిష్టస్థానము కలదు. అందును హనుమంతుని రామదూతగ భావింప వీరు

శ్రీరామమంత్రమునకు ప్రధానాచార్యునిగా స్వీకరింతురు. శ్రీరామతారక మంత్రమును రాముడు సీత కీయ నామె హనుమంతున కుపదేశించెను. హనుమంతుడు బ్రహ్మదేవున కుపదేశించగా నది పరంపరాగతముగ విస్తృత మైనట్లు వీరి మతము.

> ''జానకీ తు జగన్మాతా - హనూమంతం గుణాకరం
> శ్రావయామాస నూనం హి - క్రమా దస్మా దవాతరత్''
> (వాల్మీకిసంహిత)

ఈ సంప్రదాయాచార్యులు శ్రమ దనంతాచార్యులును ''హనుమంతం సదా వందే - రామమంత్ర ప్రవారకమ్ (సిద్ధాంత ప్రదీపకం) హనుమంతుని శ్రీరామమంత్ర ప్రవర్తకునిగా జెప్పిరి. వీరి సంప్రదాయమున హనుమదుపాసన ఆవశ్యకమే కాదు అనివార్యము.

హనుమత్పర మాచార్యం - వినాఽఽచార్యో నకో ఽపి
ఇతి పద్ధతి నిర్ణీతం - పూర్వోక్తం చ మహోదితామ్
ఆచార్యం చ హనూమంతం - త్యక్త్వా హ్యన్య ముపాసతే
క్లిశ్యన్తి చైవ తే ముగ్ధా-మూలహీః పల్లవాశ్రితాః॥ (మహాశివసంహితా)

అని వీరి ప్రమాణము. నారద భక్తిసూత్రముకూడ హనుమంతుని భక్తికి ఆచార్యునిగా, 'ఇత్యేవం వదంతి...... హనుమ ద్విభీషాదయో భక్త్యాచార్యాః (నా.భ. సూ-3) అని చెప్పుచున్నది. వీరు ''రాం రామాయ నమః'' మంత్రముతోనే ''హనుమతేనమః'' మంత్రము చెప్పి అనివార్యముగా రామ మంత్రగాయత్రితోబాటు ''ఆంజనేయాయ విద్మహే మహాబలాయ ధీమహి తన్నో హనుమాన్ ప్రచోదయాత్'' అను హనుమద్గాయత్రి జపింతురు. ఇతర సంప్రదాయములవలె స్వతంత్రముగా బూజించుట కాక

> ''శ్రీరామస్య ప్రసాదో హి - భుంక్తే శ్రీ మారుతాత్మజః
> అతః కపీశపూజాయాం - హరే రర్పిత మర్పయేత్॥'

అని శ్రీరామార్పిత వస్తువే హనుమంతున కర్పింతురు.

''స్వాత్యాం కుజే శైవతిథౌ తు కార్తికే'' (శ్రీవైష్ణవమతాబ్జభాస్కరం-81) అనుదానినిబట్టి ఈ సంప్రదాయం ప్రకారం హనుమదవతారము కార్తికమాసమునందు జరిగెను. హనుమంతునకు జన్మలేదు. కేవల అవతారము.

గర్భజన్మాది దుఃఖం మే అననుభూయ స్థితాః సదా
సీతారామప్రియాః శశ్వ త్తే హనుమ న్ముఖామాతాః॥''

శ్రీవైష్ణవ మతాబ్జ భాస్కరం - 136

శ్రీవిష్ణు మహాయాగ, రుద్ర మహాయాగములవలె వీరి మతమున శ్రీ మారుతి మహాయజ్ఞము కలదు ఇట్టి హనుమత్ప్రాధాన్యత కల డీ సంప్రదాయము.

శ్రీస్వామి నారాయణ సంప్రదాయము :- శ్రీకృష్ణునే పరబ్రహ్మముగను పురుషోత్తమునిగ నెంచి యన్యదేవతల గణింపని వీరును హనుమంతుని యెడ భక్తిని కల్గియుందురు. స్వయముగ స్వామి నారాయణుడే
"భూతా ద్యుపద్రవే క్వాపి - వర్మ నారాయణాత్మకం
జప్యంచ హనుమ న్మంత్రో - న జప్యః క్షుద్రదేవతా॥" (శిక్షాపత్రిక-85)
అని హనుమంతుని జపమును విధించెను. వీరి సకామోపాసనలో హనుమత్పరమగు స్తోత్రమంత్రములు కలవు ఈ సంప్రదాయ యోగిరాజు శ్రీ శతానందస్వామి కృతమగు 'శ్రీ సత్సంగి జీవనము' అను గ్రంథమున గల యొక స్తోత్రమును పదునొకండు వేల పర్యాయము లొనర్చిన శత్రు నాశము చెప్పబడెను. శ్రీ ప్రేమానందస్వామి కృతమగు హనుమంతుని ఆరతిని ప్రాత స్సాయం సంధ్యలందు నీ సంప్రదాయమువారు పాడుచుందురు.

ఇట్లే రామస్నేహినంత్ సంప్రదాయము వంటివి కూడ హనుమంతున కుచితస్థాన మిచ్చియున్నవి. అఘోర సంప్రదాయమునను అఘోరాంజనేయ జపవిధి కలదు. ఇట్లు సర్వసంప్రదాయముల వారికిని హనుమంతుడు ముఖ్యుడు.

జైనసంప్రదాయము :- జైన సంప్రదాయానుసారము ప్రతికల్పమునందు నిరువది నల్వురు తీర్థంకరులు, పండ్రెండుగురు చక్రవర్తులు, నిరువదినల్వురు కామదేవులు నుందురు. ఈ కామదేవులా జన్మతోనే ముక్తులై పరమాత్మ యగుదురు. శ్రీహనుమంతుడు పదునెనిమిదవ కామదేవుడు. అతడు కోతి కాదు. అది యొక వంశము. వానరవంశమని దానిపేరు. జైనమతానుసారుల రాజధ్వజమువందు కోతిచిహ్నము కలదు. కావున వారివంశము వానరవంశముగా విఖ్యాతి నందెను. వీరి మతము ప్రకా

రము హనుమంతుని తండ్రి పవనకుమారుఁడు, తల్లి అంజన. చిన్నతన మున హనుమంతుఁడు తన మామతో విమానమున నాకాశమార్గమున వెళ్ళుచు నాటలో జారి క్రింద పర్వతముపైఁ బడ నాతని కేమియు దెబ్బ తగులలేదు కాని పర్వతము బ్రద్దలయ్యెను. అతఁడు వజ్రాంగుఁడు. విద్యాధరుఁడు. మంత్రసిద్ధివంటివి కలవు. బాలబ్రహ్మచారికాఁడు. గృహస్థాశ్రమము చివఱ సర్వసంగ పరిత్యాగియై తపమొనర్చుచు శ్రీరామునివలె ఆ జన్మమందే ముల్లోకములఁ బూజితుఁడై అనంతకాలీనుఁడగుఁ బరమాత్మగా వచ్చెను. ఇట్లు హనుమంతుఁ డవైదికమతములందును ప్రశంసితుఁడు. సర్వసంప్రదాయ ప్రశంసితుఁ డగు హనుమంతుఁ డాంధ్రదేశ జాతుఁడయ్యు శక్తియుక్తులచే విశ్వఖ్యాతుఁ డయ్యెను.

శిరిడీసాయిసంప్రదాయము : [1]శిరిడీ సాయిబాబా మసీదునుండి బయటకు వెళ్ళేటప్పుఁడు మారుతి ఆలయానికిఎదుట ఆగి ఏమో గొనుగుతూ మారుతి పైపు తిరిగి ఏవో భంగిమలు చేసేవారు. [2]సోమనాథునికి శ్రీ సాయి మారుతి రూపంగా దర్శన మిచ్చాడు.

## హనుమంతుఁడు ఆంధ్రుఁడు

ఆంధ్రవాఙ్మయము సవిస్తరముగ హనుమంతుని సంపూర్ణచరిత్రను ప్రదర్శించుటలోఁ గారణ మనఁదగిన ప్రధానమగు నాత్మీయత యొక్కటి కలదు. అది హనుమంతుఁడు ఆంధ్రుఁ డగుట. హనుమంతుఁ డాంధ్రుఁడనుటకు నాతని జనన, జాతి, దేశవిచారమే ప్రధా నాధారము. హనుమంతుని నాటి జన్మస్థలము ఈనాటి ఆంధ్రదేశ మగుటవలన హనుమంతుఁ డాంధ్రులకు సంబంధించినవాఁడుగఁ బరిగణింపవచ్చును. అట్టి ఆంధ్రదేశీయ మగు హనుమ జ్జన్మస్థల విషయమును హనుమద్గ్రంథము లన్నియు వెలుగెత్తి చాటుచున్నవి. అందుకుఁ బురాణప్రమాణములును స్పష్టముగఁ గలవు.

స్కాంద పురాణాంతర్గత మగు వేంకటాచల మాహాత్మ్యమున నిట్లు కలదు. తన ననుగ్రహించిన మతంగ మహామునితో నంజన [3]"ఓ విప్ర

1. శిరిడీసాయిబాబా జీవితచరిత్ర - పుట 119
2. శిరిడీ సాయిబాబా జీవితచరిత్ర - పుట 82
3. శ్రీ వేంకటాచల మాహాత్మ్యము - పుట 190, 191

మహాపురియయిన కిష్కింధయందు పుత్రసంతానము లేక దుఃఖించి వివిధ వ్రతముల నాచరించితిని...." అని చెప్ప నా మహాముని "సువర్ణ ముఖీనదికి ఉత్తరభాగమున వృషభాచలము, దాని అగ్రభాగమున స్వామి పుష్కరిణియుం గలవు. ఆ నదిలో స్నానమాడి వరాహునికి నమస్కరించి వేంకటేశునికిఁ బ్రణమిల్లి ఆకాశగంగా తీర్థమున కభిముఖముగ నుండి వాయుదేవుని గూర్చి తపమాచరింపు" మని చెప్పెను. ఆమెయు నట్లే యొనర్చి శ్రీహనుమంతుని బడసినట్లు కలదు పై వాక్యములఁగల స్థలములఁబట్టి యవి నేటి ఆంధ్రదేశమందలి తిరుపతి-తిరుమల ప్రదేశము లని స్పష్టము. కావున నాంధ్రదేశ సంజాతునిగ హనుమంతుని భావింప వచ్చును.

ఈ విషయమునే పరాశరసంహితయందలి "తతః కాలే మహాదేవః పర్యట న్పృథివీ మిమాం, పార్వతీసహిత శ్రీమాన్ - వేంకటాఖ్యం గిరిం గతః" అను వాక్యము, బ్రహ్మాండ పురాణమునందలి తీర్థఖండమునఁగల

2 "అంజనే! త్వంహి శేషాద్రౌ - తప స్తప్త్వా సుదారుణం
పుత్రం సూతవతీ యస్మాత్ - లోకత్రయ హితాయ వై ॥
ప్రసిద్ధం యాతు శైలోఽయ మంజనే! నామత స్తవ
అంజనాచల ఇత్యేవ-నాత్ర కార్యా విచారణా॥
అను వాక్యములు ననేకములు ప్రమాణముగ నుండ

3 "తిరుపతి నుండి తిరుమలకు వెళ్ళు మార్గమున గల ఏడుకొండలలో
అంజనాదేవి తపస్సుచేసిన పర్వతము అంజనాద్రి"

అని స్పష్టముగ సంకలన గ్రంథములు తదితరములు నెన్నియో చెప్పు చున్నవి. ఇట్లు జనన ప్రదేశ మాంధ్రముగ స్పష్ట మగుచున్నది.

సుగ్రీవ మంత్రిగా వసించినప్రదేశముఁబట్టి కూడ అతఁడాంధ్రుఁ డనియే భావింపవచ్చును. ఆంధ్రప్రాంతమున కొక యంచున జననము కాగా మఱియొక యంచున నివాసము. అట్టి నివాస స్థల మగు కిష్కింధ బళ్ళారి ప్రాంతమునకుఁజెందినది. కొమర్రాజు లక్ష్మణరావుగారిది యిదే యభిప్రాయముగా 4 'కిష్కింధ, పంచవటి స్థలనిర్ణయ'మను శీర్షికవలనఁ

1. ప, సం - 6-21 2. బ్రహ్మాండపురాణ - తీర్థఖండం 5-64, 65
3. రామచరణ్ రామాయణము - పుట 262
4. భారతి - ఫిబ్రవరి 1929 కలగూరగంప

వలియును. బళ్ళారిప్రాంత మాంధ్ర మనఁదగినది. [1] 'ఆంధ్రులెవరు' వ్యాసమున కర్త గాడె నరసింహారావు బళ్ళారిప్రాంతమువారి నాంధ్రుల గఁదల్పెను. సురవరం ప్రతాపరెడ్డి యీ విషయమునే [2] 'బళ్ళారి జిల్లాలోని బుట్టుపల్లనే పంప, ఋష్యమూకాద్రి ప్రదేశాలున్నాయని స్థానికులందు' రనుచు లాంగ్‌హర్స్టుగారు రామాయణములో వర్ణింపబడిన కిష్కింధ హంపీప్రాంతములోని దనుటలో సందేహము లేదు.' అనిరి. కాన పంపాతీరమే పంపాసరస్సు అది ఆనెగొందెవద్ద కలదు. తుంగభద్రకే ప్రాచీనకాలమున పంప యని పేరు. ఋష్యమూకపర్వతం నిజాము రాజ్యం సరిహద్దులో కలదు. మతంగపర్వతం హంపివద్దనే యనెను. హనుమత్కథా తరంగిణీయందిదే విషయమును స్పష్టపఱచుచు [3] 'కిష్కింధారాజ్య మాంధ్రులది. వాలి సుగ్రీవు లాంధ్రులు. హనుమంతుఁడు నేటి తిరుపతికొండమీద నాకాశతీర్థముచెంగట జనియించినాఁడు. తిరుపతి ఆంధ్రులది. హనుమంతుఁడు నాంధ్రజాతీయుడే' యని అవ్వారివారు వివరించిరి.

ఇక నీ జాతినిగూర్చి ప్రతాపరెడ్డి [4] 'రామాయణ వానరులుకోతులు కా రనియు వారుదక్షిణాపథమం దుండు ఆటవికులని నాఅభిప్రాయము' అనెను. కాశీబట్ట బ్రహ్మయ్యకూడ వీరు శాఖామృగములు కానేరరని, హీననాగరికత కల్గియుండు నొక తెగ మానవు లనియుఁజెప్పిన దానిని ఖండించుచు గోపరాజు రామదాసు [5] "అందఱికంటె పెద్దతోక గల హనుమంతునికే బుద్ధి తక్కువైతే అంతపని ఎటుల చేయగల్గును? అని దానిని ఖండించెను. [6] అంతియుకాక వానరులు సవరజాతివా రనియుఁ జెప్పఁబడెను. [7] "ఋష్యమూకలోని 'మూక' ద్రవిడపద మనియు 'రా'అనగా

---

1. భారతి - ప్రభవ భాద్రపదం 1927
2. రామాయణ విశేషములు - పుట 265
3. హనుమత్కథా తరంగిణీ పుట - 21 పాదదీపిక
4. రామాయణ విశేషములు - పుట 296
5. భారతి 1926 మార్చి రామాయణమునందు వానరులెవరు?
6. సప్తగిరి జూన్ 1986 - పుట 20
7. భారతి 1926 ఏప్రియల్ రామాయణమునందు వానరులెవరు'

సవరభాషలో నేనుఁ గనియు నాపదమును కిష్కింధలోని కింజాన్ అను సవరభాషా పదమునకు 'వెనుకప్రక్క కష్టసాధ్యంగా వెళ్ళదగినది' కిష్కింధ అనియు వివరించెను. చిన్నవాడు పెద్దవాని భార్యను పెండ్లాడుట, ఆకులదొన్నెలతో కల్లుత్రాగుటలుకూడ సవరజాతి ఆచారములని వివరింపఁబడెను. చింతా దీక్షితులు 'శబరి' నాటకమున సవరకన్యతో నాడుకొనుచునే హనుమంతుఁడు ప్రవేశించును.

1 'రామాయణమునందలి వానరులెవరు? వారేరి? అను శ్రీపట్టబ్రహ్మయ్యశాస్త్రి వ్యాసములో వీరభద్రరావుగారి వానరులు అను సీసాలో ఆంధ్రులే ఆ వానరు లన్న విషయము గలదు. హనుమంతుఁడు లంకను చూచినవారలలో మొదటివాఁడు. ఒక్క తెనుఁగులో మాత్రమే 'లంక' యనగా చుట్టు నీటిచే చుట్టబడియుండు భూప్రదేశ మనుటఁ గూడ గోపరాజు రామదాసు హనుమంతుని యాంధ్రునిగా గ్రహించఁ జెప్పెను. కావున పురాణాదిక ప్రాచీనప్రమాణములవలనను, ఆధునిక విమర్శల ఆధారమునను హనుమంతుఁడు తిరుపతి జన్మస్థలమగుటవలన కిష్కింధా పరిసర నివాసాదుల వలనను ఆంధ్రు డని గ్రహించుటలో ననౌచిత్త్యము ఉండదని భావింపవచ్చును.

## రామాయణ దైవతము – హనుమంతుఁడు

శ్రీమహావిష్ణువు త్రేతాయుగమున ధర్మవిగ్రహుఁడు శ్రీరామచంద్రమూర్తిగా నవతరించెను. పరమశివుఁడు శ్రీహనుమంతునిగా నవతరించెను. వీరిలో రామాయణమున దైవస్వరూపముగా హనుమంతుఁడే కానవచ్చుట గమనింపఁగలము. శక్తి దైవశక్తి, రాక్షసశక్తి రెండు విధముల నుండ దైవశక్తిఁ జూపినవాఁడు హనుమంతునిగనే కన్పట్టును. 'ఆత్మానం మానుషం మనే' అని రాముఁడు మానవమాత్రునిగానే జీవించెనుతప్ప దైవముగ జీవింపలేదు, దైవికశక్తులను ప్రదర్శింపలేదు. అట్లుదైవముగానుండుట అవతార లక్ష్యమునకు భంగకరము.

2 'రామున కాత్మవిష్ణుత్వ జ్ఞానములేదు. అట్లుండుట బ్రహ్మ రావణునకిచ్చిన వరములకు ప్రతిబంధకము. అట్టియెడ నవతార ప్రయోజ

1. భారతి 1925 ఏప్రిల్ పుట – 107
2. శ్రీరామకథామృతము – సమగ్రసమీక్ష పుట – 28

నము శూన్యము [1]పైగా రావణవధ యగునంతవరకు రామునితో నెవ్వరు నాతఁడు భగవంతుఁడని ప్రత్యక్షముగఁ జెప్పినట్లు వాల్మీకమున రచితముకాదు. ఈ భావనము దృష్టియం దుంచుకొనినట్లే విశ్వనాథ విభీషణునిచే

[2] ''తాను భగవంతుఁడని చెప్పెఁ గాన నీతఁ
డతఁడు భగవంతుఁ డని చెప్పుటయ్యె నిచట
వాఁడె భగవంతుఁడో మఱి వీఁడు నగునొ
వార్థమాత్రము దాటినవాఁడు వీఁడు'' అనిపించునట్లు తోచును.

ఇదియు న్యాయస్థానమున న్యాయవాదిగాఁ బల్కిన మాట.

భారతమున శ్రీకృష్ణుఁడు రామాయణమున హనుమంతుఁడు దైవశక్తులు చూపినవారుగ కన్పట్టుటయ కాక తులనాత్మక పరిశీలనమున సమజీవన విధానము కల దైవతములుగా కూడ తోచును. శ్రీకృష్ణుఁడు ద్వాపరయుగమున కురుక్షేత్ర సంగ్రామమునఁ దోడై నరునకు విజయమొసగ, హనుమంతుఁడు త్రేతాయుగమున రామరావణ సంగ్రామమున ధర్మపక్షమునకుఁ దోడ్పై నరునకు విజయము చేకూర్చినవాఁడు. వా రిర్వురు నాయా పురుషయత్నములకుఁ దోడైన భగవచ్ఛక్తులు.

భగవంతుని లీలలు వర్ణనాతీతములు. భాగవతమునఁ గృష్ణుని బాలలీలలవలె రామాయణమున నద్భుతలీలలు హనుమంతునియందే చూడగలము. బాల్యమునఁ దృణావర్తునిచేఁ గొంపోబడి యాకసమున కెగిరినవాఁడు శ్రీకృష్ణుఁడు కాగా సూర్యుని పండుగ భ్రమించి యాకసమున కెగిరినవాఁడు హనుమంతుఁడు. శ్రీకృష్ణుఁడు పూతనను సంహరింప హనుమంతుఁడు సింహికను బరిమార్చెను శ్రీకృష్ణుఁడు గోవర్ధనగిరి నెత్తి హనుమంతుఁడు సంజీవపర్వతము నెత్తి చరిత్ర సృష్టించెను. ధర్మజపక్షము నుండి హస్తినాపురి కేగి దుర్యోధనునకు హితము చెప్పబోయిన కృష్ణుని దుర్యోధనాదులు కట్టఁజూచి విఫలు లయిరి. అట్లు లంకానగరమున కేగి హనుమంతుఁడు కట్టఁబడి లంకఁ గాల్చి వచ్చెను. ద్వాపరమున

1. తెలుగుసాహిత్యము – రామకథ – పుట 46
2. శ్రీ.రా.క.సుం. దివా – 320

విశ్వరూపముఁ జూపినవాఁడు శ్రీకృష్ణుఁడు కాగా త్రేతాయుగమున ఉగ్రరూపముఁ జూపినవాఁడు హనుమంతుఁడు. మృతుఁ డగు గురుపుత్రుని బ్రదికించుకొని కృష్ణుఁడు రాగా, మృతుఁడగు గంధమాదనుని బ్రదికించుకొని వచ్చిన గాధ హనుమచ్చరితయందు కానవగును.

భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు చిన్మయుఁడు నానందమయుఁ డయినటుల హనుమంతుఁడుఁ జిన్మయుఁడు నానందమయునిగనే కన్పట్టును. శ్రీకృష్ణుఁడు గీతాబోధకుడు కాగా హనుమంతుఁడు గీతాపైశాచికభాషా వ్యాఖ్యాకారుఁడు ఆదినుండి భారతమున లేకయుఁ గీలకపాత్ర వహించినట్లు రామాయణమున హనుమంతుఁ డాదినుండి లేకయు రామాయణ మహామాలా రత్నమై కీలకపాత్ర వహించెను. ఇంతటి శక్తి యుక్తులు కల్గియు హనుమంతుఁడు రాముఁడను నరునకు సేవకునిగనే యుండెను. కాని భగవంతుఁడు కాఁ డనఁజాలము. శ్రీకృష్ణుడు సైతము అర్జునునకు సారథియై సేవకజనముగఁ బరిగణింపఁదగు చోదకునిగనే యుండెను. ఇట్లు రామాయణమున హనుమంతుఁడే భగవచ్ఛక్తిని ప్రదర్శించినట్లు గుర్తింపగలము.



# ఆంధ్రదేశమున వివిధ హనుమదాలయముల విశేషము

[1] "బ్రహ్మ విష్ణు శివాంశత్వాత్ - త్రిమూర్తి రితి విశ్రుతః
సర్వ దేవాంశ సంభూతేః - సర్వదేవమయః స్మృతః
హనుమ త్పూజయా తస్మాత్ పూజితా స్సర్వ దేవతాః
ప్రతిగ్రామ నివాస శ్చ - భూయా ద్రక్షో నివారణే"

హనుమంతుని యందు బ్రహ్మ విష్ణు శివాంశ ముండుట వలన త్రిమూర్తిగాఁ జెప్పఁబడును. సర్వదేవాంశలతోఁ బుట్టుటవలన సర్వదేవమయుఁడుగాఁ గీర్తింపఁబడును. కావున ఆంజనేయుని పూజించిన దేవత లందఱను పూజించినట్లే. రాక్షస పిశాచాదుల బారినుండి రక్షణకై హనుమంతునకు ప్రతిగ్రామమున ఆలయము లేర్పడును" అని సాక్షాత్తు బ్రహ్మదేవుఁడు పల్కెను. విధివాక్యము మీరరాని దయినటుల నూరూర హనుమదాలయములు వెలయుచున్నవి. అందును ఆంధ్రదేశమున హనుమదాలయములు విశేషముగఁ గలవు. ప్రత్యేక పరిశీలనమున చాల హనుమదాలయములనుండి హనుమత్సంబంధమగు సాహిత్యము వెలువడుట గుర్తింపఁగలము. అన్యప్రాంతీయ హనుమదాలయములకంటె నాంధ్రదేశీయ హనుమదాలయములందుఁ బ్రత్యేకత కన్పట్టును. ఒక్కొక్కచోటి యాంజనేయుఁ డొక్కొక్క ప్రత్యేక నామమున వ్యవహరింపఁబడుచుండుట విశేషము. అట్టి ప్రత్యేకనామముల వెనుక యెంతయో చరిత్రకూడ యున్నట్లు తెలియును. వస్తువిస్తరము గాకుండుటకై స్థూలముగ నా విశేషాంశ ముదహరింపబడుచున్నది.

[2] "వినుకొండఁ గల హనుమంతుని టపా ఆంజనేయస్వామి, గుంటి ఆంజనేయస్వామి, చెట్టు ఆంజనేయస్వామి యనియు నందురు. 'ఓం టపా ఆంజనేయాయ నమః' అని నామములు చెప్పునంతటి ప్రసిద్ధి. గుంటి ఆంజనేయస్వామి స్వయంభువ విగ్రహము. తపాలా సౌకర్యము లేని రోజులలో ఆ సౌకర్యం కల్గించాఁడట స్వామి. అందుచేత ఆ స్వామిని

1. ప సం. 6-69, 70      2. వినుకొండసీమ - పుట 22

**టపా** ఆంజనేయస్వామివా రని అన్వర్థంగా పిలుస్తారు'' ఆంజనేయస్వామి వారి కోవెల ప్రాంగణములో శతాధికవత్సర వయఃపరిమితి గల వేపచెట్లు గలవు. ఒక చెట్టు కొమ్మపై శ్రీ ఆంజనేయస్వామి ప్రాకుచున్నట్లు మూర్తి స్వయంభువమై అలరారుచున్నది కావున చెట్టాంజనేయస్వామిగాఁ జెప్పఁబడుచున్నాడు. టపాఆంజనేయస్వామినిఁగూర్చి మహాభక్తులు చెప్పుకొనుట కాక ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ నిర్మాణ వ్యవస్థాపకులలో నొకరగు పులుపుల వెంకటశివయ్యయే తమ పలనాడు వెలలేని మాగాణి అను గేయంలో

''నమ్మికొను భక్తులను వమ్ముచేయక తాను
బంట్రోతుయై టపా మోసి ముచ్చటదీర
అన్నిగవిడుల వెలసెరా!''

అని కీర్తించుట విశేషము. ² వినుకొండ గ్రామము మధ్య శ్రీ చలివేంద్ర ఆంజనేయస్వామి కోవెల యున్నది.

ప్రకాశంజిల్లా పావులూరున వెలసియున్న ఆంజనేయస్వామిని పొలిమేరాంజనేయస్వామి యందురు. ఈ స్వామి పావులూరునందొక కాలు, ఇంకొల్లునం దొక కాలు నుంచి రెండు గ్రామముల పొలిమేరలో నుండుట వలన నీ స్వామిని పొలిమేరాంజనేయస్వామి అందురు. ఇంకొల్లు నందుఁ గల మరో ఆంజనేయస్వామిని తటాకాంజనేయస్వామి యందురు. పొలిమేర ఆంజనేయస్వామిపై ఆచ్ఛాదనము నిలువకుండుట విశేషము. ఎన్నోమార్లు పైకప్పు వేయ యత్నించి విఫలులైరి. ఒకమారు ఆస్వామి ఆలయనిర్మాతలయం దొకరి స్వప్నమునఁ గన్పడి తాను ఎండ వానలలో నుండ వలెనని, ఆచ్ఛాదన వలదని చెప్పెను. కావున మహామంటపము నిర్మించియు నా స్వామిపై మాత్రము కాళీయుంచిరి

ప్రకాశంజిల్లాలోనే మరొక్క ప్రసిద్ధ ఆంజనేయుఁడు సింగరకొండ క్షేత్రమున నున్న స్వామి భవనాసి తట సమీపమునఁగల ఈ స్వామి భక్త కామితార్థ ప్రదుఁడుగా ప్రతీతి అది ముఖ్యముగ నృసింహస్వామి క్షేత్రము. ఆ స్వామికి కొండపై ప్రతిష్ఠలు జరుపు కోలాహలము జరుగు చుండ క్రింద నేదో యద్భుత శబ్దమై క్రిఁదకు చూచునంతలో నొక సాధు పుంగవుం డా శుభముహూర్తమున ఆంజనేయుని ప్రతిష్ఠించి వెళ్ళెనట. శ్రీనారసింహుని మించి విశేషముగ నా యాంజనేయుఁడు భక్తసం సేవకుఁ బాత్రుఁ డగుచున్నాఁడు. ఇట్లే

నూజివీడు :- అడవి ఆంజనేయుఁడు.
జంగారెడ్డిగూడెం - మద్ది ఆంజనేయస్వామి

1. ప సం. 6-69, 10     2. వినుకొండసీమ - పుట 22

తెనాలి - చిట్టి ఆంజనేయస్వామి
విజయవాడ - దాసాంజనేయస్వామి
ఘటికాచలం - యోగాంజనేయస్వామి
తిరుపతి - బేడీ ఆంజనేయస్వామిగా ప్రసిద్ధులు. ఇట్లు వారు నామ ప్రత్యేకత కల్గియున్నారు.

వినుకొండ తాలూకా గోకనకొండ దేవాలయమున ముఖమండప మధ్యమున శ్రీచక్రము కలదు. చోళచక్రవర్తుల కాలమున నట మహానిధి కలదు. ఆ నిధికి హనుమద్రక్షణ యుండుట విశేషము. ఆ చక్రమునుండి సుమారు సమానదూరమున నెనిమిది దిశల నెనిమిది ఆంజనేయులు ప్రతిష్ఠితులైరి. ఆ శ్రీచక్రమున కెనిమిది దిశల గల హనుమంతులు తూర్పున గొట్టిపాడు; ఆగ్నేయమున - మైలవరం అగ్రహారం, దక్షిణమున - పెద్ద జమ్ములమడక; నైఋతిదిశ - పురిమెట్ల; పడమర-పువ్వాడ, ఉత్తరం - నాగులవరం; ఈశాన్యం - కూకట్లపల్లి లలో కలరు. వీనిలోనెక్కుడు రూపములు నొకే రీతిని గలవు. హనుమ ద్విగ్రహములలో నెక్కుడు ప్రసన్నాంజనేయ, వీరాంజనేయ రూపముల నుండును. ప్రసన్నాంజనేయమే అభయాంజనేయ మని, ప్రపత్తి ఆంజనేయము భక్తాంజనేయ మనియుఁ జెప్పఁబడును. హనుమ న్నవావతారములలోని యా రెండు కాక పంచముఖాంజనేయస్వామి తెనాలి, ఒంగోలు వంటి కొన్ని తావులఁ గానవచ్చును. ఒంగోలులో హనుమంతుని తొమ్మిదియవతారములకు క్షేత్రములు నిర్మింపఁబడినవి. ఆ నవావతారముల చిన్నమూర్తులు తెనాలియందుఁ బ్రతిష్ఠితమైనవి.

శ్రీ హనుమ న్నవావతారములు కాక యన్యరూపములలో మాదిపాడున శ్రీ సత్యానందేంద్ర సరస్వతీ స్వామి ఏకాదశముఖ వీరాంజనేయస్వామి, పతాకాంజనేయస్వాములను ప్రతిష్ఠించిరి. తణుకు తాలూకా తీపఱ్ఱునందు ఏకముఖి, త్రిముఖి, పంచముఖి, సప్తముఖి, అష్టముఖి, ఏకాదశముఖి, త్రయోదశముఖి మూర్తులు కలవు. మన ప్రాంతమందలి యనేక ఆలయములద్వారా నేదో యొక హనుమద్రచన వెలువడుట విశేషము. కసాపుర౦ నెట్టిగంటి ఆంజనేయస్వామి, కరీంనగర్‌జిల్లా కొండగట్టు వీరాంజనేయస్వామి, సికింద్రాబాదు తాడ్బందు వీరాంజనేయ స్వామియు ప్రసిద్ధివడసిన మూర్తులు. పొన్నూరునందలి పెద్ద ఆంజనేయస్వామి ఆంధ్రదేశమందలి హనుమద్విగ్రహములలో కెల్ల పెద్దది. ఇట్లు ప్రసిద్ధ హనుమత్క్షేత్రములు ఆంధ్రమునఁ గానవచ్చుచున్నవి.

# ఆంధ్రమున పరివ్యాప్తమైయున్న హనుమన్మంత్ర సాహిత్యము

ఆంధ్రవాఙ్మయమున హనుమచ్చరిత్ర విశేషముగ వ్యాపించి యున్నటులే ఆంధ్రదేశమందలి ఉపాసకులయందు ననేక మంత్రములు అనుష్ఠింపబడుచున్నవి. ఆయా గురుపరంపరలయందా యా మంత్రములు అవిచ్ఛిన్నముగ నుపాసింపబడుచుండుట కాననగును. అట్టి సంప్రదాయములందుఁగల భిన్నమంత్రముల నందజేయుటయుఁ బ్రస్తుత వ్యాస పరిపూర్ణతకు దోహదకారియగును కాన మంత్ర ప్రధానాంగములు మాత్రమీయబడుచున్నవి. విశ్వనాథవారు పంచముఖ హనుమన్మంత్రముఁ బ్రదర్శించినట్లే మంత్రములకు శాస్త్రప్రాధాన్యమే కాక సాహిత్య ప్రాముఖ్యము కూడ కలదనుట గమనార్హము.

సుందరహనుమన్మంత్రము :-

ఋషి-వాల్మీకి; ఛందస్సు-అనుష్టుప్; దేవతా-శ్రీ ఆంజనేయః; బీజం-మారుతాత్మజః; కీలకం-అంజనాసూనుః వాయుపుత్రః; వినియోగము-సర్వారిష్ట నివారణార్థము.

ధ్యానం :-

శ్లో॥ బాలార్కాయుత తేజసం త్రిభువన ప్రక్షోభకం సుందరం
సుగ్రీవాది సమస్త వానరగణై స్సంసేవ్య పాదాంబుజం
నాదేనైవ సమస్త రాక్షసగణా న్సంత్రాసయన్తం ప్రభుం
శ్రీమ ద్రామపదాంబుజ స్మృతి రతం ధ్యాయామి వాతాత్మజం.

మంత్రవిషయమున 'అంజనేయోపాసన'[1] యందు "హనుమా నంజనాసూనుః వాయుపుత్రో మహాబలః" ఇత్యాది శ్లోకములు కలవు. కాని 'సుందరకాండ మెందుకు సుందరమైనది' యను గ్రంథమున[2] "జయత్యతిబలో రామో-లక్ష్మణ శ్చ మహాబలః" ఇత్యాది శ్లోకములు స్వీకరింపఁబడినవి.

1. అంజనేయోపాసన - పుట 198
2 సుందరకాండ మెందుకు సుందరమైనది? పుట-69

[1] స్వప్నాంజనేయ మహామంత్రము :-

ఋషి-భగవాన్ బ్రహ్మ; ఛందస్సు-గాయత్రి; దేవత-ఆంజనేయః; బీజం -ఓం; శక్తి-స్వాహా; కీలకం-హ్రీం; వినియోగం-స్వప్న హనుమద్దేవతా ప్రసాదేన కాలత్రయ విజ్ఞాన సిద్ధి.

ధ్యానం :- సమాగ తానాగత వర్తమాన
వృత్తాంత విజ్ఞాన భరా త్రిలోక్యాః
దూరశ్రుతిం దూరగతి స్సదృష్టిం
స్వప్నే హనూమన్ మమ దేహి నిత్యమ్''

మంత్రం :- ఓం దూరదృష్టి దూరశ్రవణ సమాగ తానాగత వర్తమాన సర్వలోక వృత్తాంత విజ్ఞానం హనుమన్ మహ్యం దేహి స్వాహా.

శ్రీహనుమ ద్ద్వాదశాక్షరీ మహామంత్రము :-

ఋషి-ఈశ్వరః; ఛందస్సు-అనుష్టుప్; దేవత-ఆంజనేయః; బీజం-హ్రాం; శక్తి-హ్రీం;కీలకం-హ్రూం;వినియోగం-ఇష్టసిద్ధి.

ధ్యానం :-

I ఆంజనేయ మతిపాట లాననం - కాంచనాద్రి కమనీయ విగ్రహం
పారిజాత తరుమూల వాసినం - భావయామి పవమాన నందనమ్॥

II మర్కటేశ! మహోత్సాహ! - సర్వశత్రు నివారక!
శత్రూ న్సంహర మాంరక్ష - శ్రియం దాపయ మే ప్రభో॥

III వందే వానర నారసింహ ఖగరాట్ క్రోడాశ్వ వక్త్రాంచితం
నానాలంకరణం త్రిపంచనయనం దేదీప్యమానం రుచా
హస్తాబ్జై రసి ఖేట పుస్తక సుధాకుం భాంకు శాద్రీ హాలం
ఖట్వాంగం ఫణి భూరుహాం దశభుజం సర్వారి గర్వాపహమ్॥

మంత్రం :- ఓం శ్రీం హ్రీం క్లీం హరిమర్కట మర్కటాయ స్వాహా.

ఈ మంత్రమే మూలమంత్రముగ హనుమత్సంబంధమున చెప్పఁబడుచు విశేషప్రచారమంది అనుష్ఠింపబడునది. ఈ మంత్రమునకు సాహిత్యమున గల ప్రాముఖ్యము విశ్వనాథవారి రామాయణ కల్పవృక్ష సుందరకాండయందుఁ గాననగును. [2] శ్రీఆంజనేయ ద్వాదశాక్షరిగా

1. పరాశరసంహిత 56-3 చూడుడు-అనుబంధము III - యంత్రము
2. ఆంజనేయోపాసన - పుట 208

'హౌం హ్స్ఫ్రేం ఖ్ఫ్రేం హ్స్రౌం హ్స్ఖ్ఫ్రేం హ్సౌం హనుమతే నమః'' అను మంత్రము ఆంజనేయోపాసనయందుఁ గలదు. ఋషి చ్ఛందస్సాద్యాదు లన్నియు పైవానికి భిన్నములు. అందే ద్వాదశాక్షరిగానే 'హం హనుమతే రుద్రాత్మకాయ హుం ఫట్'' అను మనువు కూడ చెప్పఁబడెను.

హనుమద్ద్వాదశాక్షర మహామంత్రముతోఁబాటు సప్తమంత్రాత్మక మంత్రోద్ధారము పరాశర సంహితోక్త విధానమున శ్రీ హనుమన్మహావిద్యా ప్రకాశికయందుఁ గలదు. ఆ పంచముఖాంజనేయ మహామంత్రము లిట్లు చెప్పఁబడినవి.

I ఓం నమః పంచవదనాయ పూర్వే కపిముఖే సకల శత్రు సంహరణాయ హ్రౌం మహాబలాయ స్వాహా; II ఓం నమః పంచవదనాయ దక్షిణముఖే కరాళనృసింహాయ క్ష్రౌం సకల భూత ప్రమథనాయ స్వాహా; III ఓం నమః పంచవదనాయ పశ్చిమముఖే వీరగరుడాయ క్ష్మ్ల్వ్య్రూం సకల విషహరాయ స్వాహా; IV ఓం నమః పంచవదనాయ ఉత్తరముఖే ఆదివరాహాయ గ్లౌం సకలసంపత్కరాయ స్వాహా; V ఓం నమః పంచవదనాయ ఊర్ధ్వముఖే హయగ్రీవాయ హ్స్రౌం సకల జన వశీకరణాయ స్వాహా; VI ఓం నమో భగవతే ఆంజనేయాయ మహాబలాయ హనుమతే స్వాహా; VII 'ఓం హరి మర్కట మర్కటాయ స్వాహా' యను పై చెప్పిన హనుమద్ద్వాదశాక్షరి తొలిమనువుగా గల్గిన యిది, సప్త మంత్రాత్మక విద్యగా కొనియాడబడుచున్నది.

[2] సప్తాక్షరీ మంత్రము :-

ఋషి-శౌనక; ఛందస్సు-గాయత్రి; దేవత-శ్రీఆంజనేయః; బీజం-మారుతాత్మజ; శక్తి-అంజనాసూనుః; కీలకం-వాయుపుత్రః; వినియోగం-ధర్మార్థకామమోక్షఫలసిద్ధి.

ధ్యానం :- చింతితార్థ ప్రదం దేవం - శాంతాకారం మహాప్రభుం;
సంతతం భావయే చ్చిత్తే - హనూమంత మనూపమమ్॥

మంత్రము :- ఓం శ్రీ హనుమతే నమః

1. శ్రీహనుమన్మహావిద్యాప్రకాశికా - పుట 13
2. ఆంజనేయోపాసనా - పుట 203

పంచాదశక్షరీ మహామంత్రము :-

ఋషి-భగవాన్ ఈశ్వరః; ఛందస్సు-పంక్తిః; దేవత-పంచవక్త్రి వీరాంజనేయః; బీజం-ఈశ్వరః; శక్తిః-నృసింహః; కీలకం-ఫట్; వినియోగం-శ్రీపంచముఖ వీరాంజనేయ ప్రీత్యర్థం; ధ్యానముగా "వందే వానర నారసింహ... ...." శ్లోకము. మంత్రముగా 'ఓం హ్రీం క్రోం హరిమర్కట మర్కటాయ స్వాహా' అనియుఁ జెప్పఁబడినవి.

[1] అష్టాదక్షరి :-

ఋషి-ఈశ్వరః; ఛందస్సు-అనుష్టుప్; దేవత-పవనకుమార హనుమాన్; బీజం-హం; శక్తి-స్వాహా

ధ్యానం - తప్తచామీకర నిభం-భీఘ్నం సంహితాంజలిమ్ చలత్కుండల
దీప్తాస్యం-పంచాక్షం మాదతిం స్మరేత్

మంత్రం - 'ఓం నమో భగవతే ఆంజనేయాయ మహాబలాయ స్వాహా.'

[2] దశాక్షరీ మంత్రం :- పై ఋషిచందాదులే కల్గియున్నవి.

ధ్యానం :- ధ్యాయే ద్రణే హనూమంతం-సూర్యకోటి సమప్రభం
ధావన్తం రావణం జేతుం-దృష్ట్వా సత్వర ముత్థితం
లక్ష్మణం చ మహావీరం-పతితం రణభూతలే
గుం చక్రోధ ముత్పాద్య గ్రహీతం గురుపర్వతం
హాహాకారైః సదర్పైశ్చ-కంపయంతం జగత్త్రయం
ఆబ్రహ్మాండం సమావ్యాప్య-కృత్వాభీవం కళేబరమ్॥

మంత్రము :- 'హం పవన నందనాయ స్వాహా'

ఇరువది అక్షరముల మంత్రము :- ఋషి చ్ఛందాదులు వెనుకటివలె

మంత్రము :- 'ఓం యో యో హనూమంత ఫల ఫలిత ధగద్ధగిత
ఆయురాష పరుడాహ'

శృంఖలాబంధ మోచకము :-

'ఓం నమో భగవతే ఆంజనేయాయ అముకస్య
శృంఖలాం త్రోటయ త్రోటయ బంధమోక్షం కురుకురు స్వాహా'

కామ్యసాధకము :-

"ఓం హ్రౌం క్రౌం క్ష్మ్యౌం గ్లాం హ్స్ఫ్రౌం మహాబలాయ నమః పంచవద
నాయ హనుమతే ఖేఖే హుం ఫట్ స్వాహా"

1. ఆంజనేయోపాసన - పుట 212 2. ఆంజనేయోపాసన - పుట 215

కష్టవారకము

"ఓం ఐం హ్రీం శ్రీం నమో భగవతే హనుమతే మమ కార్యేషు జ్వల జ్వల ప్రజ్వల ప్రజ్వల అసాధ్యం సాధయ సాధయ మాం రక్ష రక్ష సర్వ దుష్టేభ్యో హుం ఫట్ స్వాహా"

కార్యసిద్ధికి :- 'హం హనుమతే నమః'

అష్టసిద్ధులకు :- 'హం హనుమతే రుద్రాత్మకాయ హుం ఫట్'

పిశాచ నివారణకు :- "ఓం హ్రీం హనుమతే వరవర అంజనావరపుత్ర ఆవేశయ ఆవేశయ ఓం హ్రీం ఫట్ స్వాహా"

సప్తముఖ హనుమన్మంత్రము :-

"ఓం హ్రీం క్ష్మౌం గ్లౌం వం హ్సౌం ఘ్రుం శ్రుం సప్తముఖాయస్వాహా"

శక్తిపాద వీరహనుమన్మంత్రము :- ఓం హ్రీం యం ఘం శక్తిహనుమంతా శార్దూలముఖ సన్నిభ శక్తి ఉచ్చాటనే శంభుప్రసాదనే అస్య శ్రీ పాద ఉగ్ర వీర హనుమంతా శీఘ్రంమమ వశ్యం కురు కురుస్వాహా" వంటి మంత్రములు కన్పట్టుచున్నవి పంచముఖ ద్వాదశాక్షరీ మంత్రములవలె ప్రసిద్ధ మంత్రము.

[1] సువర్చలా హనుమద్ద్వాదశాక్షర మంత్రము :- దీనికి ఋషి-పరాశరః; ఛందస్సు-గాయత్రి; దేవత-శ్రీసువర్చలా సమేత హనుమాన్; బీజం-మారుతాత్మజ; శక్తి-అంజనాసుత. కీలకం-వాయుపుత్రః; వినియోగం-శ్రీసువర్చలేశ హనుమత్ప్రసాదసిద్ధి.

ధ్యానం :- సువర్చలాధిష్ఠిత వామభాగం
వీరాసనస్థం కపిబృంద సేవ్యం
స్వపాదమూలం శరణం గతానామ్
అభీష్టదం శ్రీహనుమంత మీడే॥

గ్రంథాంతరే - భక్తకల్పతరుం సౌమ్యం - లోకోత్తర గుణాకరం; సువర్చలాపతిం వందే - మారుతిం వరదం సదా॥

మంత్రము :- 'ఓం శ్రీం శ్రీ సువర్చలాహనుమన్నమః

[2] శ్రీహనుమత్ షోడశార్ణవ మంత్రము :-

ఋషి-అగస్త్యః; ఛందస్సు; దేవత-సువర్చలావల్లభ హనుమాన్

1. పరాశరసంహిత 7-13 2. పరాశరసంహిత 20-8

బీజం-పింగళనేత్రః; శక్తి-మహాబలః; కీలకం-ధనంజయ సఖా; వినియోగం-సువర్చలావల్లభ హనుమత్ప్రసాదసిద్ధి.

ధ్యానం: ఏకే నా భయదం పరేణ వరదం భోజ్యం పరం చాపరే
అన్యే నాపి సువర్చలా కుచయుగం హస్తేన సంబిభ్రతః
కారుణ్యామృత పూర్ణలోచనయుగం పీతాంబరాలంకృతం
రమ్యంవాయుసుతం చతుర్భుజయుతంధ్యాయే హనూమత్ప్రభుమ్॥

మంత్రము:- 'ఓం హ్రీంశ్రీం శ్రీ సువర్చలావల్లభాయ హనుమతేస్వాహా',

[1]మదనక్షోభానివారక మంత్రము :-

ఋషి-బ్రహ్మ; ఛందస్సు-గాయత్రి; దేవత-హనుమాన్; బీజం-హ్రాం; శక్తి-హ్రీం; కీలకం-క్రోం.

ధ్యానం :- ఆంజనేయ మతిపాటలాననం-కాంచనాద్రి కమనీయ విగ్రహం
పారిజాత తరుమూల వాసినం-భావయామి పవమాన నందనం

మంత్రము :-"ఓం నమో భగవతే మను మదనక్షోభం సంహర సంహర
ఆత్మతత్త్వం ప్రకాశయ ప్రకాశయ హుంఫట్ స్వాహా"

[2] నవఖండ హనూమన్మంత్రము :-

ఓం శ్రీం నమోభగవతే శ్రీహనుమతే వానర నృసింహ తార్క్ష్య వరాహ హయ పావక షణ్ముఖ ధరాయ సహస్రభుజ సహస్రాయుధ ధరాయ కోలాహల మహాభైరవాయ సకలశత్రు సంహరణాయ భక్త జన రక్షణాయ సహస్రాశ్వ రథ వాహనాయ శ్రీ సువర్చలా ప్రియాయ అనేక యువతీ సహితాయ దేవనదీ విహారాయ సకల మనోరథాని మహ్యం దేహి దేహి స్వాహా"

[3] సంతాన హనుమన్మంత్రము :-

"ఓం శ్రీం హ్రీం క్లీం హనుమన్ మమ తనయం దేహి దేహి స్వాహా"

హుంకార హనుమన్మంత్రము

"ఓం రాం యం నమో వాయుపుత్ర హనుమతే సర్వరాక్షస సంహార

1. పరాశరసంహిత - 36-5
2. పరాశరసంహిత - 71-14
3. పరాశరసంహిత - 80-5

కారణాయ సర్వభయ నివారణం కురుకురు హుం హుం హుం ఫట్ స్వాహా'' అని యింకను పంచరత్న మంత్రములు ఆంజనేయ శ్రీవిద్య, అస్త్రములు, మాలామంత్రములతో పాటు సుగ్రీవాంగదులు అంగదేవత లగుట వారి మంత్రములును హనుమద్హృదయ, పంజర, ఖడ్గ, బడబానల కవచములను హనుమ దుపాసనయందు కలవు ఇంకను ప్రథమ సోపానమున మంత్రశాస్త్ర విషయమున వివరింపబడినది. ఇట్లు ఎన్నో హనుమన్మంత్రములు విస్తృతముగ నుపాసకులచే ననుష్ఠింపబడుట కానవచ్చును. ఈ మంత్రములకు శాస్త్రప్రాధాన్యమే కాక సాహిత్య ప్రాముఖ్యము కూడ కల దనుట గమనింపదగినది.

# హనుమన్న వావతారములు

''పరిత్రాణాయ సాధూనాం - వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ - సంభవామి యుగే యుగే॥

అని శ్రీకృష్ణభగవానుఁడు భగవద్గీతయందుఁ జెప్పినటుల దుష్టశిక్షణ, శిష్టరక్షణల నిమిత్తమై హనుమంతుఁడుకూడ ఎన్నియో అవతారము లెత్తి నటులఁదెలియును. అవి ప్రసన్నాంజనేయ, వీరాంజనేయ, అభయాంజనేయ, యోగాంజనేయ,పంచముఖ,షణ్ముఖ,సప్తముఖ, ఏకాదశ ముఖాంజనేయా ద్యవతారము లనేకములు కన్పట్టుచున్నవి. ఈ విషయము ననే పరాశర మహర్షి

[1] ''గుణావతార నామాని - సుబహూని హనూమతః
బ్రహ్మాండవ దనంతాని - విద్ధి మైత్రేయ తత్త్వతః

అని హనుమంతున కనంతావతారము లున్నట్లు తెల్పెను. వానియందు నుపాస్యమూర్తులుగా తొమ్మిదింటిని ప్రత్యేకించి తెల్పెను. వానినే హనుమ న్నవతారము లందురు. అవి

[2] ''ఆద్యః ప్రసన్న హనుమాన్ - ద్వితీయో వీరమారుతిః
తృతీయో వింశతిభుజః - చతుర్థః పంచవక్త్రకః॥
పంచమోఽష్టాదశభుజః - శరణ్య స్సర్వదేహినాం
సువర్చలాపతి ష్షష్ఠః - సప్తమ స్తు చతుర్భుజః॥

1. పరాశరసంహిత - 60-5
2. పరాశరసంహిత - 60-6, 7, 8, 9 చూడుడు అనుబంధము-II

అష్టమః కథితః శ్రీమాన్ - ద్వాత్రింశద్భుజ మండలః
నవమో వానరాకారః - ఇత్యేవం నవరూపధృత్
యస్య శ్రవణమాత్రేణ - జంతుర్జన్మఫలం లభేత్॥"

అని చెప్పఁబడినవి. ప్రతి అవతారమునకు నొక్కొక్క ఇతిహాసము కానవచ్చును. ఆ యా అవతారచరిత్ర యిట్లున్నది

I ప్రసన్నాంజనేయావతారము :- ఇది అనుగ్రహమూర్తిగా గదాయుధమును నేలపై నుంచి అభయ మిడుచు నుండు మూర్తి. విజయుఁడను క్షత్రియుఁడీ ప్రసన్నాంజనేయు నుపాసించినట్లు

[1] "విజయస్తు మహాశూరః - క్షత్రియో లోకపాలకః
ప్రసన్న హనుమ ద్ధ్యానా - త్సం సారాబ్ధి మతీతరత్"

అను శ్లోకమువలనఁ దెలియును. "ఓం హ్రౌం ఆంజనేయాయ నమః" అను అష్టాక్షరి మహామంత్రోపాస్యమూర్తిగా ప్రసన్నాంజనేయమూర్త్యనుగ్రహ చరిత్రము శ్రీపరాశరసంహిత పదునైదవ పటలమునందలి విజయచరితము వలనఁ దెలియును. ఈ మూర్తి ధ్యానము :-

[2] ఆంజనేయ మతిపాటలాననం - కాంచనాద్రి కమనీయ విగ్రహం;
పారిజాత తరుమూల వాసినం - భావయామి పవమాన నందనమ్॥

అనునట్టిది. హనుమంతునకు

[3] "కుండినం నామ నగరం - శ్రీభద్రం కుశతర్పణం
పంపాతీరం చంద్రకోణం - కాంభోజం గంధమాదనమ్॥
బ్రహ్మావర్త పురంచైవ - బార్హస్పత్యపురం తథా
మాహిష్మతీపురం చైవ - నైమిశారణ్య మేవ చ॥
సుందరీనగరం చైవ - రమ్యం శ్రీహనుమత్పురం
ఏతాని హనుమద్భక్త - పుణ్యస్థానాని నిత్యశః
యస్స్మరే త్ప్రాత రుత్థాయ - భుక్తిం ముక్తిం చ విందతి॥"

అని పదమూఁడు పీఠము లున్నవి. ఆ హనుమత్పీఠములందు 'చంద్రకోణ' మను పుణ్యస్థాపరమున నీ ప్రసన్నాంజనేయావతారమును హనుమంతుఁడు దాల్చెను.

---

1. పరాశరసంహిత - 60-13
2. పరాశరసంహిత - 15-14
3. పరాశరసంహిత - 37-40

II వీరాంజనేయావతారము :- ఇది శక్తిప్రకటన మొనర్చునట్టి, గదను ధరించి యుండును. మైందుఁడను భక్తవరుఁడీ వీరాంజనేయు నుపాసించి సాక్షాత్కార మందినట్లు

1 "మైందో వేదవిదాం శ్రేష్ఠః - ధ్యాత్వా వై వీరమారుతిం
తీర్ణో నౌకాం సరిన్మధ్యే - బహుచిద్రాం సవిస్మయమ్"

అను శ్లోకమువలనఁ దెలియును. "ఓం నమో భగవతే ఆంజనేయాయ మహాబలాయ స్వాహా" అను అష్టాదశాక్షరీ మహామంత్రోపాస్యమూర్తిగా వీరాంజనేయానుగ్రహచరిత్రము శ్రీపరాశరసంహితయందు ముప్పదియొకటవ పటలమందలి మైందచరిత్రవలనఁ దెలియును. ఇది సుందరనగర మను హనుమత్పీఠ చరిత్రము. వీరాంజనేయ ధ్యానము -

2 "చింతితార్థప్రదం దేవం - శాంతాకారం మహాప్రభుమ్
సతతం చింతయేచ్చిత్తే - హనుమన్త మనూపమమ్॥
మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి॥"

అనునట్టిది. ఈమూర్తియే పై మంత్రమునకు ముందు శ్రీ హనుమతే యనునది కలిపి "ఓం శ్రీహనుమతే ఓం నమోభగవతే ఆంజనేయాయ మహాబలాయస్వాహా"అను నిరువదినాల్గక్షరముల మంత్రముచేనుపాస్యుఁ డగుహనుమంతుఁడును ఈవీరాంజనేయావతారమూర్తియేయని తెలియును.

III వింశతి భుజాంజనేయావతారము :- ఇది ఇరువదిచేతులు. నిరువది యాయుధములతో విరాజిల్లు మూర్తి. బ్రహ్మదేవుఁడే యీ వింశతిభుజ హనుమంతు నుపాసించినట్లు

3 "పురా బ్రహ్మ మహోత్సాహ-శ్చతుర్ముఖ ఇతి శ్రుతః
మారుతిం వింశతిభుజం - ఉపాస్యాపి ప్రజాపతిః"

అను శ్లోకమువలనఁదెలియును ఈ వింశతిభుజాంజనేయావతారమును హనుమంతుఁడు బ్రహ్మలోకమునఁజూపెను. ఈ అవతారరూప ధ్యానము

1. పరాశరసంహిత - 60-17 2. పరాశరసంహిత - 35-89
3. పరాశర సంహిత 60-11

ఖడ్గం, ఖేటక, భిండివాల, పరశుం, పాశ, త్రిశూల, ద్రుమాన్
చక్రం, శంఖ, గదా, ఫలాంకుశ, సుధాకుంభాన్, హలం, పర్వతం
టంకం, పుస్తక, కార్ముకాహి డమరూ, నేతాని దివ్యాయుధా
న్యేవం వింశతిబాహుభి శ్చ దధతం ధ్యాయే హనూమత్ప్రభుమ్''

వింశతి భుజాంజనేయావతార చరిత్ర శ్రీ పరాశరసంహితయందలి ఏబది మూడు, ఏబదినాల్గవ పటలములఁ గలదు. హనుమంతుఁడు భవిష్యద్బ్రహ్మయైన కారణ మీ చరిత్రమే.

IV పంచముఖాంజనేయావతారము :- ఇది ఐదు ముఖములు, పది చేతుల, పది ఆయుధములు కల అవతారము. ఐదు ముఖములందుఁ దూర్పున వానరముఖము, దక్షిణదిశ నృసింహముఖము, పశ్చిమమున గరుడముఖము, ఉత్తరమున వరాహము, ఊర్ధ్వమున హయగ్రీవము నై దిఙ్ముఖమూర్తిగా నుండి ప్రతి ముఖమునందు మూడు నేత్రములతో పూర్ణ రుద్రావతారమూర్తిగా నుండును. విభీషణుని కుమారుఁడగు నీలుఁడీ పంచముఖాంజనేయు నుపాసించినట్లు

2 "విభీషణ సుతో నీలః - సతతం సాధు పూజితః
పంచవక్త్ర హనూమంత - ముపా స్యాసీ త్సమృద్ధిభాక్॥

అను శ్లోకమువలనఁ దెలియును. ''ఓం హరిమర్కట మర్కటాయ స్వాహా''ఇత్యాది 3 సప్తమంత్రాత్మక పంచముఖాంజనేయ మహామంత్రములచే నుపాసింపదగిన పంచముఖాంజనేయావతార చరిత్రము శ్రీ పరాశరసంహిత 4, 5 పటములముల సోమదత్త, నీలచరిత్రలవలనఁ దెలియును. మాహిష్మతీపుర మను హనుమత్పురచరిత్ర యందీ పంచముఖాంజనేయావతారము కన్పట్టును. ఇట్టి పంచముఖాంజనేయుని ధ్యానము -

4 ''వందే వానర నారసింహ ఖగరాట్క్రోడాశ్వ వక్త్రాన్వితం
నానాలంకరణం త్రిపంచనయనం దేదీప్యమానం రుచా

---

1. పరాశరసంహిత 54-9
2. పరాశరసంహిత 60-14
చూడుడు : అనుబంధము II చిత్రము 4; అనుబంధము III యంత్రము
3. ఈ మంత్రములు హనుమన్మంత్రముల శీర్షికలో నీయఁబడినవి.
4. పరాశరసంహిత - 2-41

హస్తాబ్జైరసి ఖేట పుస్తకసుధాకుంభాంకుశాద్రీన్హలం
ఖట్వాంగం ఫణిభూరుహంచ దధతం సర్వారి గర్వాపహమ్''

శ్రీపంచముఖాంజనేయస్వామి సోమదత్తనీలులకు సాక్షాత్కరించినట్లు వారి చరిత్రవలనఁ దెలియును.

V అష్టాదశభుజాంజనేయావతారము :- ఇది పదునెనిమిది చేతులఁ బదునెనిమిది యాయుధములు ధరించియుండు మూర్తి. దూర్వాసమహాముని యీ యష్టాదశ భుజాంజనేయస్వామి నుపాసించినట్లు

''ఉపాస్యాష్టాదశభుజం - హనూమంతం మహాప్రభుం
లేభే పరమలోభిత్వం - దూర్వాసో లోకవిశ్రుతః''

అను శ్లోకమువలనఁ దెలియును. అట్టి యుపాసనాబలముననే పాయసపుద్రదం ఒడల ఖూయించుకొని లోభమున లోకవిఖ్యాతి నందఁగల్గెను. శ్రీ పరాశరసంహితయందలి అరువదియవటలమున నీ యష్టాదశ భుజావతార రూపధ్యాన మిట్లు చెప్పఁబడెను.

1 ''శక్తిం పాశంచ కుంతం పరశుమపి హలం తోమరం ఖేటకంవా
శంఖం చక్రం త్రిశూలం ముసలమపి గదాం పట్టిసం ముద్గరంచ
గాండీవం చర్మపద్మం ద్వినవభుజవరైః ఖడ్గమప్యాదధానం
వందేహం వాయుసూనుం సురరిపు మథనం భక్తరక్షాసుదక్షమ్

VI సువర్చలాంజనేయావతారము :- సూర్యసుతయగు సువర్చలవామ భాగమున గల్గియుండుమూర్తి యిది. ధ్వజదత్తుఁడను భక్తాగ్రేసరుఁడీ సువర్చలాంజనేయు నుపాసించి సాక్షాత్కార మందినట్లు, సర్వసంపదల బడసిన

2 ''ధ్వజదత్తస్తు విప్రేంద్రః - సర్వశాస్త్రవిశారదః
సువర్చలా హనూమంత - ముపాస్యధనికోఽభవత్''

అను శ్లోకమువలనఁ దెలియును. ''ఓం హ్రీం శ్రీం సువర్చలా హనుమన్నమః అను సువర్చలాహనుమద్ద్వాదశాక్షర మహామంత్రోపాస్యమూర్తి యగు శ్రీ సువర్చలాంజనేయ అవతార చరిత్రము శ్రీ పరాశరసంహిత యందు 8, 9, 10, 11, 12, 13, 14, పటములన్నిట వ్యాపించియున్న విస్తృతచరిత్రము. హనుమత్పీఠములలోఁ బ్రథమ పీఠమగు కుండిన

1. పరాశర సంహిత - 60-2
2. పరాశర సంహిత - 60 18

సగర పీర చరిత్ర మిది. సువర్చలాహనుమ న్మూర్తి ధ్యానము

[1] "సువర్చలాధిష్ఠిత వామభాగం - వీరాసనస్థం కపిబృంద సేవ్యం
స్వపాదమూలం శరణం గతానాం - అభీష్టదం శ్రీహనుమంత మీడే"

గ్రంధాంతరమున

"భక్తబల్పతరుం సౌమ్యం - లోకోత్తర గుణాకరం
సువర్చపతిం వందే - మారుతిం వరదం సదా॥ అనునది.

VII చతుర్భుజాంజనేయావతారము :అభయ వరద హస్తములఁగూడిన నాల్గుచేతులు గల మూర్తి యిది. కపిలుఁడను వేదవేదాంగవేత్త చతుర్భుజాంజనేయు నుపాసించి సాక్షాత్కరింపఁజేసికొన్నట్లు

[2] "కపిలస్తు మహాతేజాః - బ్రాహ్మణో వేదపారగః
చతుర్భుజ హనూమన్త - ముపాస్యాసీ ద్విముక్తిగః"

అను శ్లోకమువలనఁ దెలియును. 'ఓం హ్రీం శ్రీం శ్రీ సువర్చలావల్లభ హనుమతే స్వాహా' అను షోడశార్ణవ మహామంత్రోపాస్యమూర్తిగా చతుర్భుజాంజనే యానుగ్రహ చరిత్రము శ్రీపరాశరసంహిత 0, 21 పటలములఁగల కపిలచరిత్రవలనఁ దెలియును. హనుమత్పీఠముల నొక టగు బార్హస్పత్యపురమున సాక్షాత్కరించిన యీ అవతార రూపధ్యాన మిట్లొప్పును.

[3] "ఏకే నాభయదం పరేణ వరదం బోజ్యం పరం చాపరే
అన్యే నాపి సువర్చలా కుచయుగం హస్తేన సంబిభ్రతః
కారుణ్యామృత పూర్ణలోచనయుగం పీతాంబరాలంకృతం
రమ్యం వాయుసుతం చతుర్భుజయుతం ధ్యాయే హనూమత్ప్రభుమ్

VIII ద్వాత్రింశద్భుజాంజనే యావతారము : ఇది ముప్పదిరెండు చేతుల ముప్పదిరెం డాయుధములు కల్గిన విరాడ్రూపము. సోమదత్తుడను రాజు ద్వాత్రింశద్భుజ స్వామి నుపాసించి పూర్వము పోయిన రాజ్యమును మరల పొందినట్లు

[4]. "సోమదత్తో మహారాజో - ద్వాత్రింశద్భుజ మారుతేః
రాజ్యభ్రష్టగ తాశంకో - భూయో రాజ్య మవాపహ॥"

---

1. పరాశరసంహిత - 60-2
2. పరాశరసంహిత - 60-12
3. పరాశంసంహిత - 20-10
4. పరాశరసంహిత - 60-18

అను శ్లోకమువలనఁ దెలియును. శ్రీపరాశరసంహితయందలి 4, 5 పటలముల గల సోమదత్తుని చరిత్రమున ద్వాత్రింశద్భుజాంజనేయాను గ్రహము తెలియఁదగినది. అట్టి మూర్తి రూపధ్యాన మిట్లు చెప్పఁబడెను

[1] "ఖడ్గం ఖట్వాంగ శైల ద్రుమ పరశు గదా పుస్తకం శంఖ చక్రే
పాశం పద్మం త్రిశూలం హల ముసల ఘటా స్టంక శక్త్యక్షమాలాః
దండం వా కుంత చర్మా చలిత కుశవరా పట్టిసం చాప బాణాన్
ఖేటం ముష్టిం ఫలం వా డమరు మభిభజే బిభ్రతం వాయుసూనుమ్.

IX వానరాకారాంజనేయావతారము : ఇది కేవల మర్కటరూపము. గాలుఁడను కిరాతుఁడీ వానరాకారు నుపాసించి అవారోగ్యమునుంది రక్షింపఁబడి మోక్షసిద్ధినిసైత మందినట్లు

[2] "ఉపాస్య వానరాకారం - గాలో నామ వనేచరః
ప్రాప్తవాన్ పరమాం సిద్ధిం - ఆరోగ్య ప్రముఖా మపి॥"

అను శ్లోకమువలనఁ దెలియును. హనుమత్పీఠములందలి నైమిశారణ్య పుణ్యస్థావరచరిత్ర మిది సువర్చలాహనుమ ద్ద్వాశాక్షర మంత్రోపాసనా ఫలముగ గాలున కీ రూపమున హనుమంతుఁడు సాక్షాత్కరించి యనుగ్రహించెను. శ్రీ పరాశరసంహితయందు గాలచరిత్రము 10, 11, 12 పటలములందుఁగలదు. అట్టి వానరమూర్తి ధ్యానముగా

'నమోఽస్తు తే వాయుసుతాంజనేయ!
నమోఽస్తు తే శ్రీ హనుమ న్మహాప్రభో!
నమోఽస్తు తే వానరవీర నిత్యం
నమోఽస్తు తే రాఘవ ముఖ్యభక్త!'

యను శ్లోకము గ్రహింపదగినది. ఇట్లు హనుమంతుని నవావతారముల చరిత్ర కన్పట్టును.

1. పరాశరసంహిత - 60-1
2. పరాశరసంహిత - 60-15

# హనుమత్ప్రసంగం విశేషగాథలు

హనుమత్కథకు సంబంధించిన యవాల్మీకాంశము లెన్నో కలవు. వానిలో మైరావణ, కాలనేమి చరిత్రలు విశేష ప్రచార మందినవి. విస్తృత ప్రచార మందని మఱికొన్ని హనుమత్కథాంశములు ఆంధ్రసారస్వతమునను గన్పట్టుచున్నవి. వాని పరిశీలన మావశ్యకము.

సువర్చలోదంతము : లోకమున హనుమంతుఁడు బ్రహ్మచారి యని ప్రసిద్ధి కలదు. కాని మంత్రశాస్త్ర గ్రంథముల నుపాసనాభాగములందు హనుమంతుఁడు సువర్చలాపతిగా కన్పట్టుచున్నాఁడు. హనుమంతునకు సూర్యసుతయగు సువర్చలతో జ్యేష్ఠశుద్ధ దశమినాఁడు కల్యాణము జరిగినట్లు హనుమత్పర్వస్వ మగుఁ బరాశరసంహిత చెప్పుచున్నది. అందలి శ్రీసువర్చలా హనుమ ద్ద్వాదశాక్షర మంత్ర కథన మను సప్తమపటలము, సూర్యసుతాకథన మను దశమపటలము వంటి వీ విషయమును నిరూపించుచున్నవి.

[1] ''సువర్చ లాధిష్ఠిత వామభాగం
వీరాసనస్థం కపిబృంద సేవ్యం
స్వపాదమూలం శరణం గతానాం
అభీష్టదం శ్రీహమమంత మీడే''

వంటి ధ్యానములు కలవు. హనుమంతుని నవావతారములలో [2] 'సువర్చలాపతి షష్ఠః' అని సువర్చలాంజనేయావతారము హనుమంతుని ఆరవ అవతారముగఁ జెప్పఁబడెను. రామాయణ సారోద్ధారమున శ్రీ రామోత్సవ కల్పలతాభాగమున, [3] ''శౌనకసంహితాయాం 'ఆగచ్ఛ హనుమద్దేవ! త్వం సువర్చలయా సహ' అని మొదలుగ 'జ్యేష్ఠశుద్ధ దశమ్యాం చ భగవాన్భాస్కరో నిజాం సుతాం సువర్చలా నామ ప్రాదాత్ప్రీత్యా హనూమతే అత స్తస్యాం తిథౌ భక్తో-వివాహోత్సవ మాచరేత్'' అనువర్యంతము సువర్చలాహనుమత్కల్యాణము నిరూపిత మైనది. ఆంధ్రభాషయందు వెలువడిన సంకలనగ్రంథములు దాదాపు అన్నియు నీసువర్చలోదంతమును గూర్చి తెల్పుచున్నవి. అవియే కాక విశేషముగ కొన్ని ప్రత్యేక గ్రంథ

1. ప. సం 7-18
2. ప. సం. 60-7
3. శ్రీరామోత్సవ కల్పలతా - పుట 173

ములును ఈ యితివృత్తమున వెలసినవి. అచ్యుతుని వెంకటాచలపతిరావు కృతమైన 'బాలాంజనేయము' హరికథకు సువర్చలాంజనేయ కల్యాణ మని యుపనామము. అందు భాస్కరుడు

"[1] ఈ మీ మాటలె తెల్పు నా యభిమతం బింకేమి? మీ నోటనే
నే మామన్; గురుదక్షిణా క్రమము మున్నే తీరెఁబో; మీరు మా
జామాతల్ సుమి! సు త్తమూరుచిర తేజస్స్ఫార సంజాత క
న్యా మాణిక్య సువర్చలామణి వివాహం బాడవే ధీమణీ!"

అని బ్రహ్మచర్యనిష్ఠకు భంగము కా దని యభయ మిడుచునే సువర్చల నిడ కల్యాణ మొనర్చినట్లు చెప్పెను.

శ్రీ ఆంజనేయ భక్తమండలి నరసాపురమువారి ప్రకాశనమున శ్రీ సువర్చలాహనుమత్కల్యాణము వెలువడెను. అందు నాల్గు వ్యాకరణ ములు నేర్చిన హనుమంతునకు మిగిలిన ఐదు వ్యాకరణములను సూ ర్యుడు చెప్పఁదలచెను. గృహస్థులకు మాత్రమే చెప్పవలసిన వానిని బ్రహ్మచారియగు హనుమంతునకుఁజెప్పుటకై వివాహము చేసికొన నంగీ కరింపఁజేసి తన కుమార్తెయగు సువర్చల నిచ్చి వివాహ మొనర్చి ఆ వ్యాకరణములను చెప్పినట్లు [2] కలదు. ఈ హనుమత్కల్యాణము గూర్చి పరాశరసంహిత, ఖగేంద్రసంహిత, సుషేణసంహిత, శౌనకసంహితలలో విపులముగ వర్ణింపబడి యున్న దని యందే చెప్పఁబడెను. అందు పుష్య శుద్ధ చతుర్దశినాడు సువర్చలా హనుమత్కల్యాణము జరిగినట్లు కలదు.

ఇట్టిదే గురజాడ పూర్ణచంద్రశర్మ కృతమగు శ్రీ సువర్చలాంజనే యము కూడ. శ్లోక భావములతో నున్న ఈ రచనమున తొంబదియైదు శ్లోకములు కలవు. పుల్లాపంతుల వేంకటరామశర్మ కృతమగు హనుమత్క ల్యాణ స్తవమున జ్యేష్ఠశుద్ధ దశమి భానువారమున కల్యాణము జరిగినట్లు న్నది. అందు "గురు నానతిఁ బాలించుటకు సువర్చలను బరిగ్రహించి గృహస్థుఁ డాయెనే కాని హనుమంతుఁడు తన పవిత్ర బ్రహ్మచర్యమును వదలక పాలించుచుండును." కావున నమ్మహాత్ముఁడు గృహస్థ బ్రహ్మ చారిగా నొప్పారుచు రామభక్తి పరాయణుఁడై భక్తసులభుఁడై చిరకాల జీవియై నెగడుచుండును" అని చెప్పఁబడెను.

---

1. బాలాంజనేయము – 89 పుట
2. శ్రీ సువర్చలా హనుమత్కల్యాణము – పుట 26

శేనగల వెంకటప్పయ్యశాస్త్రి కృతమగు శ్రీ సుందర హనుమత్క థా సుధ యందు ఆ వివాహసంబంధ మగు ప్రవర, మంగళాష్టకము, [1] చూర్ణికలును గలవు. ప్రతాప హనుమయ్యయు పై విషయములు సూచించుచుఁ దమ ప్రసన్నాంజనేయమున[2] శ్రీ పరాశరసంహితా పారము లు నిన్ను గొప్ప గృహస్థుగాఁ జెప్పినారు.' అని శుభముహూర్తము జ్యేష్ఠ శుద్ధ దశమి అనియుఁ గల్యాణాంశములఁ జెప్పెను. ఇట్లు సువర్చలోదంత ము పండిత గ్రాహ్యమై కన్పట్టును.

శ్రీ హనుమద్వ్రతము:- ఇది మార్గశిర శుద్ధ త్రయోదశినాడు నిర్వహించు హనుమత్పరమగు వ్రతము. పంపాసరోవరమున జరుపవలసిన దగుట వలన పంపాకలశ ప్రతిష్ఠ చేసి అనంతరము వ్రతము జరుపుట యీ వ్రత విధానమునఁ బ్రత్యేకత. ఈ విధానమునకును మూలము పరాశరసంహి తయే. ఈ వ్రతమునుగూర్చి 'శ్రీ హనుమద్వ్రత జయంతి ప్రదక్షిణ కల్ప ము, అను పేర శ్రీ శిష్టా చంద్రమౌళిశాస్త్రి ,హనుమద్వ్రత కల్పము అని శ్రీ చల్లా లక్ష్మీనరసింహశాస్త్రి, శ్రీ హనుమద్వ్రత విధానము అని అన్న దానం చిదంబరశాస్త్రియు గ్రంథములుగా రచించిరి.

హనుమద్వాలము - పార్వతి:- రాక్షస సంహారార్థ మవతరించు శ్రీరాముని సేవింపఁదాను నంజనాగర్భమున వానర రూపమున జన్మింపబోవు చుంటి నని శివుఁడు పార్వతితోఁ బల్కెను. ఆమె ''మీ శరీరమున నర్ధభాగ మా క్రమించుకొని యున్న నన్ను విడిచి వెళ్ళదగునా? యన శివుఁడు [3] ''పరాశక్తి వగు నీవు నాయందు లీనముగాకున్న దైత్యుల నంతమొం దించు శక్తి నాకెట్లుగల్గును? నీవు నా వాలము నాశ్రయించి నాకు శక్తిని కల్గింపు''మనెను. కావున హనుమంతుని వాలము పార్వతీదేవియే.

భగవద్గీతావ్యాఖ్యాత-హనుమంతుఁడు:- హనుమంతుఁడు అర్జునుఁడు కోరి న ప్రకారము రథముపై నుండగా శ్రీకృష్ణభగవానుఁడర్జునునకు భగవద్గీ తా జ్ఞాన ధర్మముల నుపదేశించెను. వాని నన్నిటిని ఆంజనేయుఁడు పై నుండి వినియున్నానని చెప్పుటచేత శ్రీకృష్ణభగవానునకు కోపము వచ్చి

---

1. శ్రీ సుందర హనుమత్కథాసుధ - పుట 116
2. ప్రసన్నాంజనేయము - 92. 97
3. శ్రీ సుందర హనుమద్వాలపూజ - పుట 14

నది అందువలన అంజనేయుని పిశాచమగునట్లు శపించెను. తరువాత భగవద్గీతకు వ్యాఖ్యానము వ్రాసినపుడు నీ పిశాచత్వము పోవునని చెప్పగా నాంజనేయుఁడు [1] 'భగవద్గీతకు వ్యాఖ్యానము వ్రాసి శాపవిముక్తి నొంది దెను. 'గీతార్థము సంగీతానందము వాతాత్మజునకు బాగ తెలుసురా' అన్న త్యాగరాజు కీర్తనోద్దేశ్యమిదియే.

మహానాటక కర్త - హనుమంతుఁడు : హనుమంతుఁడు రామకథ వస్తువుగా నొక నాటకము రచించెను. దీనినే మహానాటక మని, హనుమన్నాటక మనియు నందురు. పది యంకముల యీ నాటకమున విదేహ తనయా లాభము మొదలుగా శ్రీరాముఁడు స్వర్గమున కేగువఱకుఁగల రామకథాభాగ మంతయు సంగ్రహముగా కలదు. ఇది సంస్కృత భాషయందు లిఖింపఁబడెను. గ్రంథాదినిఁ గల

[2] "ఏష శ్రీ హనూమతా విరచితే శ్రీమన్మహానాటకే
మిశ్ర శ్రీ మధుసూదనేన కవినా సందర్భ సజ్జీకృతే"

యను శ్లోకమువలన హనుమంతుఁడు దీనిని రచియించె నని, మధుసూదనమిశ్రుఁడు సందర్భోచితముగా సవరించె నని తెలియును. దీనిని హనుమంతుఁడు రచించె నని నాటకాదిని గల "వాల్మీకే రుపదేశతః స్వయమహో - వక్తా హనూమాన్ కవిః" అను సూత్రధారవాక్యము స్పష్టమొనర్చుచున్నది.

మరికొన్ని విశేషాంశములు-: [3] 'అహల్య శాపమువలన అంజనాదేవికి కోతి ఆకారముఁగల కుమారుఁడు జన్మింపవలెను. కాన అంజనేయుఁడు వానరుడయ్యెను [4] శ్రీరాముని బాల్యముననే ఆంజనేయుని రాముని కడకు తీసుకొనివచ్చిరి. శ్రీరామాంజనేయులు కొన్నిరోజు లాట లాడుకొనిరి.

[5] వారధి నిర్మాణార్థము గోవర్ధనగిరి పర్వతముఁ దెచ్చుహనుమంతునకు వారధి పూర్తి అయినట్లు తెలిసి యొక్కచోఁ బడవేయ నది దైవ

---

1. శ్రీమదాంజనేయ చరిత్ర - పుట - 35
2. సంస్కృత వాఙ్మయ చరిత్ర - 2వ భాగం - పుట 419
3. శ్రీమదాంజనేయ చరిత్ర - పుట - 4
4. శ్రీమదాంజనేయ చరిత్ర - పుట - 7
5. శ్రీమదాంజనేయ చరిత్ర - పుట - 11

కౌర్యమున కుపకరింపని నేనేల? సముద్రమున నే పడవేయు" మనగా నా విషయమును హనుమంతుఁడు రామునకుఁ జెప్పెను. రాముఁడు 'తాను ద్వాపర యుగమున శ్రీకృష్ణుఁడనై ఏడు రోజులు వ్రేలిపై నా పర్వతమును మోసెద నని చెప్పు'మనెను.

రామేశ్వరమునఁ బ్రతిష్ఠించుటకు స్వయంభూ లింగముఁ దెమ్మన రామాజ్ఞపై కాశీ వెడలిన హనుమంతునకు నెటుచూచినను శివలింగములే కన్పడెను. స్వయంభూలింగము తెలియక విచారించుచుండ ఒక గరుడపక్షి వచ్చి ఒకలింగము యొక్క పై భాగమున తిరుగుచుండెను. ఒక బల్లి చలుకు కూడా విన్పడెను. అదియే స్వయంభూలింగ మని దానిని గొంపో నుండ క్షేత్రపాలకుఁడు కాలభైరవుఁడు ఎదుర్కొని యుద్ధము చేయ దేవత లది లోకకల్యాణార్థము గొంపోవుచున్నాఁడని యుద్ధము విరమింపఁ జేసిరి. అపుడు కాలభైరవుఁడు కాశీపరిధిలో నెగురకూడ దని గరుడునకుఁ పలుకరా దని బల్లికి శాప మిచ్చెను.

[2] సీతాదేవికి స్వయముగ వంట చేసి అంజనేయునకు వడ్డింపవలెనను కోరిక కల్గి యట్లు చేసెను. ఆంజనేయుఁ డానందముతో భుజించుచుండిన పదార్థము లన్నియు పూర్తి అయినను చాలు ననకుండుట చూచి యాతనిశివావతారత్వమును గుర్తుచేసికొనిస్తుతించి అంజనేయునిశిరమున 'ఓం నమశ్శివాయ' అని వ్రాసెను. అంతట నాతఁడు తృప్తుఁడయ్యెను.

[3] అశ్వమేధ యాగాశ్వమునకు రక్షకుఁడుగ నేగిన హనుమంతుఁడు కుశునితోడి యుద్ధమున మూర్ఛిల్లెను. వినోదముగ తననుసీతకడకుఁ గొంపో నెంచిన లవునిమాటవిని తాను తేరుకొనియు మూర్ఛ నటించుచునే యుండి సీతకడకుఁ గొంపోఁబడెను. తన నీ స్థితిలో చూచిన అభిమానవంతుఁడగు నితఁడు నిర్జీవుఁడై మరణించును. కాన వెంటనే రణరంగమున విడిచిర మ్మని పంపెను. ఇట్టివి, దుష్టశిక్షణ, శిష్టరక్షణలకు సంబంధించినవియు నగు హనుమద్గాథ లెన్నియో కాననగును.

---

1. శ్రీ మదాంజనేయ చరిత్ర – పుట – 14; కాశీయాత్ర – పుట 70
2. శ్రీ మదాంజనేయ చరిత్ర – పుట – 16
3. జైమినీ భారతం – 36–65 నుండి 75

# హనుమత్కథలోని అంతరార్థ తత్త్వము

ఆంజనేయునకు సంబంధించిన నామములలో హనుమంతుఁడు అను నది ముఖ్యనామము. హనుమంతుఁడు తనను గూర్చి చెప్పుకొనునప్పుడు తరచుగ నా నామమునే తెల్పుకొనును

'హనుశబ్దో జ్ఞానవాచీ - హనుమానితి శబ్దితః' అని ఒక వేదోపనిషత్ వ్యాఖ్యముల మాధ్వులన్నటుల నట్టి హనుమచ్ఛబ్దమునకు జ్ఞానవంతుఁ డని యర్థము. 'జ్ఞానినా మగ్రగణ్యం' అని హనుమంతుని స్తుతించుట ప్రసిద్ధము సర్వజ్ఞ నామధేయము శర్వునకే చెల్లును కాన నట్టి శివావతా రతను కూడ నా శబ్దము నిరూపించును

హనుమంతునియెడఁ బ్రయోగింపఁబడు 'అగ్నిసంభవ' 'వాయునందన' వంటి శబ్దములును, 'యా సృష్టిః స్రష్టు రాద్యా వహతి' యను నభిజ్ఞాన శాకుంతల నాందీ శ్లోకమందు కాళిదాసుచే ప్పినటుల శివతనువుల నే ప్రకటించుచున్నవి.

ప్రాణశక్తి వాయువు. ప్రాణసాధన యోగము దానివలన మోక్ష సాధి జ్ఞానము లభించి జ్ఞానాన్మోక్షము లభించును. కావున ప్రాణ - జ్ఞాన- మోక్షములు హనుమంతుని విషయమునఁ గానవచ్చు నాధ్యాత్మిక క్రమము. బుద్ధి మాయావరణము బొందక పుట్టినయట్లున్న ట్లుగ భగవంతునను గ్రహించు నను విషయము 'ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీనారాయణః' అని చెప్పఁబడు సూర్యుని హనుమంతుఁడు మ్రింగఁబోవుటలో నున్న విశేషము. మనస్సను నింద్రుఁడు మాయయను వజ్రాయుధమున దెబ్బతీయుటతో మాయఁదాకినవాఁడై లోకమునఁ బడెను. మరల మాయా ప్రమాదమునుండి బయల్పడుటకు ప్రాణసాధనే కర్తవ్యమయ్యెను. వాయు స్తంభనమున కుంభక విధాన మొనర్పఁబడెను. దానిచే ననంత శక్తులు దేవతలవరముల రూపమున హనుమంతునకు లభించెను. యోగసాధనా లభ్యమగు నణిమాద్యష్టసిద్ధులచే గర్వించువాఁడు పతన మందునట్లు దేవతల వరములచే నతిశయించిన హనుమంతుఁడు శాప గ్రస్తుఁడై ఖిన్నుఁడయ్యెను.

కావున మరల గురుసేవనమునఁ దనయందు లోపించిన జ్ఞానశక్తిని అనంత జ్ఞానమునుండి స్వీకరింప నెంచెను. 'ధియో యో నః ప్రచో

దయాత్‌అని బుద్ధిశోధనకు కారకుఁడగు సూర్యునే గురువుగ స్వీకరించెను. 'గుకార స్త్వంధకారస్స్యాత్ రుకార స్తన్నిరోధకః' అను అంధకార నిరోధకుని స్వీకరించుట, అజ్ఞానాంధకారమును తొలగించువానిని చేరుట సముచితము. వేదాధ్యయనాదుల బ్రహ్మచారిగా నిష్ఠతోనున్న యాతనికి బ్రహ్మవర్చస్సు, సువర్చస్సు చేకూరుట సహజము. అందుకు కారకుఁడా గురువే. అట్టిగురువగు సూర్యునివలన సువర్చలనందు కొనుటలో నంతరార్థ మదియే.

విశుద్ధతత్త్వము నానందమున కనుసంధించుటలో భగవదన్వేషణాపరమగు బుద్ధి ఉపకరించుటయు రామసుగ్రీవమైత్రి కూర్చుట. సీత ప్రకృతి. రాముఁడు పురుషుఁడు-ఆనందరూపుఁడగుఁబరమాత్మ-ప్రకృతి పంచజ్ఞాన + పంచకర్మ = దశకంధరవశమై యున్నదాని నన్వేషించి దానికి ఆనందతత్త్వమగు రామతత్త్వము దెల్పి ఆత్మసాయుజ్యము సమకూర్పు ఘటనమే హనుమంతుని సీతాన్వేషణాదిక గాథగా నంతరార్థ రామాయణము తెల్పుచున్నది.బుద్ధితమస్సును దెబ్బతీసి చోటుజేసికొన్న బ్రహ్మజ్ఞానము కల్గుననుట లంకిణికి హనుమంతుని దెబ్బతో బ్రహ్మవాక్యముల స్మరించుట సూచించును. తమోనిలయ విధ్వంసనము లంకాదహనము. అనంతర సాత్త్విక సుఖానుభవము మధువన సుఖవిహారము. మాయచే దెబ్బతిని మూర్ఛిల్లిన లక్ష్మణునకు సంజీవకరణిగా బుద్ధి సహకరించెను.

ముందు హనుమద్దర్శనము చేసి ఆలయమున రాముని దర్శించుట బుద్ధీంద్రియ ద్వారమువనే ఆనందరూప భగవద్దర్శనమగుట.'యోబుద్ధేః పరత స్తు సః'అన్నగీతావాక్యార్థ సమన్వయ మిది.'జ్ఞానాదేవమోక్షః'అని మోక్షము జ్ఞానము వలననే లభించును అనగా జ్ఞానము కల్గినపిదప 'అహం బ్రహ్మాஉస్మి'వంటి మహావాక్యముల పరతత్త్వమెఱిగి తానేబ్రహ్మమనుకొనుట, అట్లగుట జరుగును కావున జ్ఞాని అనంతరదశ బ్రహ్మమే. కావున హనుమంతుఁడు భవిష్యద్బ్రహ్మ యనుటలో నాంతర్య మిదియే అట్టి బుద్ధి యవినాశి కావున బుద్ధి జ్ఞాన రూపుఁడగు హనుమంతుఁడు చిరంజీవిగా లోకమును జ్ఞానరూపమున రక్షించుచున్నాఁడనుటయుఁతరార్థము. శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము హనుమంతుని సుందాచార్యత్వము

నిరూపించుచుండ హనుమచ్ఛతకమ్ము ఆత్మయగు రాముని కానందమగు సీతను గూర్చుటలో హనుమంతునకు నిధిధ్యాన స్థానము నిడుచున్నవి.

రామకథారసవాహిని గ్రంథాదిని భగవాన్ సత్యసాయి బాబా అభిప్రాయమున 'శాంతి' అను సముద్రముదాటి బ్రహ్మజ్ఞాన మనుసీతను గుర్తించి ఆనందదాముడగు రాముని చేరిన ధైర్యము హనుమంతుడు. షోడశరామాయణ రహస్యములందు హనుమంతుడు సాధకుడగు మహాయోగిగను సుషుమ్నానాడిగను సుందరకాండ కుండలినీ యోగముగను చెప్పబడెను. పెయ్యేటి లక్ష్మీకాంతమ్మ అంతరార్థరామాయణమున హనుమంతుడు సత్సంగశర్మగా వర్ణితుడు.

హనుమంతుని కథ యందలి అంతరార్థమును ఖగోళశాస్త్రులిట్లు భావింతురు స్వాతి వాయుదేవతాకను తులారాశి దాని స్థానము, అనగా వాయు స్థానము, దానికి పంచమ స్థానము సంతాన స్థానమగును. అది కుంభము. తద్గత పూర్వాభాద్ర హనుమజ్జన్మ నక్షత్రము. ఇట్లు వాయు, హనుమంతులు తండ్రీ కొడుకులగుట ఖగోళ సిద్ధము. హనుమంతునిది కుంభరాశి. దానికి కళత్ర స్థానమగు 7వ రాశి సింహరాశి. సింహరాశిలో నున్న ఉత్తరా నక్షత్రమున హనుమత్కల్యాణం జరుగుట హనుమంతుని కళత్ర ప్రాప్తిని సూచిస్తుంది. సింహమున కధిపతి సూర్యుడు. తత్స్వరూపతేజః పుంజమే సువర్చల. సూర్య పుత్రికకు, వాయు పుత్రునకు కల్యాణమగుట ప్రకృతి సిద్ధము.

ఇట్లు హనుమత్కథ యందంతరార్థము లనేకరీతుల నాయా కవి పండితులచే భావింపబడుచు హనుమత్కథయందలి యాధ్యాత్మికతత్త్వమును బోధించుచున్నవి.





పై ఆకునందు రెండు హనుమంతుని చిత్రములు కలవు. ఇట్లు ప్రతి ఆకునందు సహజముగ హనుమన్మూర్తిద్వయము ఉండెడిచెట్టు ప్రకృతిలో నొకటున్నది. శ్రీహనుమంతుఁడు ప్రకృతిసిద్ధముగనే చిత్రింపఁబడియుండు ఆకులు గల ఆ చెట్టు హనుమద్బీర. ఇది శ్రీశైలము అడవులలోఁగలదు. ఇలా ప్రకృతిలోనే హనుమంతుఁడాచెట్టు ఆకులపై చిత్రింపఁబడియుండుటకు కారణం[1] 'ఎవరైనా భక్తుఁడు ఆ చెట్టు క్రింద కూర్చొని ఆంజనేయస్వామిని గూర్చి తపస్సు చేస్తూ అందు స్వామిని ఆవాహనచేసి యుండవచ్చు'' అని సినీ సంగీత వేత్త శ్రీ పి. బి. శ్రీనివాస్ అభిప్రాయము. హనుమత్పరమగు నా ప్రకృతి విశేషమగు హనుమద్బీర ఆకుకు సంబంధించిన ఛాయాచిత్రమీయనుబంధమున నీయబడినది. ఇది కృత్రిమము కాదనుటకుఁ బ్రమాణము సూర్యరాయాంధ్ర నిఘంటువు నందలి 8వసంపుటమున 475వ పుటలో ''హనుమంతబీర – వి. వృక్ష విశేషము ఒక జాతిచెట్టు అని కలదు. అందే ''సి. హనుమంతబీర మంకెనగిరి కర్ణిక పెదమల్లె కొండ ముప్పిడియుగోలి'' అని హంస వింశత్యుదాహరణము నీయబడినది.

---

1. విశ్వరచన – 1-12-85 సంచిక 'ప్రకృతి వింతశీర్షిక'

# అనుబంధము - II

## హనుమన్నవతారములు



1. శ్రీ ప్రసన్నాంజనేయస్వామి అవతారము



2. శ్రీ వీరాంజనేయస్వామి అవతారము



3. శ్రీ వింశతి భుజాంజనేయస్వామి అవతారము



4. శ్రీ పంచముఖాంజనేయస్వామి
అవతారము



5. అష్టాదశభుజాంజనేయస్వామి
అవతారము



6. శ్రీ సువర్చలాంజనేయస్వామి
అవతారము



౭. శ్రీ చతుర్భుజాంజనేయస్వామి
అవతారము



౮. శ్రీ ద్వాత్రింశ
ద్భుజాంజనేయస్వామి
అవతారము



౯. శ్రీ వానరాకారాంజనేయస్వామి
అవతారము

# అనుబంధము - III

## 1. శ్రీ ఆంజనేయ యంత్రము




ఈ ఆంజనేయ యంత్రము అద్భుతశక్తి కలది. దీనిని రాగిరేకు పై చెక్కించి శోధనగావించి నిత్యము మూలమంత్రము అనుష్ఠానము గావించుచు పూజింపవలెను. అందువలన సర్వశత్రు, పైశాచిక, రోగ బాధలు తొలగి జయము, సుఖము, కార్యసిద్ధి చేకూరును.

## ౭. శ్రీ సువర్చలాంజనేయ యంత్రము



శ్రీ సువర్చల హనుమంతుని భార్య. ప్రతి హనుమదాలయమున సువర్చలా ఉత్సవ విగ్రహముకూడ ఉండవలెను. అది లేకున్నను ఈ యంత్రమయినను చేయించి శోధనచేసి సువర్చలా హనుమన్మంత్రము ప్రాణప్రతిష్ఠపూర్వకముగా ధారపోసి తప్పక ఆలయములందుంచవలెను.

## ౩. స్వప్నాంజనేయ యంత్రము




ఈ స్వప్నాంజనేయ యంత్రమంత్రముల నుపాసించుట వలన దూరదృష్టి, భూత భవిష్యద్వర్తమానములందలి సమస్త శుభాశుభములు తెలిసికొను శక్తి ఏర్పడును. యంత్రమును రాగిరేకుపై చెక్కించి యంత్రశోధన గావించి ప్రాణప్రతిష్ఠచేసి స్వప్నాంజనేయ మంత్రానుష్ఠానము చేయుచు దీనిని పూజించుచుండవలెను.

## 4. శ్రీ పంచముఖ హనుమద్యంత్రము



శ్రీ పంచముఖ హనుమంతుని పూర్ణానుగ్రహము పొందగోరువారు ఈ యంత్రమును చేయించి శోధనగావించి మంత్రజపము ధారవోసి పూజ యందుంచుకొనవలెను. నిత్యసేవలు గావింపవలెను. అద్భుత శక్తిని దీనివలన పొందగలరు. మంత్ర, యంత్ర, ప్రాణప్రతిష్ఠాది మంత్రములు కూడ చేర్పించిన ఆలయములందు ప్రతిష్ఠించుకొనవచ్చును.

## 5. ఉష్ట్ర యంత్రము



శ్రీ హనుమంతుని వాహనము ఉష్ట్రము. అనగా ఒంటె. ప్రతి హనుమదాలయమున శివునకుముందు నందివిగ్రహమును ప్రతిష్ఠించినట్లీ ఉష్ట్రమును ప్రతిష్ఠింపవలెను. అట్టి ఉష్ట్రమునకు క్రింద ఈ యంత్రము ప్రతిష్ఠింపవలెను. తప్పక ఈ యంత్రము చేయించి ధ్వజస్తంభము వద్ద నయిన ప్రతిష్ఠించుట మంచిది.

## 6. లఘు హనుమద్యంత్రము



ఇది హనుమద్విషయమున ధరింపదగిన యంత్రము. రేకులపై చెక్కించి ధరించుటకు, తాయెత్తులకు వినియోగింపవచ్చును. దీనిని ధరించినచో ఇది రక్షాకవచముగానుండును. సర్వవిధముల కామ్యములను నెరవేర్చును.

# ఉపయుక్త గ్రంథ సూచిక

| గ్రంథము | గ్రంథకర్త | ముద్రణాకాలము |
|---|---|---|
| 1 అద్భుతోత్తరరామాయణము | జనమంచి వెంకటసుబ్రహ్మణ్యశర్మ | 1969 |
| 2 అధ్యాత్మరామాయణము | వావిళ్ళ రామస్వామిశాస్త్రులు & సన్స్ | 1926 |
| 3 అన్నమయ్య హనుమత్సంకీర్తనలు | డా॥ కె. సర్వోత్తమన్ | 1983 |
| 4 అష్టాదశ పురాణములు | ఓలేటి వెంకటలక్ష్మీనరసింహశర్మ | .... |
| 5 అప్పకవీయము | అప్పకవి | 1910 |
| 6 అంతరార్థ రామాయణము | పెయ్యేటి లక్ష్మీకాంతమ్మ | .... |
| 7 ఆనందరామాయణము | పండిత చిలుకూరి శ్రీరామశాస్త్రి | 1956 |
| 8 ఆంధ్రహరికథా వాఙ్మయము | వాడరేవు సీతారామాంజనేయులు | 1976 |
| 9 ఆర్యచరిత్ర రత్నావళి | వావిలకొలను సుబ్బరాయవిరచితము | — |
| 10 ఆశ్చర్యచూడామణి | ఊటుకూరు ఆంజనేయశర్మ | 1961 |
| 11 ఆశ్చర్యచూడామణి | కుప్పా ఆంజనేయశాస్త్రి | 1952 |
| 12 ఆంధ్రశతక సాహిత్య విమర్శ | డా॥ కె గోపాలకృష్ణరావు | 1976 |
| 13 ఆంధ్ర వచన వాఙ్మయము | డా॥ కులశేఖరరావు | 1974 |
| 14 ఆంధ్ర వాఙ్మయ సూచిక | కాశీనాథుని నాగేశ్వరరావు | 1929 |
| 15 ఆంజనేయోపాసన | శ్రీరామచరణ్ | 1981 |
| 16 ఆంధ్ర ద్విపద సాహిత్యచరిత్ర | డా. టి. సుశీల | 1979 |
| 17 ఆంధ్రశతక సాహిత్య వికాసము | డా. కె. గోపాలకృష్ణారావు | .... |
| 18 ఉత్తరరామాయణ విమర్శ | డా. యం. పాండురంగారావు | 1981 |
| 19 కాశియాత్ర తమిళమూలం | శ్రీమత్ సభారతిస్వాములవారు అనువాదకులు - తాళ్ళూరు అర్మగంపిళ్ళె | — |
| 20 గోపీనాథ రామాయణము | గోపీనాథం వెంకటకవి | 1928 |
| 21 ఛందోదర్పణము | అనంతామాత్యుడు | 1958 |
| 22 జగద్గురు మధ్వాచార్య | డా. ఆకొండి విశ్వనాథం | 1983 |
| 23 జైమిని భారతం | అనంతం | — |
| 24 తెనుగు జానపద సాహిత్యము | డా. రావి ప్రేమలత | 1983 |
| 25 తెనుగు సాహిత్యము రామకథ | విద్వాన్ రాపూరి దొరస్వామిశర్మ | .... |
| 26 తెనుగు సాహిత్యములో రామకథ | వందా శ్యమంతకమణి | .... |

| గ్రంథము | గ్రంథకర్త | ప్రచురణకాలము |
|---|---|---|
| 27 తెలుఁగు సాహిత్య సమీక్ష | డా. జి. నాగయ్య | -1983 |
| 28 తెలుఁగు జానపదగేయ సాహిత్యము | డా. బి. రామరాజు | -1978 |
| 29 నక్షత్రములు | గొబ్బూరి వెంకటానందరాఘవరావు | |
| 30 ప్రసన్నాంజనేయము | ప్రతాప హనుమయ్య | -1954 |
| 31 పురాణ వాఙ్మయము | డా. జి. వి. సుబ్రహ్మణ్యం | |
| 32 భావప్రకాశనం | ఆం.సా.అ. జమ్ములమడక మాధవరామశర్మ | -1978 |
| 33 భాస్కరరామాయణము | భాస్కర ప్రభృతులు | -1980 |
| 34 బాలాంజనేయము | అచ్యుతుని వేంకటాచలపతిరావు | -1969 |
| 35 భూషణకిరణావళి | రామరాజభూషణ | -1969 |
| 36 మైరావణ చరిత్రము | పురాణం పిచ్చయ్య | -1988 |
| 37 మొల్ల రామాయణము | మొల్ల | -1987 |
| 38 మహాభారతము - ఉపాఖ్యాన తత్త్వము | డా॥ పి. వెంకటరాజు | -1982 |
| 39 మహావీరహనుమాన్ | మూలం శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారీమహరాజ్ అనువాదం శ్రీ పురాణపండ రామమూర్తి | -1970 |
| 40 మారుతి | డా. ఆకొండి విశ్వనాథం | |
| 41 మారుతి విజయము | వేదం సుందరరాజశర్మ | -1928 |
| 42 మైరావణ | అయ్యగారి విశ్వేశ్వరరావు | -1947 |
| 43 మారుతి మైరావణ సంగ్రామము | గుంటూరు బ్రహ్మయ్య | -1924 |
| 44 మైరావణ చరిత్రము | మాడయ్య కవి | -1914 |
| 45 యమాంజనేయ యుద్ధం | సత్తిగోడుపు రాఘవరాజు | -1968 |
| 46 రామాయణ ప్రసంగములు | ఎక్కిరాల కృష్ణమాచార్య | |
| 47 రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రకవి | -1987 |
| 48 రామాయణ సుధాలహరి | కల్లూరి చంద్రమౌళి | |
| 49 రామచరణ్ రామాయణము | రామచరణ్ | |
| 50 రాఘవ పాండవీయము | కాపూరి పూర్ణచంద్రరావు | -1980 |
| 51 రామాయణ విశేషములు | మందపరం ప్రతాపరెడ్డి | -1957 |
| 52 రామకథారసవాహిని | భగవాన్ సత్యసాయిబాబా | |
| 53 రామాయణ సర్వస్వము | సంస్కృతభాషాప్రచార సమితి | -1985 |
| 54 రామాశ్వమేధయాగము | పురాణం పిచ్చయ్య | -1852 |
| 55 రామాయణ సుధాలహరి | యువభారతి | -1976 |

గ్రంథము గ్రంథకర్త ముద్రణాకాలము

56 లంకావిజయము - పిండిప్రోలు లక్ష్మణకవి -1915
57 లంకాదహనము - వేంకటనారాయణ -1922
58 లలితాసహస్రనామము - ఇలపావులూరి పాండురంగారావు -1984
59 వసుచరిత్ర విమర్శనము - వఝల చిన సీతారామశాస్త్రులు -1965
60 వసుచరిత్రము - రామరాజ భూషణుఁడు -1967
61 వేదాలలో హనుమంతుఁడు -అన్నదానం చిదంబరశాస్త్రి
- దుందుభి మార్గశిరము
62 శతకంఠ రామాయణము -మర్ధనకవి -1954
63 శతకంఠ రామాయణము - పురాణం పచ్చయ్య
64 శతావధాన ప్రబంధము-శ్రీరామసాహిత్య పరిషత్తు -1977
65 శిబి - చింతాదీక్షితులు -1952
66 శ్రీమత్ కామ్యసిద్ధి రామాయణము
-మాపుడూరు వేంకటసత్య శ్రీరామశర్మ -1881
67 శ్రీ భగవాన్ పంచముఖి -ద్వివేది సత్యనారాయణసూరి -1981
68 శ్రీమద్వాల్మీకి రామాయణాంతర్గత సుందరకాండము -1976
69 శ్రీరామాయణ సారోద్ధారము -ములుకుట్ల లక్ష్మీనరసింహావధాని-1936
70 శ్రీరామ కథామృతము - శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి -1974
71 శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము - వావిలికొలను సుబ్బారావు1964
72 శ్రీరామాయణమ్-సుందరకాండ: -శ్రీ భాష్యం అప్పలాచార్యః -1986
73 శ్రీరంగనాథ రామాయణము -కోన బుద్ధారెడ్డి
74 శ్రీరామ కథామృతము - సమగ్ర సమీక్ష
-తూములూరి శ్రీదక్షిణామూర్తిశాస్త్రి -1985
75 శ్రీ వాసుదాసు కీర్తనలు - వాసుదాసస్వామి -1973
76 శ్రీమద్రామాయణ కల్పవృక్షము -విశ్వనాథ సత్యనారాయణ -1956
77 శ్రీరామాంజనేయ యుద్ధం -తాండ్ర వేంకటసుబ్రహ్మణ్యం -1979
78 శ్రీరామాంజనేయము -పిశుపాటి చిదంబరకవి -1925
79 శ్రీ సీతాన్వేషణము - వాడేల వేంకటశేషగిరిరావు
80 శ్రీ సువర్చలా హనుమత్కల్యాణము -శ్రీఆంజనేయ భక్తమండలి
81 ఆంజనేయ చరితము - Ch శ్రీరామమూర్తి -1980

గ్రంథము | గ్రంథకర్త | ముద్రణాకాలము

82 శ్రీ హనుమాన్ పాతాళ విజయము
-నాగశ్రీ & దరిశి వీరరాఘవస్వామి -1964
83 శ్రీ సుందర హనుమత్కథాసుధా-శ్రీశనగల వెంకటప్పయ్యశాస్త్రి-1989
84 శ్రీ సుందర హనుమద్వాలపూజ -శనగల వేంకటప్పయ్యశాస్త్రి -1978
85 శ్రీ రామోద్యోగము -ద్రోణంరాజు సీతారామారావు -1921
86 శ్రీమహాభాగవతము -బమ్మెర పోతన -1984
87 శ్రీహనుమన్మహావిద్యా ప్రకాశికా -శ్రీలంకా వెంకటేశ్వరశాస్త్రి -1972
88 శ్రీ వేంకటాచలమాహాత్మ్యము -డా. మోడేకుర్తి వేంకటసత్యనారాయణ
89 శివపురాణం - సన్నిధానం నరసింహశర్మ -1986
90 శ్రీ పద్మపురాణం - ధూళిపాళ శ్రీరామమూర్తి
91 శ్రీమదాంధ్ర పద్మపురాణం -పిశుపాటి చిదంబరశాస్త్రి
92 శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్తమహాపురాణం -పుట్టుపల్లి సుబ్బరాయగుప్త
93 శ్రీరామదూత చరితము -అనుముకొండ తులసీరావు -1984
94 శ్రీ హనుమాన్ లీలాతరంగిణి -కుంటముక్కల రామారావు -1977
95 శ్రీ హనుమద్విషయ సర్వస్వము -అన్నదానం చిదంబరశాస్త్రి -1967
96 శిరిడీ సాయిబాబా జీవితచరిత్ర - అయ్యలరాజు
97 శ్రీ మదుత్తర రామాయణము - కంకంటి పాపరాజు
98 శ్రీ వేంకటాచల మాహాత్మ్యము -వరాహాది అష్టపురాణాన్తర్గతం -1959
99 శ్రీ హనుమద్వ్రత జయంతి ప్రదక్షిణకల్పము
శిష్ట్లా చంద్రమౌళిశాస్త్రి
100 శ్రీ హనుమద్విలాసము -శిష్ట్లా చంద్రమౌళిశాస్త్రి
101 శ్రీ హనుమద్వ్రత విధానము -అన్నదానం చిదంబరశాస్త్రి -1986
102 శ్రీమదాంజనేయచరిత్ర సంగ్రహము - శ్రీచిన్మయరామదాసు -1980
103 శ్రీ హనుమజ్జనన రహస్యము -డా. ఎ. జి. కృష్ణమూర్తి
104 శ్రీ హనుమచ్చరిత్ర - డా॥ బుడ్డిగ ఆదినారాయణమూర్తి -1983
105 శ్రీ హనుమచ్చరితామృతము-అవ్వారి గోపాలకృష్ణమూర్తిశాస్త్రి 1986
106 శ్రీ హనుమద్విజయము - అవ్వారి సుబ్రహ్మణ్యశర్మ -1982
107 శ్రీ హనుమజ్జయన్తి - బొమ్మరాజు వెంకటసుబ్బయ్య -1970

| గ్రంథము | గ్రంథకర్త | ముద్రణాకాలము |
|---|---|---|
| 108 శ్రీ హనుమత్సముద్రోల్లంఘనము - | బొమ్మరాజు వెంకటసుబ్బయ్య | -1978 |
| 109 శ్రీ సుందర హనుమత్తత్త్వము | చింతలపాటి వీరభద్రరావు | -1986 |
| 110 శ్రీ సుందరమారుతి వైభవచరిత్ర | వరిగొండ లక్ష్మీనరసింహం | -1987 |
| 111 శ్రీ మద్రామాయణ సుందరకాండము - | సూరంపూడి రాధాకృష్ణమూర్తి | -1979 |
| 112 శ్రీ భక్తాంజనేయ వైభవము | యం. శ్యామసుందరశాస్త్రి | |
| 113 షోడసి రామాయణరహస్యములు | గుంటూరు శేషేంద్రశర్మ | -1980 |
| 114 సహస్రకంఠరామాయణము | పురాణం పిచ్చయ్య | |
| 115 సుందర హనుమద్వైభవము | శ్రీ శిష్టా చంద్రమౌళిశాస్త్రి | |
| 116 సమీరకుమారవిజయము | పుష్పగిరి తిమ్మన | -1929 |
| 117 స్త్రీల రామాయణపు పాటలు | ఆంధ్ర సారస్వత పరిషత్తు | -1955 |
| 118 సుగ్రీవ విజయము | కందుకూరి రుద్రకవి | -1973 |
| 119 సుగ్రీవ పట్టాభిషేకం | అబ్బరాజు హనుమంతరావు | -1912 |
| 120 సంస్కృత వాఙ్మయచరిత్ర | మల్లాది సూర్యనారాయణశాస్త్రి | -1961 |
| 121 సుందరకాండ ఎందుకు సుందరమైనది | అవ్వారి సుబ్రహ్మణ్యశర్మ | |
| 122 సుందరకాండము | రాచర్ల కృష్ణమూర్తి | -1983 |
| 123 సుందర మందారము | శాంతిశ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి | -1982 |
| 124 సేతుబంధ మహాకావ్యం | అవధానము చంద్రశేఖరశర్మ | -1985 |
| 125 హనుమదాచార్యోపదేశము - | వావిలికొలను సుబ్బరాయ విరచితము | -1926 |
| 126 హరికులామోదము | చల్లా సూర్యకామేశ్వరరావు | -1973 |
| 127 హనుమత్కల్యాణస్తవము | పుల్లాపంతుల వేంకటరామశర్మ | |
| 128 హనుమద్వ్రత కల్పము | చల్లా లక్ష్మీనరసింహశాస్త్రి | -1986 |
| 129 హనుమదర్చన | దావులూరి కోటిసూర్యప్రకాశరావు | |
| 130 హనుమత్స్మరణ | జై హనుమత్సేవాసమితి | -1972 |
| 131 హనుమత్సేవ | శ్రీమారుతి శరణ్ చయనం శ్రీనివాసరావు-రక్తాక్షి | |
| 132 హనుమచ్చరితం | స్వామికృష్ణదాస్ జీ-దుర్మతి | |

గ్రంథము గ్రంథకర్త [illegible]

133 హనుమద్భక్తి ప్రాశస్త్యము –
మాగులూరి రామకోటేశ్వరరావు –1[illegible]

134 హనుమదుపాసన – అల్లంరాజు వెంకటసు[illegible]

135 క్షేత్రయ్య పదసాహిత్యం – డా॥ [illegible]

136 లంకాదహనము అను హనుమద్విజయము –
పుతుకుమల్లి [illegible] –1[illegible]

137 వీరాంజనేయము – 'పండిత' [illegible] –1[illegible]

138 వీరాంజనేయ సంకీర్తనలు – [illegible] –1[illegible]98

139 శ్రీరామదూతచరితము – అనుమకొండ [illegible] –[illegible]

140 శ్రీ హనుమచ్చరిత – చల్లా పిచ్చయ్యశాస్త్రి –1[illegible]8

141 సహస్రకంఠరామాయణము – పురాణం పిచ్చయ్య

142 సేతుబంధ మహాకావ్యము – అవధానము చంద్రశేఖరశర్మ 1985

143 మారుతిసేవ – ముక్కామల వెన్నయ్య 1937

144 లంకాదహనము – కాశీనాథుని వీరమల్ల[illegible] 1916

145 సంపూర్ణాంజనేయము కొడాలి సత్యనారాయణరావు 1928

146 లంకాదహనము – ద్రోణంరాజు సీతారామారావు 182[illegible]

147 రామరావణ సంగ్రామము – వసుమూర్తి లక్ష్మీనారాయణ 1917

148 హనుమద్విలాసము – డా॥ మొక్కపాటి శ్రీరామశాస్త్రి 1[illegible]88

149 పాపిటబొట్టు – కె. సూర్యనారాయణ [illegible]8

150 అన్వేషణ – కె. సూర్యనారాయణ [illegible]

151 జండాపై కపిరాజు – కె. సూర్యనారాయణ 1[illegible]

152 వినుకొండసీమ – కంచర్ల పాండురంగశర్మ –1[illegible]

# సంస్కృత గ్రంథములు

1. ఆనందరామాయణము - శ్రీమద్వాల్మీకి మహర్షి ప్రణీతము
ముద్రాక్షరశాల - 1902
2. శ్రీ సువర్చలాంజనేయమ్ - గురజాడ పూర్ణచంద్రశర్మ
గురజాడ - 1976
3. స్కన్ద మహాపురాణమ్ - మనసుఖరాయ్‌మోర్ - 5 - క్లైవ్‌రో
కలకత్తా 1-1960
4. పద్మపురాణమ్ - మనసుఖరాయ్‌మోర్ - 5 - క్లైవ్‌రో
కలకత్తా - 1 1959
5. బ్రహ్మపురాణమ్ మనసుఖరాయ్‌మోర్ 5 క్లైవ్‌రో కలకత్తా 1 1954
6. శ్రీహనుమత్పంచాంగః - శ్రీధరశివలాల్‌జీ
జ్ఞానసాగర ముద్రణశాల బొంబాయి
7. శ్రీరామాయణ సారోద్ధారః - ములుకుట్ల లక్ష్మీనరసింహావధాని 1936
8. శ్రీరామాయణమ్ సుందరకాండః - తత్త్వదీపికావ్యాఖ్యా
శ్రీభాష్యం అప్పలాచార్యులు 1986

## పత్రికలు

భారతి : 1925 ఏప్రియల్; 1926 మార్చి, ఏప్రియల్; 1927 భాద్రపదం
1929 ఫిబ్రవరి
సప్తగిరి : 1986 జూన్;
విశ్వరచన : డిశంబరు 1985
[illegible] : 1975 జనవరి
ఆంధ్రప్రభ : 27.10 1975
[illegible] : 1982 మే, సెప్టెంబర్, 1983 జూన్; 1984 మార్చి
ఏప్రిల్, మే, జూన్, జూలై, ఆగస్టు, నవంబర్
1985 జనవరి, ఫిబ్రవరి, మార్చి, ఏప్రియల్, మే, జూన్
ఆగస్టు, అక్టోబరు, డిశంబరు
1986 జనవరి, ఫిబ్రవరి, మే, జూలై
1988 ఏప్రియల్





ఒంగోలులో డా॥ అన్నదానం చిదంబరశాస్త్రిగారు ప్రతిష్ఠించిన శ్రీ గాయత్రీ మాతామూర్తులు

గంధపుద్రవ్యానికు రు. 116/- లు సమర్పించిన హనుమద్భక్తులు

సర్వశ్రీ స్వర్గ రాధావెంకటకృష్ణమూర్తి - పార్వతిగార్లు, వేటపాలెం
డి. డూరి వెంకటసుబ్బారావు - వీరావతిగార్లు, వేటపాలెం
...పాటి విద్యాసాగర్ - శైలజగార్లు, వేటపాలెం
A. V. L. నరసింహారావు, ఫిజిక్స్ లెక్చరర్ (రిటైర్డ్) వేటపాలెం

## విజయనగరం భక్తులు

...న్న సూర్యనారాయణమూర్తి, కమీషను ఏజంట్సు, చిన్నవీధి
త...కు సత్తియ్య - టోకు బట్టలవర్తకం, మంగళవీధి
...జపు సన్నంగరావు - డాల్‌మిల్లు, P W మార్కెట్టు
నారాయణం వెంకటచలమాజీ ఉరఫ్ C. B. స్వామి, గీతాలాడ్జి, M.G. రోడ్
P V R M. రాజు, A.P S R T C.
గోకవరపు వెంకటరాజు, శ్రీ వెంకటేశ్వర క్లాత్ ఎంపోరియం,
...త్తు గోవిందరాజులు, మణికంఠ సప్లయర్స్ చిన్నవీధి
P V. S. రామానుజం, రంగుల వ్యాపారం, నియర్ S. K. P. టెంపుల్
ఓబ్బిలిశెట్టి జానకిరామయ్య, జనరల్ మర్చంట్సు, చిన్నవీధి
కొ...గారి పెదసత్యారావు, వెండిసామానుల తయారు, చిన్నవీధి
దంతులవారి సాంబమూర్తి, మోటార్ వర్కర్సు, జిడ్డువారి వీధి
ఓబ్బిలిశెట్టి వెంకటరమణమూర్తి, వురఫ్ కొండబాబుగారు,
కమీషన్ మర్చంట్సు
పెంటపాటి వెంకటముత్యాలు - పద్మావతి, భాగ్యలక్ష్మి కిరాణా సెంటరు
పూసర్ల రామచంద్రరావు, ఆడిటర్సు, బొండాడవీధి
నారాయణం రామారావు S/O లేటు వెంకటచలమాజీ
కీ॥శే॥ వెత్సా రంగనాయకులు, రమణమ్మ జ్ఞా॥ కుమారుడు సూకరాజు
కీ॥ శే॥ బొడ్రా స్వామిగారి జ్ఞా॥ ధర్మపత్ని సోమమ్మ
కుసుమంచి సుబ్బారావు & బ్రదర్స్ హోల్‌సేల్ ఆనియన్స్ వ్యాపారం,
కురాళ్ళ చంద్రమోహన్, బుట్టయ్యపేట, మచిలీపట్నం
కొల్లూరు బంగార్రాజు, టీచరు, ఆమదాలవలస
తమ్మిన సత్తిరాజు, గోల్డు మర్చంట్సు, అమదాలవలస
కుంచాడ లక్ష్మణమూర్తి, జనరల్ మర్చంటు, ఇచ్ఛాపురం
కంకటాల బుచ్చివెంకటరమణ, రైస్ మర్చంటు, అనకాపల్లి
నూనె శ్రీనివాసరావు, నెల్లూరు షావుకార్లు c/o గీతాలాడ్జి VZM
S. V. ఇలయరాజు స్వామిగుప్త, నెల్లూరు షావుకార్లు
c/o శ్రీ జి. రవీంద్రబాబు VZM

# తెనాలి భక్తులు

సర్వశ్రీ దార్వేముల సత్యనారాయణ సిద్ధాన్తి
దీవి సీతారామాచార్యులు, శ్రీ చిట్టి ఆంజనేయస్వామివారి పూజార్చకులు
అక్క పెద్ది బాలగోపాల్, శ్రీ సీతారామమందిర నిర్వాహణ కమిటీ అధ్యక్షుల
దూపుగుంట్ల వెంకటరంగయ్య
కొండా రామమోహనరావు
మూకల సాంబశివరావు
తూటుపల్లి రామకృష్ణారావు
సూదాని కోటేశ్వరరావు
కల్వ చందయ్య
షిర్డి సాయిభక్తులు మాచర్ల నరసింహారావు
రాయపూడి సూర్యనారాయణగారి కు॥ ను. రవిమోహనరావు
కొల్లూరి గోపాలకృష్ణమూర్తి - సంతోషి విలాస్
అనుమాలశెట్టి వెంకటేశ్వరరావు
సోమిశెట్టి సుబ్రహ్మణ్యేశ్వరరావు
భువనగిరి వేంకటలక్ష్మీనరసింహావధానులు
జూపూడి వేంకటరామారావు దంపతులు
ఓలేటి హనుమంతరావు
వరదా వేంకటశేషగిరిరావు
మల్లవరపు శంభులింగాచారి
కోట శివయ్య – రత్నమంజూషగార్లు
ఇమ్మడి వీరవేంకట సుబ్రహ్మణ్యకుమార్
కాటూరి లోకశివశ్రీనివాసరావు
పాదర్తి నారాయణరావు,
పొలదుగు యశపాల, లెక్చరర్
శిఘాకొల్లి జానకిరామయ్య - సత్యవతి
నన్నపనేని పూర్ణచంద్రరావు, ఐతానగర్
యం. వి. రామకుమార్

## గ్రంథప్రచురణకు రు. 116/- లు సమర్పించిన హనుమద్భక్తులు

సర్వశ్రీ స్వర్ణ రాధావెంకటకృష్ణమూర్తి - పార్వతిగార్లు, వేటపాలెం
ఓడూరి వెంకటసుబ్బారావు - వీరావతిగార్లు, వేటపాలెం
ముషారి విద్యాసాగర్ - శైలజగార్లు, వేటపాలెం
A. V. L. నరసింహారావు, ఫిజిక్స్ లెక్చరర్ (రిటైర్డ్) వేటపాలెం

## విజయనగరం భక్తులు

అప్పన్న సూర్యనారాయణమూర్తి, కమీషను ఏజంట్సు, చిన్నవీధి
తంగుడు సత్తెయ్య - టోకు బట్టలవర్తకం, మంగళవీధి
ప్రజప్ప సన్యాంగరావు - డాల్‌మిల్లు, P W మార్కెట్టు
నారాయణం వెంకటచలమాజీ ఉరఫ్ C. B. స్వామి, గీతాలాడ్జి, M.G. రోడ్
P V R M. రాజు, A.P S R T C.
గోదపటివు వెంకటరాజు, శ్రీ వెంకటేశ్వర క్లాత్ ఎంపోరియం,
పొట్టు గోవిందరాజులు, మణికంఠ సప్లయర్స్ చిన్నవీధి
P V. S. రామానుజం, రంగుల వ్యాపారం, నియర్ S. K. P. టెంపుల్
ఒప్పలిశెట్టి జానకిరామయ్య, జనరల్ మర్చంట్సు, చిన్నవీధి
కోనారి పెదసత్యారావు, వెండిసామానుల తయారు, చిన్నవీధి
దంతులవారి సాంబమూర్తి, మోటార్ వర్కర్సు, జిడ్డువారి వీధి
ఒప్పలిశెట్టి వెంకటరమణమూర్తి, ఉరఫ్ కొండబాబుగారు,
కమీషన్ మర్చంట్సు
పెంటపాటి వెంకటముత్యాలు - పద్మావతి, భాగ్యలక్ష్మి కిరాణా సెంటరు
పూసర్ల రామచంద్రరావు, ఆడిటర్సు, బొండాడవీధి
నారాయణం రామారావు S/O లేటు వెంకటచలమాజీ
కీ॥శే॥ వెత్సా రంగనాయకులు, రమణమ్మ జ్ఞా॥ కుమారుడు నూకరాజు
కీ॥ శే॥ బొర్రా స్వామిగారి జ్ఞా॥ ధర్మపత్ని సోమమ్మ
కుసుమంచి సుబ్బారావు & బ్రదర్స్ హోల్‌సేల్ బనియన్స్ వ్యాపారం,
కురాళ్ళ చంద్రమోహన్, బుట్టయ్యపేట, మచిలీపట్నం
కొల్లూరు బంగార్రాజు, టీచర్, అమదాలవల్స
తమ్మన సత్తిరాజు, గోల్డు మర్చంట్సు, అమదాలవల్స
కుంచాడ లక్ష్మణమూర్తి, జనరల్ మర్చంటు, ఇచ్ఛాపురం
కంకటాల బుచ్చివెంకటరమణ, రైస్ మర్చంటు, అనకాపల్లి
నూనె శ్రీనివాసరావు, నెల్లూరు షావుకార్లు c/o గీతాలాడ్జి VZM
S. V. ఇలయరాజు స్వామిగుప్త, నెల్లూరు షావుకార్లు
c/o శ్రీ జి. రవీంద్రబాబు VZM

సర్వశ్రీ కె. నాగేంద్రబాబు, విజయవాడ
యం. ఆర్. సన్యాసయ్య, విశాఖపట్నం
డా॥ యజ్ఞావఝుల పరమశివం – శ్రీకాళహస్తి
వి. యస్. పరబ్రహ్మమూర్తి – మాచెర్ల
R. S. S. V. V. రాజు, నెల్లూరు
శనగల వెంకటప్పయ్యశాస్త్రి, హైదరాబాద్
వేముగంటి రామానుజరావు, హైదరాబాద్
ఇనుకపల్లి వెంకటేశ్వర్లు, ఒంగోలు
శ్రీమతి వజ్రమణి W/O శ్రీ ఎ. గంగాధర్, హనుమకొండ
వారణాసి వెంకటసుబ్బయ్య, ఎర్రగొండపాలెం
శిరపురపు పరదేశి, టింబర్ మర్చంట్. రాజమండ్రి
కె. యస్. ప్రకాశ్ బొంబాయి, మహారాష్ట్ర
జాగర్లమూడి హరిబాబు, U. S. A.
టి. రాధాకృష్ణమూర్తి, నయాగాన్ మధ్యప్రదేశ్
సి హెచ్. సత్యనారాయణ, రాజమండ్రి
యస్. రామకృష్ణారావు – గాజువాక, విశాఖపట్నం
ద్రోణంరాజు శేషగిరిరావు, పాలకొల్లు
కీ॥శే॥ గూడ రామకృష్ణశర్మగారి కుమారుడు సూర్యప్రసాద్, ఆడిపూడి
శ్రీమతి వై. సరోజనమ్మ, బెంగుళూరు, కర్ణాటక

పై హనుమద్భక్తు లెల్లరకు కృతజ్ఞతలు

---

ఈ గ్రంథము వెలుగుచూచుటకు ప్రధాన కారకులు మా హనుమత్కార్యములన్నిట ముందు నిలచు మాన్యులు శ్రీ కె. వి రామయ్య R. T. O. Rtd. కాకినాడ; శ్రీ గోకవరపు అప్పలరాజు – విజయనగరం; శ్రీ కె. శ్రీరాములు సబ్‌రిజిస్ట్రారు (Rtd.) నరసరావుపేట; శ్రీ మాన్ దివి సీతారామాచార్యులు; శ్రీ చిట్టి ఆంజనేయస్వామి పాదార్చకులు – తెనాలి వారలకు ప్రత్యేక కృతజ్ఞతల నందజేసికొనుచున్నాము.

– హనుమదాధ్యాత్మిక కేంద్రం